వాల్మీకి

# రామాయణ సార





రచయిత :

డా. స్వర్ణ వాచస్పతి, బి. ఏ.

❦

"విద్యా విశారద", "సాహిత్య సరస

డా. కన్నెగంటి రాజమల్లాచారి, యమ్

గారి పీఠికతో

# వాల్మీకి

# ాయణ సౌరభాలు





రచయిత :

ర్ణ వాచస్పతి, బి. వి. యస్. సి.

ద్యా విశారద", "సాహిత్య సరస్వతి"

**ంటి రాజమల్లాచారి,** యమ్. ఎ., పిహెచ్. డి.

గారి పీఠికతో

సర్వహక్కులు : గ్రంథకర్తవి

ప్రథమ ముద్రణ : సెప్టెంబరు 1995

ACC No. 20756

ప్రతులు : 1000

వెల : రు. 60-00

ప్రతులకు :

1. డా. స్వర్ణవాచస్పతి, బి.వి.యస్.సి.
రిటైర్డు వెటరినరి అసిస్టెంటు సర్జన్
నారాయణపురం – వడికూడి
దాచేపల్లి-522 414 (పోస్టు)
గుంటూరు జిల్లా

2. గూడవల్లి చంద్రమోహన్, బి.కాం.
D. No. 6-5-22
మార్వాడిగుడి ఎదురు బజారు
తెనాలి-522 201

ముద్రణ : న్యూ విజయ ఆర్టుప్రెస్, గాంధీచౌక్-తెనాలి.

# సౌరభ రహస్యాలు

డా॥ కన్నెగంటి రాజమల్లాచారి, M.A.PhD.
మార్కాపురం.

విమర్శకాచార్యులు శిల్పాకళాకోవిదులు బ్రహ్మశ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్య కవీంద్రుల పుత్రులు డాక్టర్ వాచస్పతిగారు విరచించిన వాల్మీకి రామాయణ సౌరభాలు అనే విమర్శనాత్మకమైన గ్రంథాన్ని పట్టిన పట్టు విడవకుండా అమూలాగ్రంగా పఠించాను. అమందమైన ఆనందం కలిగింది. విమర్శించడంలో సుబ్రహ్మణ్య కవుల సునిశిత దృష్టి కుమారులకు సంక్రమించింది. వాచస్పతిగారు నభూతో నభవిష్యతి అన్నట్లు వాల్మీకి రామాయణ సౌరభాలను గుబాళింపజేశారు. వాచస్పతిగారి మహాగ్రంథాన్ని చదివిన తరువాత మళ్లీ ఒకసారి నిశితంగా వాల్మీకి రామాయణాన్ని చదివితే కలిగిన భావాలివి.

వాల్మీకి రామాయణాన్ని ఏకపక్షంగా రచించాడు. దశరథుడు మొదలైన రాముని పక్షం వారందర్నీ మహాత్ములుగా నీతిమంతులుగా వర్ణించాడు. రాముడికి లోకంలో వున్న సద్గుణాలన్నీ కట్టబెట్టడానికి యత్నించాడు. రావణాసురుడు మొదలైన పాత్రలను పక్షపాత బుద్ధితో దుష్టులుగా వర్ణించాడు.

కానీ వాచస్పతిగారు వాల్మీకి రామాయణ సౌరభాలను నిష్పాక్షికంగా రచించారు. రామాయణంలోని వివిధపాత్రలు స్వభావాలను సమీక్షించడంలో ఎంతో శ్రద్ధవహించారు. ఈ గ్రంథం రచించడానికి ఆయన చేసిన కృషి అనంతమైంది. వాల్మీకి రామాయణంతో పాటు ప్రపంచ సాహిత్యంలో వెలువడిన రామాయణ గ్రంథాలన్నింటినీ దాదాపుగా చదివారు. విషయాన్ని నిగ్గుతేల్చారు.

శ్రీరాముడు జన్మించకముందే వైకుంఠ సభా నిర్ణయాన్ననుసరించి నారదుడు పుట్టకు రామ కథ వినపించడం అది విని వాల్మీకి రామాయణం రచించడం వాస్తవంకాదు. సీతాదేవి రామునిచేత అరణ్యా

వాసానికి పంపబడి వాల్మీకి ఆశ్రమంలో చేరిన తరువాత ఆమె ద్వారా విషయాలు తెలుసుకొని వాల్మీకి రామాయణ రచన చేశాడు.

వాల్మీకి కథను కేవలం రాముని పక్షాన నడిపినా కొంత సహజంగా వాస్తవదృష్టితో రచించాడు. కొంత కథను అభూతకల్పనలతో వాస్తవ విరుద్ధంగా రచించాడు. దీనికి కారణం ఏమిటంటే వాల్మీకి మహాకవి సమాజానికి ఉత్తమమైన సందేశాలందివ్వడానికి ఒక మహా కావ్యాన్ని సృజించాలనుకొన్నాడు. ప్రపంచ మానవులకోసం అపూర్వమైన నీతులను పంచిపెట్టాలనుకొన్నాడు. తన కావ్యానికి కథానాయకుడుగా శ్రీరాముని ఎన్నుకొన్నాడు. శ్రీరాముడికి లోకోత్తర గుణగణాలను అన్వయించాడు. అయితే రాముని పాత్రలో కించిత్తు లోపం కూడా ఉండకూడదు. అనే భావంతో వాల్మీకి రామాయణాన్ని రచింపలేదు. కొంతవాస్తవంగా రచించాడు. కాబట్టి రాముని పాత్రలో వున్న లోపాలను కూడా ఆయన రచించాడు. లోకానికి ఒక మహాపురుషుడి లక్షణాన్ని చూపించడానికి రాముని పాత్రను లోకోత్తర గుణాలను అంటగట్టడానికి వాల్మీకి అభూతకల్పనలు చేయవలసి వచ్చింది. ఆదికవి గనుక ఆదికావ్యం గనుక ఈ మహాకావ్యంలో రచనా పరంగా దొరలిన పొరపాట్లని మనం భావించవచ్చు.

మొదట దశరథుడు పుత్రులకోసం. వశిష్ఠాదులు ఋత్విక్కులుగా అశ్వమేధం చేశాడు. కానీ పుత్రులు పుట్టలేదు ఎందుకని?

శాంత దశరథుని కుమార్తెకాదు. రోమపాదుని కుమార్తె. అతనికి కూడా దశరథుడనే బిరుదు వుంది.

దశరథుడు కైక తండ్రి కిచ్చిన వాగ్దానాన్ని అనుసరించి భరతుడే పట్టాభిషేకమున కర్హుడు. శ్రీరామునకు పట్టాభిషేకార్హత లేదు.

రాముని వనవాసానికి కారణం, కైకగాని మంధర కానీ కాదు. రామ వనవాసానికి కారకుడు దశరథుడు.

శ్రీరామ సుగ్రీవు లిద్దరూ తెలిసివుండి కూడా రావణు డెవరో తెలియనట్లు అతని నివాసం తెలియ ట్లూ నటించారు. ఇది కేవలం తమ స్వార్థప్రయోజనాలకోసమే జరిగింది.

హనుమంతుడు లంకను దహించటం, అశోకవనాన్ని సర్వనాశనం చెయ్యడం వాస్తవంకాదు. దీనికి యుద్ధకాండలోని 24, 39 సర్గలలోని వర్ణనలు నిదర్శనాలు.

హనుమంతుడు హిమాలయాలకు వెళ్ళి పర్వతాలను పెకలించడం వాస్తవవిరుద్ధాంశం.

రామాయణ కథాకాలంనాటి లంక ద్వీపకల్పమేగాని ద్వీపం కాదు.

హనుమంతుడు సముద్రముపై గాలిలో ఎగురలేదు. సముద్రంలో పడి ఈదుకుంటూ లంకను ప్రవేశించాడు. ఇందుకు

శ్లో॥ సాగరస్యోర్మి జాలానా మురసా శైల వర్ష్మణామ్,
అభిఘ్నం స్తు మహావేగః పప్లువే స మహాకపిః.

అనే శ్లోకాన్ని ఉదహరింపవచ్చు.

రామ రావణ యుద్ధానికి ముఖ్యకారణం సీతాపహరణంకాదు. యుద్ధానికి కారణం రాముని రాజ్యకాంక్షయే. దానికి ఋషుల రక్షణ అనే ముసుగు వేసుకున్నాడు.

రాముడు తాటకను వధించడం న్యాయంకాదు.

రాముడు అబద్ధములాడి శూర్పణఖకు ఆశకల్పించి తమ్మునితో ముక్కు చెవులు కోయించడం అనుచితం. సీతాపహరణంకంటె ముందుగానే రాముడు రావణునిపై పగవహించినట్లు శూర్పణఖను విరూపిగా చేయటం సంభవించింది.

రాముడు వెంటాడింది. మాయలేడి కాదు మారీచుని పెంపుడు లేడి అయివుంటుంది. రాముడు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించిందీ మామూలు లేడి మీద కాదు. మారీచుని మీదనే.

వనాలలో కందమూలాలు భుజిస్తూ ఋషిలా సంచరిస్తానని ప్రతిజ్ఞ చేసిన రాముడు మృగాలను చంపి మాంసభక్షణ చేశాడు.

రాముడు :

శ్లో॥ అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణాం,
న తు ప్రజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః.

అరణ్య. 10 సర్గము.

అన్నాడు. దీని ననుసరించి

సీతనుగానీ లక్ష్మణునిగానీ విడిచిపెడతాడేగాని రాముడు ఋషులకు ఇచ్చిన మాటను విడువడు. ఆయన ప్రతిజ్ఞ రాక్షసవధ. రాజ్య సంగ్రహణం. కనుక రామునికి మిక్కిలి ప్రియమైంది సీతగాదు. రాజ్యమేనని స్పష్టమవుతుంది

ఒక ముసలి బ్రాహ్మణుడి కొడుకు చనిపోగా అతడు రాముడి కడకు వచ్చి ఇది నీ దోషమేనని పలికాడు. దీని కారణం ఒకశూద్రుడు తపస్సు చేయడమేనని నారదుడు చెప్పాడు. అప్పుడు రాముడు వెంటనే వెళ్ళి అతని శిరస్సు ఖండించాడు. రాముని ఈ చర్య అనుచితం. శూద్రుడు తపస్సు చేస్తే రాజుకు హానికలగాలిగాని బ్రాహ్మణుడి కొడుకు మరణించడ మేమిటి ?

ఒక శునకము భిక్షుకునిచే కొట్టబడి రాముని సభకు వచ్చి మొరపెట్టుకొన్నది. కుక్క మాట్లాడట మేమిటి ? శునక భాష రాముడి కి తెలుసంటారేమో ?

కుక్కకు న్యాయం జరగలేదు. కొట్టినవాడు బ్రాహ్మణుడు అతణ్ణి శిక్షించడం ధర్మంకాదని పెద్దలు చెప్పారు. పైగా కుక్కను కొట్టిన వాణ్ణి కులపతిని చేశారు. ఇదేమి ధర్మం ?

రాముడు ఋషులు బ్రాహ్మణుల మాటలు విని ధర్మాధర్మ విచక్షణ లేకుండా ప్రవర్తించాడు.

రాముడు అనేక ప్రగల్భాలు పలికాడు.

మూలబలంలేని రాముడు మహాబలవంతుడైన రావణుని నాశనం చెయ్యడం అతని గణనీయమైన రాజనీతికి నిదర్శనం.

శ్రీరాముడు సీతను భోగవస్తువుగ భావించాడు.

భరతుడికి సంక్రమించవలసిన రాజ్యాన్ని తా నాశించాడు.

మృగంమీద కాకిమీద బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించిన రాముడు ఇంద్రజిత్తుపై ప్రయోగింపవలదని లక్ష్మణునితో అనడంలో రాముని ఉద్దేశ్యమేమిటి?

ఇలాంటి అంశాలు అనేకానేకం వాల్మీకి రామాయణ సార భాల రచయిత చేత చర్చించబడ్డాయి.

ఇంకా ఈ గ్రంథంలో రామాయణంలోని పాత్రల గుణశీలాలన్నీ విపులంగా పరిశీలించబడ్డాయి.

దశరథుడు : భార్యాప్రీతికై చంపదగని వాళ్లను చంపేవాడు. ధనవంతులను దరిద్రులుగా చేసేవాడు. (అయోధ్య. 10వ సర్గము)

భరతుడు : పట్టణ, నివాసాన్ని వదలి కాషాయాంబరాలు ధరించి కందమూలాలు భక్షించాడు. 'రామునికంటే మహాత్ముడు.

లక్ష్మణుడు : రామునికోసం అనేక త్యాగాలు చేశాడు. చివరకు వృద్ధాప్యంలో రాముని చేత బహిష్కరింపబడి ప్రాణాలు విడిచిపెట్టాడు. ధర్మానురక్తుడు.

మంథర : కైక పుట్టినింటిదాసి. దశరథుడు కైకకు చేస్తున్న అన్యాయాన్ని పసిగట్టి ఆమెకు కర్తవ్యాన్ని ఉపదేశించింది. తన కర్తవ్యాన్ని నెరవేర్చింది. ఆమె దుష్టురాలు కాదు.

కైకేయి : రామాది సవతిపుత్రులను తన బిడ్డలుగా పెంచింది. కల్లాకపట మెరుగనిది. భరతునకు పట్టాభిషేకం కోరటంలో అధర్మ మేమీా లేదు.

కౌసల్య : జీవితకాలమంతా భర్తకు దూరంగా గడిపింది. దశరథునిపై పెంచుకోవలసింది కైకపై పగ వహించింది.

రావణుడు : రామునితో పోరుచు పారిపోవడం అబద్ధం. రావణుడు పుంజికస్థలను బలాత్కరించి అనుభవించగా బ్రహ్మదేవుడు "నేడు మొదలు ఏ స్త్రీనైన బలాత్కరించిన నీ తల వేయివ్రక్క లవు తుంద' ని శపించాడు.

రంభను బలాత్కరించినపుడు ఇదే విధంగా నలకూబరుడు శపించాడు. ఈ రెండు సంఘటనల్లో ఏదో ఒకటి ముందు జరిగి వుంటుంది. బ్రహ్మశాపం ముందే ననుకుంటే రంభను బలాత్కరించి నప్పుడు రావణుని తల పగిలిపోవాలి గదా! ఈ అంశం కేవలం కల్పన రావణుడు సీతను స్పృశించనిది శాపంవల్లనేగాని అతని నియమ వర్తనవల్ల కాదని చెప్పడానికి ఈ శాపవృత్తాంతాలు కల్పించబడ్డాయి.

సుగ్రీవుడు : తా నెన్ని తప్పులు చేసినా–"నిన్ను హింసింపను పొమ్మని దండించి వదలిపెట్టిన అన్నను రాజ్యకాంక్షతో క్రూరంగా చంపించిన భాతృద్రోహి, దురాత్ముడు.

విభీషణుడు : రాజ్యకాంక్షతో పరుల పాదాక్రాంతుడై స్వజాతి నిర్మూలనకు కారకుడై, ఎవరిచేతను జయించటం చేతగాని రావణాది రాక్షసవీరులను అంతంచేయించిన కులపాంసకుడు.

హనుమంతుడు : గొప్ప మేధావి. రాజనీతిజ్ఞుడు. వాక్య విశారదుడు, సాహసి, మహాబలవంతుడు మహాభక్తుడు.

సీత : మహాపతివ్రత. పతిభక్తికి ఫలితంగా భర్తృనిరాదరణ పొందిన అభాగ్య. రాజవంశ గౌరవానికి వన్నె తెచ్చిన పుణ్యవనిత.

వాలి : రామునికంటె మిక్కిలి బలవంతుడు.

ఇలా పాత్రల స్వభావాలను చక్కగా నిరూపించారు వాచ స్పతిగారు.

ఇంకా రామాయణంలోని పరస్పర విరుద్ధాంశాలు, అనౌ చిత్యాల నెన్నింటినో సోదాహరణంగా వివరించారు. ఉదాహరణకు.

శివధనస్సును శివుడు దేవరాతుడనే రాజుకడన్యాసంగా వుంచా డని–బాల. 66వ సర్గములో, మహాయజ్ఞంలో ధనుస్సును వరుణుడు జనకుని కిచ్చాడని – అయోధ్య. 118వ సర్గములో.

ఇవి పరస్పర విరుద్ధాంశాలు.

శృంగార వర్ణనలో రాముడు తన భార్యయైన సీత కచ కుచాదులను ఇతరుల ముందు వర్ణించడం అనుచితం.

ఇలాంటి వర్ణనలలో కొంచెం అనౌచిత్యం కనిపించినా వాల్మీకి కావ్యం రసపిపాసులైన పాఠకులకు అమందమైన ఆనందాన్ని అందిస్తాయి.

ఇలా ఈ గ్రంథంలో నిక్షిప్తం చేయబడ్డ అంశాలు చాలా వున్నాయి. ఇలా రాస్తూ పోతుంటే ఈ పీఠికే ఒక గ్రంథమవుతుంది. పీఠికావిస్తర భీతివల్ల ముగించవలసివస్తుంది.

ఇంతటి మహత్తరమైన గ్రంథాన్ని రచించడానికి మిత్రులు వాచస్పతిగారు

ఋగ్వేదం, అష్టాదశపురాణాలు, దేవీ భాగవతంలాంటి గ్రంథాలు, రామ రహస్యోపనిషత్తులాంటి అనేక ఉపనిషత్తులు, భారతం, జైన సాహిత్యంలోని పురుష చరిత్ర, టిబెట్‌లోని రామకథ, బౌద్ధ సాహిత్యంలోని దశరథుని కథ, రామ చరిత మానస్, అగస్త్య, భాస్కర, రంగనాథ రామాయణాలు, కంబళ, అధ్యాత్మ, అద్భుత ఆనంద రామాయణాలు, విచిత్ర రామాయణం, కథా సరిత్సాగరం.

ఇంకా ఇంకా ఎన్నెన్నో గ్రంథాలను శ్రోద్రక్రమంగా పరిశీలించారు. ఆయన చేసిన విశ్లేషమైన కృషి ఈ గ్రంథరూపంలో ఫలించింది. వాల్మీకి రామాయణంలోని సత్యమైన అంశాలను వెలికితీసి ఆంధ్ర పాఠకులకు మహోపకారం చేశారు వాచస్పతిగారు. సాహితీ పిపాసులారా ఈ గ్రంథాన్ని ఆమూల్యగ్రంగా చదివి మళ్లీ ఒకసారి శ్రీమద్రామాయణాన్ని చదవండి.

మిత్రులు సద్విమర్శకులు శ్రీ స్వర్ణ వాచస్పతిగారు ఇలాగే గొప్ప విమర్శన గ్రంథాలను రచించి ఆంధ్ర శారదకు అపుర్వాలంకృతులు సమర్పిస్తారని ఆశిసున్నాను. ఆయన లేఖినీ శిఖరంలో కృతి ప్రసవీ సహస్రాలు కుట్మలించాలని ఆకాంక్ష.

మార్కాపురం
19-6-95

— కన్నెగంటి రాజమల్లాచారి.

ఆచార్య గుజ్జర్లమూడి కృపాచారి
తెలుగు శాఖాధిపతి,
నాగార్జున విశ్వవిద్యాలయం
నాగార్జున నగర్–522 510

# రామదర్శనం

రామాయణ గాథ ఎప్పుడు వెలుగుచూసిందోగాని భారతీయ జీవన సంస్కృతికి ప్రతిబింబం సీతారాముల గాథ. రామకథా సంబంధి గాథలు పరశ్శతంగా ప్రకాశిస్తూనే వున్నాయి. ఒక కావ్యం కాల క్రమానుగతంగా ఒక జాతిని ప్రభావితం చేయడం విశ్వసాహితీ చరిత్రలోనే అపూర్వం. రామకథ పండిత పామరులను అలరించిందనడంలో అతిశయోక్తి లేదు. సంస్కృత సాహిత్యంనుంచి – మౌళిక సాహిత్యం (జానపద సాహిత్యం) వరకూ రామగాథ వుంది.

వాల్మీకి రామాయణం బహుప్రాచీనమైనా 12వ శతాబ్దినుంచి భాషాకవుల్ని ఆకర్షించినట్టు చారిత్రక ఆధారం. దేశభాషల్లో వెలువడిన తొలి రామాయణం తమిళంలో కంబ మహాకవి రచించిన రామావతారం అనే రామాయణం. 13వ శతాబ్దంలో అభినవపంప బిరుదాంకితుడై నాగచంద్రుని రామచరిత్ర పురాణం కన్నడంలో వెలిసింది. ఇది జైన రామాయణం. తెలుగులో 13వ శతాబ్దిలోనే రంగనాథ–భాస్కర రామాయణాలు తొలినాట రామగాథలు. మలయాళంలో 16వ శతాబ్ది వాడయిన ఎళుత్తచ్ఛన్ రచించిన రామాయణానికి అధిక ప్రచారం వచ్చింది.

ఉత్తరాదిన వెలసిన రామాయణాల్లో 14వ శతాబ్దిలో అస్సామీలో వెలసిన రామాయణమే అతిప్రాచీనమైనది. 15వ శతాబ్దిలో సరళదాసు బరియారు రామాయణం–15వ శతాబ్దిలోనే బెంగాలీలో కృత్తివాస, ఓఝు – 16వ శతాబ్దిలో మరాఠీలో ఏకనాథ్ – హిందీలో తులసీదాసు ప్రభృతులు రామ గాథను ఆవిష్కరించారు.

ఈ చరిత్ర అంతా ఎందుకంటే వాల్మీకి అంటే గౌరవమున్నా–అవాల్మీక విషయాలు రామాయణ కవులు చేర్చారు. కన్నడంలో కంబ కవి– తెలుగులో గోన బుద్ధారెడ్డి అవాల్మీకాంశాలు చేర్చారు. అవే అనంతరకాలంలో చిరస్థాయిగా నిలచాయి. రామకథను రచించే నాటికి రాముడు విష్ణుమూర్తి అవతారంగా చేసి ఆపై దేవుడనే ముద్రవేశారు.

రావణుడి కూతురు సీత అని కాశ్మీరి రామాయణం పేర్కొటుంది. ఆమె కాళిక అవతారం అని వంగ రామాయణం చెబుతుంది. ఏది ఏమైనా రామాయణ గాథ విశ్వసాహిత్యంలో భారత జాతిని ప్రతిబింబించే ఉత్తమ కథా కావ్యం.

కుటుంబ జీవనంలో శ్రీరాముడు సుఖపడిన కాలం చాల తక్కువ. శ్రీరామునికన్న సీతాదేవిని ఇక్కడ ప్రస్తావించాలి. రాజవాసం అనుభవించాల్సింది పోయి ఆమె పడిన కష్టాలు గడగండ్లే ఎక్కువ. ఒక్కమాటలో భారతస్త్రీకి దర్పణం సీత కథ. ఆమె మాని. భర్తతోడిదే లోకం. పతిమాటే పరమవేదం. పతియే ఆమె దైవం. అదే ఆమెను సుఖజీవితానికి దూరంచేసింది. ఐతే మనం దీన్ని పతివ్రత–పరమసాధ్వి అనే గౌరవవాచకాలు తగిలించి ఆమెను దేవతామూర్తిచేసి కొనియాడుతున్నాం. మహిళగా ఆమె పడిన పష్టాలు – ఆమెకు జరిగిన అన్యాయం ఎదిరించే శక్తి లేదు. ఎందుకంటే దేవతామూర్తులకు ఏం జరిగినా అది పవిత్రమో–ఆదర్శప్రాయమో–అంటూ [illegible]

ఇన్నాళ్ళకు వాల్మీకి రామాయణ సారభాలు అనే మంచి గ్రంథం చదివినందుకు ఆనందిస్తున్నాను. ముందుగా డా॥ స్వర్ణ వాచస్పతిని అభినందిస్తున్నాను. నిజాన్ని నిర్భయంగా నిస్సంకోచంగా ఆవిష్కరిస్తున్నందుకు–మతమౌఢ్యంనుంచి గత జాడ్యంనుంచి – శృత శృంఖలాల తుప్పును వదలించడానికి వచ్చిన దీ గ్రంథం.

నిజాన్ని నిస్తేజంగా నిర్నిరోధంగా నిష్కర్షగా చెప్పిన ఈ గ్రంథాన్ని ధైర్యం ఉంటేనే చదవండి. యదార్థదృష్టితో చూడండి. మైకం వదలించుకుని మతం అనే మూర్ఖంనుంచి మార్గం మార్చుకుని జ్ఞానమార్గావిష్కరణం చేస్తేనే ఈ పుస్తకం అర్థం అవుతుంది. ముందే ఒక అభిప్రాయానికి మనస్సును 'ట్యూన్' చేసుకుని ఆపై చదివితే యథా మామూలే. అందుకే జ్ఞానాన్ని–నింపుకొని – అజ్ఞానమనే చీకటిని వదలించుకుని వస్తే ఈ గ్రంథం అర్థం అవుతుంది. మార్గమూ సుగమం అవుతుంది.

ఇంతకీ డా॥ స్వర్ణ వాచస్పతి చెప్పిన విషయాలు అరకొర ముచ్చటించడం భావ్యం. రాముని వనవాసం ఎన్నేళ్ళు అంటే 14 సంవత్సరాలు. ఇది ఆనాడు ఎంతకాలం అనే వివరం పుట–17 లో సమర్థించినతీరు సహేతుకం. హనుమంతుడు లంకాదహనం చేశాడన్నది వాస్తవం. ఐతే ఇది ఎంతమేర జరిగిందనేది పుట–83 లో ఉంది. అతిశయోక్తి అంటే 'అతి' అతిశయోక్తిగా ఈ ఉదాహరణం చెప్పుకోవచ్చు.

రాముని శీలమునుగూర్చి చర్చించిన సందర్భంలో పుటలు 127–134 లలో వనవాసంలో రాముని జీవితం–ఆహారనియమాలు – భార్యా వియోగంతో విలపించిన రాముని ఇంద్రియ నిగ్రహం కలవాడనడం – రావణ వధకు విభీషణ, సుగ్రీవుల సహాయంకోరడం – ఆ సహాయ్యం లోనూ సాధారణ–సామాన్య మానవ ప్రవర్తనే కన్పిస్తుందేతప్ప

దైవశక్తి కాని-మహాబలసంపత్తి కాని కానరాదు. ఈ వివరణం చక్రని యదార్థిక విశ్లేషణ.

లక్ష్మణుడు రామునికి కుడి ఎడమలుగ నుండి తన జీవితాన్నే పణంగాపెట్టిన తమ్ముడు. సోదరుడంటే లక్ష్మణుడే. ఐతే చివరికి రామునిచే బహిష్కరణ గురికావడం పుట-143 ఎంత బాధాకరమైన విషయమో! ఊహించడానికే కూడనిదీపని. మరి! జరిగింది. అదీ మానవ మనస్తత్వం కదా!

రావణగాథ మన మదిలో ఒక దుష్టపాత్రగ ముద్రించబడింది. నిజానికి రావణుడు మహాశివభక్తుడు. వేదవేదాంగవేత్త వివేకశీలి. పైగా రావణ రాజ్యమంతా అందమైన సుందరమైన ప్రాసాదాల తోనూ, వేదమంత్రఘోషతోనూ, అందమైన సరస్సులతో నిండి వుంది. కాని మన మనోఫలకంపై అతనో 'విలన్'గా చిత్రించి కాముకుడనీ-దుర్మార్గుడనే విధంగా చిత్రీకరించడం జరిగింది.

ఏతా వాతా చెప్పేదేమంటే రామాయణ గాథలో 'విన్నంత కన్నంత తెలియవచ్చినంత శేట' కాదు. ఈ గ్రంథం చక్రని విశ్లేషణతోనూ-వివరణాత్మకంగా ఉదాహరించిన తీరు బాగుంది. డా॥ వాచస్పతిగారూ మరిన్ని గ్రంథాలు రాసి నిజనిరూపణం చేయండి. నూతన్నవ్యవస్థకు ద్వారాలు తెరవండి.

మీ కృషికి అభినందనలు

.... కృపాచారి, జి.

# గ్రంథారంభ పరిచయము

రామాయణమును మహాకవు లనేకు లనేకవిధముల రచించిరి. రాముని కథ వసిష్ఠ-దూర్వాస-అగస్త్య-మార్కండేయ - భరద్వాజ - వాల్మీకాది మహర్షుల కనేకులకు దెలియును. వీరందఱు రామాయణ ములను రచించిరి. బ్రహ్మ-గరుడ-వాయు-స్కంధ-పద్మ - నృసింహ - కాళిక-సౌర-శివ-బ్రహ్మాండాది పురాణములలోను రామాయణ కథ గలదు. మహాభారతమునందును రామాయణ కథ గలదు. మఱియు తరువాత కవు లనేకులు రామాయణమును తమ యిచ్ఛ వచ్చిన రీతిని రచించిరి.

రామాయణము హిందూదేశమందేగాక టిబెట్, మంగోలియా, కంబోడియా, జావా మున్నగు ననేక దేశములలో ప్రాశస్త్యమును బొందినది. జైన-బౌద్ధవాఙ్మయ మందును రామ కథ గలదు. రాముఁడు వేదపురుషుఁడు. ఋగ్వేదమునందు రాముని గురించిన వివరమున్నది.

రామాయణము లన్నిటియందును ప్రఖ్యాతి వహించినది. బహుళ ప్రచారము నొందినది వాల్మీకి రామాయణము. వాల్మీకి ఆది కవి. ఆది సంస్కృత కవి. వాల్మీకి రామాయణము నెందఱో మహా కవు లాంధ్రీకరించిరి. ఎందఱో వివిధ భాషలలోని కనువదించిరి. కాని వారిలో ననేకులు వాల్మీకి రామాయణములోని యసహజ సంఘటన లకు మఱికొన్ని యసహజ సంఘటనలు, మహాత్మ్యములు కలిపిరేగాని వాస్తవ సంఘటనలను సంగ్రహించుటకు యత్నించలేదని నా యభి ప్రాయము.

అందుచే రామాయణమును ప్రచురింపవలయునను యుద్దేశ్య ముతో ననేక గ్రంథములను పరిశీలించి యీ క్రిందివిధమున మూడు సంపుటములుగ ప్రచురించి తెలుగు సాహితీలోకమునకు సమర్పించ దలచితిని. అవి 1) వాల్మీకి రామాయణ సారభాగాలు.

2) ప్రపంచ సాహిత్యములో రామ కథ 3) చారిత్రక దృక్పథంలో రామాయణము.

1. వాల్మీకి రామాయణ సౌరభాలు : ఇందు వాల్మీకి రామాయణములోని వివిధాంశములు విపులముగ వివరింపబడినవి. వాల్మీకి వచించిన 'రామ కథ'కు సంబంధించిన యదార్థ విషయము లీ సంపుటములో చిత్రీకరించబడినవి. వీటిని కవి కప్పిపుచ్చుటకు ప్రయత్నించని యదార్థ సంఘటనలని యీ గ్రంథము యొక్క 'సారాంశము'లో వచించుట జరిగినది.

2. ప్రపంచ సాహిత్యములో రామ కథ : ఇందు వివిధ దేశములలో ప్రచారమునందున్న రామాయణ కథలు, మనదేశములోని రామ కథా భేదములు వివరింపబడినవి. రాముడు 129 మంది భార్యల నగ్నిసాక్షిగ పరిణయమాడిన విషయములు మున్నగు వెన్నియో వ్రాయబడినవి.

3. చారిత్రక దృక్పథంలో రామాయణము : ఇందు వాస్తవమునకు విరుద్ధముగానున్న యసహజ సంఘటనలను తొలగించి రామ కథ సంపూర్ణముగా రచింపబడినది.

కనుక సహృదయులగు కవి పండితులు యదార్థ విషయముల పరిశీలనకై నా యొనర్చిన కృషిని సహృదయముతో నాదరింతురు గాక యని కోరుచున్నాను.

ఈ రచనలో నాకు ప్రోత్సాహమిచ్చిన మిత్రులు మార్కాపురం S.V.K.P. కళాశాల తెలుగు లెక్చరర్ "విద్యావిశారద" – "సాహిత్య సరస్వతి" డాక్టర్ కన్నెగంటి రాజమల్లాచారిగారికి, ఉభయభాషాప్రవీణ శ్రీ సదాశివయ్యగారికి ఈ గ్రంథమును గురించి తెలిపినంతనే, శ్రమయని తలపక, గ్రంథమును నామూలాగ్రముగ చదివి తమ యభిప్రాయమును వ్రాసి యిచ్చిన, నాగార్జున విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధిపతిఆచార్య గుజ్జర్లమూడి కృపాచారిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుచున్నాను.

ఇట్లు

స్వర్ణ వాచస్పతి.

# విషయసూచిక

ఓమ్

శ్రీ శారదాయై నమః

# వాల్మీకి రామాయణ సౌరభాలు

## 1. దశరథుని సంతానము

బాలకాండము 8వ సర్గము :

శ్లో॥ చింతయానస్య తస్యైవం బుద్ధి రాసీ న్మహాత్మనః
సుతార్థ హయమేధేన కిమర్థం న యజామ్యహమ్. 2

పుత్రులకొఱకై చింతించుచున్న దశరథునకు "పుత్రుల కొఱకై నేనేల యశ్వమేధ యజ్ఞము చేయరా"దను తలంపుకలిగెను.

ఈ విధముగ తలచి యతడు సుయజ్ఞ – వామదేవ – జాబాలి – కాశ్యప–వసిష్ఠాది ద్విజులను పూజించి వారితో నిట్లు పలికెను.

బాల. 8వ సర్గము :

శ్లో॥ మమ లాలప్యమానస్య పుత్రార్థం నాస్తి వై సుఖమ్
తదర్థం హయమేధేన యక్ష్యామేతి మతిర్మమ. 8

పుత్రులకొఱకై పరితపించుచున్న నాకు సుఖములేదు. కాన సంతానార్థము అశ్వమేధ యజ్ఞము చేయదలచితిని.

బాల. 8వ సర్గము :

శ్లో॥ తదహం యష్టు మిచ్ఛామి శాస్త్రదృష్టేన కర్మణా
కథం ప్రాప్స్యామ్యహం కామం బుద్ధి రత్ర విచార్యతామ్. 9

నేను నా కోరికతీరుటకై శాస్త్రములు నిర్దేశించిన ప్రకారము నిర్విఘ్నముగ నా యాగమెట్లు నిర్వహింపవలయునో యాలోచింపుడు.

దశరథుని యామాటలకు వారు ప్రీతులై యీ రీతిపలికిరి.

బాల. 8వ సర్గము :

శ్లో॥ సర్వథా ప్రాప్స్యసే పుత్రా నభిప్రేతాంశ్చ పార్థివ
యస్య తే ధార్మికీ బుద్ధిరియం పుత్రార్థమాగతా. 12

ఓ రాజా ! నీ కిట్లు యశ్వమేధ యాగముచేయవలెనని ధర్మ సమ్మతమగు నాలోచన కలిగినది. కనుక నీవు కోరినట్లు తప్పక పుత్రులబడయగలవు.

బాల 9వ సర్గము : ఈ మాటలు వినిన సూతుడగు సుమంత్రుడు దశరథునితో పూర్వము తాను సనత్కుమారుడు ఋషులతో నీ క్రింది విధముగ మాట్లాడుట వినియుంటినని వచించెను.

శ్లో॥ ఋశ్యశృంగస్తు జామాతా పుత్రాం స్తవ విధాస్యతి
సనత్కుమార కథితమే తావ ద్వ్యాహృతం మయా. 18

అల్లుడగు ఋశ్యశృంగుడు నీకు పుత్రులు కలుగునట్లు చేయ గలడు. అట్లు సనత్కుమారుడు దెలిపినదెల్ల నేను నీతో తెలిపితిని.

బాల. 11వ సర్గము :

శ్లో॥ అనపత్యోఽస్మి ధర్మాత్మన్ శాంతాభర్తా మమక్రతుమ్
అహరేత త్వయాఽఽజ్ఞ ప్త స్సంతానార్థం కులస్య చ. 5

"ఓ ధర్మాత్ముడా ! నేను పుత్రులు లేనివాడను. మా కులము నకు సంతతి కలుగుకొఱకై శాంతభర్తయగు ఋశ్యశృంగుడు నీ యానతితో నా క్రతువును నిర్వహించునుగాక" అని యతడు (దశరథుడు) రోమపాదుని కోరగలడు.

బాల. 11వ సర్గము :

శ్లో॥ శ్రుత్వా రాజ్ఞోఽథ తద్వాక్యం మనసా విచింత్య చ,
ప్రదాస్యతే పుత్రవంతం శాంతాభర్తార మాత్మవాన్. 6

దశరథుని మాటవిని యా రోమపాదు డొకింత యాలోచించి పుత్రులనీయ సమర్థుడగు ఋశ్యశృంగుని (ఋత్విజునిగా) నీయగలడు.

బాల 12వ సర్గము : తరువాత కొన్ని దినములకు దశరథుడు సుయజ్ఞ-వామదేవ-జాబాలి-కాశ్యప - వసిష్ఠాదులను, వేదపాఠకులగు ఋత్విక్కులను పూజించి వారితో నిట్లు పలికెను.

శ్లో॥ మమ లాలప్యమానస్య పుత్రార్థం నాస్తి వై సుఖమ్,
తదర్థం హయమేధేన యక్ష్యామీతి మతిర్మమ. 8

పుత్రులకొఱకై మిగుల పరితపించుచున్న నాకు సుఖములేదు. కనుక పుత్రుల కొఱకు అశ్వమేధయజ్ఞ మొనరింపదలచితిని.

శ్లో॥ తదహం యష్టుమిచ్ఛామి శాస్త్రదృష్టేన కర్మణా,
ఋషిపుత్ర ప్రభావేన కామాన్ ప్రాప్స్యామి చాప్యహమ్. 9

అందువలన నేను శాస్త్రప్రక్రియచేతను, ఋశ్యశృంగుని ప్రభావముచేతను యజ్ఞ మొనరించి నా కోరికలను పొందదలచితిని.

బాల 14వ సర్గము : దశరథుడు యజ్ఞమును పూర్తిగావించి ఋత్విక్కులకు భూమి నొసగెను. వారు రాజుతో తమకు భూమితో పనిలేదనియు, ఆ భూమిని రాజే యుంచుకొని తమకు సువర్ణమును - గోవులను-యిమ్మని యడిగిరి. అపుడు రాజు వారికి గోవులను, సువర్ణమును, రజతము నిచ్చెను. వారు రాజొసంగిన దాని నంతటిని ఋశ్యశృంగునకు, వసిష్ఠునకీయు, వారిరువు రద్దానిని న్యాయరీతిగ విభజించి యా బ్రాహ్మణుల కొసగ వారు ప్రీతులై రాజు నాశీర్వదించిరి.

శ్లో॥ తతోఽబ్రవీ దృశ్యశృంగం రాజా దశరథ స్తదా,
కులస్యవర్ధనం త్వం తు కర్తు మర్హసి సువ్రత, 56

అంత దశరథమహారాజు ఋశ్యశృంగునితో నిట్లనెను. "ఓ యుత్తమ వ్రతనిష్ఠుడా! మా కులమును వృద్ధినందించుకార్యమును నీవే యొనరింపదగుదువు"

బాల : 15వ సర్గము : మేధావియు, వేదజ్ఞుడునగు ఋశ్యశృంగుడు కొంచెముసేపు ధ్యానమగ్నుడై యుండి రాజుతో నిట్లు వచించెను.

శ్లో॥ ఇష్టిం తేఽహం కరిష్యామి పుత్రీయాం పుత్రకారణాత్,
అధర్వ శిరసిప్రోక్తై ర్మంత్రై స్సిద్ధాం విధానతః. 2

ఓ రాజా! నీకు పుత్రులు కలుగుటకై యధర్వశిరస్సునందు చెప్పబడిన మంత్రములచే, పుత్రుల కలిగించు నొక యజ్ఞము చేసెదను.

పై విషయములన్నియు నొక్కసారి పరికింపుడు. దశరథుడు మొదట వసిష్ఠాది మహాత్ములతో పుత్రులకొఱకై తానశ్వమేధ యజ్ఞము చేసెదనన, వారందఱు లెస్సయని బలికిరి. దీనియర్థము అశ్వమేధ యజ్ఞమొనరించిన సంతతి కలుగుననియే కదా! దశరథుడు వసిష్ఠ-ఋశ్యశృంగాదులు ఋత్విక్కులుగ యజ్ఞమును పూర్తి చేసి బ్రాహ్మణులకు విరివిగ దానములిచ్చెను. దీని యర్థము యజ్ఞము పూర్తియైనట్లే గదా! పుత్రులకొఱకై చేసిన ఆ యజ్ఞమునకు పుత్రులేల కలుగలేదు?

అశ్వమేధ యజ్ఞము పూర్తియైన పిమ్మట దశరథుడు ఋశ్యశృంగునితో "మా కులమును వృద్ధినందించు కార్యము నీవే యొనరింపదగుదువు" అని యేల అనవలసివచ్చినది? దీని యర్థమేమి? అశ్వమేధ యజ్ఞము విఫలమైనట్లే గదా!

అంతకుముందు పుత్రులకొఱకై దశరథునిచే నశ్వమేధ యజ్ఞమొనరించిన ఋశ్యశృంగుడు పుత్రులకొఱకై మరియొక యజ్ఞము ను

నిర్వర్తింతునని వచించుటేల? అశ్వమేధయజ్ఞ విఫలత కప్పిపుచ్చు కొనుటకా?

అశ్వమేధయజ్ఞముచే పుత్రులను పొందగోరుచున్నానని దశరథుడనుట చూడ, పుత్రుల బడయుటకొఱకై అశ్వమేధయజ్ఞ మున్నదను విషయము దశరథునకు తెలియును. అట్లు తలచిన దశరథుడు వయోవృద్ధుడగు నంతవఱకా యజ్ఞమునేల చేయ సంకల్పించలేదు? అప్పటివఱకతనికి పుత్రుల పొందవలయునను చింతకలుగలేదా? వసిష్ఠాదులైనా, అశ్వమేధయజ్ఞమును గురించి దశరథునకు తెలుపలేదా? లేదా, తాము తెలిపినచో, దశరథుడాయజ్ఞమొనరించి పుత్రసంతానమును పొందక విఫలుడైన తమకు నిందయగునని వారు దశరథునకు తెలుపలేదా? దశరథుడు పుత్రులకొఱకై అశ్వమేధ యజ్ఞమొనరింతునన బ్రాహ్మణులెల్ల సంతోషించుట ఆ యజ్ఞఫలముచే దశరథునకు సంతానము కలుగుననియా? లేక తమకు విరివిగ దానములు లభించుననియా?

సుమంత్రుడు దశరథునిచే యజ్ఞముచేయించుటకు ఋశ్యశృంగు నేలనియమించెను? వృద్ధుడగు వసిష్ఠుడు, చిన్నవాడగు ఋశ్యశృంగుడు నిర్వహించువిధమున యజ్ఞమును నిర్వహింపలేడనియా? మరెందుకు?

పుత్రకామేష్టి వలన పుత్రులు జన్మించినారని తలచినచో, పుత్రకామేష్టి యజ్ఞమున సాక్షాత్ యజ్ఞహోమమునుండి యుద్భవించిన మహాపురుషుడు ప్రాజాపత్య నరుడొసగిన ప్రసాదమున దశరథుని భార్యలు వెంటనే గర్భవతులు కావలయును గదా! యజ్ఞము పూర్తియైన సంవత్సరమునకు దశరథుని భార్యలు ప్రసవించిరి. అనగా యజ్ఞము పూర్తియైన పిదప రెండు లేక మూడుమాసములకు

వారు గర్భవతులైరి. కనుక వారు గర్భవతులగుట పాయసమహిమయే యనుట యెట్లు పొసగును ?

యజ్ఞము వలన పూర్తిగలాభమును పొందినవారు ఋషులు, పురోహితులు. కనుక వారు తమ యాగవిఫలతను కప్పిపుచ్చుకొనుటకై దశరథుని భార్యలకు సంతానము కలుగుట పాయసమహిమయే యని చాటిరి.

విశ్వామిత్రుడు తన యజ్ఞరక్షణకై రాముని బంపుమని దశరథు నడుగ, దశరథు డతనితో 'రాముడు తన కఱువదివేల సంవత్సరముల కెంతో కష్టముచే కలిగినాడని వచించుటయు గమనించదగినది. (బాలకాండము 20వ సర్గము 10, 11 శ్లోకములు)

సుమంత్రుడు దశరథునితో "పుత్రులనీయ సమర్థుడగు ఋశ్యశృంగుడ"నుటచేతను, దశరథుడు "ఋశ్యశృంగుని ప్రభావమున పుత్రుల బడయుదున"ని వచించుట వలనను, అశ్వమేధయజ్ఞము పూర్తియైన పిమ్మట దశరథుడు ఋశ్యశృంగునితో "మా కులమును వృద్ధినొందించుకార్యము నీవే యొనర్పుము"ని కోరుటవలనను, పుత్రకామేష్టియందుద్భవించిన పురుషు డొసగిన ప్రసాదము తినినవెంటనే దశరథుని భార్యలు గర్భవతులు కానందువలనను, కౌసల్య, సుమిత్ర, కైకేయిలకు కలిగిన సంతానము దశరథుని సంతానమా ? అని సందేహమును కలిగించుచున్నది.



సుమంత్రుడు దశరథునితో 'నీ యల్లుడగు ఋశ్యశృంగుడ'ని వచించెను. దీనినిబట్టి రామాదులు జనించుటకు పూర్వమే దశరథునకు శాంతయను కుమార్తె జన్మించెనని తెలియుచున్నది. దశరథుడామెను రోమపాదునకు దత్తతగా నిచ్చినట్లు కొన్ని కథలు కన్పించుచున్నవి. దశరథునకు శాంతయను కుమార్తె జన్మించిన లేక లేక

కలిగిన యొక్క కుమార్తె నతడంగరాజగు రోమపాదునకు దత్తతగా నిచ్చునా? ఇది యసంభవము. దశరథుని కుమార్తె శాంతయని కొన్ని కథలయందు కనిపించుచున్నది. రోమపాదునకు దశరథుడని పేరుకూడకలదని కొందఱు పండితుల యభిప్రాయము. మరియు దశరథునకును, అంగరాజగు రోమపాదునకును మిక్కిలి సన్నిహిత సంబంధము కన్పించుచున్నది. వారిరువురు సోదరులవలె వర్తించుటను బట్టి సుమంత్రుడు రోమపాదుని యల్లుడగు ఋశ్యశృంగుని, దశరథునితో నీ యల్లుడగు ఋశ్యశృంగుడని వచించియుండునని యేల భావింపకూడదు?

---

పరశురాముడు–అంగరాజగు రోమపాదుని (ఇతనికి దశరథుడను పేరు గలదు) చంపుటకు రాగా, వసిష్ఠుడు, రోమపాదుని కుమార్తె శాంతను బ్రాహ్మణున కిచ్చి వివాహమునర్చునట్లు నియమించి, పరశురాముని మరల్చి, రోమపాదుని రక్షించెను.

ఇక్ష్వాకువంశములోని, సుదాసుని (కల్మాషపాదుని) భార్య 'మదవతి' వసిష్ఠునివలన సంతానమును గనెను.

## 2. రాజ్యము రామునిదా? భరతునిదా?

అయోధ్య. 107వ సర్గము : రాముడు భరతునితో

శ్లో॥ పురా భ్రాతః పితా నః స్నమాతరం తే సముద్వహన్,
మాతామహే సమాశ్రౌషీ ద్రాజ్యశుల్క మనుత్తమమ్. 3

మున్ను మన తండ్రి నీ తల్లియగు కైకేయిని వివాహమాడు నపుడు నీ తాతయగు కేకయమహారాజునకు "కైకేయికి పుట్టినవానికే రాజ్యమొసంగెదను" అని వాగ్దానము గావించెను.

దీనినిబట్టి రాజ్యము తండ్రికి పిమ్మట భరతునకు చెందవలయు నని రామునకు తెలియును.

బాల. 77వ సర్గము :

శ్లో॥ గతే తు భరతే రామో లక్ష్మణశ్చ మహాబలః,
పితరం దేవసంకాశం పూజయామాస తు స్తదా. 20

భరతుడు వెళ్ళగా (మేనమామతో); రాముడును, లక్ష్మణుడును దేవతలతో సమానుడైన తండ్రిని సేవించిరి.

దీనినిబట్టి రాజ్యమునకు వారసుడైన భరతుడు, తండ్రినుంచి - అయోధ్యనుంచి దూరముచేయబడుటచే, రామునికి రాజ్యము కట్టబెట్టుటకు దశరథు డొనర్చుచున్న ప్రయత్నములకు సంతోషించిన వారలై, రామలక్ష్మణులు తండ్రియందు మిక్కిలి ప్రేమాభిమానములు గలవారై, యతనిని సేవించిరని తెలియుచున్నది.

అయోధ్య. 1వ సర్గము :

శ్లో॥ అథరాజ్ఞో బభూవైవ వృద్ధస్య చిరజీవనః,
ప్రీతిరేషా కథం రామో రాజస్యా న్మయి జీవతి. 36

దశరథునకు తాను జీవించియుండగా 'రాముడెట్లు రాజగునా!' యను నాలోచన కలిగెను.

శ్లో॥ ఏషా హ్యస్య పరా ప్రీతి ర్హృది సం పరివ ర్తతే
కదా నామ సుతం ద్రక్ష్యా మ్యభిషి క్త మహం ప్రియమ్. 37

"నే నెపుడు నా ప్రియపుత్రుడగు రాముని రాజ్యాభిషిక్తునిగ జూతునా"?" యను మిక్కిలిప్రీతి యొడతెగక దశరథుని హృదయమున నేర్పడెను.

దశరథుని జ్యేష్ఠపుత్రుడు రాముడు. రాజ్యమునకు తన వారసుడు. కాని దశరథునికి నిజముగ తన వారసుడు రాముడే యైనచో

నతని రాజ్యాభిషిక్తునిగ చేయుటకు నిరంతర ఖేదనము ననుభవించు టేల? దశరథుడు, తాను కైకకు జన్మించిన పుత్రునకే రాజ్య మొసంగుదునని ప్రమాణముచేయుటచే, దానికి భిన్నముగ రాముని రాజ్యమున ప్రతిష్ఠించుటకు మార్గము నాలోచించుచు నిరంతర ఖేదము ననుభవించినట్లు తెలియుచున్నది.

అయోధ్య. 4వ సర్గము : దశరథుడు రామునితో నిట్లనెను.

శ్లో॥ తతః పుష్యేఽభిషించస్వ మన స్త్వరయతీవ మామ్,
శ్వస్త్వాఽహ మభిషేక్ష్యామి యౌవరాజ్యే పరంతప 22
సుహృదశ్చా ప్రమత్తాస్త్వాం రక్షంత్వద్య సమంతతః,
భవంతి బహువిఘ్నాని కార్యాణ్యేవం విధాని హి 24
విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః,
తావ దేవాభిషేక స్తే ప్రాప్తకాలో మతో మమ. 25
కామం ఖలు సతాం వృత్తే భ్రాతా తే భరతః స్థితః,
జ్యేష్ఠానువర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేంద్రియః. 26
కిం తు చిత్తం మనుష్యాణా మనిత్యమతి మే మతిః,
సతాం తు ధర్మనిత్యానాం కృతశోభి చ రాఘవ. 27

నిన్ను పుష్యమి యందభిషేకింపుమని నా మనస్సు త్వరపెట్టు చున్నది. రేపు నిన్ను యువరాజ్యమందభిషేకింతును.

నీ స్నేహితు లప్రమత్తులై యుంతట నిన్ను రక్షింతురుగాక. ఇట్టి కార్యములకు పెక్కువిఘ్నములు కలుగుచుండును.

భరతుడు పురమునుండి పంపబడినాడు. అతడు వచ్చులోపల నీ యభిషేకమునకు తగినసమయము.

నీ సోదరుడగు భరతుడు సత్పురుషమార్గమందున్నవాడు. జ్యేష్ఠు ననుసరించువాడు. ధర్మాత్ముడు జితేంద్రియుడు. దయా ర్ద్రహృదయుడు.

అయినను మనుజుల మనస్సు స్థిరముగానుండదని నా యభిప్రాయము. ధర్మనిరతులగు సజ్జనుల మనస్సు కార్యముచే ప్రకాశించును.

పై మాటలనుబట్టి దశరథ-రాము లిరువురు రాజ్యార్హతగల భరతుని వలనను, భరతునివైపు వారివలన యేవైన నాటంకములు కలుగునేమో యని యప్రమత్తులై యున్నట్లు విశదమగుచున్నది.

"భరతుడు పురమునుండి పంపబడినాడు. అతడు వచ్చులోపల నీ యభిషేకమునకు తగిన సమయము" అని దశరథుడు వచించుటను బట్టి దశరథుడు కావలయునని ముందుచూపుతో, రామునికి రాజ్యము కట్టబెట్టవలయుననెడి యుద్దేశ్యముతో భరతుని పురమునుండి పంపినట్లు విశదమగుచున్నది.

అయోధ్య. 4వ సర్గము : రాముడు తన తల్లితో తన పట్టాభిషేక వార్త తెలుపగనే, కౌసల్య యిట్లు పలికెను.

శ్లో॥ వత్స రామ చిరంజీవ హతాస్తే పరిపంథినః,
జ్ఞాతీన్ మే త్వం శ్రియా యుక్త స్సుమిత్రాయాశ్చనందయ 39

"రామా! నీ శత్రువులు చంపబడిరి. నీవు సంపదతో గూడి నా జ్ఞాతులను, సుమిత్రయొక్క జ్ఞాతులను సంతోషపెట్టుము."

దీనినిబట్టి కౌసల్యకు కూడ, దశరథుడు కైక కుమారునకు రాజ్యాధికారము దత్తతచేయుట తెలియును. అందువలననే తన కుమారునకు రాజ్యము సంక్రమించునను ఆశను వదలుకొనినది. కాని రాముడు ఆమెతో తన పట్టాభిషేకవార్త తెలుపగనే, తానూహించని కార్యము తన యెదుట జరుగబోవుచున్నందుకు హర్షాతిశయముతో పులకరించినదై పై విధముగ పలికెను. చిరకాలము నుండియు భరతునకు కలుగబోవు రాజ్యప్రాప్తికి, తన కుమారునకు కలుగబోవు రాజ్యవిహీనతకు కుములుచున్న కౌసల్య రాముడు తన పట్టాభిషేక వార్త తెలుపగనే "నీ శత్రువులు చంపబడిరని" వచించెను. అనగా కైక-

భరతుడు-వారి వర్గమువారు హీనదశనందిరని కౌసల్యాయభిప్రాయము. దీనినిబట్టి కౌసల్యకు, కైకపైన భరతునిపైన నెంతటి ద్వేషమున్నదో గ్రహింపుడు. ఈ ద్వేషమునకు ముఖ్యకారణము భరతునకు కలుగబోవు రాజ్యప్రాప్తి'యని వేరే వచింప నవసరము లేదు.

అయోధ్య. 38 సర్గము :

శ్లో॥ తస్యాచీరం వసానాయాం నాథవత్యా మనాథవత్,
ప్రచుక్రోశ జనస్సర్వోధిక్ త్వాం దశరథం త్వితి. 1

సీత నాథుడు కలదయ్యు, ననాథవలె నారవస్త్రముల ధరింపగా, జనులందఱు "దశరథునకు నిందయగుగాక"యని యాక్రోశించిరి.

సీతారాముల వనవాసమునకు కైక కారణమైనచో జనులందఱు కైకను నిందించవలయును కదా! దశరథునేల నిందించిరి? అనగా దశరథుడు కైక పుత్రునకు రాజ్యమొసంగెదనని వచించుట పురప్రజలందఱికి తెలియును. (ఇచట దశరథుడు కైకకు తానిచ్చిన వరద్వయముచే, కైక దశరథునితో రాముని వనవాసము కోరుటచే దశరథుడందుల కంగీకరించినందున పురప్రజలు దశరథుని రాముని వనవాసమునకు కారణభూతుడుగ తలచిరని భావింపవచ్చును. కాని కైకయే రాముని వనవాసమునకు కారణమని తలచిన, పురప్రజలు కైకనేల నిందింపరు? దశరథునే నిందించుటేల?) అందువలన భరతునకుగల రాజ్యాధికారమును త్రోసివేసి దశరథుడు రామునకు పట్టాభిషేక యత్నమొనర్చుట పురప్రజలందఱికి తెలియును. అందుచే నచటి జనులు దశరథుని నిందించిరి.

శ్లో॥ తేన తత్ర ప్రణాదేన దుఃఖితః స మహీపతిః,
చిచ్ఛేద జీవితే శ్రద్ధాం ధర్మే యశసి చాత్మనః. 2

ఆ ధ్వని (జనులందఱు దశరథునకు నిందయగుగాక యని యొనరచిన ధ్వని) విని దశరథుడు జీవితముపైన, ధర్మముపైన, కీర్తిపైన, యాదరమును వీడి దుఃఖాక్రాంతుడయ్యెను.

ఈ మాటలనుబట్టి దశరథుడు తనచేతలన్నియు జనులకంతఱకు తెలిసినవని తలచినవాడై మిక్కిలి ఖేదమునందెను.

పై విషయములన్నిటి వలన, రాముడు దశరథునకు జ్యేష్ఠ పుత్రుడైనను, దశరథుడు కైక తండ్రికొసర్చిన వాగ్దానమునుబట్టి, భరతుడే రాజ్యమున కర్హుడని విదితమగుచున్నది. దశరథుని వాగ్దానము యదార్థమనియు పై సంఘటనలు ఋజువుచేయుచున్నవి.

మరియు దశరథుడా వాగ్దానమును త్రోసిపుచ్చుటవలననే, కైక దశరథుని, యాతడు తన కొసంగిన వరములచే, తన పుత్రునకు పట్టాభిషేక మొనర్పవలయునను తన కోరికను నెరవేర్చుకొనెను.

## 3. రాముని వనవాసమునకు కారణమెవ్వరు ? కైకయా ? దశరథుడా ? రాముడా ?

అయోధ్య. 107వ సర్గము : రాముడు భరతునితో

శ్లో॥ పురా! భ్రాతః పితానః స్సమాతరం తే సముద్వహన్,
మాతామహే సమా|శ్రౌషీ|ద్రాజ్య శుల్క మనుత్తమమ్. 3

మున్ను మన తండ్రి నీ తల్లియగు కైకేయిని వివాహమాడు నపుడు నీ తాతయగు కేకయమహారాజునకు "కైకేయికి పుట్టినవానికే రాజ్యమొసంగెదన"ని వాగ్దానము గావించెను.

ఈ మాటలనుబట్టి దశరథునికి పిమ్మట రాజ్యము భరతునకు చెందవలయునని రామునకు తెలియును. తాను దశరథునకు జ్యేష్ఠ పుత్రుడగుటచే తన తండ్రికి పిమ్మట తాను రాజుకావలయును. కాని తన తండ్రి కైక తండ్రికిచేసిన వాగ్దానమువలన రాజ్యము భరతునకు సంక్రమింపవలసియున్నది.

మొదట కైక యందలి మమకారముచే కైకను పరిణయ మాడు సమయమున కైక తండ్రితో, కైకపుత్రునకు రాజ్యమొసంగెద

నని వాగ్దానము చేసిన దశరథునకు, తరువాత రామునకు రాజ్యమొసంగ వలయునను కోరిక కలిగెను. అందులకై దశరథుడు తన ప్రయత్నముల చేయనారంభించెను. ప్రప్రథమముగ భరతుని అయోధ్యయందు లేకుండ చేయదలచినవాడై, అతని మేనమామతో నతనిని కేకయ రాజ్యమునకు పంపెను.

యుధాజిత్తు మేనల్లుడగు భరతుని చూచుటకురాగా, దశరథుడు భరతునితో "నీ మేనమామ నిన్ను తీసికొనివెళ్ళుటకు వచ్చినాడ'ని వచించిన దశరథుని యీ క్రింది పన్నాగమును చూడుడు.

బాల. 73వ సర్గము : యుధాజిత్తు దశరథునితో నీ క్రింది విధముగ పలికెను.

శ్లో॥ స్వస్త్రీయం మమ రాజేన్ద్ర ద్రష్టు కామో మహీపతిః,
తదర్థ ముపయాతోఽహ మయోధ్యాం రఘు నన్దన. 4
శ్రుత్వా త్వహ మయోధ్యాయాం వివాహార్థం తవాత్మజాన్,
మిథిలాముపయాతాం స్తుత్వయా సహ మహీపతే. 5
త్వర యాభ్యుపయాతోఽహం ద్రష్టు కామః స్వసుః సుతమ్.

రాజా! కేకయరాజు నామేనల్లుని చూడగోరినాడు. అందువలన నే నయోధ్యకు వెళ్ళితిని.

నీ కుమారులు వివాహముకొఱకై సీతోగూడ మిథిలచేరిన వారుగా నయోధ్యలో విని నేను సోదరికుమారుని చూచుకోరికతో త్వరగవచ్చితిని.

పై వాక్యములో యుధాజిత్తు 'కేకయమహారాజు నామేనల్లుని చూడగోరినాడ'ని వచించుటచే, నతడు తన మనుమని చూడగోరి నాడని వచించుటవలననే దశరథుడు తన కుమారుని పంపినాడని కొందఱు వచింతురు.

కాని యుధాజిత్తు తన మేనల్లుని పంపుమని దశరథుని కోర లేదు. తన తండ్రి మనుమని తీసికొనిరమ్మని నాడనియు దశరథునితో

వచింపలేదు. తన తండ్రి మనుమని చూడగోరి తన్ను పంపినట్లున్నది. అనగా కేకయరాజు కుమారుడగు యుధాజిత్తును మనుమని చూచి రమ్మనియే పంపెను. యుధాజిత్తుకూడ దశరథునితో తన మేనల్లుని చూడవలయునను కోరికతో నచటకు వచ్చితినని వచించెను.

బాల. 77వ సర్గము : కాని దశరథుడు భరతునితో నిట్లు పలికెను.

శ్లో॥ అయం కేకయ రాజస్య పుత్రో వసతి పుత్రక,
త్వాం నేతు మాగతో వీరో యుధాజన్మా తుల స్తవ. 18
ప్రార్థిత స్తేన ధర్మజ్ఞ మిథిలా యా మహం తథా,
ఋషి మధ్యేతు తస్య త్వం ప్రీతిం కర్తు మిహార్హసి. 19

కుమారా! నిన్ను తీసికొనివెళ్ళుటకు నీ మేనమామయగు యుధాజిత్తు వచ్చియున్నాడు.

నే నతనిచేత మిథిలయందు ఋషులమధ్య నట్లు ప్రార్థింపబడితిని. నీ వతని కానందము కలిగించుటకు తగియున్నావు.

ఈ విధముగ యుధాజిత్తు అడుగకపోయినను, యుధాజిత్తు ఋషులమధ్య భరతుని తీసికొని వెళ్ళుటకై తన్ను ప్రార్థించెనని, దశరథుడు భరతునితో వచించి, భరతుని–యుధాజిత్తుతో కేకయ రాజ్యమునకు బంపెను.

పిమ్మట దశరథుడు రాముని చేత పురోహితులకు, పురప్రజలకు, మంత్రులకు యిష్టమగు కార్యములు చేయించెను.

దశరథు డీ విధముగ భరతు డయోధ్యలో లేకుండునట్లు చేసి, రామునిపై ప్రజలకు ప్రీతికలిగించుటకై రామునిచేత వారలకిష్టమగు కార్యములు చేయించెను.

రాముడును; తండ్రి, భరతుని అయోధ్యనుండి వెడలబంపుట, తనచేత పురోహితాదులకు హితమగు కార్యములు చేయించుట యందలి యభిప్రాయము గ్రహించినవాడై, భరతుడింటినుండి వెళ్ళి నప్పటి నుండియు తండ్రిని మిక్కిలిగ గౌరవించెను.

ఈవిధముగ తన కార్యములన్నియు సానుకూలముగ నొనర్చు కొనుచు దశరథుడు, ఒక్కరోజు లోపల రాముని పట్టాభిషిక్తునిగ నొనరించుటకు తగిన యత్నమంతయు చేసెను.

దశరథుడు రామునితో భరతుడయోధ్యకు వచ్చులోపలనే యతని (రాముని) పట్టాభిషేకము జరుగవలయుననియు, శత్రువుల నుండి తగు జాగ్రత్తలోనుండుమనియు హెచ్చరించెను. అనగా భరతుడు లేకున్నను, భరతునికి సంబంధించిన వారి పట్టాభిషేకమునకు విఘ్నమొనరింతురేమోయని రామ–దశరథులు తమ ప్రయత్నములో నుండిరి.

భరతునికి పట్టాభిషేకము చేయవలసిన దశరథుడు, భరతుడు దేశములో లేనిసమయమున, కనీసము భరతుని తల్లికికూడ తెలుపక, భరతునివైపువారికి కబురంపక, తన ప్రియపుత్రుడగు రామునికి పట్టాభిషేకము చేయుటకు యత్నములు సలుప, తన కుమారునికి రావలసిన రాజ్యాధికారమును తాను ప్రశ్నించుట కైక నేరమా? కైక పుట్టింటి దాసియగు మంథర, కైకకు పూర్వవిషయములు తెల్పుట నేరమా? ఈ విషయమున వాల్మీకి. కైకను, కుబ్జను–చెడ్డమనసులు గలవారనియు, పాపులనియు వ్రాసెను. రాముని దశరథుని యుత్తములుగ వ్రాసెను. మరియు "దశరథుడు రామాభిషేకమును ప్రియురాలగు కైకకు తెలుపుటకై యంతఃపురమును ప్రవేశించెను" అని వాల్మీకి వ్రాసెను. దశరథుడు కైక యంతఃపురమును ప్రవేశించినది రాత్రివేళ. అతడు రామాభిషేకకార్యములు సర్వము నేర్పాటుగావించి కైక యంతఃపురమును ప్రవేశించెను. అనగా కైక, భరతునికై యిక నేమియు చేయజాలదని నిర్ణయించినవాడై, కైకతో రాముని పట్టాభిషేకవార్త తెల్పుట కేతెంచియుండవచ్చును. అయినను దశరథు డొనర్చినది దుష్టత్వమేగదా! తన వాక్యముచే రాజ్యమును భరతున కీయవలసిన దశరథుడు, చెంతనున్న భరతుని తల్లికి తెలియనీయకుండ,

నొక్క-రోజులో రాముని పట్టాభిషేకమునకు సకలయత్నములు పూర్తి గావించి కైక యంతఃపురమునకు ప్రవేశించినది కైకకావిషయములు తెలుపుటకే యనుట యెంత సమర్ధనీయము ?

రాజ్యము భరతునకు చెందవలయునని తెలిసియు, తండ్రితో మంతనములు సలిపి, రాజ్యాధికారమును చేజిక్కించుకొనుటకు, పట్టాభిషేకమునకు తాపత్రయపడు రాముని వనవాసమునకు బొమ్మనుట కైక దోషమా ?

భరతుడుగాని, భరతునివైపువారుగాని నగరములో లేకున్నను, దశరథుడు కుమారుడగు రామునితో, నమ్మకముగలవారి రక్షణలో నుండుమనియు, భరతుడు సత్పురుషమార్గమందున్నను, మనుజుల మనస్సు స్థిరముగానుండదని తన యభిప్రాయమనియు యాదేశించెను. అట్టి సమయమున కైక, తన కుమారుడగు భరతుడు రాజ్యాభిషిక్తుడగుచుండ, రాజ్యకాంక్షచే సతనివైరియగు రాముని దేశములో లేకుండ చేయుట యనుచితమా ? కైక యీ విధముగ దశరథుడు చూపిన మార్గములోనే పయనించినది.

రాజ్యాధికారము పొందుటకేమియు యత్నింపని భరతుని, రామ-దశరథు లనుమానింప, రాజ్యాధికారమునకై ప్రయత్నము చేయుచున్న రాముని, కైక శంకించవలదా ?

తన కుమారుడుగాని, తనవైపువారుగాని నగరములోను -రాజ్యములోను లేకున్నను, దశరథుడు-రాముని నమ్మకముగలవారి రక్షణలోనుండుమని యాదేశింప, నూతనముగ రాజ్యాభిషిక్తుడై మూలబలముగూడ లేకయున్న సమయమున, తన కుమారుని రక్షణకై కైక, స్వదేశములో మూలబలమును గలిగియుండి, రాజ్యమునకై పరితపించు రాముని వనవాసమున కంపుట నేరమా ?

ఈ యంశముల ననుసరించి, రాజ్యమునకై రాముడు తండ్రితో కలిసిచేసిన కుట్రలఫలితమే, కైక, రాముని వనవాసమును కోరుట.

కనుక రాముని వనవాసమునకు ముఖ్యకారణుడు దశరథుడు తరువాత కారణుడు రాముడు.



రాముడు రాజ్యమును పాలించినకాలము 11 వేల సంవత్సరములని వాల్మీకి వ్రాసెను. దశరథునకు 60 వేల సంవత్సరములకు రాముడు జన్మించెననియు వాల్మీకి వ్రాసెను. ఇన్ని సంవత్సరములాయుష్యముగలవారికి 14 సంవత్సరములనిన నెంతకాలము ? బహు కొద్దికాలము.

60 వేల సం॥లు జీవించిన వారికి 14 సం॥లు అనిన, 100 సం॥లు జీవించువానికి 9 రోజులకుకూడ తక్కువ. అనగా కైక - రామునకు నిర్దేశించిన వనవాసకాల మిప్పటి జీవితకాలమునుబట్టి బహుతక్కువ. అట్టి సమయమున దీనికింతరాద్ధాంతమేల జరుగవలసి వచ్చినది ?

## 4. రామునకు - రావణుని గురించి తెలియునా ?

భరద్వాజుడు : ఇతడు తన కుమార్తెయగు దేవవర్ణిని, రావణుని తండ్రియగు విశ్రవసునకు భార్యగా నిచ్చెను. (ఉత్తరకాండము 3వ సర్గము).

భరద్వాజుని యాశ్రమము అయోధ్యకు చేరువలోనేయున్నట్లు వాల్మీకి రామాయణము వలన తెలియుచున్నది. రాముడు వనమున కేగునపుడు, తిరిగివచ్చునపుడు భరద్వాజుని యాశ్రమమున కేగి, యతనితో సంభాషించెను. భరతుడును, రామునికొఱకై యడవుల కేగునపుడు భరద్వాజుని యాశ్రమమునకేగి, యతని యాతిథ్యము స్వీకరించెను. ఈ సంఘటనలనుబట్టి అయోధ్యరాజులు భరద్వాజునికి చిరపరిచితులు. అట్టియెడల భరద్వాజుని బంధువైన రావణుడు అయోధ్యరాజులకు, రామునకు తెలిసియుండు ననుట నిస్సందేహము.

బాల. 20వ సర్గము : విశ్వామిత్రుడు దశరథునితో

శ్లో॥ పౌలస్త్యవంశ ప్రభవో రావణో నామ రాక్షసః,
స బ్రహ్మణా దత్తవరస్త్రైలోక్యం బాధతే భృశమ్. 16
మహాబలో మహావీర్యో రాక్షసై ర్బహుభి ర్వృతః,
శ్రూయతే హి మహావీర్యో రావణో రాక్షసాధిపః. 17
సాక్షా ద్వైశ్రవణ భ్రాతా పుత్రో విశ్రవసో మునేః

పౌలస్త్యవంశ్యుడగు రావణుడను రాక్షసుడు........సాక్షాత్ కుబేరుని సోదరుడు. విశ్రవసముని పుత్రుడు.

దశరథుడు విశ్వామిత్రునితో

శ్లో॥ దేవదానవ గంధర్వా యక్షాః పతగ పన్నగాః,
న శక్తా రావణం సోఢుం కిం పునర్మానవా యుధి. 22

దేవదానవ గంధర్వ యక్షపతగ పన్నగులును రావణుని జయించలేరు.

ఉత్తర 19వ సర్గములో : రావణు డయోధ్యరాజగు అనరణ్యుని జయించి నట్లున్నది. (గౌతమ ధర్మసూత్రములలో రావణుడు దశరథుని తండ్రియైన అనరణ్యుని చంపినట్లు గలదు.)

ఉత్తర. అధికపాఠము 1వ సర్గములో : రావణుడు మాంధాతతో రణ మొనర్చినటులున్నది.

ఉత్తర. 67 సర్గము : మధువు పుత్రుడగు లవణుడు మాంధాతను రణములో చంపెను.

ఉత్తర. 61వ సర్గము : విశ్వావసు పుత్రి కుంభీనసి. మధువు భార్య.

ఉత్తర. 25వ సర్గము : అనగా లవణుడు రావణునికి మేనల్లుడు.

(స్కంధపురాణములో రావణునకు–మాంధాతకు చాలకాలము యుద్ధము జరిగినట్లున్నది).

ఇట్లు దశరథుని పూర్వీకులతో అనేక యుద్ధములు చేసిన రావణుడు, దశరథునికి తెలిసిన రావణుడు, రామునకు తెలియకుండునా?

తన పూర్వీకులను చంపిన రావణునిపై పగ, రాముని మనస్సులో బాల్యమునుండి యుండనోపు.

రాముని, రాక్షసవధకై తీసికొని వెళ్ళిన విశ్వామిత్రుడు, రాక్షసులకు నాయకుడగు రావణుని గురించి రామునకు తెలుపకుండునా ?

అరణ్య. 6వ సర్గము : ఋషులు రామునితో రాక్షసులనుండి తమ్ము రక్షింపుమని కోర, రాముడు వారితో నిట్లనెను.

శ్లో॥ కేవలే నాత్మ కార్యేణ ప్రవేష్టవ్యం మయావనం,
విప్రకార మపాక్రష్టుం రాక్షసై ర్భవతా మిమమ్. 22
పి తుస్తు నిర్దేశకరః ప్రవిష్టోఽహ మిదం వనమ్,
భవతామర్థ సిధ్యర్థ మాగతోఽహం యదృచ్ఛయా. 23

నేను ఆత్మార్థ మీవనమును ప్రవేశించితిని రాక్షసులచే మీకు కలుగు ఆపదను తొలగించుటకే మీకార్యమునకై వనమున ప్రవేశించితిని.

పితాజ్ఞను నిర్వర్తించువాడనై యీ వనమునకు వచ్చితిని. యాదృచ్ఛికముగ మీ కార్యసిద్ధి కొఱకును వచ్చితిని.

అయోధ్య. 112వ సర్గము :

శ్లో॥ తత స్త్వృషి గణాః క్షిప్రం దశగ్రీవ వధై షిణః,
భరతం రాజశార్దూల మిత్యూచుః సంగతావచః. 4

ఋషిగణములు రావణ వధమును గోరువారై భరతునిచేరి యిట్లు పలికిరి.

అయోధ్య 116వ సర్గము : ఋషులు రామునితో

శ్లో॥ రావణా వరజః కశ్చిత్ఖరో నామేహ రాక్షసః,
ఉత్పాట్య తాపసాన్ సర్వాన్ జనస్థాన నివాసినః. 11

రావణుని తమ్ముడగు ఖరుడు.... ....

ఈ విధముగ ఋషులందరికి తెలిసిన రావణుడు, రామునకు తెలియకుండునా ? రావణవధగోరు ఋషులు రామునకు రావణుని

నివాసమును గురించి తెలుపకుందురా ? కనులుమూసికొనినంత నే సర్వమును తెలిసికొన గలిగిన యోగిపుంగవులు, దేవలోక – బ్రహ్మలోక–సమస్తలోకములు తిరిగిరాగలిగిన సమర్థులగు మహర్షులకు రావణుని నివాసము తెలియకుండునా ? వారు రామునకు తెలుపకుందురా ? రాక్షసులకు నాయకుడగు రావణుని నివాసము తెలిసికొనకయే రాముడు రాక్షసుల చంపెదనని వాగ్దానములు చేసెనా ?

అరణ్య. 17వ సర్గము : శూర్పణఖ రామునితో

శ్లో॥ అహం శూర్పణఖా నామ రాక్షసీ కామరూపిణీ,
అరణ్యం విచరా మీదమేకా సర్వభయం కరా. 22
రావణో నామమే భ్రాతా బలీయా న్రాక్షసేశ్వరః,
వీరో విశ్రవసః పుత్రో యది తే శ్రోత్ర మాగతః. 23
ప్రవృద్ధ నిద్రశ్చ సదా కుంభకర్ణో మహాబలః,
విభీషణస్తు ధర్మాత్మా న తు రాక్షస చేష్టితః. 24
ప్రఖ్యాత వీర్యౌ చ రణే భ్రాతరౌ ఖరదూషణౌ,
తా నహం సమతి క్రాంతా రామః త్వా పూర్వ దర్శనాత్
స ముపేతాఽస్మి భావేన భర్తారం పురుషోత్తమమ్. 25

నేను శూర్పణఖ యను రాక్షసిని .... ఒంటరిగా నరణ్యమున సంచరించుచుందును.

రావణుడు నా సోదరుడు. మహాబలశాలి. సకలరాక్షసులకు ప్రభువు. వీరుడు. విశ్రవసుని పుత్రుడు. నీ వతని పేరు విని యుండవచ్చును.

నా మరియొక రెండవ సోదరుడు కుంభకర్ణుడు. మహాబలుడు. విభీషణుడు నా మూడవ సోదరుడు. ప్రఖ్యాత వీరులగు ఖరదూషణులు నా సోదరులు.

శూర్పణఖ యింత విపులముగ తన కుటుంబమును గురించి తెలిపెను. ఆమె రామ లక్ష్మణులతో చాలసేపు గడిపెను. రామ లక్ష్మణు లామెతో పరియాచకము లాడిరి. రావణుని నివాసమును

గురించిగాని, రావణుని గురించిగాని, తనకు తెలియునిచో, రావణుని చంపుటకై కుతూహలపడు రాము డామె నడిగి యుండెడివాడు గదా! కనుక రావణుని గురించి రామునకు పూర్తిగా తెలియును.

ఉత్తర. 34వ సర్గము : రావణుడు కిష్కింధకేగి, వాలితో రణమొనరించి, స్నేహము చేసికొని, వాలి గృహమున నొకమాసము గడిపెను.

దీనినిబట్టి రావణుడు వానరు లందఱకు తెలిసినేయుండును. సుగ్రీవ-హనుమంతాది వానరులందఱు రావణు నెరిగియుందురనుట నిస్సందేహము.

కిష్కింధ. 6వ సర్గము : సుగ్రీవుడు రామునితో

శ్లో॥ హ్రియ మాణా మయా దృష్టా రక్షసా క్రూర కర్మణా,
క్రోశంతీ రామ రామేతి లక్ష్మణేతి చ విస్వరమ్,
స్ఫురంతీ రావణస్యాంకే పన్నగేంద్ర వధూర్యథా. 9

క్రూర కర్ముడగు రావణు డపహరించుకొని పోవుచుండగా, రావణుని యంకమందుండి, రామా! లక్ష్మణా! యనుచు వికృత స్వరముతో నఱచు సీతను చూచితిని.

ఇచట సుగ్రీవుడు 'రావణుని' నామ ముచ్చరించుటనుబట్టి, రావణుని చూచితి ననుటవలనను రావణుడు సుగ్రీవునకు తెలిసినట్లే గదా!

కిష్కింధ. 35వ సర్గము : తార, లక్ష్మణునితో

శ్లో॥ శతకోటి సహస్రాణి లంకాయాం కిల రాక్షసాః,
అయుతాని చషట్ త్రింశత్ సహస్రాణి శతాని చ. 15
అహత్వా తాంశ్చ దుర్ధర్షాన్ రాక్షసాన్ కామరూపిణః,
న శక్యో రావణో హన్తుం యేన సా మైథిలీ హృతా. 16
తే న శక్యారణే హంతు మసహాయేన లక్ష్మణ,
రావణః క్రూరకర్మా చ సుగ్రీవేణ విశేషతః. 17

లంకలో లక్షకోట్ల మూడులక్షల అరువదివేలమంది రాక్షసులున్నారు. కామరూపులు, ఎదిరింప శక్యముకానివారగు నారాక్షసుల సంహరింపక సీత నపహరించిన రావణుని చంపుట సాధ్యముకాదు.

ఆ రాక్షసులను యుద్ధమున చంపుట సాధ్యముకాదు. అందును విశేషించి క్రూరకార్యములు చేయు రావణుని, సుగ్రీవు డొంటరిగ చంపుటయు సాధ్యముకాదు.

కిష్కింధ. 41వ సర్గము : సుగ్రీవుడు వానరులతో

శ్లో॥ ద్వీప స్తస్యా పరే పారే శతయోజన మాయతః,
అగమ్యో మానుషైర్దీ ప్త స్తం మార్గధ్వం సమం తతః., 24
తత్ర సర్వాత్మనా సీతా మార్గితవ్యా విశేషతః,
స హి దేశ స్తు వధ్యస్య రావణస్య దురాత్మనః. 25
రాక్షసాధి పతే ర్వాస స్సహ స్రాక్ష సమద్యుతేః.

ఆ సముద్రపు టావలి యొడ్డున నూరామడవైశాల్యముగల యొక ద్వీపమున్నది....ఆ ద్వీపము దేవేంద్రునకు సాటియగు ప్రకాశము గలవాడు, మనకు చంపదగినవాడు నగు రాక్షసరాజగు రావణుని నివాసస్థానము.

ఈవిధముగ తారకు సుగ్రీవునకు తెలిసిన లంకను గురించిన సమాచారము రావణుని గురించిన సమాచారము, రామునకు తెలియకుండునా ?

సుందర. 51వ సర్గము : హనుమంతుడు రావణునితో

శ్లో॥ అహం సుగ్రీవ సందేశాత్ । ఇహ ప్రా ప్త స్తవాలయం ।
రాక్షసేంద్ర హరీశస్త్వాం । భ్రాతా కుశల మబ్రవీత్. 2

రాక్షసరాజా ! నేను సుగ్రీవుని సందేశముతో నీ పురమునకు వచ్చితిని. సోదరతుల్యుడగు వానరనాధుడు నీ కుశలమడిగెను.

ఇచట "సుగ్రీవుని, రావణుని సోదరతుల్యుడు" అని సంబోధించుటనుబట్టి, సుగ్రీవ–రావణులకు సన్నిహిత సంబంధమున్నట్లు తెలియుచున్నది.

అరణ్య. 52వ సర్గము :

శ్లో॥ ప్రహృష్టా వ్యథితాశ్చా సం త్సర్వే తే పరమర్షయః 13
దృష్ట్వా సీతాం పరామృష్టాం దండకారణ్య వాసినః,
రావణస్య వినాశం చ ప్రాప్తం బుద్ధ్వా యదృచ్ఛయా. 14

రావణుడు సీతను గొంపోవుచుండగా చూచి, దండకారణ్య వాసులగు ఋషులందఱు రావణున కేర్పడు వినాశము నెఱిగి సంతోషమును, సీతను గూర్చి దుఃఖమును పొందిరి.

ఆ ఋషులు రామునకు రావణుని సీతాపహరణ వృత్తాంతమును తెలుపకుందురా ?

అరణ్య. 67వ సర్గము : జటాయువు రామునితో

శ్లో॥ త్వయా విరహితా దేవీ లక్ష్మణేన చ రాఘవ,
హ్రియమాణా మయా దృష్టా రావణేన బలీయసా. 16

రామా ! నీవు, లక్ష్మణుడు చెంతలేని సమయమున బలశాలియగు రావణుడు దేవి నపహరించుచుండగా నేను చూచితిని.

అరణ్య. 68వ సర్గము : జటాయువు రామునితో

శ్లో॥ పరిశ్రాంత స్యమే తాత పక్షౌ ఛిత్వా స రాక్షసః,
సీతా మా దాయ వైదేహీం ప్రయాతో దక్షిణాం దిశమ్. 10

నేను మిగుల నలసియుండగా ఆ రాక్షసుడు నా ఱెక్కలు నఱికి సీతను తీసికొని దక్షిణదిశగా నేగెను.

శ్లో॥ పుత్రో విశ్రవస స్సాక్షాద్భ్రాతా వైశ్రవణ స్య చ,
ఇత్యుక్త్వా దుర్లభాన్ప్రాణా న్ముమోచ పతగేశ్వరః. 16

"రావణుడు విశ్రవసుని పుత్రుడు. కుబేరుని తమ్ముడు" అని పలికి జటాయువు ప్రాణములు విడిచెను.

పై విషయములలో జటాయువు రామునితో, రావణుడు సీతను గొంపోయిన మార్గము తెలుపుటయేగాక, రావణుడెవరైనది తెలిపెను.

అరణ్యా. 69వ సర్గము :

శ్లో॥ కృత్వైవ ముదకం తస్మై ప్రస్థితౌ రామలక్ష్మణౌ,
అవేక్షన్తౌ వనే సీతాం పశ్చిమాం జగ్మ తుర్దిశమ్. 1

రామలక్ష్మణు లట్లు జటాయువునకు జల తర్పణాదులు చేసి, యచటనుండి బయలు దేరి సీతను వెదకుచు పశ్చిమదిశగా వెళ్ళిరి.

జటాయువు రామునితో రావణుడు సీతను తీసికొని దక్షిణ దిశగా వెళ్ళెనని తెలుప, రామలక్ష్మణులు పశ్చిమదిశగా నేల వెళ్ళిరి! రామునకు రావణుని నిలయము తెలియును గనుక, తాము నేరుగా ప్రయాణించి లంకకు చేరినను, రావణుని జయించుట దుర్లభమని యెరిగియుండుటచే, ఆలోచనా నిమగ్నులై రావణు నేవిధముగ జయించవలయునో తెలియక పరితాపమందుచు, తమకు సహాయము చేయగలుగు వారెవరా ? యను అన్వేషణతో పశ్చిమదిశయం దెవరిపైననో యాశగలవారై, ఆ దిక్కుగా ప్రయాణించిరని తెలియు చున్నది.

కిష్కింధ 28వ సర్గము : రాముడు లక్ష్మణునితో

శ్లో॥ రావణశ్చ మహాన్ శత్రు రపారం ప్రతిభాతిమే. 59

మహాశత్రువగు రావణుడు - అంతులేని ప్రతిభగలవాడుగ నున్నాడు.

కిష్కింధ. 26వ సర్గము : రాముడు సుగ్రీవునితో

శ్లో॥ ప్రవృత్తాః సౌమ్య చత్వారో మాసా వార్షిక సంజ్ఞకాః,
నాయ ముద్యోగ సమయః ప్రవిశ త్వం పురీం శుభామ్. 14

రాబోవు నాలుగుమాసములు వార్షికమాసములు. ఇది (యుద్ధమునకు) ప్రయత్నించు సమయముకాదు.

శ్లో॥ ప్రభూత సలిలా సౌమ్య ప్రభూత కమలోత్పలా,
కార్తికే సమనుప్రాప్తే త్వం రావణ వధేయత. 16

కార్తీకమాసము వచ్చినతోడనే నీవు రావణవధకై ప్రయత్నింపుము.

రామునిపై వచనములనుబట్టి రావణుని నిలయము రామునకు తెలిసినట్లే కన్పించుచున్నది. లేనిచో సుగ్రీవునితో ఆ నాలుగు మాసములు రావణుని నివాసమును, సీతయున్నచోటును వెదికించుమని తెలిపియుండెడివాడు గదా! ఇందు రావణుని వధకై ప్రయత్నింపుమనుటయు గమనింపదగినది. ఈ మాటనుబట్టి సీతాన్వేషణతో పనిలేదనియు, సీత-రావణుని పురములోనున్నదని తెలిసియుండుట చేతనే, రావణునితో యుద్ధమునకు ప్రయత్నించుచున్నారనియు విశదమగుచున్నది.

పై విషయములన్నిటినిబట్టి రామునకు, రావణుడు సీత నపహరించి లంకకు తీసికొనిపోవుట, రావణుని పట్టణము, రావణుని బల పరాక్రమములు పూర్తిగా తెలియునని స్ఫురించుచున్నది.

రామునకు రావణుడు లంకానివాసియని, తన భార్య నతడు లంకకు తీసికొనిపోయెనని తెలిసినచో, సుగ్రీవాదులతో రాముడు, తన భార్యను రావణు డపహరించెననియు, అతని నివాసము తనకు తెలియదని వచించుటేల? అనియు,

కిష్కింధ. 7వ సర్గము : రావణుని వివరములు తెలిసిన సుగ్రీవుడు రామునితో

శ్లో॥ న జానే నిలయం తస్య సర్వథా పాప రక్షసః,

సామర్థ్యం విక్రమం వాపి దౌష్కులేయస్య వా కులమ్. 2

"నేనా పాపరాక్షసుని (రావణుని) నివాసముగాని, బల పరాక్రమములు గాని అతడు జన్మించిన దుష్కులమును గూర్చిగాని యెంతమాత్రమెఱుగను" అని యేల వచించెననియు సందేహము కలుగును. ఇందు కారణములు :

1) రాముని యాలోచన : రావణుడు బలవంతుడు. తాను, సహాయము లేకుండ లంకను ప్రవేశించుట, అచట రావణుని - అతని

సైన్యమును జయించుట దుర్లభము. ఆ విషయము సుగ్రీవునకు తెలిపిన, సుగ్రీవుడు తనను తేలిక భావముతో చూడవచ్చును. కనుక రాము డా విషయమును మభ్యపెట్టి రావణుని నివాసము తనకు తెలియనట్లు నటించెను.

2) సుగ్రీవుని యాలోచన : సుగ్రీవునకు వాలిని చంపించి, తాను కిష్కింధకు రాజు కావలయునను కోరికగలదు. వాలి మహా బలవంతుడు. ప్రథమముగా తాను రామునకు-రావణుని నిలయమును గురించి తెలిపిన, అతడు తనకు వాలిని చంపుటకు సహాయపడవచ్చును లేక సహాయపడకపోవచ్చును. కనుక సుగ్రీవుడు ముందుగ 'వాలిని చంపుట' యను తన కార్యమును రామునిచే సాధించుకొనదలచి, యతనితో, తనకు రావణుని నివాసమును గురించి తెలియదనియు, తాను-సీత యెచటనున్నను వెదికించి రామునకు సమర్పించెదననియు వచించెను.

ఈవిధముగ రామ-సుగ్రీవు లిరువురు తమ తమ ప్రయోజనములు సాధించుకొనదలచినవారై, రావణుని నివాసము తమకు తెలియనట్లు నటించిరి.

## 5. హనుమంతుడు లంకాదహనము గావించెనా ? అశోకవనమును నాశనమొనర్చెనా ?

సుందరకాండము 41వ సర్గము :

శ్లో॥ తద్వనం మథితై ర్వృక్షై ర్భిన్నైశ్చ సలిలాశయైః
చూర్ణితైః పర్వతాగ్రైశ్చ బభూవా ప్రియదర్శనమ్. 16
నానా శకుంతవిరుతైః ప్రభిన్నైః సలిలాశయైః
తామ్రైః కిసలయైః క్లాంతైః క్లాంతద్రుమలతాయుతమ్. 17
న బభౌ తద్వనం తత్ర దావానల హతం యథా
వ్యాకులా వరణా రేజు ర్విహ్వలా ఇవ తా లతాః. 18

లతా గృహై శ్చిత్ర గృహైశ్చ నాశితై
ర్మహోరగై ర్వ్యాళ మృగైశ్చ నిర్ధుతైః,
శిలా గృహై రున్మథితై స్తథా గృహైః
ప్రణష్టరూపం తద భూ న్మహద్వనమ్. 19

ఆ వనము విఱువబడిన చెట్ల చేతను, భేదింపబడిన సరస్సుల చేతను, పొడిగా చేయబడిన గిరిశిఖరముల చేతను చూడరానిదయ్యెను.

అనేక పక్షుల అఱపుల చేతను, భిన్నమైన సరస్సుల చేతను, వాడి పోయిన యెఱ్ఱని చిగుళ్ళచేతను కాంతి లేని దయ్యెను.

వాడిన చెట్లతీగలతో గూడి యావనము దావానలముచేత తగుల బడిన దానివలె కాంతి లేనిదయ్యెను. తీగలు–ఆధారములు లేనివై వ్యాకులములై గానిపించెను.

నాశనము చేయబడిన పొదరిండ్లు – చిత్రగృహముల చేతను, వెలి పుచ్చబడిన సర్పములు – క్రూరమృగముల చేతను, పాడు చేయబడిన గృహములు, శిలాగృహముల చేతను, ఆ వనరూపమే నశించెను.

సుందర. 43వ సర్గము :

శ్లో॥ ప్రా సాదస్య మహా స్తస్య హేమజాల పరిష్కృతం,
ఉత్పాటయి త్వా వేగేన హనుమాన్ పవనాత్మజః. 16
తత స్తం భ్రామ యా మాస శతధారం మహాబలః,
తత్రచాగ్ని స్సము భవ త్ప్రాసాదశ్చా ప్యదహ్యత. 17

ఆ మహాప్రాసాదముయొక్క బంగారు స్తంభమును పెకలించి వేగముగ త్రిప్పెను. అపుడందుండి యగ్ని పుట్టి ప్రాసాదము తగులబడెను.

సుందర. 54వ సర్గము : హనుమంతు డిట్లు తలచెను.

శ్లో॥ వనం తావ త్ప్రమథితం ప్రకృష్టా రక్షసాం హతాః
బలైక దేశః క్షపిత శ్శేషం దుర్గవినాశనమ్. 3

వనము ధ్వంసము చేయబడినది. ప్రసిద్ధులగు రాక్షసులు చంప బడిరి. సైన్యము ఒక భాగము నాశనము చేయబడినది. మిగిలినది

దుర్గవినాశము. హనుమంతుడు ప్రహస్త, మహాపార్శ్వుల గృహము లను నిప్పంటించెను—పిమ్మట

శ్లో॥ వజ్ర దంష్ట్రస్య చ తదా పప్లువే స మహాకపిః
శుకస్య చ మహా తేజా స్సారణస్య చ ధీమతః. 10
తదా చేంద్రజితో వేశ్మ దదాహ హరి యూథపః
జంబుమాలే స్సుమాలేశ్చ దదాహ భవనం తతః 11
రశ్మికేతశ్చ భవనం సూర్యశత్రో స్తథైరచి,
హ్రస్వ కర్ణస్య దంష్ట్రస్య రోమశస్య చ రక్షసః. 12
యుద్ధోన్మత్తస్య మత్తస్య ధ్వజగ్రీవస్య రక్షసః
విద్యుజ్జిహ్వస్య ఘోరస్య తథా హస్తిముఖస్య చ. 13
కరాళస్య పిశాచస్య శోణి తాక్షస్య చైవహి
కుంభకర్ణస్య భవనం మకరాక్షస్య చైవహి 14
యజ్ఞ శత్రోశ్చ భవనం బ్రహ్మశత్రోశ్చ స్తథైవచ
నరాంత కస్య కుంభస్య నికుంభస్య దురాత్మనః. 15

హనుమంతుడు వరుసగ వజ్రదంష్ట్ర-శుకసారణుల-ఇంద్రజిత్తు-జంబుమాలి-సుమాలి-రశ్మికేతు-సూర్యశత్రు - హ్రస్వకర్ణ - దంష్ట్ర - రోమశ-యుద్ధోన్మత్త-మత్త-ధ్వజగ్రీవ - విద్యుజ్జిహ్వ - హస్తిముఖ - కరాళ - పిశాచ-శోణితాక్ష-కుంభకర్ణ-మకరాక్ష-యజ్ఞశత్రు - బ్రహ్మశత్రు-నరాంతక-కుంభ-నికుంభుల భవనములు తగులబెట్టెను.

శ్లో॥ సర్వేషాం సమ తిక్రమ్య రాక్షసేంద్ర స్య వీర్యవాన్,
అస సాదా థ లక్ష్మీవాన్ రావణస్య నివేశనమ్. 18

పిమ్మట, అందఱి గృహములను దాటి రాక్షసరాజగు రావణుని నివాసభవనమును జేరెను-దీనిని కూడా తగులబెట్టెను—

శ్లో॥ హనుమా తా వేగవతా వానరేణ మహాత్మనా,
లంకాపురం ప్రదగ్ధంత రుద్రేణ త్రిపురం యథా. 31

వేగవంతుడగు హనుమంతునిచే, రుద్రునిచే త్రిపురములవలె లంకాపురి దగ్ధము చేయబడినది.

శ్లో॥ త తస్తు లంకా సహసా ప్రదగ్ధా
స రాక్షసా సాశ్వర థా స నాగా
స పక్షిసంఘా స మృగా స వృక్షా
రురోద దీనా తు ములం స శబ్దమ్. 40

అపుడు రాక్షసులతోడను, హయములతోడను, రథముల తోడను, ఏనుగులతోడను, మృగ–పక్షి – వృక్షములతో గూడ తగుల బెట్టబడిన లంక దీనముగ పెద్దగ రోదించెను.

శ్లో॥ భఙ్క్త్వా వనం మహాతేజా హత్వా రక్షాంసి సంయుగే
దగ్ధ్వా లంకాం పురీం రమ్యాం రరాజస మహాకపిః. 48

ఆ మహాకపి వనమును నాశనముచేసి, రాక్షసుల చంపి, అంద మైన లంకాపురిని తగులబెట్టి ప్రకాశించెను.

సుందర. 55వ సర్గము : హనుమంతుడు.

శ్లో॥ వి నష్టా జానకీ నూనం నహ్యా దగ్ధం ప్రదృశ్యతే,
లంకాయాం కశ్చి దుద్దేశ స్సర్వా భస్మీకృతా పురీ. 12

జానకీదేవి తప్పక నశించియుండును. ఏలయన నీ లంకలో తగులబడని చోటెక్కడను లేదు. పురమంతయు బూడిదగా చేయ బడినది.

పై విషయములనుబట్టి రావణుని లంకాపురి యశోకవనమందలి చైత్యప్రాసాదముతోడ పూర్తిగ నాశనము చేయబడినది. రాక్షస ప్రముఖుల గృహములతోపాటు లంకయంతయు భస్మీకృత మొనర్చ బడినది.

పిమ్మట నొకమాసము లోపలనే రాముడు–వానరసైన్యముతో లంకను ప్రవేశించెను. అప్పటి యీ క్రింది లంకను గురించిన వర్ణనలు చూడుడు.

యుద్ధకాండము 24వ సర్గము :

శ్లో॥ దృష్ట్వా దాశరథి ర్లంకా ఛిత్రధ్వజ పతాకినీం
జగామ మనసా సీతాం దూయమానేన చేతసా. 6

రాముడు చిత్రములగు ధ్వజపతాకములతో నొప్పుచున్న లంకా పురినిజూచి మనస్సు చింతాక్రాంతము కాగా సీతను తలచుకొనెను.

శ్లో॥ విమానై ర్బహుభి ర్లంకా సంకీర్ణా భువి రాజితే,
విష్ణోః పదమివాకాశం ఛాదితం పాండురై ర్ఘనైః. 10

ఈ లంక పెక్కు విమానములచే (గొప్ప భవనములచే) నిండినదై, తెల్లని మేఘములచే కప్పబడిన యాకాశమువలె నున్నది.

శ్లో॥ పుష్పితైః శోభితా లంకావనై శ్చిత్ర రథోపమైః,
నానాపతంగ సంఘుష్టైః ఫల పుష్పోపగై శ్శుభైః. 11

పశ్యమత్త విహఙ్గాని ప్రలీన భ్రమరాణి చ,
కోకిలాకులషణ్డాని దోధవీతి శివోఽనిలః. 12

ఈ లంకాపురి ఫలపుష్పములతో గూడి, చైత్రరథమునకు సమమై వివిధ పక్షులచే నిండి పుష్పించిన వనములచే శోభించుచున్నది.

మదించిన పక్షులు, దాగియున్న తుమ్మెదలు, కోకిలలతో గూడిన పూలగుత్తులు గల వనముల మంచిగాలులచే కదలుచున్నవి.

యుద్ధ. 39వ సర్గము :

శ్లో॥ తాం రాత్రి ముషితా స్తత్ర సువేలే హరిపుఙ్గవాః,
లంకాయాం దదృశు ర్వీరా వనాన్యుప వనాని చ. 1
సమ సౌమ్యాని రమ్యాణి విశాలా న్యాయతాని చ,
దృష్టి రమ్యాణి తే దృష్ట్వా బభూవు ర్జాత విస్మయాః. 2

వానరశ్రేష్ఠులా రాత్రి సువేలాద్రిపై వసించి లంకయందలి వనములను, ఉపవనములను, ఎత్తు–పల్లములు లేక సమములై – రమ్యములై – విశాలములై – అందమునైన గృహములను జూచి యాశ్చర్యమందిరి.

శ్లో॥ శుశుభే పుష్పి తాగ్రైశ్చ లతా పరిగతై ర్ద్రుమైః,
లంకా బహువిధై ర్దివ్యై ర్యథేన్ద్ర స్యామరావతీ. 5
విచిత్ర కుసుమోపేతై ర్రక్తకోమల పల్లవైః
శాద్వలైశ్చ తథా నీలై శ్చిత్రాభి ర్వన రాజిభిః. 6

కొనలయందుపూసి తీగలలముకొనగా వింతగొలుపు పూలతో ఎర్రని-మెత్తని చిగుళ్ళు గలిగి వివిధవృక్షములు నల్లని పచ్చికబయళ్ళు, చిత్రములగు వనపంక్తులతో లంక యింద్రుని యమరావతివలె శోభించెను.

శ్లో॥ గన్ధాఢ్యా న్యభి రమ్యాణి పుష్పాణి చ ఫలాని చ,
ధారయ న్త్య గమా స్తత్ర భూషణా నీవ మానవాః. 7

అచట వృక్షములు, మానవులు భూషణములు ధరించినట్లు, సుగంధములతో గూడిన సుందర ఫలపుష్పములను ధరించియుండెను.

శ్లో॥ తచ్చైత్రర థ సంకాశం మనోజ్ఞం నన్దనోపమమ్,
వనం సర్వ ర్తుకం రమ్యం శుశుభే షట్పదాయుతమ్. 8

సర్వ ర్తు రమ్యమైనదియు, తుమ్మెదలచే వ్యాప్తమైన యా (అశోక) వనము, (కుబేరుని) చైత్రరథమువలెను, (ఇంద్రుని) నందన వనమువలెను మనోజ్ఞమైయుండెను.

శ్లో॥ కాంచనేన చ సాలేన రాజతేన చ శోభితా,
ప్రాసాదై శ్చ విమానై శ్చ లంకా పరమ భూషితా. 22

లంక-బంగారు-వెండి ప్రాకారములతో శోభించుచు, ప్రాసాదములచేతను, విమానములచేతను మిగులభూషితమై యుండెను.

శ్లో॥ యస్యాం స్తమ్భ సహస్రేణ ప్రాసాద స్సమ లఙ్కృతః,
కైలాస శిఖరా కారో దృశ్యతే ఖమి వోల్లిఖన్. 23
చైత్య స్స రాక్ష సేన్ద్రస్య బభూవ పురభూషణమ్,
శతేన రక్షసాం నిత్యం య స్సమగ్రేణ రక్ష్యతే. 24
మనోజ్ఞాం కానన వతీం పర్వతై రుపశోభితామ్,
నానాధాతు విచిత్రై శ్చ ఉద్యానై రుపశోభితామ్. 25
నానా విహంగ సం ఘుష్టాం నానా మృగ నిషేవితామ్,
నానా కానన సంఛన్నాం నానా రాక్షస సేవితామ్. 26
తాం సమృద్ధాం సమృద్ధార్థాం లక్ష్మీవాన్లక్ష్మణాగ్రజః,
నగరీ మతురప్ర ఖ్యో విస్మయం ప్రాప వీర్యవాన్. 27

అందు వేయి స్తంభముల మేడ అలంకరింపబడియున్నది. అది కైలాస శిఖరాకారమై యాకాశమునంటుచున్నది. ఆ చైత్యప్రాసాదము రావణుని లంకకలంకారముగ నున్నది.

నిత్యము దానిని నూఱుమంది రాక్షసులు రక్షించుచుందురు.

అందమగు నడవులతోను, పర్వతములతోను శోభించునదియు, అనేకములగు ధాతువులు గల యుద్యానవనములచే ప్రకాశించునదియు, అనేక పక్షులచే ధ్వనింపజేయబడినదియు, అనేక మృగములు గలదియు, అనేక రాక్షసులచే సేవింపబడునదియు నగు సర్వసమృద్ధమైన రావణుని పురిని, రాముడు వానరులతో చూచెను.

గొప్ప గృహములతో నిండిన యా నగరమునుజూచి రాముడాశ్చర్యము నందెను.

దీనినిబట్టి లంకాపురి యందలి భవనములు, వనములు, ఉద్యానవనములు ఎంతో ప్రకాశవంతములై యలరారుచున్నవని విదితమగుచున్నది. చైత్యప్రాసాదమెంతో రమణీయమైనదిగ – లంకకలంకృతముగ నుండెనని తెలియుచున్నది.

హనుమంతు డివి యన్నియు నాశనమొనర్చినట్లు సుందరకాండ మందలి 41, 43, 54, 55 సర్గలలో తెలుపబడినది. హనుమంతుడు చైత్యప్రాసాదమును దగ్ధమొనర్చిన, రాముడు లంకకేగు నప్పటికే యది పునర్నిర్మింపబడియుండునా ?

హనుమంతుడు లంకను భస్మముచేసి – ఆ భవనములన్నియు నాకొద్దికాలములో పునర్నింపబడియుండునా ?

హనుమంతునిచే లంకదహింపబడిన, లంకయందలి వనములు, ఉద్యానవనములు ఫలపుష్పభరితములై శోభిల్లుచుండగలవా ?

కనుక హనుమంతుడు–అశోకవనమును పాడుచేయుట చైత్య ప్రాసాదమును నాశనమొనర్చుట, లంకను దహించుట మొదలగున వన్నియు నబద్ధములుగ కనిపించుచున్నవి. ఒకవేళ హనుమంతుడు

మండుచున్న తన వాలముతో పరుగిడచుండ, ఆ మంటలు తగిలి యచటచట గల పూరిగుడిశలు గడ్డివాములు మొదలగునవి కొలదిగ దహింపబడియుండవచ్చును. అంతియేగాని హనుమంతుడు లంక నంతటిని బూడిదచేసెననుట జరిగియుండదు. ఇందులకు యుద్ధకాండ మందలి 24, 39 సర్గములలోని పై వర్ణనలే నిదర్శనములు—

## 6. రామ లక్ష్మణులు పాములచే బంధింపబడ, గరుత్మంతుడు విడిపించెనా ?

యుద్ధ. 44వ సర్గము : ఇంద్రజిత్తు సర్పమయబాణములను రామలక్ష్మణుల సర్వావయవములందు నాటెను. (38, 39 శ్లో॥లు) శరబంధముచే రామలక్ష్మణుల నిరువురను బంధించెను. (40వ శ్లోకము)

యుద్ధ. 45వ సర్గము : ఇంద్రజిత్తు దేహమునంతను ఛేదించు శరములను-రామ లక్ష్మణుల దేహములందు నాటెను. అతని బాణములచే రామలక్ష్మణులు సందులేని శరీరముగలవారైరి. వారల గాయములద్వార నధికరక్తము స్రవించెను. (7, 8, 9 శ్లోకములు) రామ లక్ష్మణుల మర్మస్థానములందు వాడిబాణముల నాటెను. రణరంగ మందు శరబంధముచే గట్టబడిరి. ఛేదింపబడిన సర్వాంగములందు, బాణపుములుకులు గ్రుచ్చుకొని వణకిరి. బాణములచే కొట్టబడిన సర్వావయవములు గలవారై మిక్కిలి బాధింపబడిరి. వారిదేహమందు గ్రుచ్చబడనిదిగాని చీల్చబడినదిగాని చోటులేదు. బంగారు పిడులు, శుభ్రములగు తోకలును, క్రిందికి పోవు బాణములు అర్థ బాణములు, శ్రేష్ఠములగు అంజలులు, వత్సదంతములు, సింహ దంతములు, మంగలికత్తులు అనెడి బాణములచే రామలక్ష్మణులు కొట్టబడిరి. (14 నుండి 24 శ్లోకము వరకు)

పై విషయములను బట్టి ఇంద్రజిత్తు రామలక్ష్మణులపై సర్ప మయ బాణములనే గాక యనేక విధములగు బాణముల ప్రయో గించెను. ఆ బాణములచే వారి శరీరమంతయు నాటబడెను.

సర్పమయ బాణములనిన పాములా! గరుత్మంతునిజూచి యవి పారిపోయెనా!

## రామాయణమునందు సర్పమయ బాణముల వాడిన ఘట్టములు

కిష్కింధ. 16వ సర్గము : రాముడు సర్పసదృశమగు బాణము లతో వాలిని చంపెను. (33 శ్లో)

యుద్ధ. 44వ సర్గము : రామ లక్ష్మణులు సర్పసదృశములగు బాణములతో రాక్షసులను చంపిరి. (9, 10 శ్లోకములు)

యుద్ధ. 59వ సర్గము : రావణుడు సుగ్రీవునిపై సర్పతుల్యమగు శరమును ప్రయోగించెను. రావణుడు సర్పసదృశములగు బాణము లతో నీలుని గొట్టెను.

70వ సర్గము : త్రిశిరుడు సర్పసదృశములగు బాణములతో నంగదుడు తనపై విసిరిన వృక్షములను ఛేదించెను.

71వ సర్గము : అతికాయుడు లక్ష్మణుని సర్పసదృశమగు శరములతో గొట్ట, నతడు దాని నర్ధచంద్ర బాణముచే ఛేదించెను.

లక్ష్మణు డాగ్నేయాస్త్రమును ప్రయోగింప, అతికాయుడు దానిని సౌరాస్త్రముతోను, సర్పసదృశమగు బాణముతో నను నివారించెను.

అతికాయుడు సర్పాకారశరములను ప్రయోగింప, లక్ష్మణుడు ముహూర్తకాలము నిశ్చేష్టుడై మరల రణమొనర్చెను.

73వ సర్గము : ఇంద్రజిత్తు సర్పతుల్యములగు శరములతో వానరసైన్యమును ఛేదించెను.

88వ సర్గము : ఇంద్రజిత్తు నాగవిషసమానములగు బాణము లను లక్ష్మణునిపై ప్రయోగింప, అవి యతనిని పీడించెను.

89వ సర్గము : లక్ష్మణుడు అగ్నిజ్వాలలతో సమానమగు మహావిషముగల సర్పములవంటి నిశితాస్త్రములతో నింద్రజిత్తును గొట్ట, నతడు మహార్తశాలము మూర్ఛుడాయెను.

91వ సర్గము : లక్ష్మణుడు సర్పవిషతుల్యమగు నైదుబాణము లచే నింద్రజిత్తును గొట్ట, నవి యతని శరీరమును భేదించి రక్తసర్ప ములవలె నేలబడెను.

ఇంద్రజిత్తు–వజ్రసమానములు–సర్పవిషతుల్యములు నగు బాణ ముల లక్ష్మణునిపై ప్రయోగింప, నవి యతని కవచమును గొట్టి నాశమయ్యెను.

లక్ష్మణుడు, మంచిరెక్కలుగలదియు, మంచిగణుపులు గల దియు, గుండ్రని యాకారము గలదియు, సర్పవిషముతో నైనదియు నగు వంకరలేని బాణమైన నింద్రాస్త్రముతో నింద్రజిత్తు శిరస్సును ఖండించెను. (67 నుంచి 76 శ్లోకము వరకు)

108వ సర్గము : రావణుడు రామునిపై తామసాస్త్రమును సంధించ, నందుండి సువర్ణాలంకృతము లగుశరములు మహా విషసర్ప ములై వెలుగుచున్న ముఖములతో నోటినుండి మండుచున్న నగ్నిని గ్రక్కుచు వాసుకికి సమములై ప్రకాశించు దేహములతో రాముని పైకి వచ్చుచుండ, రాముడా పన్నగములజూచి గరుడాస్త్రమును ప్రయోగింప, రాముని శరములు గరుత్మంతుని రూపములై సర్పా కారములగు నా సాయకముల హరించెను. (17 నుండి 33 శ్లోకముల వరకు)

110వ సర్గము : రాముడు సర్పసమానమైన మంగళికత్తి వంటి బాణమును వింటితో రావణునిపై సంధించెను. (25 శ్లో)

51వ సర్గము : రావణుడు, రాము డింద్రజిత్తుయొక్క శర బంధములనుండి విముక్తుడైనాడని తెలిసికొని "వాసుకి సమతేజము లగునట్టి ఇంద్రజిత్తు శరములు వ్యర్థములాయెను గదా !" అని తలచెను.

50వ సర్గము : గరుత్మంతుడు రాగా, శరప్రాయములై రామ లక్ష్మణుల బంధించిన నాగములన్నియు పాఱిపోయెను (37 శ్లో)

పై విషయములనుబట్టి సర్పమయబాణముల ననేకులు సంధించి నట్లున్నది. ఆ బాణములు కొందఱిని చంపెను. కొందఱిని బాధపఱచెను. కొందఱి యస్త్రములను ఛేదించెను. రామ లక్ష్మణులను మాత్రము ఇంద్రజిత్తు యొక్క సర్పమయాస్త్రములతో బంధించబడగా, గరుత్మంతుడు వచ్చుట, ఆ గరుత్మంతుని జూచి శరప్రాయములగు నాగములు పాఱిపోవుట జరిగెను రావణుడు రామునిపై మహావిషసర్పమయమగు రాక్షసాస్త్రమును సంధింప, రాముడు దానికి ప్రతిగ గరుడాస్త్రమును ప్రయోగింప నందుండి గరుత్మంతునిరూపములు వచ్చి, ఆ సర్పాకార సాయకముల హరించెను.

తనయొద్దనున్న ఈ గారుడాస్త్రమును, ఇంద్రజిత్తు తనను - తన తమ్ముని సర్పమయాస్త్రములచే బంధించినపు డేల ప్రయోగించ లేదు ? వైనతేయుడు రావలసిన యగత్యమేమి ? రాముడు తాను ప్రాణాపాయస్థితి యందుండియు, అస్తమించు సూర్యునివలెనున్న తమ్ముని జూచి శోకించుటేల ? ప్రాణాపాయ స్థితియందున్న రామ లక్ష్మణుల గూర్చి విభీషణుడు చింతించుటేల ?

ఇంద్రజిత్తు రామలక్ష్మణులను సర్పమయబాణములతో నే గాక, క్రిందికిపోవు బాణములు, అర్ధబాణములు, అంజలులు, వత్సదంతములు, సింహదంతములు, మంగలిక త్తివంటి బాణములు మొదలగు వివిధ బాణములను వారి దేహమంతట నాటెను. ఆ బాణ ఘాతములకు వారు దేహమంతట రక్తము స్రవించుచుండ - బాణముల ములుకుల యొక్కయు, విషబాణముల యందలి విషబాధలను ధరణిపైబడి ప్రాణాపాయస్థితినందిరి. అంతియేగాని రామలక్ష్మణులు నాగములచే త్రాళ్ళవలె బంధింపబడుట, గరుత్మంతుడురాగా వవి పాఱిపోవుట కల్పనగా నున్నది. కానిచో సర్పమయ బాణము లనేక

మారులు వాడబడెను. అప్పుడును వైనతేయుడు వచ్చెనా? రాలేదు గదా! గారుడాస్త్రము నుండియే గరుత్మంతుని రూపములు వచ్చుచుండ వైనతేయునితో పనియేమి? రాముని - విష్ణువుయొక్క అవతారముగ చూపుటకొఱకే యిచట గరుత్మంతుడు వచ్చినట్లు కల్పన చేయబడెను. ఇంద్రజిత్తు రామలక్ష్మణుల సర్పమయబాణములతో నేగాక అనేకవిధముల బాణములతో గొట్టెను. కనుక రామలక్ష్మణుల కపుడెవరో చికిత్స చేసి, వారి దేహములకు గ్రుచ్చుకొనిన ములుకులను తీసి, వ్రణములకు చికిత్స చేసి, సర్పవిషములతో కూడిన బాణములచే కొట్టబడుటచే వానికి విరుగుడుగ మందులనుకూడ యిచ్చియుందురు. రామలక్ష్మణులు కోలుకొనియుందురు. వాల్మీకి యా వైద్యుని గరుత్మంతునిగ రూపకల్పనచేయుట జరిగెను.

అంతియేగాని రామలక్ష్మణులు నాగములచే బంధించబడుట, గరుత్మంతుడు రాగా నాగములు పారిపోవుట కల్పితములే.

యుద్ధ. 80వ సర్గము : రావణుడు-ఇంద్రజిత్తుతో

శ్లో॥ జహి వీర! మహావీర్యౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ,
అదృశ్యో దృశ్యమానో వా సర్వథా త్వం బలాధికః. 3
త్వమప్రతిమకర్మాణ మింద్రం జయసి సంయుగే,
కిం పునర్మానుషౌ దృష్ట్వా న వధిష్యసి సంయుగే. 4

వీరా! మహావీరులును-సోదరులునగు రామలక్ష్మణులను, కనుపించియో, కనుపించకయో యెల్లవిధముల బలాధికుడవగు నీవుచంపుము.

సాటిలేని సమర్థుడగు ఇంద్రుని రణమున జయించితివి. నీవు మనుష్యులను జూచి యేల యుద్ధమున (చంపకున్నావు?) కు పోవకుంటివి?

అని పలుక నింద్రజిత్తు యుద్ధమున ప్రవేశించి

శ్లో॥ స దదర్శ మహావీర్యౌ నాగౌ త్రిశిర సావివ,
సృజంతౌ విషజాలాని వీరౌ వానర మధ్యగౌ. 20

ఇమే తావితి సంచిత్య సజ్జం కృత్వాథ కార్ముకమ్,
సంతతానేషు ధారాభిః పర్జన్య ఇవ వృష్టిమాన్. 21

మహావీరులును, మూడుతలల నాగమువలెనున్న వారును, శర జాలములను వేయుచున్న వారును, వానరమధ్యమునను్న వీరుల నిరువురను చూచెను.

వీరే వారని (రామలక్ష్మణులని) యోచించి, వింటినెక్కుపెట్టి యెడతెగక వర్షించుచున్న పర్జన్యునివలె బాణముల గురిపించెను.

ఇంద్రజిత్తుయొక్క యీ మాటలనుబట్టి, అతడంతవరకు రామ లక్ష్మణులను చూడలేదు. కనుక నతడు వారితో యుద్ధమొనరించి యుండుటయు, వారిని నాగాస్త్రముచే బంధించుటయు, గరుత్మంతుడు వచ్చి విడిపించుటయు కల్పితములుగ నున్నవి. ఇచట నింద్రజిత్తు వీరే వారని యోచించి, అనుటలో, తానంతకు పూర్వము రణమందు మూర్ఛితుల చేసినవారని ధ్వనించుచున్నది. కాని యిందాతడు యోచించవలసిన పనిలేదు.

ఇంద్రజిత్తు, తన తండ్రి తనతో చెప్పిన వీరులగు రామలక్ష్మ ణులు వారేనని యోచించి రణమొనరించెను.

## 7. హనుమంతుడు హిమవంతమునకు వెళ్ళి ఓషధి పర్వతమును తెచ్చెనా ?

వాల్మీకి రామాయణమున హనుమంతుడు రెండుసార్లు ఓషధి పర్వతమును తెచ్చినట్లు గలదు. 1) ఇంద్రజిత్తుయొక్క బాణఘాతము లకు రామలక్ష్మణులు నిశ్చేష్టులైపడియున్నపుడు 2) రావణుని శక్తిచే లక్ష్మణుడు పడియున్నపుడు.

యుద్ధ. 73వ సర్గము : ఇంద్రజిత్తు యొక్క బాణఘాతములకు రామలక్ష్మణు లిరువురు నచేతనులై పడిపోయిరి. వానరసైన్య మంతయు పీడింపబడెను.

74వ సర్గము : హనుమంతుడు-విభీషణుడు ఇరువురు కొఱువులను పట్టుకొని యా రాత్రి మరణించిన-మరణించనున్న వానరవీరులను, అచేతనులై పడియున్న రామలక్ష్మణులను చూచిరి. అనేక బాణములు గ్రుచ్చుకొని బాధనొందుచున్న జాంబవంతుని జూచిరి. జాంబవంతుడు హనుమంతునితో, "హిమవంతమునకు వెళ్ళి, అచట ఋషభకైలాస శిఖరముల నడుమ, గొప్పవెలుగుతో ప్రకాశించు ఓషధి పర్వతశిఖరమందు వెలుగుచున్న మృతసంజీవని-విశల్యకరణి, సావర్ణ్యకరణి, సంధానకరణి యను ఓషధులను తీసికొనిరమ్ము" అని పలికెను

అపుడు హనుమంతుడు తన దేహమును పూరించి పర్వతమంత పెరిగి, మలయపర్వతము నధిరోహించి యాకాశమునకెగిరి హిమవంతమునకేగి ప్రకాశించుచున్న సకలౌషధములచే కాంతివంతముగనున్న ఓషధిపర్వతమును గాంచెను: ఆ యోషధులు హనుమంతుడు, తమ్ము తీసికొని వెళ్ళుటకు వచ్చినాడని గ్రహించి, మాయమయ్యెను. హనుమంతుడంత కోపముతో నా పర్వతమును పెకలించి తీసికొనివచ్చి వానరసైన్యము మధ్యనుంచెను. అపు డా యోషధుల గాలిపీల్చుటచే రామ లక్ష్మణులు, వానరవీరులు లేచిరి.

శ్లో॥ యదా ప్రభృతి లంకాయాం యుద్ధ్యంతే కపిరాక్షసాః,
తదా ప్రభృతి మానార్థ మాజ్ఞయా రావణస్య చ. 75
యే హన్యంతే రణే తత్ర రాక్షసాః కపి కుంజరైః,
హతా హతాస్తు క్షిప్యంతే సర్వ ఏవ తు సాగరే. 76

వానర రాక్షస యుద్ధము ప్రారంభమైనప్పటినుండి, వానరులతో మానముకొఱకు రణమొనర్చి మరణించిన-కొట్టబడి మరణించిన రాక్షసులు, రావణుని యాజ్ఞచే సముద్రమునందు పారవేయబడిరి.

వాయుపుత్రు డా ఓషధిశైలమును తీసికొని హిమాలయమునకేగి, ఆ పర్వతము నచటనుంచి తిరిగి రాముని యొద్దకు వచ్చెను.

పై విషయములన్నియు నూహాతీతములుగనున్నవి. యుద్ధమున ప్రతివాడును శత్రువుల చంపుటయందే నిమగ్నులై యుందురుగాని,

శవములను పారవేయుటయందు తమకాలమును వ్యర్థముచేయరు. వాల్మీకి, పై నుదహరించిన, మరణించిన రాక్షసులను సముద్రమున పారవేయుట యనునది–రావణుడు వచించినట్లు, రామాయణము నందెచటను గన్పింపదు. ఓషధిపర్వత మహిమకు రాక్షసులేల బ్రతక లేదనుటకు వాల్మీకి యీ మాటలు కల్పించెననుటలో సందేహము లేదు. ఒక యబద్ధమును కప్పిపుచ్చుటకు మరియొక యబద్ధము చెప్ప వలసి వచ్చినట్లు–హనుమంతు డోషధిపర్వతమును తెచ్చెనను యబద్ధ మును కప్పిపుచ్చుటకు, మరణించిన రాక్షసుల నందఱిని రావణుడు సముద్రమున పారవేయించెనను మరియొక యబద్ధము కల్పించవలసి వచ్చినది.

అయోధ్య. 25వ సర్గము :

శ్లో॥ ఔషధీం చ సుసిద్ధార్థాం విశల్య కరణీం శుభామ్,
చకార రక్షాం కౌసల్యాం మంత్రైరభిజజాపచ. 38

(శ్వేతాక్షతలను రాముని శిరస్సునందుంచి) సిద్ధార్థమగు నోషధిని, శుభమగు విశల్యకరణిని రక్షగాజేసి కౌసల్యమంత్రమును జపించెను.

ఈ విధముగ కౌసల్య–రామునకు విశల్యకరణిని రక్షగాజేసి యుండెనని విశదమగుచున్నది. అట్టియెడ హనుమంతుడు విశల్యకరణి కొఱకై హిమవంతమున కేళ్ళవలసిన పనియేమున్నది?

యుద్ధకాండము 80వ సర్గమునందు ఇంద్రజిత్తు ప్రప్రథమముగ రామలక్ష్మణులను చూచి, గుర్తించినట్లుండుటచే, నంతకు ముందతఁ డొనర్చిన యుద్ధములన్నియు నబద్ధములని విశదమగుచున్నది. (ఈ విషయము 'రామలక్ష్మణులు పాములచే బంధించబడ గరుత్మంతుడు విడిపించెనా?' అను యంశమునందు విపులముగ వ్రాయబడినది)

దీనిని బట్టి యుద్ధకాండ 74వ సర్గమునందు ఇంద్రజిత్తు చేసి నాడని చెప్పబడుచున్న యుద్ధమే జరుగలేదని విశదమగుచున్నది.

అందుచేత నింద్రజిత్తుచే రామ లక్ష్మణులు-వానరులు పీడింపబడుట, హానుమంతుడు ఓషధి పర్వతమును దెచ్చుట కల్పితములని విశదమగు చున్నది.

యుద్ధ. 102వ సర్గము : లక్ష్మణుడు రావణుని శక్తిచే హృదయము భేదింపబడి నెత్తుటలో మునిగి నేలబడిమూర్ఛితుడుకాగా సుషేణుడు హానుమంతునితో నోషధి పర్వతమునకేగి విశల్యకరణిని, సంజీవనిని, సంధానకరణిని తీసికొనిరమ్మని వచించెను. అంత హానుమంతుడు ఓషధిపర్వతమునకేగి, ఓషధుల కనుగొనలేక విచారమునంది, ఓషధి శిఖరమును పెళ్ళగించి తీసికొనివచ్చెను. సుషేణుడా ఓషధిని పెళ్ళగించి-నలుగగొట్టి లక్ష్మణునకీయ, లక్ష్మణుడు దాని నాఘ్రాణించి శల్యములనుంచి విముక్తిపొంది లేచెను.

హానుమంతుడు మొదటిసారిగ వెళ్ళి యోషధి పర్వతము తెచ్చినపుడు, రెండవసారి వెళ్ళి, ఓషధిపర్వతమును తెచ్చినపుడుగల తేడాలను పరిశీలింపుడు, మొదట వెళ్ళినపుడు ఓషధులు ప్రకాశించుచుండెను. రెండవసారి వెళ్ళినపు డీ ప్రకాశము చెప్పబడలేదు, మొదట వెళ్ళినపుడు ఓషధులు-హానుమంతుడు తమ్ము తీసికొనివెళ్ళుటకు వచ్చినాడని తలచి మాయమయ్యెను. రెండవసారి హానుమంతు డేగినపుడు-హానుమంతుడే ఆ ఓషధులు కనుగొనలేకపోయెను. మొదట హానుమంతు డా ఓషధిపర్వతమును తెచ్చినపుడు జాంబవంతుడుగాని, సుషేణుడుగాని ఆ పర్వతమునుండి ఆ ఓషధులను విశదీయలేదు. ఆ ఓషధిపర్వతపు గాలి తగిలినంతనే, రామ లక్ష్మణులు, వానరులు ఒక్కసారిగ తమగాయములనుండి విముక్తులై లేచిరి. రెండవసారి హానుమంతు డోషధి పర్వతమును తెచ్చినపుడు, సుషేణు డా పర్వతమునుండి, ఓషధిని-పెళ్ళగించి-నలుగగొట్టి లక్ష్మణున కాఘ్రాణించుట కిచ్చెను. మొదటిసారి ఓషధి పర్వతమును తెచ్చినపుడు హానుమంతు డా పర్వతమును తిరిగి తీసికొనివెళ్ళి యథాస్థానమునకు జేర్చి నటు లున్నది. కాని రెండవసారి హానుమంతు డా యోషధీశిఖరమును తిరిగి యథాస్థానమునకు చేర్చినటుల గన్పించదు.

కనుక హనుమంతుడు రెండవసారి ఓషధి పర్వతశిఖరమును పెళ్ళగించి తీసికొనివచ్చుటయు నబద్ధముగ గన్పించుచున్నది. వాస్తవ విరుద్ధములగు నిట్టికార్యములు హనుమంతుని కాపాదించి, వాల్మీకి యతనిని మానవాతీతునిగ చేయుటకు యత్నించుట తప్ప, హనుమంతుడు దేహమును పెంచుట, హిమాలయపర్వతములకేగి పర్వతముల పెకలించి తెచ్చుట మొదలగు కార్యములు కల్పితములనుటలో సందేహము లేదు.

యుద్ధ. 92వ సర్గము : ఇంద్రజిత్తుతో జరిగిన యుద్ధములో లక్ష్మణుడు, విభీషణుడు, వానరులు గాయములతో నస్వస్థులు కాగా.

శ్లో॥ లక్ష్మణాయ దదౌ న స్త స్సుషేణః పరమౌషధిమ్,
స తస్యా గన్ధ మాఘ్రాయ విశల్య స్సమపద్యత. 24
తథా నిర్వేదన శ్చైవ సంరూఢవ్రణ ఏవ చ.

సుషేణుడు లక్ష్మణునకు పరమౌషధము నిచ్చెను. ఆ యౌషధము యొక్క గంధము నాఘ్రాణించి విశల్యుడాయెను.

దీనినిబట్టి విశల్యకరణి సుషేణునియొద్ద నున్నట్లే గదా! సుషేణుడు హనుమంతుని యోషధిపర్వతమునకై పంపునవసరమేల కలిగినది?

కనుక సుషేణుడు హనుమంతుని ఓషధులకై హిమవంతము పంపినాడనుట యబద్ధము. అందుచే హనుమంతుడు హిమవంతమున కేగుట, ఓషధి పర్వతశిఖరమును పెకలించి తెచ్చుట యబద్ధమనుటలో సందేహము లేదు.

## 8. లంక ద్వీపమా? ద్వీపకల్పమా?

అరణ్య. 35వ సర్గము :

శ్లో॥ యానశాల తతో గత్వా ప్రచ్ఛన్నో రాక్షసాధిపః,
సూతం సం చోదయా మాస రథస్సం యుజ్యతా మితి. 4

రావణుడు ప్రచ్ఛన్నుడై యశ్వశాలకేగి రథము సిద్ధము చేయు మని సూతుని యాజ్ఞాపించెను.

శ్లో॥ ఏవముక్తం క్షణేనైవ సారథిర్లఘు విక్రమః,
రథం సంయోజయా మాస తస్యాభి మత ముత్తమమ్. 5

ఇట్లు చెప్పగనే సారథి యతనికి ప్రియమగు నుత్తమరథమును సమకూర్చెను.

శ్లో॥ కాంచన రథ మాస్థాయ కామగం రత్నభూషితం,
పిశాచవదనై ర్యుక్తం ఖరైః కాంచన భూషణైః॥ 6
మేఘ ప్రతిమ నాదేన పతేన ధన దానుజః,
రాక్షసాధిపతి శ్రీమాన్యయౌ నదపతీ పతిమ్. 7

సువర్ణాలంకృతములై పిశాచ ముఖములుగల గాడిదలచే పూన్చబడిన రత్నభూషితమగు కాంచనరథము నెక్కి సముద్రము కడకేగెను.

శ్లో॥ సశైలం సాగరానూపం వీర్యవా నవలోకయన్,
నానా పుష్పఫలై ర్వృక్షై రనుకీర్ణం సహస్రశః. 11

ఆ రావణుడు ఫలపుష్ప భరిత వృక్షములతో గూడిన సముద్ర తీరమును చూచుచుపోయెను.

శ్లో॥ తం తుగత్వా పరం పారం సముద్రస్య నదీపతేః,
ద దర్శాశ్రమ మేకాంతే రమ్యే పుణ్యే వనాంతరే. 37
తత్ర కృష్ణాజిన ధరం జటావల్కల ధారిణమ్,
దదర్శ నియతాహారం మారీచం నామరాక్షసమ్. 38

(రావణుడు) సముద్రతీరమును చేరి యచట రమ్యమగు వన మధ్యమున నేకాంతమున నొక యాశ్రమమును చూచెను.

అచట కృష్ణాజినములు జటావల్కలములు ధరించి, యాహార నియమములు పాటించుచున్న మారీచుడను రాక్షసుని చూచెను.

42వ సర్గము :

శ్లో॥ తతో రావణ మారీచౌ విమాన మివతం రథమ్,
అరుహ్య యయతు శ్శీఘ్రం తస్మాదాశ్రయ మండలాత్. 9

అంత రావణ మారీచులు విమానమువలె నున్న యా రథము నెక్కి ఆ యాశ్రమమునుండి త్వరితగతిని వెడలిరి.

శ్లో॥ సమేత్య దండకారణ్యం రాఘవ స్యాశ్రమం తతః,
దదర్శ సహ మారీచో రావణో రాక్షసాధిపః. 11

రాక్షసరాజగు రావణు డట్లు మారీచునితో దండకారణ్యమున కేగి రాముని యాశ్రమమును చూచిరి.

ఈ విధముగ రావణుడు లంకాపురినుండి గాడిదల రథముపై బయలుదేరి మొదట మారీచుని యాశ్రమమును, పిమ్మట దండకారణ్యమున నుండిన రాముని యాశ్రమమును చేరెను. దీనిని బట్టి రావణుడు లంకనుండి దండకారణ్యమునకు నేలమీదనే ప్రయాణము చేసెను అనగా లంకాపురి కొకవైపున తప్పక భూమియుండి యుండవలయును.

దీనిని బట్టి లంక ద్వీపకల్పమనియే నిశ్చయమగుచున్నది.

## హనుమంతుడు ఓషధి పర్వతమున కేగుట

యుద్ధ. 74వ సర్గము :

శ్లో॥ శ్రుత్వా జాంబవతో వాక్యం హనుమా న్హరి పుంగవః,
అపూర్యత బలోద్ధర్షై స్తోయ వేగై రివార్ణవః. 35

స పర్వత తటాగ్రస్థః పీడయన్ పర్వతోత్తమమ్,
హనుమాన్ దృశ్యతే వీరో ద్వితీయ ఇవ పర్వతః. 36

జాంబవంతుని వాక్యమును విని హనుమంతుడు, జలవేగముచే సముద్రమువలె బలసంతోషములతో దేహమును పూరించెను.

అతడు పర్వతపు టొడ్డునదిలచి పర్వతరాజము నొత్తుచు రెండవ పర్వతమువలె చూడబడెను.

శ్లో॥ పృథివీ ధర సంకాశో నిపీడ్య ధరణీధరమ్,
పృథివీం క్షోభయా మాస సార్ణవాం మారుతాత్మజః. 41

హనుమంతుడు పర్వతమును భూమిమట్టముగ త్రొక్కి సముద్రముతో గూడ భూమిని క్షోభింపజేసెను.

శ్లో॥ ఆరు రోహ తదా తస్మాద్దకి ర్మలయపర్వతమ్,
మేరుమందర సంకాశం నానా ప్రస్రవణాకులమ్. 42

అపుడు హనుమంతుడు మేరుమందర సంకాశమును, అనేక సెలయేళ్ళతో వ్యాపించినదియు నగు మలయపర్వతము నెక్కెను.

శ్లో॥ సర్వా నా కులయన్ తత్ర యక్షగంధర్వ కిన్నరాన్,
హనుమా న్మేఘ సంకాశో వవృధే మారుతాత్మజః. 45
పద్భ్యాం తు శైల మా పీడ్య బడబాముఖ వన్ముఖమ్,
వివృత్యో గ్రం ననాదోచ్చై స్త్రాసయ న్నివ రాక్షసాన్. 46
తస్య నానద్యమానస్య శ్రుత్వాని నద మద్భుతమ్,
లంకా సా రాక్షసా స్సర్వే న శేకు స్స్పందితుం భయాత్. 47

ఆతడచట యక్ష గంధర్వ కిన్నరుల నందఱిని కలవరపఱచుచు మేఘసమానముగ పెఱిగెను.

పాదములచే శైలమును త్రొక్కి, బడబాముఖమువలె నోటిని తెఱచి రాక్షసులను భయపెట్టువానివలె క్రూరముగ నఱచెను.

అఱచుచున్న యద్భుతమగు నతని ధ్వనిని విని లంకయందున్న రాక్షసులందఱు భయమువలన కదలుటకు శక్తులు గాకపోయిరి.

శ్లో॥ స పుచ్ఛ ముద్యమ్య భుజంగ కల్పం
వినమ్య పృష్ఠం శ్రవణే నికుంచ్య,
వివృత్య వక్త్రం బడబాముఖాభ
మా పుప్లువే వ్యోమని చండవేగః. 49

హనుమంతుడు సర్పమువంటి వాలమును పైకెత్తి, వీపును వంచి, చెవులను ముడుచుకొని, బడబాముఖమువంటి నోటిని తెఱచి మిక్కిలి వేగముగ నాకాశమున కెగిరెను.

పై విషయముల పరిశీలించిన, హనుమంతుడు, లంకయందున్న పర్వతమునుండి మలయపర్వతమునెక్కి, బిగ్గఱగా నఱచి, యాకసమున కెగిరెను. అతడు లంకనుండి బయలుదేరి మలయపర్వతము నెక్కుటలో సముద్రమును దాటలేదు. దీనినిబట్టి లంకనుండి, మలయపర్వతమునకు భూమార్గము గలదని తెలియుచున్నది. (రావణు డీ మార్గముననే సీతను తీసికొనివెళ్ళెను. అరణ్యా. 54వ సర్గము 5వ శ్లోకము). మలయపర్వతముపై నిలచి హనుమంతుడు బిగ్గఱగా నఱువగా, లంకయందున్న రాక్షసు లా ధ్వని విని భయపడిరి. దీనినిబట్టి మలయ పర్వతము లంకకు చాల దగ్గఱలో నున్నదని తెలియుచున్నది.

యుద్ధ. 67వ సర్గము : కుంభకర్ణుని యుద్ధము.

హనుమంతుడు కుంభకర్ణుని శూలమును విఱుగగొట్టగా, కుంభకర్ణుడు

శ్లో॥ ఉత్పాట్య లంకా మలయాత్స శృంగం
జఘాన సుగ్రీవ ముపేత్య తేన,
సశైల శృంగాభిహతో౽వి సంజ్ఞః
పపాత భూమౌ యుధి వానరేంద్రః. 68

లంకనున్న మలయపర్వతమునుండి శృంగమును పెకలించుకొని వచ్చి దానిచే సుగ్రీవుని గొట్టెను. శైలశిఖరముచే గొట్టబడి సుగ్రీవుడు స్మృతిదప్పి క్రిందపడెను.

దీనినిబట్టియు లంకాపురి ప్రక్కనే మలయపర్వతమున్నట్లు, లంకకు మలయపర్వతమునకు భూమార్గమున్నట్లు విశదమగుచున్నది.

## లంకాపురి మార్గమునకు సంబంధించిన మరికొన్ని విశేషములు

రావణుడు సీతను గొంపోవుట : రావణుని రథము జటాయువుచే భగ్నముచేయబడగా రావణుడు సీత నెత్తుకొనిపోయెను.

వాల్మీకి రావణుడు సీత నెత్తుకొని యాకాశమార్గమున వెళ్ళెనని వ్రాసెను. వాల్మీకి రామాయణములో రావణుడు, విభీషణుడు,

విభీషణుని యనుచరులు, రావణుని దూతలు, సుగ్రీవుడు, అంగదుడు, హనుమంతుడు, వాలి–అందఱు నాకాశమున నెగిరినవారే. ఇవి యన్నియు నభూతకల్పనలు. చారిత్రకాధారములు లేనివి. రావణు డాకాశమున నెగురగల శక్తిగలవాడైనచో గాడిదల రథముపై దండకకు వచ్చుటేల? వాల్మీకి రావణునకు పుష్పకవిమానమున్న దనియు వ్రాసెను. ఆకాశమార్గమున విమానముపై పయనించు రావణునకు, గాడిదల రథముపై పయనించు నగత్యమేల కలిగెను?

అరణ్యా. 51వ సర్గము : సీత తనను గొనిపోవుచున్న రావణునితో

శ్లో॥ కిం కర్తుం శక్యమేవం హి యజ్జవే నైవ ధావసి,
ముహూర్త మపి తిష్ఠస్వ నజీవ న్ప్రతి యాస్యసి. 10

నీ విట్లు వేగముగ పరుగెత్తుచున్నావే, యేమిచేయ శక్యమగును? ముహూర్తమాగుము. ప్రాణములతో పోలేవు.

అరణ్యా. 52వ సర్గము :

శ్లో॥ దృష్ట్వా సీతాం పరామృష్టాం దండకారణ్య వాసినః. 14

రావణుడు సీత నెత్తుకొని పోవుచుండగా దండకారణ్య వాసులు చూచిరి.

అరణ్యా. 54వ సర్గము :

శ్లో॥ పింగాక్షా స్తాం విశాలాక్షీం నేత్రై రనిమిషై రివ,
విక్రోశంతీం తథా సీతాం దదృశు ర్వానర ర్షభాః. 4

వానరశ్రేష్ఠులు చూచిరి.

శ్లో॥ స చ పంపా మతిక్రమ్య లంకా మభిముఖః పురీమ్,
జగామ రుదతీం గృహ్య వైదేహీం రాక్షసేశ్వరః. 5

రావణు డట్లు రోదించుచున్న సీతను గ్రహించి పంపాసరస్సును దాటి లంకాభిముఖుడై వెళ్ళెను.

పై విషయములనుబట్టి రావణుడు సీత నెత్తుకొని వెళ్ళినట్లే తెలియుచున్నది.

రావణుడు పరిపాలించు లంకకు భూమార్గమున్న హనుమంతుడు సముద్రమును దాటుటేల? అంగదాదులు సముద్రతీరమున గూర్చుండి, సముద్రమును దాటుటెట్లు? అని యాలోచించుటేల? సేతుబంధన మేల? అను ప్రశ్న లుత్పన్నములగును వాని నీ క్రింద పరిశీలింతము.

రావణుడు బలవంతుడనునది జగద్విదితమే. రావణుడు సీతను లంకకు తీసికొని వెళ్ళినవెంటనే, జనస్థానమునగల రాక్షసుల నప్రమత్తులుగ నుండుమని యాదేశించెను. అట్లాదేశించిన రావణుడు తన లంకాపురికి గల మార్గము నెట్లాదమరచియుండును? ఆ మార్గమున గూడ బలవంతులగు రాక్షసులను కాపలాగా నియమించియుండును. లంకాపురిపై దండెత్తవలయుననిన రాక్షసబలమును, అచటి భద్రతా యేర్పాటులను తెలిసికొనుట ముఖ్యావసరము.

రావణు డనేక దండయాత్ర లొనర్చి విజయదుందుభులు మ్రోగించిన వీరాగ్రేసరుడు. సుగ్రీవాదు లతనిపోల్చిన యెంతటి రణ భీరులు. పరులపరాక్రమము విని, పరాక్రమవంతులను యుద్ధమున కాహ్వానించిన మేటివీరుడు రావణుడు. రామలక్ష్మణుల చూచి నంతనే భీరువై పరుగులెత్తినవాడు సుగ్రీవుడు, ఇవి యన్నియు నాలోచించిన రాముడు లంకపై దండెత్తుటకు ముందచటి పరిస్థితులు గ్రహించుట ముఖ్యావసరమని తలచెను.

రాముని రాజనీతి: తన తండ్రిచేసిన వాగ్దానమువలన రాజ్యము భరతునకు సంక్రమించునని తెలిసియు, తానేమియు నెఱుగని వాని విధమున తండ్రితో కలసి కుట్రచేసి అయోధ్య రాజ్యాభిషిక్తుడగుటకు యత్నించెను. తత్ప్రయత్నము విఫలమై, కైక – దశరథుని పేరుతో తనకు వనవాసము విధింప, తన కుట్ర విఫలమైనందుకు లోలోన నగచియు; నైపుణ్యమున ప్రజల యేమరగింపు పొందక, తండ్రి వాక్య పాలనను నెరవేర్చువానిగా లోకమునకు చాటదలచి వనముల కేగెను.

సుగ్రీవుని సహాయము పొందుటకై, అతినీచముగ, తమ్మునితో

రణ మొనరించు వాలిని, చెట్లచాటునదాగి క్రూరవిష బాణములచే కూల్చి తన పని సాధించెను.

ఇట్టి నేర్పరియగు రాముడు, సుగ్రీవుడు తన బలమునంతటిని సమీకరించిన పిమ్మట, లంకయందలి రావణుని బలమును, ఆయుధములను, భద్రతకు సంబంధించిన యేర్పాటులను ముందుగా తెలిసికొన దలచినవాడై హనుమంతాదులను సుగ్రీవుని తోడ్పాటుతో నాకార్యమునకు వినియోగించెను. వారు భూమార్గమున రాక్షసులకు కన్పించక లంకనుప్రవేశించుట దుష్కరమని తలచినవారై లంకకు మరి యొక మార్గమును వెదకుచు సముద్రతీరమును చేరియుందురు. అచట నుండియు నందఱు లంకనుప్రవేశించుచో, రాక్షసులకు పట్టుబడి బంధింపబడినచో తమకార్యము విఘ్నమగునని తలచినవారై, హనుమంతు డొకనినే యీ కార్యమునకు నియోగించి, అతడు తిరిగివచ్చు వరకు, అతని కొర కెదురుచూచుచు నా సముద్రతీరమున నుండిరి.

## హనుమంతుడు సముద్రమును దాటుట

సుందర. 1వ సర్గము :

శ్లో॥ తస్య వానరసింహస్య ప్లవమానస్య సాగరం,
కక్షాన్తర గతో వాయుర్జీమూత ఇవగర్జతి. 64

హనుమంతుడు సముద్రమున పోవుచుండ నతని బాహుమూలలనుండి పోవుచున్న గాలిశబ్దము మేఘము గర్జించినటులుండెను.

శ్లో॥ యం యం దేశం సముద్రస్య జగామ స మహాకపిః,
స స తస్యోరువేగేన సోన్మాద ఇవలక్ష్యతే. 68

ఆ మహాకపి పయనించు సముద్రప్రదేశ మతని తొడలవేగముచే నపస్మారము (మూరుగు) గలదివలె తోచెను.

శ్లో॥ సాగర స్యోర్మి జాలానా ముర సా శైల వర్ష్మణామ్,
అభిఘ్నం స్తు మహావేగః పప్లువే స మహాకపిః. 69

అతడు మహావేగముగ పోవునపుడు అతని బొమ్ముతాకుడుచేత సముద్రము యొక్క అలలు చిందరవందరై చెదరిపోయెను.

శ్లో॥ వికర్షన్నూర్మి జాలాని బృహన్తి లవణామ్భసి,
పప్లవే కపిశార్దూలో వికిరన్నివ రోదసీ. 71

ఆకాశమున కెగయుచున్న అలలు అతని గమనవేగమునకు చెదరిపడుచుండగా హనుమంతుడు భూమ్యాకాశముల మధ్య అలలను క్రిందికి అణచుచున్న వానివలె పోయెను.

శ్లో॥ తస్య వేగ సముద్ధూతం జలం స జలదం,
అమ్బరస్థం విబభ్రాజ శారదాభ్రమివాఽతతమ్. 78

అతని తొడలవడిచే మీది కెగురుటచే తెల్లనగు సముద్రోదకము మేఘమండల పర్యంతము వ్యాపించుటచే స్వచ్ఛమైన మేఘము వలె ప్రకాశించెను.

శ్లో॥ తిమి నక్ర ఝషాః కూర్మాదృశ్యన్తే వివృతాస్తదా,
వస్త్రాపకర్షణే నేవ శరీరాణి శరీరిణామ్. 74

వస్త్రములు లాగుటచే జనుల అవయవములు కన్పించినట్లు, అతని గమనవేగమునకు సముద్రజలము భేదిల్లి యందలి తిమి – నక్ర – మీన–కూర్మములు కనిపించెను.

శ్లో॥ యేనాసౌ యాతి బలవాన్ వేగేన కపి కుఞ్జరః,
తేన మార్గేణ సహసా ద్రోణీకృత ఇవార్ణవః. 79

హనుమంతుడేగు మార్గమున నతని గమనవేగముచే సముద్రపు నీరు దోనెగా చేయబడెను.

ఈ వర్ణనలన్నియు హనుమంతుడు సముద్రముననే పయనించినట్లు స్పష్టముగ తెలుపుచున్నవి.

4వ సర్గము :

శ్లో॥ రక్షితం సుమహావీర్యైః యాతుధానైః సహస్రశః,
రావణసాధిపతేః గుప్తం అవివేశ మహాకపిః. 28

రక్షితమగుచున్న రాక్షసరాజు గృహమును రాత్రివేళ గూఢ గతిని హనుమంతుడు ప్రవేశించెను.

80వ సర్గము : హనుమంతుడు తనలో తానిట్లు తలచెను.

శ్లో॥ చారేణ తు సంయుక్తేన। శత్రో శ్శక్తి మపేక్షితా।
గూఢేన చరతా తావత్। అవేక్షిత మిదం మయా। 4

చారుడును, శత్రువుల శక్తి పరీక్షించువాడును, రహస్యముగ సంచరించువాడును, అగు నాచే నిది యంతయు చూడబడినది.

రాక్షసుల విశేషములును, లంకాపురియు, రాక్షసరాజగు రావణుని ప్రభావమును తెలిసికొనబడెను.

రాముని యొక్క భార్యను పతిని చూడగోరుచున్న దానిగ నూరడింపదగును.

దీనినిబట్టి హనుమంతుడు చారుడుగనే లంకకు వెళ్ళెను, చారుడుగనే తన పని నిర్వర్తించె ననుట స్పష్టమగుచున్నది. చారుడుగ వెళ్ళినందువలననే సముద్రమును దాటవలసివచ్చినది.



ఈ సందర్భమున హనుమంతుడు సీతను చూచిన పిమ్మట, రావణుని చూడదలచినవాడై తానే యశోకవనమును ధ్వంసముచేసెనని వాల్మీకి రచించెను. హనుమంతుడు దూతగ లంకకు వెళ్ళినాడను నొక వాదనయుగలదు.

రావణుడు సీత యొద్దకు వేకువనవచ్చెను. ఉషఃకాలమున బ్రహ్మరాక్షసుల వేదఘోషలు విన్పించుచుండ, మంగళవాయిద్యములచే మేల్కొలుపబడిన రావణబ్రహ్మ, సీత యొద్దకువచ్చి సంభాషించి వెళ్ళెను. అనగా అప్పటికి దాదాపు తెల్లవారవచ్చెను. రాజు వెళ్ళిన పిమ్మట, అచట గల రాక్షసులు నిద్రమత్తులోనుండగా హనుమంతుడు సీతతో సంభాషించుట జరిగినది. అంతలో రాక్షసస్త్రీలు మేల్కొనుట జరిగెను. హనుమంతుడు త్వరగా నచటనుండి వెళ్ళ

టకు ప్రయత్నించియుండును. మేల్కొనిన రాక్షసకాంతల అరపుల కచటి కాపలాదాదులు వేగిరపడి హనుమంతుని చూచి యతనిని బంధించుటకై వెంబడించియుందురు. ఈలోగా రాక్షసకాంతలు రావణుని జేరి జరిగిన విషయము దెల్పుట, హనుమంతుని బంధించుట కక్షయకుమారుడు వచ్చుట జరిగెను. హనుమంతునికి రాక్షసులకు జరిగిన ఘర్షణలో నొక రిద్దఱు రాక్షసులు మరణించియుందురు. పిమ్మట హనుమంతుడు బంధింపబడెను. అట్లు బంధింపబడిన హనుమంతుడు రావణుని యొద్దనుండి తప్పించుకొనుటకై తాను రాముని దూతగ తెలుపుకొనెను. రాముని చేరి, అన్నయగు రావణుని చంపించి రాజ్యమేలవలయునను తలంపుతో నున్న విభీషణుడు హనుమంతుని సమర్థించెను.

హనుమంతుడు రాముని దూతగవచ్చినచో దొంగతనముగ లంకకు పోనేల ? లంకిణిని చంపనేల ? రాత్రియందు గూఢముగ చరించ నేల ? రాజభటుల చంపనేల ? అతడు దూతయగుచో రాజభటు లతని చెంతకు వచ్చినపుడైన తాను రామునికి దూతగ వచ్చితినని వచింపడా ?

దీనినిబట్టి హనుమంతుడు దూతగుకాక చారుడుగనే లంకకు వెళ్ళినట్లు విశదమగుచున్నది.

## వానరులు సేతువునిర్మించుట, వారధి దాటుట

యుద్ధ. 22వ సర్గము :

శ్లో॥ సూత్రాణ్యన్యే ప్రగృహ్ణన్తి వ్యాయతం శతయోజనమ్,
నలశ్చక్రే మహాసేతుం మధ్యే నదనదీపతేః. 61

కొందఱు నూఱుయోజనముల పొడవుగల సూత్రమునుబట్టిరి. నలుడు సముద్ర మధ్యమున మహాసేతువును నిర్మించెను.

శ్లో॥ అన్యే మధ్యేన గచ్ఛన్తి పార్శ్వతోఽన్యే ప్లవఙ్గమాః,
సలిలే ప్రపతన్త్యన్యే మార్గ మన్యే న లేభిరే. 83

శ్చే చిద్రై ర్విహాయ సగతాః సుపర్ణా ఇవ పుప్లువుః.

వానరులు కొందఱు మధ్యమునను, కొందఱు ప్రక్కలను, కొందఱు జలములను మార్గము ననుసరించిరి. కొందఱు ఆకాశమునందు గరుడులవలె ఎగిరి దాటిరి.

వానరులు వారధిగట్టినచోట నీటికిరువైపులనుండి సూత్రమును బట్టిరనుటచే దానివెడల్పు ఎక్కువగాదని తెలియుచున్నది. మరియు వానరులు కొందఱు జలముల ననుసరించి సముద్రమును దాటరనుటచే నది హనుమంతుడేగాదు వానరులనేకులు దాటగలిగినది. ఇందఱు దాటగలిగిన సముద్రమున-మొదటగా హనుమంతునే యేల పంపిరన - చారుడుగ తన పని నిర్వర్తించగల సమర్థుడు హనుమంతుడనియే జాంబవంతాదులు నిర్ణయించి, యతనిని లంకకు బంపిరి.

## 9. రామ-రావణ యుద్ధమునకు కారణమెవరు? రావణుడా? ఋషులా? సీతయా? రాముడా?

అరణ్య. 11వ సర్గము : రాముడు లక్ష్మణునితో

శ్లో॥ తస్యేద మాశ్రమ పదం ప్రభావాద్యస్య రాక్షసైః,
దిగియం దక్షిణాత్రా సాద్దృశ్యతే నోప భుజ్యతే. 82
యదా ప్రభృతి చాక్రాంతా దిగి యం పుణ్యకర్మణా,
తదా ప్రభృతి నిర్వైరాః ప్రశాంతా రజనీ చరాః. 83

ఎవని ప్రభావముచే రాక్షసులు ఈ దక్షిణదిక్కు నుపభోగింపజాలకుండిరో, భయముతో చూచుచుండిరో ఆ అగస్త్యుని యాశ్రమమిది.

పుణ్యకార్యము లాచరించుచు నా అగస్త్యు డెప్పటినుండి యిచట నివసించెనో, అప్పటినుండియు రాక్షసులు ఋషులపై వైరమునూని ప్రశాంతి వహించిరి.

శ్లో॥ నామ్నా చేయం భగవతో దక్షిణా దిక్ప్ర దక్షిణా,
ప్రథితా త్రిషు లోకేషు దుర్ధర్షా క్రూర కర్మభిః. 84

ఈ దక్షిణదిశ, అగస్త్యుని పేరుతో 'అగస్త్యుని దిక్కు' అని ప్రసిద్ధమై రాక్షసులకు దుర్ధర్షమైనది.

పై విషయములనుబట్టి అగస్త్యుడు మహాబలవంతుడని తెలియుచున్నది. అరణ్యకాండము 12వ సర్గలో నగస్త్యుడు రాముని కనేక యాయుధము లిచ్చినట్లు గలదు. అగస్త్యుని యొద్ద దేవ - గంధర్వ - యక్ష-గరుడ-నాగు-లెందరో వసించుచుండిరి.

దండకారణ్యము రాక్షసులపాలనలోని ప్రాంతము - ఖరుడు మొదలగు రాక్షసరాజు లచట పాలనసాగించుచుండిరి. అగస్త్యుడు, విశ్వామిత్రుడు మొదలగు నార్యర్షులు దండకారణ్యమునకు వలస వచ్చిరి. అట్లు వచ్చినవారు బలహీనులగు రాక్షసరాజుల జయించి వారి రాజ్యము లాక్రమించుట, రాక్షసపాలితప్రాంతములందు యజ్ఞము లనుపేరుతో రాక్షసుల యాచారములకు విరుద్ధముగ వర్తించుట మున్నగు కార్యము లొనర్చుచు, అవసరమని తోచినపుడు డార్య రాజుల సహాయమును పొందుచుండిరి.

బాల. 25వ సర్గము : విశ్వామిత్రుడు రామునకు తెలిపిన యీ కథ చూడుడు.

శ్లో॥ సుందే తు నిహతే రామ సాగస్త్య మృషి సత్తమమ్,
తాటకా సహ పుత్రేణ ప్రధర్ష యితు మిచ్ఛతి. 9
భక్షార్థం జాత సం రంభా గర్జంతీ సాభ్యధావత,
ఆపతంతీం తు తాం దృష్ట్వా అగస్త్యో భగవా నృషిః. 10
రాక్షసత్వం భజస్వేతి మారీచం వ్యాజహార సః
అగస్త్యః పరమక్రుద్ధస్తాటకామపి శప్తవాన్. 11
సైషా శాపకృతా మర్షా తాటకా క్రోధ మూర్ఛితా,
దేశ ముత్సాదయ త్యేవ మగస్త్య చరితం శుభమ్. 13

సుందుడు (అగస్త్యునిచే) చంపబడగా, తాటక తనకుమారు నితో వచ్చి యా ఋషిని బెదరింపదలచెను.

తనను భక్షింపవచ్చుచున్న తాటకను చూచి అగస్త్యుడు తాటక-మారీచులను శపించెను. అప్పటినుండి యామె క్రోధముతో మూఢయై, ఆ పవిత్రవనమునెల్ల నిర్మానుష్య మొనరించుచున్నది.

విశ్వామిత్రు డీ కథయందు సుందుని చంపిన అగస్త్యునియందు దోషమారోపించలేదు. సుందుని చంపుటకుగల కారణమును వచింప లేదు. కాని తన పుత్రునితో నగస్త్యుని యొద్దకు వచ్చుచున్న తాటకను, ఆమె, అగస్త్యుని తన భర్తను చంపిన కారణముగ వచ్చు చున్నదో మరెందుకు వచ్చుచున్నదో తెలిసికొనకయే అగస్త్యుని భక్షించుటకు వచ్చుచున్నదని వచించినాడు. ఆమె అంతకుముందెవరినీ భక్షించి నట్లాధారములు లేవు. ఆ విధముగ వచ్చుచున్న ఆ స్త్రీని అగస్త్యుడు నరులను తినుమని శపించెను. అతడు శపించినప్పటినుండియే, ఆమె మనుష్యులను చంపి, వారి మాంసమును తినుచు నా పవిత్రవనమును నిర్మానుష్య మొనరించుచున్నదట. దీనినిబట్టి అగస్త్యుని శాపప్రభావ మున నామె యచట నరులను చంపుచున్నది. కనుక దీనికి కారణ మగస్త్యుడే గదా! ఈ కథ తెలిపి విశ్వామిత్రుడు రామునిచే తాటకను చంపించెను.

అగస్త్యుడు సుందుని రాజ్యమునకువచ్చి, యతనిని చంపి, అతని భార్యాపుత్రులను శపించి, అచటి జనపదము నిర్మానుష్యమగుటకు కార ణుడయ్యెను. ఇట్టివి యగస్త్యు డొనరించిన పుణ్యకార్యములా? అట్టి యగస్త్యుని యార్యఋషులు పొగడుట, రామునివంటివారు కీర్తించుట జరిగినది. అగస్త్యుని ప్రభావమున రాక్షసు లాదిక్కునకు రాలేకపోవు చున్నారని వచించుటనుబట్టి, యత డెంతటి క్రూరస్వభావుడో, ఎంతటి బలవంతుడో తెలియుచున్నది. ఇట్టి వారు ఋషులు. అతనివద్దనున్న వా రతని శిష్యులనుటకంటె, వారు ఋషుల వేషములను ధరించి యార్య సామ్రాజ్యవిస్తరణకై పాటుపడిరనిన యెంతయో సమంజసముగ నుండెడిది.

విశ్వామిత్రుడు కూడ ఇదేవిధముగ రాక్షసులున్న ప్రాంతము నకు వచ్చి, రాక్షసుల యాచారములకు వ్యతిరిక్తమగు యజ్ఞహోమా దులుచేసి సుబాహుని చంపించెను.

అరణ్య 6వ సర్గము : ఋషులు రామునితో

శ్లో॥ పంపానదీ నివాసానా మనుమందాకినీ మపి,
చిత్రకూటాలయానాం చ క్రియతే కదనం మహత్. 17

పంపానదీ తీరవాసులును, మందాకిని ననుసరించిన చిత్రకూటా లయములందును ఋషు లధికముగ పీడింపబడుచున్నారు.

శ్లో॥ తత స్త్వాం శరణార్థం చ శరణ్యాం సముపస్థితాః,
పరిపాలయనో రామః వధ్యమానా న్నిశా చరైః. 19

అందువలన రక్షకుడవగు నిన్ను శరణుకోరి వచ్చితిమి. రాక్షసు లచే హింసించబడుచున్న మమ్ము రక్షింపుము.

రాముడు ఋషులతో

శ్లో॥ కేవలే నాత్మ కార్యేణ ప్రవేష్టవ్యం మయావనమ్,
విప్రకార మపాక్రష్టుం రాక్షసైర్భవ తామిమమ్. 22

రాక్షసులు మీకుచేయు నపచారములను తొలగించుటకు, మీ కార్యమునకై నే నీ యరణ్యమునకు వచ్చితిని.

శ్లో॥ పి తస్తు నిర్దేశకరః ప్రవిష్టోఽహ మిదం వనమ్,
భవతామర్థ సిద్ధ్యర్థ మాగతోఽహం యదృచ్ఛయా. 23
తస్యమేఽయం వనేవాసో భవిష్యతి మహాఫలః. 24
తపస్వినాం రణేశత్రూ న్హ న్తుమిచ్ఛామి రాక్షసాన్,
పశ్యం తు వీర్యమృషయ స్స భ్రాతుర్మే తపోధనాః. 25

తండ్రి యాజ్ఞను పాలించుట కీ వనమునకు వచ్చితిని, యాదృచ్ఛికముగ మీ కార్యసిద్ధికొఱకు వచ్చితిని.

కనుక నా వనవాసము మిక్కిలి ఫలముగలది కాగలదు.

తపోధనులారా! తాపసుల శత్రువులగు రాక్షసులను రణమందు

చంపగోరుచున్నాను. నా పరాక్రమమును, నా తమ్ముని పరాక్రమమును చూతురు గాక !

రాము డీ మాటలు పలుకునాటికి సీతాపహరణము జరుగలేదు. రాముడు "ఋషుల కార్యమునకై యీ యడవికి వచ్చినాన"నుటలో నతడరణ్యావాసకాలములో రాక్షసుల జయింపదలచినాడని తెలియుచున్నది. రాముడు 'తన వనవాసము మహాఫలప్రదము కాగలద'నుటలో ఆ ఫలము–రాక్షసవధ, రాక్షసరాజ్యముల నాక్రమించుట కావచ్చును.

అరణ్య. 9వ సర్గము : సీత రామునితో

శ్లో॥ త్రీణ్యేవ వ్యసనా న్యత్ర కామజాని భవన్త్యుత,
మిథ్యావాక్యం పరమకం తస్మాద్గురుతరా వుభౌ,
పరదారాభిగమనం వినా వైరం చ రౌద్రతా. 8
తృతీయం యా ఇదం రౌద్రం పరప్రాణాభి హింసనమ్,
నిర్వైరం క్రియతే మోహాత్ త్త చ్చతే సముపస్థితమ్. 9

ఈ లోకమున కామజములగు మూడు వ్యసనములున్నవి : అందు మొదటిది అసత్యము పలుకుట. రెండవది పరస్త్రీగమనము. మూడవది కారణములేని రౌద్రము. ఈ రెండును అసత్యమాడుట కంటెను ఘోరమైనవి.

మూడవదైన కారణములేకయే పరులప్రాణములను తీయుటయను రౌద్రము మోహముచే నిప్పుడు నీకు తటస్థించినది.

శ్లో॥ ప్రతిజ్ఞా త స్త్వయావీర ! దండకారణ్యవాసినామ్,
ఋషీణాం రక్షణార్థాయ వధస్సం యతి రక్షసామ్. 10
ఏ తన్నిమిత్తం చ వనం దండకా యితి విశ్రుతమ్,
ప్రస్థిత స్త్వం సహ భ్రాత్రా ధృత బాణ శరాసనః. 11

వీరా ! దండకారణ్యవాసులగు ఋషుల రక్షణకొఱకు యుద్ధమున రాక్షసుల చంపుదునని ప్రతిజ్ఞ చేసితివి.

దీని కొఱకే నీవు సోదరునితో ధనుర్బాణములను ధరి దండకాటవికి బయలుదేరితివని వినికిడి.

ఇందు 'వైరములేకయే యితరుల చంపవలయునను యుద్దేశ్య నీకు కలుగుచున్నద'ని సీత వచించుటవలన, రాముడే అకారణము రావణాది రాక్షసులతో వైరమునకు దలపడుచున్నట్లు విశదము చున్నది.

మరియు రాముడు ఋషులతో, 'మీ కార్యమునకై నే యరణ్యమునకు వచ్చితి' ననుటలో ఋషులద్వారా, వారికోరికల్ తాను రాక్షసులతో రణమునకు కారణములు వెదకుచున్నా డను స్పష్టముగ గోచరించుచున్నది.

మరియు సీత రామునితో

శ్లో॥ న కథం చన సా కార్యా గృహీత ధనుషా త్వయా,
బుద్ధిర్వైరం వినాహం తుం రాక్షసాన్దండ కాశ్రితాన్,
అపరాధం వినాహం తుం లోకాన్వీర న కామయే.

నీ వీ దండకారణ్య రాక్షసులను పగలేకయే ధనుస్సు దా వధించుట కిచ్ఛగింపకుము. అపరాధము లేకయే ప్రాణులను చంపుట నే నిష్టపడను.

అని పలుక రాముడు సీతతో

అరణ్య. 10వ సర్గము :

శ్లో॥ తదర్ద్యమానా న్రక్షోభిర్దండకారణ్య వాసిభిః,
రక్ష నస్త్వం సహ భ్రాత్రా త్వన్నాథా హి వయం వనే.
మయా చైత ద్వచశ్శ్రుత్వా కాత్స్న్యేన పరిపాలనమ్,
ఋషీణాం దండకారణ్యే సంశ్రుతం జనకాత్మజే.
సంశ్రుత్య చ న శక్ష్యామి జీవమానః ప్రతిశ్రవమ్,
మునీనా మన్యథా కర్తుం సత్యమిష్టం హి మే సదా.

దండకారణ్యమున రాక్షసులచే పీడించబడుచున్న ఋషులు నన్ను కాపాడుమనికోర, నేను వారిని రక్షింతునని ప్రతిజ్ఞ చేసితిని.

నేను మునులకు ప్రతిజ్ఞ చేసి తద్విరుద్ధముగా నాచరింపజాలను. నాకెల్లప్పుడును సత్యమే ప్రియము.

అని తన నిర్ణయమును తెలిపెను. దీనినిబట్టి రాముని ధ్యేయము రాక్షసవధ యని తెలియుచున్నది.

67వ సర్గము : రాముడు లక్ష్మణునితో

"జనస్థాన నిమిత్తం హి కృతవైరోఽస్మి రాక్షసైః. 9

జనస్థాన నిమిత్తమై రాక్షసులతో విరోధము చేసికొంటిని

ఈ మాటనుబట్టి రాముడు రాక్షసులతో కావలయుననియే కోరి విరోధము చేసికొనినట్లు కన్పించుచున్నది. అనగా జనస్థానమందలి రాక్షసులతో యుద్ధమునుగోరి శూర్పణఖను విరూపిగ నొనర్చెనా ? లేక జనస్థానము నాక్రమించుటకై యేదైన యత్నమొనర్చెనా ? యను సందేహమును కలుగజేయుచున్నది. వేరే యత్నముకానిచో, శూర్పణఖను, రాక్షసులతో విరోధమును కోరియే విరూపిగ నొనర్చి ననుట స్పష్టము.

అరణ్య. 17వ సర్గము : శూర్పణఖ రామునితో

శ్లో॥ అహం శూర్పణఖా నామ రాక్షసీ కామరూపిణీ,
అరణ్యం విచరా మీద మేకా సర్వభయంకరా. 22

నేను శూర్పణఖ యను రాక్షసిని. కామరూపిణిని. సర్వభయంకరనై యీ వనమున ఒంటరిగా తిరుగుచుందును.

శ్లో॥ రావణో నామ మే భ్రాతా బలీయాన్ రాక్షసేశ్వరః,
వీరో విశ్రవసః పుత్రో యది తే శ్రోత్ర మాగతః. 23

నా అన్న రావణుడు. రాక్షసులకు రాజు. విశ్రవసుని పుత్రుడు, బలవంతుడు, నీవతని పేరు వినియుండవచ్చును.

దీని కొఱకే నీవు సోదరునితో ధనుర్బాణములను ధరించి దండకాటవికి బయలుదేరితివని వినికిడి.

ఇందు 'వైరము లేకయే యితరుల చంపవలయునను యుద్దేశ్యము నీకు కలుగుచున్నద'ని సీత వచించుటవలన, రాముడే అకారణముగ రావణాది రాక్షసులతో వైరమునకు దలపడుచున్నట్లు విశదమగు చున్నది.

మఱియు రాముడు ఋషులతో, 'మీ కార్యమునకై నేనీ యరణ్యమునకు వచ్చితి ననుటలో ఋషులద్వార, వారికోరికలపై తాను రాక్షసులతో రణమునకు కారణములు వెదకుచున్నాడనుట స్పష్టముగ గోచరించుచున్నది.

మరియు సీత రామునితో

శ్లో॥ న కథం చన సా కార్యా గృహీత ధనుషా త్వయా,
బుద్ధిర్వైరం వినాహం తుం రాక్షసాన్దండ కాశ్రితాన్,
అపరాధం వినాహం తుం లోకాన్వీర న కామయే. 25

నీవీ దండకారణ్య రాక్షసులను పగలేకయే ధనుస్సు దాల్చి వధించుట కిచ్చగింపకుము. అపరాధము లేకయే ప్రాణులను చంపుటకు నే నిష్టపడను.

అని పలుక రాముడు సీతతో

అరణ్య. 10వ సర్గము :

శ్లో॥ తదర్ద్యమానా న్రక్షోభిర్దండకారణ్య వాసిభిః,
రక్ష న స్త్వం సహ భ్రాత్రా త్వన్నాథా హి వయం వనే. 16
మయాచైత ద్వచశ్శ్రుత్వా కార్త్స్న్యేన పరిపాలనమ్,
ఋషీణాం దండకారణ్యే సంశ్రుతం జనకాత్మజే. 17
సంశ్రుత్య చ న శక్ష్యామి జీవమానః ప్రతిశ్రవమ్,
మునీనా మన్యథా కర్తుం సత్యమిష్టం హి మే సదా. 18

దండకారణ్యమున రాక్షసులచే పీడించబడుచున్న ఋషులు నన్ను కాపాడుమనికోర, నేను వారిని రక్షింతునని ప్రతిజ్ఞ చేసితిని.

నేను మునులకు ప్రతిజ్ఞ చేసి తద్విరుద్ధముగా నాచరింపజాలను. నాకెల్లపుడును సత్యమే ప్రియము.

అని తన నిర్ణయమును తెలిపెను. దీనినిబట్టి రాముని ధ్యేయము రాక్షసవధ యని తెలియుచున్నది.

67వ సర్గము : రాముడు లక్ష్మణునితో

"జనస్థాన నిమిత్తం హి కృతవైరోఽస్మి రాక్షసైః. 9

జనస్థాన నిమిత్తమై రాక్షసులతో విరోధము చేసికొంటిని

ఈ మాటనుబట్టి రాముడు రాక్షసులతో కావలయుననియే కోరి విరోధముచేసికొనినట్లు కన్పించుచున్నది. అనగా జనస్థానమందలి రాక్షసులతో యుద్ధమునుగోరి శూర్పణఖను విరూపిగ నొనర్చెనా? లేక జనస్థానము నాక్రమించుటకై యేదైన యత్నమొనర్చెనా? యను సందేహమును కలుగజేయుచున్నది. వేరే యత్నము కానిచో, శూర్పణఖను, రాక్షసులతో విరోధమును కోరియే విరూపిగ నొనర్చి రనుట స్పష్టము.

అరణ్య. 17వ సర్గము : శూర్పణఖ రామునితో

శ్లో॥ అహం శూర్పణఖా నామ రాక్షసీ కామరూపిణీ,
అరణ్యం విచరా మీద మేకా సర్వభయంకరా. 22

నేను శూర్పణఖ యను రాక్షసిని. కామరూపిణిని. సర్వభయంకరనై యీ వనమున ఒంటరిగా తిరుగుచుందును.

శ్లో॥ రావణో నామ మే భ్రాతా బలీయాన్రాక్షసేశ్వరః,
వీరో విశ్రవసః పుత్రో యది తే శ్రోత్ర మాగతః. 23

నా అన్న రావణుడు. రాక్షసులకు రాజు. విశ్రవసుని పుత్రుడు, బలవంతుడు, నీవతని పేరు వినియుండవచ్చును.

శ్లో॥ తా నహం సమతిక్రాంతా రామత్వా పూర్వదర్శనాత్,
సముపేతాఽస్మి భావేన భర్తారం పురుషోత్తమమ్. 25

రామా! నిన్ను చూచి, నావారి నందరిని వదలి, నిన్ను భర్తగా పొందవలయునని నీ కడకు వచ్చితిని.

శ్లో॥ "చిరాయ భవమే భర్తా". 26

నీవు నాకు చిరకాలము భర్తవు కమ్ము.

18వ సర్గము : రాముడు శూర్పణఖతో

శ్లో॥ కృత దారోఽస్మి భవతి భార్యేయం దయితా మమ,
త్వ ద్విధానాం తు నారీణాం సు దుఃఖా స సపత్నతా. 2

నేను వివాహితుడను ఈమె నాభార్య. నీవంటి స్త్రీలకు సవతు లుండుట చాలదుఃఖమును కలిగించును.

శ్లో॥ ఏ నం భజ విశాలాక్షీ భర్తారం భ్రాతరం మమ,
అసపత్నా వరారోహే మేరు మర్క ప్రభా యథా. 5

నీవు సవతిపోరు లేనిదానివై, నా తమ్ముని భర్తగా పొందుము.

అని పలుక, శూర్పణఖ రాముని మాటలు నిజమనితలచి, లక్ష్మణునితో

శ్లో॥ అస్యరూపస్య తే యుక్తా భార్యాఽహం వరవర్ణినీ,
మయా సహ సుఖం సర్వాన్ దండకా న్విచ రిష్యసి. 7

.... నేను, నీ రూపమునకు తగిన భార్యను. నాతో కలిసి నీవు సుఖముగ దండకయందు విహరింపుము.

లక్ష్మణుడు శూర్పణఖతో

శ్లో॥ కథం దాసస్యమే దాసీ భార్యా భవతు మిచ్ఛసి,
సోఽహ మార్యేణ పరవాన్భ్రా తా కమలవర్ణిని. 9

నేనే యితనికి దాసుడను. నాకు భార్యవై నీవు దాసివగుట కెట్లు తగుదువు?

శ్లో॥ సమృద్ధార్థస్య సిద్ధార్థా ముదితా మలవర్ణినీ,
ఆర్యస్య త్వం విశాలాక్షీ భార్యా భవ యవీయసీ. 10

ఓ విశాలాక్షీ, నీవు సమృద్ధార్థుడగు నాయ్యనకు కనిష్ఠభార్యవై సిద్ధార్థవగుము.

శ్లో॥ ఏనాం విరూపా మసతీం కరాళాం నిర్ణతోదరీమ్,
భార్యాం వృద్ధాం పరిత్యజ్య త్వామే వైష భజిష్యతి 11

అతడు విరూపయు-వృద్ధయు, అసతియు, కరాళయు, (వేలాడు పొట్ట గలదియునగు భార్యనువదలి నిన్ను పొందగలడు.

శ్లో॥ కోహిరూప మిదం శ్రేష్ఠం సంత్యజ్య వరవర్ణిని,
మానుషీషు వరారోహేః కుర్యాద్భావం విచక్షణః. 12

ఓ సుందరాంగీ! ఇట్టి నీ శ్రేష్ఠమగు రూపమును వదలి, ఏ బుద్ధిమంతుడు-మనుజస్త్రీల యందనురాగము కలవాడగును.

శ్లో॥ ఇతి సా లక్ష్మణే నోక్తా కరాళా నిర్ణతోదరీ,
మన్యతే తద్వచ స్తథ్యం పరిహాసా విచక్షణా. 13

అని లక్ష్మణుడు పలుక పరిహాసము నెఱుగని యా రాక్షసి అతని మాటలు నిజమని తలచెను.

పై విషయములన్నియు నొకసారి పరిశీలింపుడు. శూర్పణఖ, రామునిజూచి, అతడెవరైనది తెలిసికొని, తన కుటుంబ విషయములు, స్వవిషయములు తెలిపి, నిశ్చయముగ-కపటములేకుండ తాను రాముని భర్తగా కోరివచ్చితిననియు,తనను భార్యారూపముతో చూచి-శాశ్వతముగ భర్తవగుమనియు కోరినది. అట్టి కల్మషమెఱుగక మాటలాడు స్త్రీని-రాముడు పొగడి తనకు భార్యగలదనియు, తన తమ్ముడామెకను కూలుడగు వరుడనియు వచించెను. లక్ష్మణుడును ఆమె యందమును పొగడి, తన వదినగారి యందమును తూలనాడుచు 'నీవు మాయన్నకు రెండవ భార్యవగుమనియు-సుందరాంగివగు నిన్ను విడచి, (మా యన్న) మనుజస్త్రీలయందు (సీతయందు) అనురాగము కలవాడెట్లగును' అని పలికి యామె నింకను రెచ్చగొట్టెను.

పరిహాసము నెఱుగని యా శూర్పణఖ, మరల రామునితో తన

మనోగతమును వెల్లడించెను. పిమ్మట 'నీవంటి స్త్రీలకు సవతులుండుట దుఃఖము కలిగించు'నని, రాముడు వచించినమాటను తలచి శూర్పణఖ, రాముడు తనను వలచినాడనియు, సీత లేకున్నచో తనను స్వీకరించుననియు తలచి సీతను చంపబోయెను. అంత రామలక్ష్మణులామెను పట్టుకొని విరూపిగ నొనరించిరి.

ఈవిధముగ నొక స్త్రీని యాటలుపట్టించి, ఆశగొలిపి విరూపిగ జేయుట వారి సత్యసంధతయా? క్షాత్రధర్మమా? ఆమెతో మొదటనే, తా మామెను పరిణయమాడువారము కామని తెలుపవచ్చునుగదా! అంతకంటె యామె నచటనుండి వెడలగొట్టు మార్గమా పురుషశ్రేష్ఠులకు గోచరింపలేదా? ఆమె పాలితప్రాంతమునకు వచ్చి, ఆమెతో పరిహాసములాడి, ఆమెను విరూపిగ నొనర్చుట యార్యరాజుల కనుచితమగు చర్యయా?

శూర్పణఖ వివాహమాడుమని యా రాజకుమారులను కోరినది కాని, వారిని బలవంతముచేయలేదు. వారితో దుష్ప్రసంగము చేయలేదు. వారు మాట్లాడిన మాటలనుబట్టియే, సీత లేనిచో రాముడు తన్ను వరించునని సీతపై కిబోయినది. ఆ యవకాశమును తమ మాటల ద్వార కల్పించినవారు రామలక్ష్మణులు ఆమె యందమును పొగడి, ఆమెకు ఆశగొలిపి, ఆమెను రెచ్చగొట్టి-విరూపిగ నొనర్చినవారు రామలక్ష్మణులు.

ఈ సందర్భమున వాల్మీకి రాముని ప్రశంసించుచు

అరణ్య. 17వ సర్గము :

శ్లో॥ అనృతం నహి రామస్య కదాచి దపి సమ్మతమ్,
విశేషేణాఽఽశ్రమ స్థస్యసమీపే స్త్రీ జనస్య చ. 15

రామున కసత్యమెన్నడును సమ్మతముకాదు. విశేషించి యాశ్రమమందుండుట వలనను, స్త్రీల సమక్షముననుー

అని వ్రాసెను. రాము డీ సంభాషణయంతయు జరిపినది – స్త్రీ సమక్షముననే కాదు స్త్రీతో.

దీనినిబట్టి రాముడు, శూర్పణఖను విరూపిగ నొనర్చుట, రాక్షసులతో వైరముకోరియే యనుట సుస్పష్టమగుచున్నది.

అరణ్య. 20వ సర్గము : శూర్పణఖ-రామలక్ష్మణులు తనకు చేసిన పరాభవమును తెలుప, ఖరుడు వారిపై రాక్షసులను పంపెను- ఆ రాక్షసులతో రాము డిట్లనెను—

శ్లో॥ ఫలమూలాశనౌ దాంతౌ తాపసౌ ధర్మచారిణౌ,
వసంతౌ దండకారణ్యే కిమర్థ ముపహారసథ. 8

ఫలమూలముల దినుచు జితేంద్రియులమై తాపసవృత్తి నవలంబించి-ధర్మము నాచరించుచు దండకారణ్యమున నివసించు మమ్మేల హింసించెదరు ?

శ్లో॥ యుష్మాన్ పాపాత్మకా న్హంతుం విప్రకారా న్మహాహవే,
ఋషీణాం తు నియోగేన ప్రాప్తోఽహం సశరాయుధః. 9

హింసాస్వభావముగల పాపాత్ములగు మిమ్ము యుద్ధభూమియందు సంహారించుటకై ఋషుల నియోగముచే ధనుర్బాణములు దాల్చివచ్చితిని.

ఇచట రాముడు రాక్షసులతో "యుద్ధభూమియందు మిమ్ముల సంహారించుటకై ఋషుల నియోగముచే ధనుర్బాణముల ధరించి వచ్చితి" ననుటచే, రాముడు కావలయుననియే రాక్షసులతో యుద్ధమునుకోరి శూర్పణఖను విరూపినిగ నొనర్చినటుల విశదమగుచున్నది.

ఇందు రాముడు తమ్మునిచే శూర్పణఖను స్త్రీ యనియు తలపక హింసించి, రాక్షసులను హింసాస్వభావము గలవారనుట యెంతయు గర్హనీయము.

మరియు వనమున వేటాడి మాంసము భుజించుచు తమను పరిణయమాడుమని వచ్చిన స్త్రీతో పరిహాసములాడి, యామెను విరూపినిగావించి, తాము ఫలమూలముల దినువారమనియు, జితేంద్రియుల మనియు, తాపసవృత్తి నవలంబించి ధర్మము నాచరించుచున్నా

మనియు వచించుట యెంతటి గడసరిమాటలో ఈపాతకులూహింతురు గాక !

రావణుడు : ఋషులు, తమ పాలితప్రాంతములలోనికివచ్చి, తమ యాచారములకు విరుద్ధములగు క్రతువు లొనరించుచు, తమ జాతివారిని చంపుటవలనను, రాముడు ఋషుల పక్షమువహించి, రాక్షసుల చంపుటవలనను, రాక్షసులను చంపెదనని ఋషులతో పలుకుటవలనను, తన చెల్లెలగు శూర్పణఖను విరూపిగ నొనర్చినందుకు ప్రతిఫలమే రావణుని సీతాపహరణము అని విశదమగుచున్నది.

రామ-రావణుల చర్యయందలి యీక్రింది భేదమును పరిశీలింపుడు.

రాముడు. తనను వలచి వచ్చిన స్త్రీతో పరియాచకములాడి యామెను విరూపిగ నొనర్చెను.

రావణుడు సీతను గాఢముగ కామించియు, తన యధీనములో- నేకాంతమై దిక్కు-లేక-దిక్కు-తోచక యున్నపు డామెతో నిట్లనెను. సుందర. 20వ సర్గము :

శ్లో॥ స్వధర్మో రాక్షసాం భీరు సర్వదైవ న సంశయః,
గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమధ్య వా. 5
ఏవం చైత ద కామాం తు నత్వాంస్ప్రక్ష్యామి మైథిలి,
కామం కామశ్శరీరేమే యథాకామం ప్రవర్తతామ్. 6
దేవి నేహ భయం కార్యం మయి విశ్వసి హి ప్రియే,
ప్రణయస్వ చ తత్త్వేన మైవం భూశ్శోక లాలసా. 7

పిఱికిదానా, పరస్త్రీలను పొందుట, బలాత్కారముగ తెచ్చుట, నిస్సంశయముగ రాక్షసుల ధర్మము. కావుననే నధర్మమొనరించితినని తలపకుము.

నా శరీరమున కామము యథేచ్ఛగా ప్రసరించిన ప్రసరింప నిమ్ము. నన్ను కామింపని నిన్ను స్పృశింపను.

ఓ దేవీ! నీవు భయపడకుము. నా మాట నమ్ముము. యదార్థముగ నన్ను ప్రేమింపుము. శోకము నందకుము.

22వ సర్గము:

శ్లో॥ ఏ తస్మా త్కారణా న్న త్వాం ఘాతయామి వరాననే,
వధార్హా మవమానార్హం ర్హాం మిథ్యా ప్రవ్రజితేర తామ్.

ఓ సుందరీ! నీవు వధింపదగియున్నను, అవమానింపదగియున్నను, కపటముగ వానప్రస్థవేషము ధరించిన రామునియందే ప్రేమకలిగియున్నను, నిన్ను చంపుట కాజ్ఞ నొసంగకున్నాను.

రావణుని యీ మాటలకు, రాముని చర్యకు నెంతటి వ్యత్యాసమున్నదో గమనింపుడు. పరస్త్రీలను బలవంతముగా గొనివచ్చుట స్వజాతి ధర్మమైనను, తాను గొనివచ్చిన భయాక్రాంతయగు సీత నోదార్చి 'నన్ను కామింపని నిన్ను స్పృశింపను' అని పలికిన రావణుడు ధర్మాచరణుడా? తనను కామించి వచ్చిన స్త్రీతో పరియాచకము లాడి యామెను విరూపిగ నొనర్చిన రాముడు ధర్మాచరణుడా?

పై విషయములనుబట్టి రావణుడు సీతను గొనివచ్చుట-రాక్షస ధర్మముచేతను, తన చెల్లెలికి జరిగిన పరాభవమునకు ప్రతీకారముగను అని తెలియుచున్నది.

రాముడు: సుగ్రీవుని చేరి, నిర్హేతుకముగ - ధర్మరహితముగ, వాలిని చంపి, సుగ్రీవుని వానరరాజుగ చేయుట కిష్కింధను తనకు లోబడిన రాజ్యముగ చేసికొను తలంపేకాని వేరుగాదు. ఆ విషయము నెఱిగియే విభీషణుడు రాముని చేరి, స్వవంశ నిర్మూలన మొనర్చుకొని నిర్వీర్యముగు లంకకు రాజయ్యెను. రాముడు విభీషణుని తోడ్పాటుతో బలవంతుడగు రావణుని చంపి, లంకను తన యధీనరాజ్యముగ నొనర్చుకొని నిర్వీర్యుడగు విభీషణుని లంక కలంకారముగు రాజుగ నొనర్చెను. కిష్కింధయు నదేవిధముగ మహాబలవంతుడు - ధర్మాత్ముడు - ధర్మరక్షకుడు నగు వాలి చంపబడగా అలంకారపు బొమ్మయగుసుగ్రీవుని చేతికివచ్చి నిర్వీర్యమాయెను.

కనుక రామ–రావణ యుద్ధమునకు ముఖ్యకారణము రాముని రాజ్యకాంక్ష. రాముడు దానికి 'ఋషుల రక్షణకొఱకు' అను ముసుగు వేసెను. అంతియేగాని సీతాపహరణ మెంతమాత్రముకాదని విదిత మగుచున్నది. దీనికి ముఖ్యఉదాహరణము, సీతాపహరణమునకు ముందు, రాముడు రాక్షసుల చంపెదనని ఋషులతో పలుకుటయే – ఇంకను దీర్ఘముగ నాలోచించిన, తన పూర్వీకులగు–అనరణ్యుని చంపిన, మాంధాతతో ఘోరరణమొనర్చిన రాక్షసరాజగు రావణుని చంపుట యను నాలోచన, రామునకు వనవాసమునకు బయలుదేరుటకు పూర్వమునుండియే గలదని యూహింపవచ్చును.

రాముడు శూర్పణఖను విరూపిగనొనర్చి రామ–రావణ యుద్ధమునకు బీజమువేసెను. సరియగు చారిత్రక అవగాహనలేని పౌరాణికులు, ఆర్యఋషుల పక్షపాతబుద్ధిగల పండిత ప్రకాండులు సరియగు ముఖ్యవిషయములు గ్రహింపనొల్లక, సీతను రావణు డపహరించుటయే, రామ–రావణ యుద్ధమునకు కారణమని ప్రచారము గావించిరి.

## 10. రావణ-దశరథుల యందలి భేదములు

అయోధ్య. 1వ సర్గము : సభయందు దశరథుడు కూర్చుండి యుండగా రాజులు ప్రవేశించి రాజున కెదురుగా వివిధాసనముల యందు కూర్చుండిరి. అలంకృతుడగు రాజు ప్రజాపతి ప్రజలనువలె వారిని జూచెను. బహుమతు లిచ్చినవారును – సవినయులునగు రాజుల చేతను, పురవాసుల చేతను, దేశీయులచేతను చుట్టబడినవాడై అమరులతో గూడిన దేవేంద్రునివలె ప్రకాశించెను.

యుద్ధకాండము 11వ సర్గము : రావణుడు సభకు పోవుచుండ నాయుధపాణులగు రాక్షసులు రాజునకు ముందుగ నడచిరి. అతిరథులు రథ–గజ–హయములతో రావణు ననుసరించిరి. వేషధారులు ఆభరణాలంకృతులై రాజును ముందువెనుకల జుట్టుకొని ప్రయాణించిరి. శంఖ

వాదము-వాద్యముల శబ్దము బిగ్గఅగ ధ్వనించుచుండ రావణుని రథము రాజమార్గమున ప్రయాణించెను. రాజునకు తెల్లనిగొడుగు పట్టబడెను. వింజామరల జంట యతని కుడి యెడమల ప్రకాశించెను. నేలపైనున్నవారు తలపై చేతులుమోడ్చి రథముపై పయనించు రావణునకు నమస్కరించిరి. రాక్షసులచే జయాశీస్సులను పొందుచు రావణుడు సభను ప్రవేశించి, యుత్తమాసనముపై నధిష్ఠించెను.

సభయందు రాక్షసులు రాజుపాదముల గ్రహించి, మరలా రాజుచే పూజింపబడినవారై కొందరు పీఠములందును, కొందరు కంబళ్ళయందును, కొందరు నేలపైనను తమ కుచితమగురీతిని కూర్చుండిరి. సభయందు అందరకు సువర్ణమణి - భూషణవస్త్రములను, అగరు, చందన పుష్పమాలల నిచ్చిరి.

సభయం దొక్కడును కోపమునంద లేదు. అసత్యమాడ లేదు. బిగ్గఅగ మాట్లాడ లేదు. అందరు ప్రభువు ముఖమును చూచుచు కూర్చుండిరి.

ఈ క్రింది సంఘటనల పరిశీలింపుడు.

దశరథ-రాముల సమక్షమున, మంత్రియగు సుమంత్రుడు పురోహితుడగు వసిష్ఠుడు, దశరథుని భార్య-రాముని సవతితల్లియగు కైకను నిందించిరి.

రాముడు సీతకు నారవస్త్రములు గట్టుచుండ జనులు దశరథుని నిందించిరి.

రావణునకు దశరథునకువలె ననేక భార్యలుండిరి. కాని వారందరు రావణుని యందనురక్తులు. వారిలో సవతి కయ్యము లున్నట్లు వాల్మీకి యెచటను వర్ణింపలేదు. దశరథుని యంతఃపుర కాంతలలో సవతుల కయ్యము లున్నవి.

వాల్మీకి అయోధ్యలో వారకాంతలున్నట్లు, వార ఉద్యాన వనములయందు విచ్చలవిడిగ చరించుచున్నట్లు వర్ణించెను. కాని లంకా

పురిలో వారకాంతలను వర్ణించుట జరుగలేదు. అయోధ్యలో ఎక్కువ అంతస్థుల భవనము లున్నట్లు వర్ణించలేదు, కాని లంకలో ఏడెనిమిది అంతస్థుల భవనములున్నట్లు వర్ణింపబడెను. వాల్మీకి దశరథుని పరబలమర్దనుడనియు, అతిరథుడనియు వచించెనేడాని, యతడు విజయములుగాంచిన యుద్ధము లేమియు వర్ణించలేదు. రావణుడు విజయము నొందిన యనేక యుద్ధములను గురించి వ్రాసెను.

పై విషయములనుబట్టి రావణ–దశరథుల యందుగల వ్యత్యాసము వారి రాజ్యముల పరిస్థితి, ప్రజలలో వారికిగల మన్నన వెల్లడి యగుచున్నవి.

## 11. మారీచుడు - లేడి

బాలకాండము 1వ సర్గములో :

"తేన మాయావినా దూర మపవాహ్య నృపాత్మజౌ". 52

మాయావియగు నతనిచే రాజకుమారులు దూరముగ తీసికొని పోబడిరి. అని యున్నది. ఇందు మారీచుడు లేడిగామారి, యని ప్రస్తావించబడలేదు.

మరియు, 'సహాయం వరయామాస మారీచం నామ రాక్షసమ్' 50 శ్లో.

మారీచుడను రాక్షసుని సహాయముకోరెను. అని మాత్రమే యున్నది. మారీచుని లేడిగామారి తనకు సహాయపడుమని కోరినట్లును లేదు.

అరణ్య. 36వ సర్గము : రావణుడు మారీచుని యాశ్రమము నకు వచ్చి, యతనిని బంగారం లేడి రూపముదాల్చి తనకు సహాయపడుమని కోరెను.

42వ సర్గము : మారీచుడు మృగరూపముదాల్చి రాముని యాశ్రమప్రాంతముల దిరుగాడుచుండెను.

శ్లో॥ సముద్వీక్ష్య చ తం సర్వేమృగా హ్యన్యే వనే చరాః,
ఉపాగమ్య సమాఘ్రాయ విద్రవంతి దిశో దశ. 29

ఆ మాయామృగమును జూచి యా వనమున తిరుగాడు లేళ్ళన్నియు చెంతకువచ్చి దానిని వాసన జూచి దశదిశలకు పరుగెత్తినవి.

4లివ సర్గము : లక్ష్మణుడు రామునితో

శ్లో॥ చరంతో మృగయాం హృష్టాః పాపే నోపాధినా వనే,
అనేన నిహతా రాజః రాజానః కామరూపిణా. 5

రాజా! కామరూపియగు నీ పాపాత్ముడీ లేడివేషముదాల్చి, యీ యడవియందు సంతోషముతో వేటకై వచ్చిన రాజుల ననేకుల చంపినాడు.

లేడి రూపముతో రాజుల నెట్లు చంపియుండును? లేడి భయంకర మృగము కాదుగదా!

44వ సర్గము : రాముడు మారీచునిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. మారీచుడు మృగరూపుడై యున్నచో - రాముడు దానిపై బ్రహ్మాస్త్రము ప్రయోగించుట జరుగదు. కనుక రాక్షస రూపుడగు మారీచుని రాముడు బ్రహ్మాస్త్రముతో చంపెను.

44వ సర్గము : రాముని బాణఘాతము చే మారీచుడు మరణించుచు హా! సీతా, లక్ష్మణా! అని యఱచెను. (అరణ్య. 44వ సర్గము 19 శ్లోకము).

శ్లో॥ తత్ర రామం భయం తీవ్ర మావివేశ విషాదజమ్,
రాక్షసం మృగరూపం తం హత్వా శ్రుత్వా చ తత్స్వరమ్. 27

అట్లు మృగరూపుడగు రాక్షసుని సంహరించి, అతని స్వరమును (హా! సీతా, లక్ష్మణా! యని, రాముని కంఠధ్వని ననుసరించుచు పలికిన) విని, మిక్కిలి భయమును, విషాదమును పొందెను.

శ్లో॥ నిహత్య పృషతం చాన్యం మాంస మాదాయ రాఘవః,
త్వరమాణో జనస్థానం ససా రాభిముఖ స్తదా. 28

అంత రాముడు మఱియొక మృగమును చంపి, దాని మాంసమును గ్రహించి త్వరితముగ జనస్థానమున కభిముఖుడై వెళ్ళెను.

మారీచుడు రాముని కంఠధ్వని ననుసరించి పలికిన 'హా సీతా ! లక్ష్మణా !' యను మాటలు విని రాముడు మిక్కిలి భయమును, విషాదమును పొందెననియు, పిమ్మట మరియొక మృగమును చంపి దాని మాంసమును గ్రహించి జనస్థానమున కేగెననియు తెలుపబడినది. మృగరూపుడై యున్న మారీచుని జూచి, మృగము లతని చెంతకువచ్చి వాసనజూచి పరుగెత్తెనని పైన తెలుపబడినది. అట్టియెడ మృగరూపు డగు మారీచుడు చనిపోగా నచటకు మరియొక మృగము వచ్చు టెట్లు సంభవించును ? మారీచుని యఱపునకు భయమును, విషాదమును పొందిన రాముడు, మరియొక మృగమును చంపి, దాని మాంసము తీయుట యందు కాలమును వ్యర్థముచేయునా ?

దీనినిబట్టి మారీచునకు అందమగు పెంపుడు మృగమున్నదనియు, అది యతని నెప్పుడు విడిచియుండెడిది కాదనియు, మారీచు డా మృగ మును సీతారాముల పర్ణశాల యెదుట సంచరింపజేయుచు, తా నా పరిసరముల చెట్లమాటున-పొదలమాటున దాగియుండుననియు, రాము డా మృగము ననుసరింప-తానును ఆ చెట్లమాటున పరుగిడియుండు ననియు, రాము డాతనిగాంచి బ్రహ్మాస్త్రముతో నతని చంపియుండు ననియు, (సహజ లేడియైనచో బ్రహ్మాస్త్రముతో పనియేమున్నది) పిమ్మట మారీచుని పెంపుడు లేడి, యజమానియగు మారీచుని చెంతకు రాగా, రాముడు దానిని చంపి, యా మాంసమును గ్రహించి పర్ణ శాలకు బయలుదేరెనని తోచుచున్నది.

## 12. రా ము డు

### 1. అవతారము :

బాల. 15వ సర్గము :

శ్లో॥ వత్స్యామి మానుషే లోకే పాలయన్ పృథివీ మిమామ్,
ఏవం దత్త్వా వరం దేవో దేవానాం విష్ణు రాత్మవాన్. 29

మానుషే చింతయామాస జన్మభూమి మథాత్మనః,
తతః పద్మపలాశాక్షః కృత్వాఽఽత్మానాం చతుర్విధమ్. 30
పితరం రోచయామాస తథా దశరథం నృపమ్.

విష్ణుదేవుడు 'ఈ భూమిని పాలించుచు మనుష్యలోకమందు వసింతును' అని దేవతలకు మాటయిచ్చి, తన పుట్టుకకు స్థానమెద్ది? అని యోచించెను.

పిదప విష్ణువు తన యాత్మను నాలుగుభాగములుగజేసి దశరథుని తండ్రిగా నిశ్చయించెను.

యుద్ధ. 120వ సర్గము : దేవతలు రామునితో

శ్లో॥ ఋతధామా వసుః పూర్వం వసూనాం త్వం ప్రజాపతిః. 7
త్రయాణాం త్వం హి లోకానా మాదికర్తా స్వయంప్రభుః,
రుద్రాణా మష్టమో రుద్ర స్సాధ్యానా మపి పంచమః. 8

నీవు పూర్వము వసువులకు వసువగు ఋతుధాము డనెడి ప్రజాపతివి. ముల్లోకముల కాదికర్తవు. స్వయంప్రభుడవు.

రుద్రులలో అష్టమరుద్రుడవు. సాధ్యులలో నైదవవాడవు.

యుద్ధ. 120వ సర్గము : బ్రహ్మ రామునితో

శ్లో॥ సీతా లక్ష్మీ ర్భవాన్విష్ణు ర్దేవః కృష్ణః ప్రజాపతిః,
వధార్థః రావణస్యేహ ప్రవిష్టో మానుషీం తనుమ్. 28

సీత లక్ష్మి. నీవు ప్రజాపతియగు విష్ణుదేవుడవు. రావణుని వధమునకై మనుజరూపమును పొందితివి.

కనుక రాము డెవని యవతారము?

## 2. పితృవాక్య పాలన :

అయోధ్య. 18వ సర్గము : కైక దశరథుని మాటలుగ రామునితో నిట్లువచించెను.

శ్లో॥ సప్త సప్త చ వర్షాణి దండకారణ్య మాశ్రితః,
అభిషేక మిదం త్యక్త్వా జటా చీర ధరో భవ. 37

అభిషేకమును వదలి జటావల్కలములు ధరించి పదునాలుగు వత్సరములు దండకారణ్యము నాశ్రయింపుము.

20 సర్గము : రాముడు కౌసల్యతో

శ్లో॥ చతుర్దశ హి వర్షాణి వత్స్యామి విజనేవనే,
మధుమూల ఫలై ర్జీవన్ హిత్వా మునివదా మిషమ్. 29

నేను మునులవలె నా మిషమును వదలి తేనె-దుంపలు - పండ్లు తినుచు పదునాలుగు వత్సరములు నిర్జనమగు వనమున నివసింతును.

50వ సర్గము : రాముడు గుహునితో

శ్లో॥ కుశ చీరాజిన ధరం ఫలమూలాశినమ్ చ మామ్,
విద్ధి ప్రణిహితం ధర్మే తాపసం వనగోచరమ్. 44

నన్ను కుశచీరాజినధరునిగను ఫలమూల భక్షకునిగను, ధర్మ నిష్ఠునిగను, తాపసిగను తెలిసికొనుము.

52వ సర్గము : రాముడు గుహునిచే మఱ్ఱిపాలు తెప్పించుకొని

శ్లో॥ లక్ష్మణ స్యాఽఽత్మనశ్చైవ రామ స్తే నాకరోజ్జటాః,
దీర్ఘబాహు ర్నరవ్యాఘ్రో జటలత్వ మధారయత్. 69

రాముడు మఱ్ఱిపాలతో లక్ష్మణునికి జడలను వేసి తను వేసికొనెను.

52వ సర్గము :

శ్లో॥ తౌ తత్ర హత్వా చతురో మహా మృగాన్,
వరాహ మృశ్యం పృషతం మహారురుమ్,
ఆదాయ మేధ్యం త్వరితం బు భుక్షితౌ,
వాసాయ కాలే యయు ర్వనస్పతిమ్. 102

అచట వారు పంది, మనుబోతు, దుప్పి, చారలదుప్పి యనెడి నాలుగు మహామృగములను చంపి, తీసికొనివచ్చి, భుజింపదలచినవారై, సాయంకాలమందు వసించుటకై వనస్పతికి వెళ్ళిరి.

సుందర. 36వ సర్గము : హనుమంతుడు సీతతో

నీవు కనిపించని దుఃఖముచే రాముడు సుఖమును పొందుట లేదు....మద్య మాంసముల సేవించుట లేదు.

అభిషేకమును వదలి జటావల్కలములు ధరించి పదునాలుగు వత్సరములు దండకారణ్యము నాశ్రయింపుము.

20 సర్గము : రాముడు కౌసల్యతో

శ్లో॥ చతుర్దశ హి వర్షాణి వత్స్యామి విజనేవనే,
మధుమూల ఫలై ర్జీవన్ హిత్వా మునివదా మిషమ్. 29

నేను మునులవలె నా మిషమును వదలి తేనె-దుంపలు - పండ్లు తినుచు పదునాలుగు వత్సరములు నిర్జనమగు వనమున నివసింతును.

50వ సర్గము : రాముడు గుహునితో

శ్లో॥ కుశ చీరాజిన ధరం ఫలమూలాశినమ్ చ మామ్,
విద్ధి ప్రణిహితం ధర్మే తాపసం వనగోచరమ్. 44

నన్ను కుశచీరాజినధరునిగను ఫలమూల భక్షకునిగను, ధర్మనిష్ఠునిగను, తాపసిగను తెలిసికొనుము.

52వ సర్గము : రాముడు గుహునిచే మఱ్ఱిపాలు తెప్పించుకొని

శ్లో॥ లక్ష్మణ స్యాఽఽత్మనశ్చైవ రామ స్తే నాకరోజ్జటాః,
దీర్ఘబాహు ర్నరవ్యాఘ్రో జటలత్వ మధారయత్. 69

రాముడు మఱ్ఱిపాలతో లక్ష్మణునికి జడలను వేసి తను వేసికొనెను.

52వ సర్గము :

శ్లో॥ తౌ తత్ర హత్వా చతురో మహా మృగాన్,
వరాహ మృశ్యం పృషతం మహారురుమ్,
ఆదాయ మేధ్యం త్వరితం బు భుక్షితౌ,
వాసాయ కాలే యయు ర్వనస్పతిమ్. 102

అచట వారు పంది, మనుబోతు, దుప్పి, చారలదుప్పి యనెడి నాలుగు మహామృగములను చంపి, తీసికొనివచ్చి, భుజింపదలచినవారై, సాయంకాలమందు వసించుటకై వనస్పతికి వెళ్ళిరి.

సుందర. 36వ సర్గము : హనుమంతుడు సీతతో

నీవు కనిపించని దుఃఖముచే రాముడు సుఖమును పొందుట లేదు....మద్య మాంసముల సేవించుట లేదు.

టకై తన కనుకూలుడై చరించు పుత్రుని మన తండ్రి నన్నువలె త్యజించునా.

శ్లో॥ అర్థ ధర్మౌ పరిత్యజ్య యః కామ మనువర్తతే,
ఏవ మాపద్యతే క్షిప్రం రాజా దశరథో యథా. 13

ధర్మార్థములను వదలి యెవడు కామము ననుసరించునో, అతడు దశరథునివలె శీఘ్రముగ వ్యసనమును పొందును.

శ్లో॥ మన్యే దశరథాంతాయ మమ ప్రవ్రాజనాయ చ,
కైకేయీ సౌమ్య సంప్రాప్తా రాజ్యాయ భరతస్య చ. 14

దశరథుని యంతము కొఱకు, నా వనవాసమునకు, భరతుని రాజ్యము కొఱకు కైకేయి సంప్రాప్తమైనదని తలచుచున్నాను.

శ్లో॥ అపీ దానీం తు కైకేయీ సౌభాగ్య మదమోహితా,
కౌసల్యాం చ సుమిత్రాం చ సాప్రబాధేత మత్కృతే. 15

కైకేయి సౌభాగ్య గర్వముచే మైమఱచినదై నాకారణమున కౌసల్యా-సుమిత్రలను బాధింపకుండునా ?

శ్లో॥ క్షుద్ర కర్మాహి కైకేయీ ద్వేషా దన్యాయ మాచరేత్,
పరిదద్యా హి ధర్మజ్ఞే భరతే మమ మాతరమ్. 18

నీచకృత్యయగు కైకేయి ద్వేషముచే నన్యాయ మొనరించక మానదు. ధర్మజ్ఞుడగు భరతునకు రక్షణగ నాతల్లి కౌసల్య నప్పగించును.

శ్లో॥ మన్యే ప్రీతి విశిష్టా సా మత్తో లక్ష్మణ సారికా.
యత్తస్యాః శ్రూయతే వాక్యం శుకపాద మరేర్దశ. 22

లక్ష్మణా ! నాకంటెను గోరువంక నాతల్లికి మిక్కిలి ప్రీతిని కలుగజేయుచున్నది. 'ఓ చిలుకా ! శత్రుపాదమును కొఱుకుము' అను వాక్య మామెకు వినబడుచున్నది.

(అనగా తాను కూడ యింటియొద్దనున్నచో కైకను తిట్టుచు, తన తల్లి కానందము కలిగించుచుండెడివాడను గదా ! అనియే గదా !)

ఈవిధముగ తండ్రిని, తండ్రితో బాటు తల్లిని నిందించుట పితృవాక్యపాలన నిర్వహించుటయా ?

ఇంతియే కాదు. రాముడు కైక ననేక పర్యాయములు వనమున నిందించెను. మరియు రాముడు

శ్లో॥ అధర్మ భయభీతశ్చ పరలోకస్య చా నఘ,
తేన లక్ష్మణ నాద్యాహ మాత్మాన మభిషేచయే. 26

శ్లో॥ ఏత దన్యచ్చ కరుణం విలప్య విజనే బహు,
అశ్రుపూర్ణ ముఖో రామో నిశితూష్ణీ ముపావిశత్, 27

లక్ష్మణా ! అధర్మమునకు భయపడియు, పరలోకము లభింపదనియు, నన్ను నే నభిలషించుకొనలేదు.

ఈవిధముగ చెప్పరానట్టి మాటలాడుచు, నిర్జనవనమందు దీనముగ నేడ్చి కన్నీటితో నిండిన ముఖముకలవాడై యుండెను.

పై మాటలవలన రాము డధర్మమునకు–పరలోకనిందకు వెరచి రాజ్యాభిషేకమునకు ప్రయత్నించలేదు కాని, తండ్రి యాజ్ఞాపాలనకు కాదనుట స్పష్టము.

ఈ విధములగు భావనలతో గడిపిన రాముడు పితృవాక్య పాలకుడా ?

96వ సర్గము : రాముడు చిత్రకూట పర్వతమున సీతతో కూర్చుండి, ఆమెకు మాంసపుముక్కను చూపి,

శ్లో॥ ఇదం మేధ్యం మిదంస్వాదు విష్టప్త మిద మగ్నినా,
ఏవ మాస్తే స ధర్మాత్మా సీతయా సహ రాఘవః. 2

ఇది పవిత్రమైనది. ఇది రుచియైనది. ఇది యగ్నిలో చక్కగా కాల్చబడినది. అని చెప్పుచుండెను.

శ్లో॥ తథా తత్రాஉஉసత స్తస్య భరత స్యోప యాయినః,
సైన్య రేణుశ్చ శబ్దశ్చ ప్రాదురాస్తాం నభస్స్పృశౌ. 3

అపుడు వచ్చుచున్న భరతుని యొక్క సైన్యపుధూళియు, శబ్దమును, ఆకాశము నంటెను.

99వ సర్గము :

శ్లో॥ నిరీక్ష్య సముహూర్తం తు దదర్శ భరతో గురుమ్,
ఉటజే రామ మాసీనం జటామండల ధారిణమ్. 25

పర్ణశాలయందు జటామండలములు ధరించి కూర్చుండియున్న రాముని భరతుడు క్షణకాలము చూచెను.

శ్లో॥ కృష్ణాజిన ధరం తం తు చీరవల్కల వాససమ్,
దదర్శ రామ మాసీన మభితం పావకోపమమ్. 26

కృష్ణాజినములు ధరించి, చీరవల్కల వసనములు గలవాడై, పావకసదృశుడై కూర్చుండియున్న రాముని చూచెను.

శ్లో॥ ఉపవిష్టం మహాబాహుం బ్రహ్మాణ మివ శాశ్వతమ్,
స్థండిలే దర్భ సంస్తీర్ణే సీతయా లక్ష్మణేన చ. 28

శాశ్వత బ్రహ్మవలె కూర్చునియున్నవాడును, దర్భలుపరచిన నేలపై సీతా లక్ష్మణులతో నుపవిష్టుడై యున్నవాడు నగు రాముని జూచెను.

సీతకు మాంసపుముక్క రుచిని తెలుపుచు కూర్చుండియున్న రాముడు, భరతుడు తనయొద్దకు వచ్చుచున్నాడని గ్రహించినంతనే యీవిధముగ కూర్చుండుటను బట్టి రాముడు ఋషివలె నటించెననుట స్పష్టమగుచున్నది. రాముని యీ ప్రవర్తనను నిష్కపటముగ విమర్శించిన యీ క్రింది సీతా వాక్యములను చూడుడు.

అరణ్యా. 9వ సర్గము :

శ్లో॥ ప్రతిజ్ఞా తస్త్వయా వీర దండకారణ్య వాసినామ్,
ఋషీణాం రక్షణార్థాయ వధస్సం యతి రక్షసామ్. 10
ఏతన్నిమిత్తం చ వనం దండకా ఇతి విశ్రుతమ్,
ప్రస్థి తస్త్వం సహ భ్రాత్రా ధృత బాణ శరాసనః. 11

వీరా! దండకారణ్య వాసులగు ఋషుల రక్షణ కొఱకు యుద్ధమున రాక్షసుల చంపుదునని ప్రతిజ్ఞ చేసితివి.

దీని కొఱకే నీవు సోదరునితో ధనుర్బాణములు ధరించి దండకాటవికి బయలుదేరితివని వినికిడి.

శ్లో॥ తతస్త్వాం ప్రస్థితం దృష్ట్వా మమ చింతాకులం మనః,
తద్వృత్తిం చింతయంత్యా వై భవేన్నిశ్శ్రేయ సంహితత్. 12
నహిమే రోచతే వీర ! గమనం దండకాన్ప్రతి,

అందువలన బయలుదేరిన నిన్ను చూచి, నీ నడవడివి - సౌఖ్యమును చింతించుచున్న నా మనస్సు చింతాకులమైనది. నీ దండకాటవీ గమనము నా కిష్టముకాదు.

శ్లో॥ క్వచ శస్త్రం క్వచవనం క్వచక్షాత్రం తపః క్వచ,
వ్యావిద్ధ మిద మస్మాభిర్దేశ ధరస్తు పూజ్యతామ్. 27

శస్త్రమెక్కడ ? వనమెక్కడ ? క్షాత్రమెక్కడ ? తపమెక్కడ ? ఇవి పరస్పర విరుద్ధము లగుచుండగా మనము దేశ (తపో) ధర్మమునే యాచరించవలెను.

శ్లో॥ తదార్య కలుషా బుద్ధి ర్జాయతే శ్శస్త్ర సేవనాత్,
పునర్గత్వా త్వ యోధ్యాయాం క్షత్రధర్మం చరిష్యసి. 28

శస్త్రసేవనముచే బుద్ధికలుషితమైనచో మరల అయోధ్యకు వెళ్ళి క్షత్రియ ధర్మము చేపట్టుము,

శ్లో॥ అక్షయాతు భవేత్ప్రీతి శ్శ్వశ్రూ శ్వశుర యోర్మమ,
యదిరాజ్యం పరిత్యజ్య భవేస్త్వం నిరతోమునిః. 29

నీవు రాజ్యమును వదలి యిచట శాశ్వతముగ ముని వగుచో నా అత్తమామల నక్షయమగు ప్రీతికలుగును.

తండ్రియాజ్ఞచే కందమూలముల భుజించుచు వనమున ఋషిగ సంచరింతునని పలికిన రాముడు, వనమున మృగముల చంపి మాంసము భుజించుట, తండ్రిని-తల్లిని నిందించుట, ఋషిధర్మమగు ధ్యానముతో గూడిన తపస్సును పరిత్యజించి ఋషివేషము ధరించి తిరుగుట పితృవాక్యపాలనయా ?

అయోధ్యా రాజ్యసింహాసనమునకై తండ్రితో కలసి తా నొనరించిన కుట్ర విఫలముకాగా, ప్రజలలో తలయెత్తి తిరుగజాలకున్న సమయమున, అరణ్యవాస మతని కెంతో నుపయుక్తమయ్యెను. దానికి పితృవాక్యపాలన'యను ముసుగు కల్పించెను. దీనితో . ప్రజల యాదరణ' యను లబ్ధిపొందదలచినవాడై, కనుపించిన వారందరితో తాను తండ్రి యాజ్ఞ నిర్వర్తించుట కడవుల కేగుచున్నాననియు, అచట కందమూలములచే తృప్తినొందెదననియు వచించెను. రాగద్వేషములచే నగు జడలను మఱ్ఱిపాలచే ధరించెను. కాషాయాంబరములు ధరించెను కాని, బుద్ధికలుషితము పోకుండుటచే ధ్యానమందు మనస్సును లగ్నము చేయలేకపోయెను. అయోధ్యయందు పోయిన రాజ్యమును దండకారణ్యములందు సంపాదింప యత్నించెను.

దీనినిబట్టి రాముని పితృవాక్యపాలన మిధ్యగ కన్పించుచున్నది.

3. ధైర్య పరాక్రమములు :

అరణ్య. 2వ సర్గము : విరాధుడు, రామలక్ష్మణులతో నున్న సీతను గ్రహించి, తన చంకనిడుకొని పోవుచుండగా

శ్లో॥ తాం దృష్ట్వా రాఘవ స్సీతాం విరాధాంక గతాం శుభామ్,
అబ్రవీల్లక్ష్మణం వాక్యం ముఖేన పరిశుష్యతా. 16

విరాధుని చంకయందున్న సీతను జూచి రాముడు శుష్కించిన నోటితో లక్ష్మణునితో నిట్లనెను.

శ్లో॥ యదభిప్రేత మస్మాసు ప్రియం వరవృతం చ యత్,
కైకేయ్యాస్తు సు సంపన్నం క్షిప్ర మద్యైవ లక్ష్మణ. 18

లక్ష్మణా ! కైక మనయందెట్టి యభిప్రాయము గలిగి, యెట్టి వరమును కోరుకొనినదో, అది ఆమె కిపుడు ఫలించుచున్నది.

శ్లో॥ పరస్పర్శాత్తు వైదేహ్యా న దుఃఖతర మస్తిమే,
పితుర్వియోగా త్సౌమిత్రే స్వరాజ్యహరణా త్తథా. 20

లక్ష్మణా ! సీతను పరపురుషుడు తాకుటచే నిపుడు నాకు కలిగి

నంత దుఃఖము, తండ్రి నెడబాయుటచేగాని - స్వరాజ్యాపహారణముచే గాని కలుగలేదు.

శ్లో॥ ఇతి బ్రువతి కాకుత్స్థే బాష్పశోక పరిప్లుతే,
అబ్రవీల్లక్ష్మణః క్రుద్ధో రుద్ధో నాగ ఇవ శ్వసన్. 21

రాము డిట్లు దుఃఖితుడై కన్నీరు గార్చుచు పలుకగా, లక్ష్మణుడు క్రుద్ధుడై కట్టుబడిన పాముపలె బుసకొట్టుచు నిట్లుపలికెను.

ఇట్లు భార్యను పరుడెత్తుకొని పోవుచుండగా, కాగల కార్యము నెంచింపక, యెక్కడో నున్న తల్లిని నిందించుట - కన్నీరు గార్చుచు విలపించుట-పౌరుషవంతుల లక్షణమా?

అరణ్యా. 69వ సర్గము : కబంధుడు తన భుజబలముచే రామలక్ష్మణుల నిరువురను తన రెండు బాహువులతో పట్టుకొని, 'మీకింక జీవితము దుర్లభము'ని పలుక,

శ్లో॥ తస్య తద్వచనం శ్రుత్వా కబంధస్య దురాత్మనః,
ఉవాచ లక్ష్మణం రామో ముఖేన పరిశుష్యతా. 46

దురాత్ముడగు కబంధుని వాక్కును విని, రాముడు నోరెండ లక్ష్మణునితో నిట్లనెను.

శ్లో॥ కృచ్ఛ్రాత్ కృచ్ఛ్రతరం ప్రాప్య దారుణం సత్యవిక్రమః,
వ్యసనం జీవితాంతాయ ప్రాప్త మప్రాప్య తాం ప్రియామ్. 47

లక్ష్మణా! అత్యంతకష్టమగు దారుణమునుపొంది, ప్రియురాలిని పొందకయే ప్రాణాంతకమగు నీ విపత్తు ప్రాప్తమైనది.

ఇట్లు పరిపరివిధముల విలపించు రాముని జూచి లక్ష్మణుడు శీఘ్రమే ఖడ్గములతో నా రాక్షసుని బాహువుల ఛేదింతమని పలికెను.

ఇట్లు శత్రువు యొక్క బాహువులందు చిక్కినంతనే నోరు తడియారుట పరాక్రమవంతుల లక్షణమా? భీరువుల లక్షణమా? మరియు నా శత్రువునుండి తప్పించుకొను ప్రయత్నముగాని, అతనిని చంపు నుపాయముగాని యాలోచింపక, కష్టములు తలచుకొని వగచుట-వీరులకు -ధైర్యపరాక్రమోపేతులకు చెల్లునా?

71వ సర్గము : రామ లక్ష్మణులు కబంధుని భుజములు నఱుకఁ, నతడు వారితో .

శ్లో॥ అహం హి మతి సాచివ్యం కరిష్యామి నరర్షభః,
మిత్రం చైవోపదేక్ష్యామి యువాభ్యాం సంస్కృతోఽగ్నినా. 19

రాజా! నీకు బుద్ధిసహాయము చేసెదను. మిత్రు నొకని సూచించెదను. మీరు నా కగ్ని సంస్కారము చేయుడు.

అని పలికినంతనే రాముడు మిత్రుడు లభించినంత సంతోష మును పొంది, అతనితో.

శ్లో॥ శోకార్తానా మనాథానా మేవం విపరి ధావతామ్,
కారుణ్యం సదృశం కర్తు ముపకారే చ వర్తతామ్. 23

శోకార్తులము-అనాధులమై దిక్కులేక నెల్లెడల తిరుగు చున్నాము. పరుల కుపకారము చేయు వారము. మా విషయము నదయ జూపుము.

ఈ విధముగ పలుకుట వీరులకు ధైర్య పరాక్రమోపేతులకు తగిన దేనా ?

పిమ్మట కబంధుని సలహా ప్రకారము రామలక్ష్మణులు సుగ్రీవుని శరణుకోరిరి. రామ లక్ష్మణులు సుగ్రీవుని శరణుగోరిన యీ క్రింది వాక్యముల చూడుడు—

కిష్కింధ. 4వ సర్గము : లక్ష్మణుడు హనుమంతునితో

శ్లో॥ రక్షసాఽపహృతా భార్యా రహితే కామరూపిణా,
తచ్చ న జ్ఞాయతే రక్షః పత్నీ యేనాస్య సా హృతా. 14

ఇతడు లేని సమయమున కామరూపియగు నొక రాక్షసునిచే నితని భార్య యపహరింపబడినది. ఆమె నపహరించిన రాక్షసు డేవడో తెలియకున్నది.

సీతను రావణు డపహరించుకొని వెళ్ళెనని జటాయువు చెప్పి నను, లక్ష్మణుడు డీ విధమున సీత నపహరించిన రాక్షసు డెవడో తెలియదని వచించుట వింతగనున్నది.

మరియు లక్ష్మణుడు హనుమంతునితో

శ్లో॥ అహం చైవ హి రామశ్చ సుగ్రీవం శరణాగతౌ. 17

నేనును-రాముడును సుగ్రీవుని శరణుజొచ్చియుంటిమి. రాముడు, 'సుగ్రీవం నాథ మిచ్ఛతి' - సుగ్రీవుని నాథునిగా కోరుచున్నాడు.

'సుగ్రీవం శరణం గతః'-సుగ్రీవుని శరణుజొచ్చినాడు.

'రామో వానరేంద్రస్య ప్రసాద మభికాంక్షతే' - రాముడు సుగ్రీవుని యనుగ్రహము కోరుచున్నాడు.

శ్లో॥ శోకాభి భూతే రామే తు శోకార్తే శరణం గతే,
కర్తు మర్హతి సుగ్రీవః ప్రసాదం హరియూథపః. 24

రాముడు శోకపరవశుడై, శోకార్తుడై శరణుకోరుచుండగా వానరరాజగు సుగ్రీవు డనుగ్రహింప వలయును.

శ్లో॥ ఏవం బ్రువాణం సౌమిత్రిం కరుణం సాశ్రు లోచనం,
హనుమాన్ ప్రత్యువాచేదం వాక్యం వాక్యవిశారదః. 25

అని యిట్లు లక్ష్మణుడు కన్నులనీరునిండగా జాలి కలుగునట్లు పలుకుచుండగా వాక్యవిశారదుడగు హనుమంతు డిట్లు పలికెను.

ఈ విధముగ నొక యాటవికుని, అనాథుని-ధీరుని-రామ లక్ష్మణులు శరణుకోరుచు యాచించుట చూడ, వారిని పరాక్రమవంతులనుట కంటె తమ కార్యసాధనకై యెంతటి హీనగతికైనా దిగజారుటకు వెనుకాడరని విదితమగుచున్నది.

వాలిని చంపుటలోగూడ రాము డెంతటి నైచ్యమునకొడం బడెనో చూడుడు. వాలి జగద్విఖ్యాతమగు పరాక్రమముగలవాడు. అతడు రణమడిగిన వారికి రణమిచ్చువాడు. రాముడు ధైర్య సంయుక్తుడగు పరాక్రమవంతుడైన వాలిని రణమున కాహ్వానించిన, వాలి యతనికి రణమొసంగువాడు గదా! అట్టి వాలిని - మరియొకరితో ద్వంద్వయుద్ధ మొనర్చుచున్న వాలిని, చెట్లచాటునదాగి, పొంచి పొంచి, వాడియగు విష బాణముతో కొట్టిచంపిన రాముడు వీరుడగునా? పరాక్రమవంతుడగునా! శౌర్య-ధైర్య సాహసోపేతుడగునా?

## 4. రామునికి ప్రియమైనది ?

అయోధ్య. 19వ సర్గము :

శ్లో॥ అహం హి సీతాం రాజ్యం చ ప్రాణా నిష్టాన్ ధనా నిచ,
హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతా యా ప్రచోదితః. 7

రాముడు 'నేను సీతను, రాజ్యమును, ప్రాణములను, ధనమును, ఒకరు చెప్పకయే భరతున కిచ్చెదను'.

ఈ మాటలవలన రామునకు సీతకంటెను, రాజ్యమునకంటెను, తన ప్రాణములకంటెను-భరతుడు తన కిష్టుడని తెలియుచున్నది.

అరణ్య. 58వ సర్గము : రాముడు లక్ష్మణునితో

శ్లో॥ పతిత్వ మమరాణాం వా పృథివ్యాశ్చాపి లక్ష్మణ,
తాం వినా తవసీ యాభాం నేచ్ఛేయం జనకాత్మజామ్. 5

నేను జానకిలేక దేవాధి పత్యమునుగాని, భూమండలాధి పత్యమునుగాని యిష్టపడను.

శ్లో॥ యది జీవిత వైదేహీ గమిష్యా మ్యాశ్రమం పునః,
సువృత్తా యది వృత్తా సా ప్రాణాం స్త్యక్ష్యామి లక్ష్మణ. 9

సీత జీవించుచో నేను మరల యాశ్రమమున కేగెదను. లేనిచో ప్రాణములు విడిచెదను. ఈ రెండు వాక్యములందును రామునికి మిక్కిలి ప్రియమైనది సీత యని తెలియుచున్నది.

యుద్ధ. 49వ సర్గము :

శ్లో॥ శక్యా సీతా సమానారీ మర్త్యలోకే విచిన్వతా,
న లక్ష్మణ సమోభ్రాతా సచివ స్సాంపరాయికః. 6

మర్త్యలోకమునందు సీతకు సమమగు నారియు, లక్ష్మణునికి సముడగు సోదరుడును దుర్లభులు.

యుద్ధ. 49వ సర్గము :

శ్లో॥ పరిత్యజ్యా మ్యహం ప్రాణా న్వానరాణాం తు పశ్యతామ్,
యది పంచత్వ మాపన్న సుమిత్రా నన్ద వర్ధనః. 7

లక్ష్మణుడు మరణించిన వానరులు చూచుచుండ ప్రాణముల త్యజింతును.

102వ సర్గము :

శ్లో॥ భ్రాతరం నిహతం దృష్ట్వా లక్ష్మణం రణపాం సుషు,
కిం మే రాజ్యేన కిం ప్రాణై ర్యుద్ధే కార్యం నవిద్య తే. 11
యత్రాయం నిహతశ్శేతే రణమూర్ధని లక్ష్మణః,
దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః. 12
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః.

లక్ష్మణుడు చంపబడిన నాకు యుద్ధముచేతను, రాజ్యము చేతను, ప్రాణములచేతను ప్రయోజనమేమి ?

లక్ష్మణుడు యుద్ధమున చంపబడియుండెను. ప్రతి దేశమందును భార్యలు-బంధువులు నుందురు.

లక్ష్మణుడు లేని రాజ్యమును నేను చూడను.

ఈ మాటలనుబట్టి రామునకు సీతకంటెను లక్ష్మణుడు మిక్కిలి ప్రియుడని తెలియుచున్నది.

అరణ్య. 75వ సర్గము :

శ్లో॥ రాజ్య భ్రష్టేన దీనేన తస్యామాస క్త చేతసా,
కథం మయా వినా శక్యం సీతాం లక్ష్మణ జీవితమ్. 28

రాజ్యభ్రష్టుడనై, అందుచే దీనుడనై ఆ దీనత్వము పోగొట్టుకొనుటకు సీతపై మనస్సు మళ్ళించుకున్నాను. ఆ సీతకూడ లేనిచో నెట్లు జీవింపగలను ?

దీనినిబట్టి రామునకు ప్రియమైనది రాజ్యమేగాని సీత గాదు, రాజ్యమునకు భరతుడు రాజు కాబోవుచున్నందున-సీతను-రాజ్యమును ప్రాణములను భరతున కిచ్చెదననెను. అంతియేగాని భరతునియందు ప్రీతివలన గాదు. అతనికి చేసిన సేవలనుబట్టి భరతునకంటెను లక్ష్మణుడే మిక్కిలి ప్రియుడు.

అరణ్య. 10వ సర్గము :

శ్లో॥ అప్యహం జీవితం జహ్యాం త్వాం వాసీతే స లక్ష్మణామ్,
న తు ప్రజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః. 19

సీతా ! ప్రాణమునుగాని, నిన్నుగాని, లక్ష్మణునిగాని విడుతునే గాని, బ్రాహ్మణులకై చేసిన ప్రతిజ్ఞ విడువలేను.

పై విషయములనుబట్టి కాలానుగుణముగ రామునకు – లక్ష్మణుడు, భరతుడు, సీత, అందఱు ప్రియమైనవారే. కాని వీనికంటెను ప్రియమైనది రాజ్యము. రాజ్యాధిపతియగుటచేతనే భరతుని యందు ప్రియము. సర్వకాల సర్వావస్థలయందును తనకు తోడ్పడిన వాడగుటచే లక్ష్మణుని యందనురాగము. రాజ్యభ్రష్టత యందలి దీనత్వము పోగొట్టుకొనుటకై సీతపై మనస్సు మరలించుకొనినాడని తానే వచించినాడు. దీనివలన నతనికి రాజ్యము ప్రియమైనదని తెలియుచున్నది. "సీతను-లక్ష్మణుని విడుతునే గాని బ్రాహ్మణులకై చేసిన ప్రతిజ్ఞను విడువన'ని చెప్పుటచేతను, ఆ ప్రతిజ్ఞ రాక్షసవధ, రాజ్యమును సంపాదించుట యగుటచేతను రామునకు మిక్కిలి ప్రియమైనది రాజ్యమేనని స్పష్టమగుచున్నది.

## 5 రాజ్యపాలన : (రామరాజ్యం)

**ఉత్తర. 42వ** సర్గము : రాముడు పూర్వాహ్ణమందు ధర్మకార్యములు నిర్వర్తించును. దినము సగభాగమున అంతఃపురమును చేరును.

సీత పూర్వాహ్ణమున దేవకార్యములు చేసి, అత్తల నందఱిని పూజించి, పిమ్మట విచిత్రాభరణములు ధరించి రాముని సమీపించును.

రాము డంతఃపురమునందలి యశోకవనముననే కాలము గడుపును. ఆతడు సీతను తన చేతులతో పట్టుకొని తీయని మేఱయరసమును స్వయముగ త్రాగించును. రాముని యాహారమునకై పరిచారకులు వివిధములగు మాంసములను, ఫలములను, అచటకు గొనితెత్తురు.

అచట నృత్తగీత విశారదులును, సుందరులు-పానవశ్యలు నగు స్త్రీలు రాజు నెదుట నాట్యముచేయుదురు. అలంకారభూతుడగు రాముడు సుందరులగు నా స్త్రీలను రమింపజేయును.

అవసరమైనపుడు చారులచే సమాచారములు వినుచుండును.

వాల్మీకి రామాయణము నందంతటను రాముడు ధర్మాత్ముడు, ప్రజాహితరక్తుడు, సత్యసంధుడు, పరాక్రమోపేతుడు, ఇంద్రియ నిగ్రహుడు, నీతిజ్ఞుడు, విజ్ఞానసంపన్నుడు, సర్వప్రజలయందు సమబుద్ధి గలవాడు మున్నగు పొగడ్తలెన్నియో గన్పించును. (వీనిని గురించి ప్రత్యేకముగ వివరించబడును) మరియు వాల్మీకి, రాముడు రాజ్యమును పాలించుచుండ చక్కగ వర్షములు కురిసెననియు, పంటలు పండెననియు వ్రాసెను. కాని, యతడు ఋషులకొఱకై యుద్ధములు చేయుట, ఋషులను వివిధదానములచే సంతృప్తులను చేయుట మొద లగు విషయములే కన్పించును. అతడు ప్రజలకై యొనరించిన హిత కార్యము లేమియు కన్పింపవు.

రాముని రాజ్యపాలనలో జరిగిన విషయములు .

ఉత్తర. 73, 74, 75, 76 సర్గములు :

ఒక వృద్ధ బ్రాహ్మణుడు, పదునాలుగు సంవత్సరముల వయస్సుగల తన కుమారుడు మరణింప, రాముని యొద్దకు వచ్చి 'నీ దుష్కృతముచేతనే నా కుమారుడు మరణించినాడు. ప్రజలు రాజ దోషముచే విపత్తునందుచున్నారు.'' అని పలికెను. (ఆ బ్రాహ్మణుడు తప్ప రాముని యొద్దకు మనుజులింకెవరు న్యాయార్థమై వచ్చినట్లు కనిపించదు.)

అపుడు ఋషులందఱు కూర్చునియుండ నారదుడు. దుర్బుద్ధి యగు శూద్రుడొకడు తపస్సుచేయుచున్నాడనియు, అందుచే నా బాలుడు మరణించెననియు తెలిపెను. అపుడు రాముడా శూద్రుని చెంతకుబోయి, తపమేల చేయుచున్నావనియడుగ, నతడు దేవలోకము

నకు పోదలచి తపముచేయుచున్నానని ప్రత్యుత్తరమిచ్చెను. వెంటనే రాము డతని శిరస్సును ఖండించెను.

ఈవిధముగ నెచటనో యేకాంతమున, నెవరికిహానియు గోఱక తపమొనర్చు నొకనిని చంపుట యుచితమా ? అది ధర్మరక్షణయా ?

"శూద్రుడు తప మొనర్చిన, అది ధర్మహానియైనచో నా కీడు రాజునకు, రాజవంశమునకు కలుగవలయును. కాని బ్రాహ్మణుని పుత్రుడేల మరణించును ?"

అని ఆలోచనయు చేయక, ఋషులు వచించినంతనే రొుక శూద్రుని చంపిన రాముడు-ధర్మాత్ముడు, ప్రజాహితుడు, విజ్ఞానవంతుడు అనుట ఎంతవఱకు సమర్థనీయము ?

ఉత్తర. అధికపాఠము 11, 12 సర్గములు :

ఒకనాడు రాముడు సభనేర్పాటుచేసియున్న సమయమున నొక శునక మతనియొద్దకువచ్చి "రాజా ! నేను సర్వార్థసిద్ధియను బ్రాహ్మణుని చెంత వసించుచుందును. అతడు నిష్కారణముగ నన్ను కొట్టెను" అని పలికెను. అపుడు రాము డా బ్రాహ్మణుని పిలిపించి, శునకమును కొట్టిన కారణమడుగ నత డిట్లు వచించెను.

రాజా ! భిక్షార్థము తిరుగుచున్న నాకు భిక్షలభించకపోగా వీధియందు నేను శ్వానమువలె పో పొమ్మని చెప్పబడితిని. భిక్షకుడ నగు నేను వీధియందు స్వేచ్ఛగానడచుటకు విషమపరిస్థితి యందుంటిని. అపుడు నేను ఆకలిచేతను-కోపముచేతను యీ శునకమును కొట్టితిని.

అపుడు రాముడు ఋషులతోను, పండితులతోను, ఆ బ్రాహ్మణునకు తగిన శిక్ష యేమి ? అని యడుగ, దురు 'శిక్షలచే బ్రాహ్మణు డవధ్యుడ'ని పలికిరి. అపుడుశునకము రామునితో 'నా బ్రాహ్మణునకు కులపతిత్వము నొసంగుము'ని పలికి, తత్కారణము వివరించ, రాము డావిధముగ నొనర్చెను.

దీనినిబట్టి రామరాజ్యమందు భిక్షకులుండిరనియు, వారికి పురమందు భిక్షయును లభించుట లేదనియు, గృహస్థులు భిక్షకులకు

భిక్షయొసగకపోగా అతినీచముగా వారిని నిందించుచు వీధులయందు శునకములవలె చూచుచుండిరనియు, భిక్షకులు (నిరుపేదలు) వీధుల యందు స్వేచ్ఛగా సంచరించలేని విషమస్థితి యందుండిరనియు తెలయు చున్నది.

ఇట్టి రాజ్యము సుభిక్షమగు రాజ్యమగునా? సరియగు వర్షములు కురిసి పంటలు బాగుగ పండుచుండ గృహస్థులు బిచ్చగాండ్ర నేల పీడ రించుకొందురు? కనుక వాల్మీకి రాముని యందలి ప్రీతిచే రాముని పలు విధముల స్తుతించెనే కాని, రామరాజ్యము దుస్థితిలో నున్నదని తెలియుచున్నది.

ఉత్తర అధికపాఠము 19వ సర్గములు :

ఒక దిన మొక గ్రద్ద-ఒక గుడ్లగూబ-ఒక నివాసమునుగూర్చి, నాది-నాదియని కలహించుకొని రాముని యొద్దకు తీర్పుకై వచ్చినవి. రాముడు వాని వివాదమును విని, మంత్రులతో నాలోచించి గ్రద్దదే యపరాధమని నిర్ణయించెను.

వీని నన్నిటనిబట్టి రాముడు దయకాలములందు పూజాపున స్కారములతో గడిపి, పిమ్మట కొలదిసేపు పురోహిత మంత్రులతో గడిపి, పిదపకాలమంతయు స్త్రీలతోనే గడిపెడివాడని తెలియు చున్నది.

రాజ్యమును, రాజ్యపాలనను, రాజును గురించి
రాముడు వచించిన మాటలు చూడుడు.

అయోధ్య. 26వ సర్గము : రాముడు సీతతో

శ్లో॥ ఆరాధితా హి శీలేన ప్రయత్నైశ్చోపసేవితాః,
రాజానః సంప్రసీదంతి ప్రకుప్యంతి విపర్యయే. 35
ఔరసాన్యపి పుత్రాన్ హి త్యజం త్యహితకారిణః,
సమర్థాన్ సంప్రగృహ్ణంతి జనా నపి నరాధిపాః. 36

రాజులు అనుకూలముచేతను, ప్రయత్నముచేతను, ఆరాధింప బడుచో ననుగ్రహింతురు. విపర్యయమందు కోపగింతురు.

రాజులు అహితమునుచేసిన పుత్రులనైనను త్యజింతురు. సమర్థులగు జనులను స్వీకరింతురు. ఇందు రాజుల నిరంకుశత్వమును, నిర్దాక్షిణ్యము గోచరించుచున్నవి.

50వ సర్గము : రాముడు గుహుని గాంచినంతనే

శ్లో॥ దిష్ట్యా త్వాం గుహ పశ్యామి హ్యరోగం సహ బాంధవైః,
అపి తే కుశలం రాష్ట్రే మిత్రేషు చ ధనేషు చ. 42

గుహా ! అదృష్టముచే నిన్ను చూచుచున్నాను. నీ బంధువులు సేమమా ? నీ రాష్ట్రమందు మిత్రులు, ధనము కుశలమా ?

అయోధ్య. 52వ సర్గము :

శ్లో॥ అప్రమత్తో బలేకోశే దుర్గే జనపదే తథా,
భవేథా గుహ రాజ్యం హి దురా రక్షతమం మతమ్. 72

గుహా ! బలమునందును, కోశమునందును, దుర్గమునందును, జనపదమునందును అప్రమత్తుడవైయుండుము, రాజ్యము కష్టముచే రక్షించదగినది.

ఈ విధముగ గుహుని ప్రశ్నించిన రాముడు, గుహుని ప్రజలను గురించిగాని, ప్రజల కష్టసుఖములను గురించిగాని, ప్రజాసమస్యలను గురించిగాని యే మాత్రము ప్రశ్నించలేదు.

అదే విధముగ భరతుని కుశలప్రశ్నలడుగు సందర్భమునను, తల్లిదండ్రుల కుశలము అడిగిన పిమ్మట గురువులను – పురోహితులను గురించి యడిగి, రాజ్యవిషయములు అనగా మంత్రులను గురించి – వారి కార్యనైపుణ్యమును గురించి, రహస్యాలోచనచేయు విధానమును గురించి, పండితులను గురించి, ప్రజలకు శిక్షలువిధించుటను గురించి – సేనాపతి – సైన్యములను గురించి – క్షత్రియుల గురించి, దుర్గరక్షణల గురించి–ఆదాయ–వ్యయముల గురించి ప్రశ్నలడుగుచు సలహాలనిచ్చెను. ధనవంతుల రక్షణను గురించి ప్రశ్నించెను. కాని ప్రజలను గురించికాని, కర్షకులను–పేదలను గురించిగాని వారి కనీసావసరములను గురించిగాని, వారి సేమమును గురించికాని యే మాత్రము ప్రశ్నించలేదు.

దీనినిబట్టి రామునకు ప్రజలయందెట్టి యనురాగముగలదో వ్యక్తమగుచున్నది.

రాముడు పూజించినది. విరివిగా దానములు చేసినది ఋషులకు, ద్విజులకు, పురోహితులకు, రాము డెచటనున్నను వారి సేమములరసెను. వారి యాజ్ఞలు, ధర్మాధర్మవిచక్షణ మాని, పాటించెను. అందుచే వారు రాముని తాము పొగడగలిగి నంతవఱకు పొగిడిరి. అతనిని గురించి చేయ గలిగి నంతవఱకు ప్రచారముచేసిరి. అంతియేగాని రామాయణ మెంత వెదకినను రాముడు ప్రజలకు చేసినమేలు శూన్యము.

## 6. రాముని ప్రగల్భములు :

రాముడు, రాజ్యము భరతునికి సంక్రమింపవలయునని తెలిసియు, తండ్రి కనుకూలుడుగ వర్తించి, రాజ్యాభిషేకము పొందబోవు సమయానికి, నిజముబ్రద్దలై, రాజ్యాధికారమునకు భరతు డర్హుడుగ ప్రకటింపబడి, రామునికి దండకారణ్య గమనము సంప్రాప్తమగును. అప్పుడు రాముడు కైకతో

అయోధ్య. 19వ సర్గము :

శ్లో॥ అహం హి సీతాం రాజ్యం చ ప్రాణా నిష్టాన్ ధనాని చ,
హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతా యాప్రచోదితః. 7

నేను సీతను, రాజ్యమును, ప్రియములగు ప్రాణములను, ధనమును, ఒకరు చెప్పకయే స్వయముగ సోదరుడగు భరతున కిచ్చెదను.

రాజ్యమును రాముడు సంపాదించలేదు. తండ్రి అతని కీయలేదు. అట్టియెడ తనకే లేని రాజ్యమును తాను భరతున కిచ్చుటేమి?

అయోధ్య. 23వ సర్గము :

శ్లో॥ ఏకోహ్యాహ మయోధ్యాం చ పృథివీం చాపి లక్ష్మణ,
తరేయ మిషుభిః క్రుద్ధో నను వీర్య మకారణమ్. 25

లక్ష్మణా! క్రోధము నొందినచో నే నొక్కడనే బాణములచేత నయోధ్యను, పృథ్విని దాటగలను.

99వ సర్గము :

శ్లో॥ నేయం మమ మహీ సౌమ్య దుర్లభా సాగరామ్బరా. 7

సాగర వసనయగు నీ భూమి నాకు దుర్లభమైనది గాదు.

రాము డింతటి పరాక్రమవంతుడైయెనచో విరాధుడు సీత నెత్తుకొని పోవుచుండ దీనుడై కన్నీరుగార్చుచు విలపించుటేల? కబంధుడు తనను, తన తమ్ముని బాహువులలో బంధించ, నోటితడియారి వగచుటేల? అతనితో శోకార్తులము, అనాధులము, దయదలచుమని వాపోవుటేల! రావణుడు సీతను గొనిపోవ సుగ్రీవుని ప్రాపుకై ప్రాకులాడుటేల?

అరణ్య. 7వ సర్గము : రాముడు సుతీక్ష్ణునితో

శ్లో॥ అహమే వాహరిష్యామి స్వయంలోకా న్మహామునే,

ఆవాసం త్వహ మిచ్ఛామి ప్రదిష్ట మిహ కాననే. 14

ఓ మహామునీ! నేనే స్వయముగా లోకములను సంపాదింపగలను. ఈ అరణ్యమున నీచే నిర్దిష్టమగు నివాసమును కోరుచున్నాను.

అరణ్య. 11వ సర్గము : రాము డగస్త్యునితో

శ్లో॥ కిం తు వ్యాదిశమే దేశం సోదకం బహుకాననమ్,

యత్రాఽఽశ్రమపదం కృత్వా వసేయం నిరతస్సుఖమ్. 11

జలసమృద్ధము, కాననబహుళము, నిరతము సుఖమును కలిగించునట్టిది యగు ప్రదేశమును తెలుపుడు. నే నచట నాశ్రమము నిర్మించుకొని వసింతును.

## లోకములను సంపాదించు శక్తిగలవానికి నివాసస్థల మొకరు తెలుపవలయునా?

అరణ్య. 7వ సర్గము : సుతీక్ష్ణుడు రామునితో

శ్లో॥ ఇమ మాశ్రమ మాగమ్య మృగసంఘా మహాయశః,
అటత్వా ప్రతి గచ్ఛంతి లోభయిత్వాऽకుతో భయాః,
నాన్యదోషం భవే దత్ర మృగేభ్యోऽన్యత్ర విద్ధివై. 18

కీర్తిశాలీ! మృగసంఘము లీ యాశ్రమమునకు వచ్చి తిరుగుచు, ఆశను గొలిపి, భయరహితములై తిరిగిపోవుచున్నవి. ఆ మృగముల వలననే దోషమును లేదు.

శ్లో॥ తచ్ఛ్రుత్వా వచనం తస్య మహర్షే ర్లక్ష్మణాగ్రజః,
ఉవాచ వచనం ధీరో వికృష్య సశరం ధనుః. 19

రాముడా మునిమాటలు విని ధీరుడై వింట బాణముసంధించి యిట్లు పలికెను.

శ్లో॥ తా నహం సుమహాభాగః మృగసంఘాం త్సమాగతాన్,
హన్యాం నిశిత ధారేణ శరేణాశ నివర్చసా. 20

ఓ మహాభాగ! నే నిచటకు వచ్చిన మృగసంఘములను పిడుగు వంటి వాడిబాణములతో చంపెదను.

సుతీక్ష్ణుడా మృగములవలన నే యాపదయు లేదని పలుక, రాముఁడు వింటిని ధీరుడై బాణముతో నెక్కుపెట్టుటేమి! మృగసంఘ చంపుదు ననుటేమి!

అరణ్య, 64వ సర్గము! సీతను రావణు డపహరించి తీసికొని మరల పోయిన సమయమున,

శ్లో॥ తతో దాశరథీ రామఉవాచ చ శిలోచ్చయమ్,
మమ బాణాగ్ని నిర్దగ్ధో భస్మీ భూతో భవిష్యసి. 33
ఇమాం వా సరితం చాద్య శోషయిష్యామి లక్ష్మణ.

రాము డా పర్వతముతో నిట్లనను. నీవు నా బాణాగ్నిచే తగులబడి భస్మము కాగలవు....లక్ష్మణా! ఈ నది నిపుడు శోషింప జేయుదును.

శ్లో॥ మమాస్త్ర బాణసంపూర్ణ మాకాశం పశ్య లక్ష్మణ. 59
నిస్సంపాతం కరిష్యామి హ్యద్య త్రైలోక్య చారిణామ్,
సన్నిరుద్ధ గ్రహగణ మావారిత నిశాకరమ్. 60
విప్రణష్టానం మరుద్భాస్కర ద్యుతి సంవృతమ్,
వినిర్మథిత శైలాగ్రం శుష్యమాణ జలాశయమ్. 61
ధ్వస్తద్రుమలతా గుల్మం విప్రణాశిత నాగరమ్,
త్రైలోక్యం తు కరిష్యామి సంయుక్తం కాలకర్మణా. 62

లక్ష్మణా! నా శస్త్రాస్త్రములచే నాకాశమును నిండించి త్రిలోకసంచారులు సంచరింపకుండు నట్లు చేసెదను.

గ్రహసముదాయము కదలకుండునట్లు, చంద్రునిగమనము నిరోధింపబడునట్లు, అగ్ని-వాయువులు నశించునట్లు, సూర్యకాంతి మరుగుపడునట్లు, గిరిశిఖరములు విఱుగగొట్టినట్లు, సముద్రము ఇంకునట్లు, చెట్లు-తీగలు-పొదలు పాడగునట్లు నగరములు నశించునట్లుచేయుదును. ముల్లోకములను నాశనముచేతును.

శ్లో॥ నాశయామి జగత్సర్వం త్రైలోక్యం సచరాచరమ్. 71

చరాచర సహితము త్రిలోకములతో కూడినదియగు జగమెల్ల నాశనము చేసెదను.

సదేవ గంధర్వ మనుష్య పన్నగం జగత్సశైలం పరివర్తయామ్యహం. 75

గంధర్వ-మనుష్య-పన్నగములతోను, శైలములతో డనుగూడిన యీ గజగమునంతటిని నాశనము చేతును.

విరాధుడను ఒక్క రాక్షసుడు-తన భార్యను చంకనెత్తుకొని పోవుచుండ దీనుడై విలపించిన రాముడు, కబంధు డను నొక్క-రాక్షసుడు తనను, తన సోదరుని బాహువులందు బంధించ, నోటకడియాంకి గొల్లున గోలపెట్టిన రాముడు యిట్టి కాని పనులు చేయగలడా? రాము డీ విధముగ ప్రగల్భములు పలికి,

అరణ్య. 66వ సర్గము :

శ్లో॥ తం తథా శోక సంతప్తం విలపం తమనాథవత్,

మోహేన మహతాఽఽవిష్టం పరిద్యూన మచేతనమ్. 1

తతస్సౌమిత్రి రాశ్వాస్య ముహూర్తా దివ లక్ష్మణః.

శోకసంతప్తుడై, యనాథునివలె విలపించుచు మహామోహము నొంది, రోదించుచు, మనస్సున చీకాకుపడియున్న రాముని, ఒక్క ముహూర్తములో లక్ష్మణు డోదార్చెను.

యుద్ధ. 3వ సర్గము : రాముడు హనుమంతునితో

శ్లో॥ తపసా సేతు బన్ధేన సాగరో చ్ఛోషణేన వా,

సర్వథా సు సమర్థోఽస్మి సాగర స్యాస్య లఙ్ఘనే. 2

తపస్సుచేసిగాని, సేతువుకట్టిగాని, సముద్రము నెండింపజేసి గాని, యీ సముద్రమును పాట సమర్థుడను.

యుద్ధ. 21వ సర్గము : రాముడు లక్ష్మణునితో

శ్లో॥ చాప మానయ సౌమిత్రే శరాం శ్చాశీ విషోపమాన్,

సాగరం శోష యిష్యామి పద్భ్యాం యాన్తు ప్లవఙ్గమాః. 22

అద్యాక్షోభ్య మపి క్రుద్ధః క్షోభయిష్యామి సాగరమ్,

వేలాసు కృతమర్యాదం సహసోర్మి సమాకులం, 23

నిర్మర్యాద కరిష్యామి సాయకై ర్వరుణాలయమ్,

మహార్ణవం క్షోభ యిష్యే మహాదానవ సఙ్కులమ్. 24

లక్ష్మణా! సర్పములవంటి బాణములను. ధనస్సును తెమ్ము. సముద్రము నింకింపజేసెద. వానరులు పాదములతో (నడచి) పోవుదురు గాక!

ఇపు డీ సముద్రమును క్షోభింపచేసెదను. ఈ సముద్రమును బాణములచే తీరములేని దానిగా చేసెదను. సముద్రమును కల్లోల పఱచెదను.

22వ సర్గము :

శ్లో॥ అద్య త్వాం శోషయిష్యామి సపాతాళం మహార్ణవ. 1
శర నిర్దగ్ధతో యస్య పరిశుష్కస్య సాగర,
మయాశోషిత సత్త్వస్య పాంసు రుత్పద్యతే మహాన్. 2

ఓ మహాసముద్రమా! నిన్ను పాతాళము వఱకు శుష్కింప జేయుదును బాణములచే దగ్ధమైన దేహముగలిగి శోషించిన సత్వము గల నీయందు దుమ్ము రేగ గలదు.

శ్లో॥ మత్కార్ముక విసృష్టేన శరవర్షేణ సాగర,
పారం తేఽద్య గమిష్యన్తి పద్భిరేవ ప్లవఙ్గమాః. 3

నా వింటినుండి వదలబడిన బాణవర్షముచే ప్లవంగములు కాలి నడకనే నీ యావలి తీరమును చేరగలవు.

రాము డింతటి సమర్థుడైనచో హనుమంతునితో

యుద్ధ. 1వ సర్గము :

శ్లో॥ సర్వథా సుకృతం తావత్సీతాయాః పరిమార్గణమ్,
సాగరం తు సమాసాద్య పునర్నష్టం మనోమమ. 16
కథం నామ సముద్రస్య దుష్పారస్య మహామ్భసః,
హరయో దక్షిణపారం గమిష్యన్తి సమాహితాః. 17

నీవు సముద్రమును దాటి సీతను వెదకుట యనునది అన్ని విధముల మంచికార్యమే. కాని నా మనస్సు పాడయినది.

అంతులేని జలముగల సముద్ర దక్షిణతీరమును వానరులు నెమ్మదిగ నెట్లుచేరగలరు ?

శ్లో॥ ఇత్యుక్త్వా శోక సంభ్రాన్తో రామ శ్శత్రు నిబర్హణః. 19

ఇట్లు పలికి శత్రునిషూదనుడగు రాముడు శోకముచే భ్రాంతు డయ్యెను.

యుద్ధ. 21వ సర్గము :

శ్లో॥ అద్య మే మరణం వాథ తరణం సాగరస్య వా. 8

ఇతి రామో మతిం కృత్వా మహాబాహు ర్మహోదధిం,
అధిశిశ్యే స విధివత్ప్రయతో నియతో మునిః. 9

ఇపుడు నాకు మరణముగాని, సముద్రతరణముగాని కావలయు నని మనస్సున దలచి, శాస్త్రవిధిగ నియత మునియై పరుండెను.

శ్లో॥ తస్య రామస్య సుప్తస్య కుశాస్తీర్ణే మహీతలే,
నియమా దప్రమత్తస్య నిశాస్తిస్రోఽతి చక్రముః. 10

నేలయందు దర్భాస్తరణయందు నప్రమత్తుడై పరుండిన రాముని కట్లు మూడురాత్రులు గడిచెను.

శ్లో॥ స త్రిరాత్రోషిత స్తత్ర నయజ్ఞో ధర్మవత్సలః,
ఉపాసత తదా రామ స్సాగరం సరితాం పతిమ్. 11

నయజ్ఞుడు, ధర్మవత్సలుడగు రాము డచట మూడు దినము లుండి పిమ్మట నదీపతియగు సముద్రు నుపాసించెను.

ఈ విధముగ సీతజాడయే తెలియదని విలపించిన రాముని కట్లు సముద్రమునుదాటి లంకకువెళ్ళి, రాక్షసులచే రక్షితమైయున్న సీతను చూచివచ్చి సీతజాడ తెలుప, "సముద్రమును దాటుటెట్లు" అని వికలిత మనస్కుడైన రాముడు, సముద్రమును శుష్కింపజేయగల సమర్థుడా? అంతటి సమర్థుడేయైన సముద్రతీరమున పడిగాపులుగాయుటేల ? సము ద్రుని పూజించుటేల ?

ఈ సందర్భమున కొందఱు, మొదట రాముడు సముద్రుని పూజించ, సముద్రుడు దారి యీయనందున సముద్రమును కల్లోల పఱచ సంసిద్ధుడయ్యెను అని వచింతురు. కాని సముద్రము నాతడు కల్లోలపఱచగలడా ? అని సందేహింపరు.

అట్టి ప్రగల్భములు పలికి రాము డొకసారి యుగ్రశరములను సముద్రజలములలోనికి వదలెను. రాముని ప్రగల్భముల వినుచున్న వానరశ్రేష్ఠులు నిజముగ రాముడు సముద్రము నింకింపజేయునేమోయని ఱెప్పలార్పక జూచుచుండిరి. సముద్రజలములలో యేమార్పును లేదు.

రాముడు తీవ్రకోపమును చెంది సముద్రముపై మరలా శరములు సంధించుటకు ప్రయత్నము చేయుచుండ, వానరుల యెదుట నవ్వుల పాలు గాబోవుచున్న వీరాగ్రేసరుడగు అన్న పరిస్థితినిగాంచి, లక్ష్మణుడు తన విచక్షణా జ్ఞానముతో అన్న వింటిని పట్టుకొని వలదు వలదు. బాణములు సంధించకుమని వారించి, రాముని పరువు-ప్రతిష్ఠలను గాపాడెను.

యుద్ధ. 18వ సర్గము : రాముడు సుగ్రీవునితో

శ్లో॥ పిశాచా న్దానవాన్యక్షా న్పృథివ్యాం చైవ రాక్షసాన్,
అఙ్గుళ్యగ్రేణ తాన్హన్యా మిచ్ఛ న్హరి గణేశ్వర. 23

పిశాచులను, దానవులను, యక్షులను, భూమియందలి రాక్షసులను, తలచినచో, బొటనవ్రేలికొనతో చంపగలను.

రాము డంతటి సమర్థుడైయైనచో వాలిని, చెట్టుచాటునదాగి, దొంగవలె-భీరువువలె విషబాణముతోకొట్టి చంపుటేల? రావణాది రాక్షసుల చంపుటకు, సుగ్రీవుని సహాయమునకై యతని పడిపంచల గాయుటేల?

ఉత్తర. 98వ సర్గము : సీత భూమిలోనికేగగా, రాముడు

శ్లో॥ ఆనయత్వం హి తాం సీతాం మత్తోఽహం మైథిలీకృతే,
నమే దాస్యసి చేత్సీతాం యథారూపాం మహీతలే. 9
స పర్వత వనాం కృత్స్నాం విధమిష్యామి తే స్థితిమ్,
నాశయిష్యామ్యహం భూమిం సర్వమాపో భవత్విహ. 10

సీతను నాకు తెమ్ము. భూమియందున్నరీతిగ సీతను నాకీయవేని, పర్వతవనములతోగూడిన నీ స్థితినంతయు నాశనము చేయుదును. నాశనముచేసిన భూమియంతయు జలమయమగు గాక.

యుద్ధ. 101వ సర్గము : రావణుడు లక్ష్మణునిపైకి శక్తి ప్రయోగించ

తా మనువ్యాహర చ్ఛక్తి మాపతంతీం స రాఘవః,
స్వస్త్యస్తు లక్ష్మణాయేతి మోఘా భవ హతోద్యమా. 33

రాముడా వచ్చుచున్న శక్తి ననుసరించి 'లక్ష్మణునకు స్వస్తి యగుగాక, నీ ప్రయత్నము వ్యర్థమగుగాక' అని పలికెను. కాని ఆ శక్తిచే లక్ష్మణుడు హృదయము భేదింపబడి నేలపడెను.

యుద్ధ. 80వ సర్గము : ఇంద్రజిత్తు, తన బాణజాలములచే రామలక్ష్మణుల నిశ్చేష్టులజేసి, వానరశ్రేష్ఠుల ప్రాణములు హరించ, నిర్వీర్యులై ధరణీతలమున బడి రాముడు-లక్ష్మణునితో

శ్లో॥ యద్యేష భూమిం విశతే దివం వా
రసాతలం వాపి నభస్థ్సలం వా,
ఏవం నిగూఢో౽పి మమాస్త్ర దగ్ధః
పతిష్యతే భూమితలే గతాసుః 42

ఇతడు భూమినిగాని, స్వర్గమునుగాని, పాతాళమునుగాని, ఆకాశమునుగాని ప్రవేశించినను, దాగియుండినను నా యస్త్రముచే దగ్ధుడై చచ్చి భూమియందు పడగలడు.

అంతట శక్తిసామర్థ్యములు గల వాడే యైనచో నింద్రజిత్తు బాణములచే నేలపడనేల ?

శ్లో॥ రాక్షసం నిహనిష్యంతి దృష్ట్వా వానర యూధపాః. 41

"ఇతనిని వానరశ్రేష్ఠులు చూచిరేని బలవంతముగ చంపగలరు" అని వానరుల సహాయమునకై తహతహపడనేల !

## 7. రాజనీతి :

రాముడు రాజనీతి విశారదుడు. మునులయొద్ద తన తండ్రి యొద్ద కొలదిగ నభ్యసించిన రాజనీతికి, తన మేధస్సుతో పదును పెట్టి, పరిణతిజెంది రాటుదేలిన రాజనీతి విశారదుడై రాణించెను.

విశ్వామిత్రుడు తనను యాగరక్షణకు గొనిపోవుచు తెలిపిన అగస్త్యాది ఋషులచరిత్రలు జాగ్రత్తగ పరిశీలించెను. వారు ఋషుల క్షేమములో దక్షిణాపథ రాజ్యముల నాక్రమించుచున్న విధానము.

యజ్ఞయాగాదులపేరుతో తమకు వ్యతిరిక్తులగు రాక్షసులను కొన్ని చోటుల తామే చంపుచు, తమ బలమునకు మించినవారని తలచి నపుడు, తనవంటి క్షత్రియవీరుల తోడ్పాటుతో వారిని చంపించుచు నార్యసామ్రాజ్యవిస్తారణకు, ఆర్యధర్మప్రచారమునకు ఆ ఋషు లొనర్చు యత్నములు చూచెను. అందువలననే యతడెల్లపుడు ఋషులతోనే మసలెను. వారినుండి బలవత్తరమగు నాయుధములు గ్రహించెను. ఋషుల యాజ్ఞలను, ధర్మాధర్మ విచక్షణమాని పాటించెను.

రాజ్యము భరతునకు సంక్రమింపవలయునని తెలిసియు, తన తండ్రి-భరతుని మేనమామతో కేకయ రాజ్యమునకు బంప, నతడు తనకై చేయుచున్న ప్రయత్నము గ్రహించినవాడై, తన తండ్రిని మిక్కిలిగ గౌరవించెను. తల్లులను, మంత్రులను, పురోహితులను గౌరవించి, వారి కార్యముల నేమరక నిర్వర్తించెను. తన క్షేమియు తెలియునట్లు, తండ్రియాజ్ఞల పాటించుచు, తన పట్టాభిషేకమున కాయుతుడయ్యెను. కాని చిట్టచివరకు, తండ్రి-తనయుల మంత్రాంగ మును గ్రహించిన కైకేయి, దశరథుని యాజ్ఞగ రామునకు పదు నాలుగేండ్ల వనవాసము విధించెను. దశరథు డెంత గోల్లుమన్నను, అతని దుర్నీతిని గ్రహించిన కైకేయి తన వాక్కును వీడనందున, రాముడు వనవాసగతుడుగాక తప్పలేదు. అట్టి సమయమున దోష మంతయు తన తండ్రియందు గన్పట్టి, తన గుట్టుబట్టబయలు కాక ముందే, రాముడు నేర్పుతో తన తండ్రియాజ్ఞను నిర్వర్తించు వాని వలె వనమున కేగుటకు సుముఖత జూపెను. ప్రజలయాదరణను ప్రతిఫలముగ పొందదలచినవాడై, కనపడినవారెల్లరతో తాను తండ్రియాజ్ఞను పాలించుటకై వనముల కేగుచున్నాననియు, అచట పదునాలుగు వత్సరములు, దుంపలు, ఫలములు తినుచు గడపెద ననియు వచించెను.

పిమ్మట వనములకేగి తన వనవాసకారకులైన తల్లిదండ్రులను నిందించుచు చక్కగా జంతువుల చంపి మాంసమును భక్షించుచు కాలముగడిపెను.

తరువాత భరతుడు వచ్చి రాజ్యము స్వీకరించుమని రాముని కోరెను. కాని భరతుని ధర్మవర్తనను జనులు పొగడుచుండ, తాను ప్రజలచేత-మంత్రులచేత, ఋషులచేత ఋజువర్తనుడుగ గుర్తింప జేయదలచి, రాజ్యమును స్వీకరించక, రాజ్యము తన చేజారిపోకుండు నట్లు, తన పాదుకలను తన ప్రతినిధిగ భరతుని కొసగెను.

అరణ్య. 57వ సర్గము : రాముడు మృగమును చంపి పర్ణశాలకు తిరిగి వచ్చుచు

శ్లో॥ "జనస్థాన నిమిత్తం హి కృతవైరోఽస్మి రాక్షసైః. 9

జనస్థాన నిమిత్తమై రాక్షసులతో విరోధము చేసికొంటిని. రాముని యీ మాటలచే, రాముడు కావలయుననియే రాక్షసులతో విరోధము తెచ్చుకొనినట్లు కన్పించుచున్నది. రాము డింతకుపూర్వమే దండకాటవియందు చరించుచు నచట ఋషులతో రాక్షసుల వధి యింతున'ని పలికెను. అందువలన, రాక్షసులతో యుద్ధమునకై తగిన కారణము వెదకుసమయమున, తమ పర్ణశాలకు రావణుని సోదరి శూర్పణఖ-మదనబాణపీడితయై వచ్చి తనను వివాహమాడుమని కోరెను. రాముడు, తమ్మునితోగూడి యామె నాటలుపట్టించి, చివరకు విరూపిగనొనర్చి, రాక్షసులతో రణమునకు నాందిపలికెను. దానికి ప్రతిఫలముగ రావణుడు సీతను గొనిపోయెను.

బలవంతుడగు రావణుని జయించుటకు, తనకు తమ్ము డొకడు తప్ప వేరెవ్వరు సహాయములేని రాముడు పన్నిన వ్యూహరచనా కౌశలమెంతయు శ్లాఘనీయము.

వాలి-సుగ్రీవుల వైరము నెఱిగిన రాముడు, తనవలె భార్యను గోల్పోయి యడవుల సంచరించు మరియొక నిర్భాగ్యుడగు సుగ్రీవుని

జేరి వానితో స్నేహ మొనర్చెను. రావణుడు తన భార్యను గొంపో యిన విషయము సుగ్రీవునకు తెలిపిన, తా నతనిముందు చులకన యగుదునేమోయని తలచి, తన భార్యనెవరో రాక్షసుడు గొనిపోయి నాడని వచించెను. సుగ్రీవుడును, రామునిచే ముందుగా తన యన్నను చంపించి సింహాసన మాక్రమించదలచినవాడై, రావణుని నివాసము తనకు తెలియదనియు, అన్ని విధముల సీతను వెదకించి తెచ్చి రామున కప్పగించెదననియు పలికెను. రామునకును రావణుని చంపుటకు సైన్య బల మవసరము. అందుచే రాముడు, రావణుని కంటెను బలవంతు డగు వాలిని ధర్మయుద్ధమున జయించుట, దుస్సాధ్యమని తలచినవాడై, సుగ్రీవునితో రణ మొనరింపజేసి-రణ మొనర్చువాలిని, చెట్లమాటున దాగి విషబాణముతో గొట్టి చంపెను. కిష్కింధలోని ప్రజలందఱు, తమకు వాలితో నెంతటి సంబంధముగలదో సుగ్రీవునితోను అంతట సంబంధముగలవారగుటచే సుగ్రీవుడు సులభముగ కిష్కింధకు రాజయ్యెను.

కృతజ్ఞుడగు సుగ్రీవుని స్నేహములభించుటచే, ఆయుధబలము గల రామునకు సైన్యబలముకూడ తోడయ్యెను. సుగ్రీవుని తోడ్పాటుచే నతని బంధుమిత్రుల బలములుగూడ రాముడు సమీకరింప జేసెను.

రణనీతికోవిదుడగు రాముడు, అనేక యుద్ధముల నారితేరిన ప్రతాపశాలియగు రావణుని సైన్య-ఆయుధ బలపరాక్రమములు తెలిసికొనగోరి, అన్నిట ఆరితేరిన సమర్థుడగు హనుమంతుని చారునిగ లంకకుపంపెను. హనుమంతుడు చారుడుగ తనవిధిని పూర్తిగ నిర్వర్తించుటయే గాక సీతను జూచి-ఆమె శుభసందేశమును రామునకు గొనివచ్చెను.

సుగ్రీవుడు, రామునిచే, తన యన్నను చంపించి రాజ్యమును సంపాదించుట గ్రహించిన విభీషణుడును-అరివీర పరాక్రముడగు

తనయున్న రావణుని రామునిచే చంపించి, రాజ్యము పొందదలచిన వాడై రాముని యాశ్రయించెను. విభీషణుని తలపు గ్రహించిన - రాముడతని చేరదీసి - లంకారహస్యములన్నియు నతనిచే గ్రహించి, అతని తోడ్పాటుతో నతని బంధుమిత్రులను - రాక్షసుల నందఱిని చంపి, రాక్షసశూన్యము-నిర్వీర్యమునగు లంకాపురి కతనిని రాజును గావించెను.

ఈవిధముగ మూలబలములేని రాముడు, మహాబలవంతుడగు రావణుని బంధుమిత్ర సైనికులతోకూడ నాశన మొనర్చుట యతని గణనీయమగు రాజనీతికి నిదర్శనము.

పిమ్మట తనకు ప్రతినిధిగ తన పాదుకలను భరతునకిచ్చి రాజ్యము పాలింపజేసిన రాముడు, తన రాజ్యమగు నయోధ్యకుజేరి పట్టాభిషిక్తుడై తన చరిత్రను సార్థకముజేసికొనెను.

## 8. రాముని గూర్చి యొక వింత సంఘటన :

రాముని యాదేశముపై సుగ్రీవు డొకసారి - వాలితో రణ మొనర్చి పారిపోయి ఋష్యమూకముచేరెను. అచట రాము డతనికి ధైర్యముచెప్పి, మరియొకసారి వాలితో రణమొనర్చుమనియు, తాను తప్పక వాలిని చంపెదననియు ధైర్యముచెప్ప, సుగ్రీవుడు తన మంత్రులతోను, రామలక్ష్మణులతోను కిష్కింధకు బయలుదేరెను. మార్గమున రాము డొక దట్టమగువనమును జూచి, సుగ్రీవునితో "మిత్రమా! ఈ వనమును గురించిన విశేషమేమి?" అని యడుగ, సుగ్రీవు డతనితో నిట్లు వచించెను.

కిష్కింధ. 13వ సర్గము :

శ్లో॥ అత్ర సప్తజనా రామ మునయ స్సంశిత వ్రతాః,

సప్తై వాస న్నధశ్శిరా నియతం జలాశాయినః. 18

ఈ యాశ్రమమునందు సప్తజనులను మును లేడుగురు నివసించు

చుండిరి. వారెల్లపుడు నీటిలో తలక్రిందుగా తపస్సు చేయు చుండెడివారు.

శ్లో॥ సప్తరాత్ర కృతాహారా వాయునా వనవాసినః,
దివం వర్ష శతై ర్యాతా సప్తభి స్స కలేబరాః. 19

వా రీ వనమునందే యేడు దినముల కొకసారి వాయువు నాహారముగ గ్రహించుచు, నూఱుసంవత్సరములు తపస్సుచేసి శరీరములతో స్వర్గమును చేరిరి.

శ్లో॥ తేషా మేవం ప్రభావానాం ద్రుమప్రాకార సంవృతం,
ఆశ్రమం సుదురాధర్ష మపి సేంద్రై స్సురా సురైః. 20

వారి ప్రభావముచే నీ యాశ్రమమునకు చుట్టును వృక్షములే ప్రాకారముగనుండెను. ఇంద్రుడుగాని, దేవతలుగాని, రాక్షసులు గాని యీ వనము నెంతమాత్రము పొందలేకుండిరి.

శ్లో॥ కురుప్రణామం ధర్మాత్మన్ తాన్ సముద్దిశ్య రాఘవ,
లక్ష్మణేన సహ భ్రాత్రా ప్రయత స్సం యుతాంజలి. 25

ధర్మాత్ముడవగు రామా! పరిశుద్ధుడవై, నీవును నీ తమ్ముడు లక్ష్మణుడును చేతులుజోడించి నమస్కరింపుము.

శ్లో॥ ప్రణమంతి హి యే తేషాం మునీనాం భావితాత్మనాం,
న తేషా మశుభం కించి చ్ఛరీరే రామదృశ్యతే. 26

రామా! ఆత్మవిదులగు నామునులకు ప్రణమిల్లిన వారికి శరీరాశుభము కొంచెమును కలుగదు.

శ్లో॥ తతో రామః సహ భ్రాత్రా లక్ష్మణేన కృతాంజలిః,
సముద్దిశ్య మహాత్మాన స్తా నృషీ నభ్యవాదయత్, 27

అంత రామలక్ష్మణులు మహాత్ములగు నా మునుల కంజలి ఘటించి నమస్కరించిరి.

వాలితో రణమునకు వెళ్ళి శరీరమంతయు హూనమొనర్చుకొని వచ్చినవాడు సుగ్రీవుడు. మరల రణమునకు వెళ్ళుచున్నవాడు

సుగ్రీవుడు. రామ లక్ష్మణులతో నా వనమహాత్మ్యము చెప్పినవాడు సుగ్రీవుడు. సుగ్రీవుడా మునులకు నమస్కరింపలేదు. ఆ వనమంతటి మహాత్మ్యముగలదేని సుగ్రీవు డేల నమస్కరింపడు?

శరీరాశుభము కొంచెమును కలిగించని యా మహాత్ముల కొనరించు నమస్కారము వాలితో ద్వంద్వయుద్ధమునకేగు సుగ్రీవున కవసరమా? చెట్లమాటునదాగి వాలిని చంపబోవు రాముని కవ సరమా? రామునికి తోడుండుటచే లక్ష్మణున కవసరమా? 'సకల విజ్ఞానఖని'యని వాల్మీకిచే ప్రశంసించబడిన రాముడు, "అంతటి మహాత్తుగల వనమును చెంతనుంచుకొని సుగ్రీవుడు, వాలిచే భంగపడి, శరీరమంతయు మర్దింపబడి వచ్చుటేల?" అని యైనా గ్రహింపలేదా? ఈ సంఘటనను బట్టి, సుగ్రీవుడా కథ చెప్పినంతనే వనమునకు నమ స్కరించిన రాముడు విజ్ఞానవంతుడా? ఆ కథ తెలిపిన సుగ్రీవుడు విజ్ఞానవంతుడా?

## 9. రాముడు భార్యగ - సీత నాదరించెనా?

రాముడు సీతను పెద్దలయెదుట నగ్నిసాక్షిగ పరిణయమాడెను. సీత చాలఅందమైనదని వాల్మీకి-హనుమంతాదులు వర్ణించిరి. రాము నకు సీత యెంతెంతయో మోహముగలదు. అతడామెయందు మిక్కలి కామాసక్తుడై యనురాగము గలవాడయ్యెను. రామునికి సీతపై గల వ్యామోహము-ప్రేమవలననా? కామము వలననా? యని ప్రత్యే కించవలసిన కామమువలననే యని చెప్పవలయును. వనముల యందా, తడు దగ్గఱగనుండి మాంసము తినిపించుట, అయోధ్య యందామెను చేతులతో గ్రహించి చెఱకురసమును త్రాగించుట మొదలగు చర్య లన్నియు నందమగు నామెయందలి కామోద్రేక చర్యలేయనుట నిస్సంశయము. రామున కామె యందు ప్రేమలేదనుటయు సమంజ సము గాదు. కామమువలన ప్రేమ జనించక మానదు గదా!

అడవులయందు మైథిలి యపహరింపబడ, రాముడు చెట్లతోను, మృగములతోను, కొండలతోను, నదులతోను తన విరహతాపమును వర్ణించుటలో వాల్మీకి తన శృంగార కవితావైభవమునందు వెదజల్ల దలచి కృతకృత్యుడయ్యెను. కానిచో పర్ణశాల పరిసరముల వెదక వలసిన సీతను, రాముడు నదులయందు పర్వతములయందు వెదక వలసిన యగత్యమేమి ? రాముడు తన భార్యయగు సీత యంగాంగము లను పరులముందు వర్ణించుటేమి ? అది యెంతవఱకు సమంజసము. వనమందాతడు సహచారిణిని గోల్పోవ, వ్యధజెందుటలో నసహజ మేమియు లేదు. కాని పరులముందెల్లపు డామె యందచందములను ఆమెతోగల తన శృంగారవాంఛలను వర్ణించుట యసహజముగ గన్పించును. లక్ష్మణు డెన్నియోమారు లన్ననోదార్చెను. సుగ్రీవుడు సహితము రాముని యదేపనిగ భార్యకై విలపించుట తగదని హెచ్చ రించెను. రాముని యీ భార్యావిలాపము, పరులయాదరాభిమాన ములు పొందుట కనుచానిలోను పూర్తి యసంబద్ధము గన్పింపదు. ఆడవియందు జంతువులచంపి వాని మాంసమును తినుచు - ఫలమూలా శనుడనై వనమున సంచరించుచున్నాననియు, రాక్షసుల చంపదలచి వనముల దిరుగుచు-తండ్రియాజ్ఞపై వనముల దిరుగుచుంటిననియు వచించు రాముడు, రాక్షసుల చంపుటకై బలమును సేకరించుచు-తన భార్యను రాక్షసు డెత్తుకొని పోవుటచే తాను భార్యాశోకముచే కుమిలి, క్రుంగిపోవుచున్నానని యితరుల యెద్ద వాపోవుటలో వింత యేమున్నది ?

రాముడు సీతలేక దేవాధిపత్యమునుగాని, రాజ్యాధిపత్యము గాని స్వీకరించననియు (అరణ్యా. 62వ సర్గము 5 శ్లో), సీతలేనిచో ప్రాణ ములు విడుతుననియు (అరణ్యా. 63వ సర్గము 9 శ్లో) వచించెను. సుగ్రీవ-హనుమంతాదుల యెదుట తన భార్యనుగురించి కన్నీటితో పలవించెను. కాని లంకాపురియందు రావణుని జయించిన పిమ్మట,

కనీసము సీతను చూడవలెనని యైన రాముడు తలపలేదు. రావణునికి సంస్కారము, విభీషణుని పట్టాభిషేకము జరిగిన పిమ్మట నింపాదిగ తన విజయమును తెలుపుమని జానకి యొద్దకు హనుమంతుని పంపెను. ఆ మాటలకు నీరసపడిన సీత దీనముగ 'రాముని చూడదలచినాన'ని వచించెను.

పిమ్మట విభీషణు డామెను తీసికొనిరాగా, రాము డామెతో శత్రువును జయించి నేను నిన్ను పొందితిని. నా పౌరుషము చూపితిని. హనుమంతుని గొప్పకార్యములు, సుగ్రీవుని శ్రమ సఫలమైనవి. యిట్లు పలుకుచు తన శౌర్యమును వానర-రాక్షసుల యెదుట వచించుచుండ. సీత కన్నీరుగార్చుచు నిలబడెను. రాముడు సీతపై తనకు కలుగుచున్న క్రోధముతో తన యుద్ధపరిశ్రమను తెలుపుచు, జానకి నడవడిని గురించి యతినీచముగ మాట్లాడెను. రావణుడు సీతను గొంపోవుటలో సీతపాత్ర యెంతవఱకున్నదియు గణుతింపక, యామెను ప్రజలయెదుట నీచాతినీచముగ మాట్లాడుచుండ, జానకి జీవితమును రోసినదై, రోదించి రోదించి చివరకు ధైర్యముచేసి తలయెత్తి రామునితో నీచుడు నీచురాలితో ప్రసంగించునట్లు ప్రసంగించుట యతనికి తగదనియు, రాముడు తలచిన విధముగ తాను సందేహించు నడవడి కలదా నన్నుకాదనియు సగర్వముగ-గణనీయముగ-ధర్మసంయుతముగ మాటలాడుచు

యుద్ధ. 119వ సర్గము :

శ్లో॥ త్వయా తు నరశార్దూల। క్రోధమేవాను వర్తతా,
లఘునేవ మనుష్యేణ స్త్రీత్వమేవ పురస్కృతమ్. 14

క్రోధమునే యనుసరించుచున్న నీచే, నీచునిచేతవలె స్త్రీత్వమే ముఖ్యముగ నుంచుకొనబడినది." అని రాముని బుద్ధిని ప్రకటించుచు పలికెను.

ఈ విధముగ పలికి సీత, రాముడు తనపై వేసిన యసత్యమగు

నపవాదునకు రోసి, జీవితము నిచ్చగింపనిదై యగ్నిని ప్రవేశింపదలచి, లక్ష్మణునితో చితి పేర్చుమనెను. రాముడును దాని కంగీకారము తెలిపెను. అపు డచటగల జనులెల్లరు హాహాకారము లొనర్చిరి. ఎట్టకేలకు రాముడు సీతను స్వీకరించెను. కాని సీతపైగల తన యనుమానము మాత్రము పోలేదు. అయోధ్యకేగిన పిమ్మట యామె గర్భవతి యయ్యెను. కాని యామె గర్భవతియనిగాని, తన భార్యయని గాని జాలితలపక, లక్ష్మణునిచే కారడవులందు వదలిపెట్టించెను. తరువాత ఆమె యేమైనదియు రాముడు పట్టించుకోలేదు. అశ్వమేధ యజ్ఞము నిర్వర్తించు సమయమున, జానకిని వాల్మీకి యాశ్రమప్రాంతమున వదలిపెట్టుమని నియోగించిన రాముడు – వాల్మీకినిగూడ తన యజ్ఞమున కాహ్వానింపలేదు. లవకుశులు తన పుత్రులని గుర్తించినవాడై, వాల్మీకితో సీతను జనమధ్యమున తన శీలమును ఋజువు పఱచుకొనవలసినదని యాదేశించెను. అప్పటికే వృద్ధురాలగు సీత, భర్తచే త్యజించబడి పుత్రులను పెంచుచు వనవాసక్లేశము ననుభవించిన సీత, జనసందోహము నెదుట భర్తచే కులటగా హీనముగా చూడబడిన రాచదేవేరియు నంతఃపుర కాంతయునగు సీత, తన జీవితాంతము అణువణువునా–భర్తను ప్రేమించి–పూజించి – గౌరవించి – యతనికై అంతఃపురవాసమును వదలి యడవుల దుర్భరజీవితమును, గడపి–యతనిచే ననుమానింపబడి వెతలబడిన సీత జీవితమును రోసి – ప్రతిసారి తన శీలపరీక్షకై యగ్నిని ప్రవేశించలేక, భూవివరమునబడి కాలధర్మము నొందెను.

దీనినిబట్టి తనను మనసార ప్రేమించిన సీతను రాము డెంతటి వ్యథలపాల్జేసినది వ్యక్తమగుచున్నది.

దీనికి రాముడు–ధర్మము, ప్రజాభిప్రాయములని యెన్ని ముసుగులు వేసినను, అవి రాముని ధర్మభ్రష్టతను, న్యాయాన్యాయ వివక్షతా జ్ఞానశూన్యతను బుద్ధి–జ్ఞాన సంపన్నతా క్షీణత్వమును పెంపొందించునే గాని, యతని కీర్తి ప్రతిష్ఠలను పెంచజాలవు.

రావణుని సోదరియగు శూర్పణఖను విరూపినిగ నొనర్చి రావణునిచే సీతాపహరణమునకు నాందిపల్కినది రాముడు. రావణుడు సీత నపహరింప, రాముడు క్రోధము జూపవలసినది రావణుని మీదగాని సీతమీాద కాదు గదా!

భరతుడు తనకు రాజ్యమొసంగుటకు సంసిద్ధుడుగా నుండెనా? లేదా యను విషయమును సేకరించుటకై హనుమంతుని గూఢచారిగ నియమించియు, తన కాప్తులైన భరద్వాజ-గుహులయొద్ద భరతుని విషయము సేకరించిన రాముడు, సీతాశీలమును గురించియు - సీతకు కాపలాయుండిన స్త్రీలద్వారగాని, మరియే యితర విధముగనైన సేకరింపవచ్చును గదా!

సీత యపహరింపబడ, "సీతను గురించి నా తల్లుల కేమని చెప్పుదును, యామె తండ్రి కేమిచెప్పుదును" అని విలపించిన రాముడు గర్భవతియగు నామెను వనములకంపి, తన తల్లులకు, సీత తండ్రికి యేమని చెప్పియుండును?

యుద్ధ. 118వ సర్గము : రాముడు సీతను జనమధ్యమున

శ్లో॥ ఇతి ప్రవ్యాహృతం భద్రే మయైతత్కృత బుద్ధినా,
లక్ష్మణే భరతే వా త్వం కురుబుద్ధిం యథా సుఖమ్. 22
సుగ్రీవే వానరేంద్రే వా రాక్షసేంద్రే విభీషణే,
నివేశయ మనస్సీతే యథా వా సుఖమాత్మనః. 23

భద్రే! లక్ష్మణునియందుగాని భరతునియందుగాని, వానరేంద్రుడగు సుగ్రీవుని యందుగాని, రాక్షసరాజగు విభీషణుని యందుగాని నీ యాత్మకు సుఖము కలుగునట్లుగా బుద్ధినుంచుము.

తనను వివాహమాడి తనకై సర్వమును పరిత్యజించి యడవుల కేతెంచిన యిల్లాలి నిట్లుపలికిన రాము నేమనవలయును? ఆమె నగ్ని సాక్షిగ పరిణయమాడునా డతడు చేసిన ప్రమాణమేమి? భార్య నిట్లు "వారిపై మనసుంచుము-వీరిపై మనసుంచుము" అని పలుకువానికి

భార్య యెందుకు? ఎంతటి నీచుడు-హీనుడు-త్రాగుబోతు - దుర్వ్యసనలోలుడు, బుద్ధిహీనుడు భార్య నావిధముగ పరులయందు మనసుంచుమని మాటలాడును? ఇట్టి రాముని ధర్మజ్ఞుడు, సత్యసంధుడు, బుద్ధిమంతుడు, జ్ఞానసంపన్నుడు, సర్వధర్మములను - స్వజనులను రక్షించువాడు, వేదవేదాంగతత్వము నెఱిగినవాడు, క్షమయందు ధరిత్రీసముడు'' అని వాల్మీకి వచించుటెంత సమంజసము?

యుద్ధ. 121వ సర్గము : రాముడు

శ్లో॥ అవశ్యం త్రిషు లోకేషు న సీతా పాపమర్హతి,
దీర్ఘకాలోషితా హీయం రావణాంతఃపురే శుభా. 13
బాలిశః ఖలు కామాత్మా రామో దశరథాత్మజః,
ఇతి వక్ష్యంతి మాం సంతో జానకీ మవిశోధ్య హి. 14
అనన్యహృదయాం భక్తాం మచ్చిత్త పరివర్తినీమ్,
అహ మప్యవగచ్ఛామి మైథిలీం జనకాత్మజామ్. 15
ప్రత్యయార్థం తు లోకానాం త్రయాణాం సత్యసంశ్రయః,
ఉపేక్షే చాపి వైదేహీం ప్రవిశంతీం హుతాశనమ్. 16

మూడులోకములందును సీత పాపమున కర్హురాలు గాదు. ఈమె రావణుని యంతఃపురమున చాలకాలమున్నది.

దశరథుని పుత్రుడగు రాముడు మూర్ఖుడు-ఖలుడు - కామాతురుడు జానకిని పరిశోధించకయే గ్రహించెనని నన్ను పలుకుదురు.

"జానకి, యితరులయందు మనస్సులేనిది-భక్తురాలు-నా మనస్సును బట్టి చరించునది"యని నే నెఱుగుదును.

సత్యము నాశ్రయించినవాడనై మూడులోకములు విశ్వసించుటకు అగ్నిప్రవేశముచేయు సీత నుపేక్షించితిని.

రాముని యీ మాటలెంతమాత్రమును సమంజసములు కావు. రాముడు కేవలము, ఇతరులకొరకై సీత నగ్నిపరీక్షద్వార పరిశోధింప దలచిన, సీతను అంతనీచముగ మాట్లాడడు. పరులపై మనస్సుంచు

మని హేయముగ ననడు. రావణుని యొద్దనున్న సీతను తన ప్రాతి ప్రత్యమును నిరూపించుకొనవలసినదిగ నొక్క-మాటలో నాదేశించి యుండెడివాడు. ఆమెతో తా నొనర్చిన వీరకృత్యములు చెప్పవలసిన పనిలేదు. ఆమెను తీక్ష్ణముగ చూడవలసిన పనియులేదు. ఈ సంద ర్భమున వాల్మీకి పలికిన యీ వాక్యములు చూడుడు—

యుద్ధ. 118వ సర్గము :

శ్లో॥ పశ్యత స్తాం తు రామస్య భూయః క్రోధో వ్యవర్ధత,
ప్రభూతా జ్యావసి క్తస్య పావకస్యేవ దీప్యతః. 11
సబద్ధ్వా భ్రుకుటీం వక్త్రే తిర్యక్ప్రేక్షిత లోచనః,
అబ్రవీ త్పరుషం సీతాం మధ్యే వానరరక్షసామ్. 12

ఆమెను చూచుచున్న రామునకు నేతితో తడిసిమండుచున్న యగ్నివలె కోపమతిశయించెను. అతడు కనుబొమలను ముడిచి, కన్ను లడ్డముగా త్రిప్పుచు వానర-రాక్షసుల నడుమ సీతను కఠినముగ బలికెను.

కనుక రాముడు సీతను పవిత్రురాలని తలచియు, పరులకొరకై యగ్నిపరీక్షకు సమ్మతించెననుట యబద్ధము.

ఎప్పుడైతే సీత అగ్నిని ప్రవేశించుటకై సంసిద్ధమైనదో అప్పు డచటి బాలురు, వృద్ధులు, స్త్రీలు, వానరులు, రాక్షసులు సమస్త ప్రజలు పెద్దగనక్షుచు హాహాకారము లొనర్చిరి. సీత పవిత్రురాలను ధ్వనియు మిన్నంటెను.

అపుడా జనసంహోహ ధ్వనులకు కలతనొందినవాడై రాముడు, తన చర్యలను కప్పిపుచ్చుకొనుటకై సీత పవిత్రురాలని తనకు తెలియు ననియు, తాని ప్రజలనుండి కలుగు నపవాదు నివర్తించుకొనుటకై తానిట్లు వర్తించితినని తన్నుతాను సమర్థించుకొనుచు సీతను స్వీక రించెను.

ఈ సందర్భమున, అగ్ని సీతను తనయంకమందుంచుకొని, పైనున్న చిదుగులను నెట్టివేసి పైకి వచ్చెననుట సహజవిరుద్ధముగనున్నది.

అగ్నిప్రభావమును చూపదలచిన, సీత అగ్నియందు దహింపకుండనే యుండవలయును. దహింపబడినచో నామంటలనుండియే రావచ్చును. లేదా, యెక్కడనుండియో భూమియడుగున, అగ్నియడుగున నుండి వచ్చినచో సహజముగనే రావలయును. తను పైకివచ్చుచుండ చిడుగులవియే పోవలయును. సీతపై చిడుగులను నెట్టివేయవలసిన యగత్యమేమి. అంతటి మహాత్మ్యముతో నగ్నివచ్చు చిడుగులు వాటియంతట యవియేపోవా. కనుక యిది కల్పితమనుటలో సందేహము లేదు. అగ్నిలోపడబోవు సీతను-అచటి జనుల యఱపులచేతను, హాహాకారములచేతను, చెంతనున్నవా రాపియుందురు. రామునకు, సీత శీలవతియని యచటి రాక్షసులు, సీత పరిస్థితి స్వయముగ గాంచిన హనుమంతాదులు నచ్చజెప్పియుందురు. రాముడు తాను త్వరపడిపలికిన మాటలను సమర్థించుకొనుటకై, ఆ సంగతి తనకు తెలియుననియు, ప్రజలు తనను నిందింతురని తానట్లు పలికితిననియు, వచించి సీతను స్వీకరించి యుండును.

భార్యను రావణు డపహరించుటచే, శంకతో నామె నిట్లు పలికినాడని తలచిన, వనవాసమునకు ముందయోధ్యలో సీతతో నిట్లు పలికెను.

అయోధ్య. 26వ సర్గము :

శ్లో॥ సాత్వం వసేహ కల్యాణి రాజ్ఞః స మనువర్తినీ,
భరతస్య రతా ధర్మే సత్యవ్రతపరాయణా. 37

నీవు ధర్మ-సత్యవ్రత పరాయణవై రాజగు భరతు ననుసరించి యిటనుండుము.

పై విషయములన్నిటినిబట్టి రాముడు సీత నొక భోగవస్తువుగ పరిగణించెను. విలాసవతియగు స్త్రీనివలె యనుభవించెను. యౌవన మదోన్మత్తుడై కామించెను. అంతియేగాని, యామెను ప్రేమించె ననునది యవాస్తవికముగ గన్పించుచున్నది. రాముని మనస్తత్వ

మును తెలియబరచు, రాముని యీ క్రింది వాక్యములు చూడుడు.

అరణ్యా. 75వ సర్గము :

శ్లో॥ రాజ్యభ్రష్టేన దీనేన తస్యాం మాసక్త చేతసా,
కథం మయా వినాశక్యం సీతాం లక్ష్మణ జీవితమ్. 28

రాజ్యభ్రష్టుడనై, అందుచే దీనుడనై, ఆ దీనత్వము పోగొట్టుకొనుటకు సీతపై మనస్సు మళ్ళించుకొంటిని. ఆ సీతకూడ లేనిచో నెటుల జీవింపగలను ?

ఈ మాటలనుబట్టియు రాజ్యభ్రష్టు డగుటచేతనే తన దిగులు పోగొట్టుకొనుటకై సీతయందు తన మనస్సును మళ్ళించుకొనెను. అందుచేతనే, మరల రాజ్యమును పొందినపిదప, సీతకంటెను తనకు ప్రియమైనది. రాజ్యము–రాజ్యభోగములు గనుక, ప్రజాభిప్రాయము నెపముతో సీతను వనముల కంపియుండునని తోచుచున్నది.

యుద్ధ. 102వ సర్గము : రాముడు

శ్లో॥ దేశే దేశే కళత్రాని దేశే దేశే చ బాంధవాః. 12

ప్రతి దేశమందును భార్యలు–బంధువులు నుందురు.

దీనినిబట్టియు రాముడు సీతను ఒకవస్తువుగనే పరిగణించినట్లు తెలియుచున్నది. అనగా ఒక సీత పోయిన – మరియొక సీత (స్త్రీ) లభించును. అనగా నామెను కేవలము ఒక స్త్రీగనే తలచెను. అనగా నామెను కామించెనేగాని ప్రేమించలేదని తెలియుచున్నది.

యుద్ధ. 49వ సర్గము : రాముడు

శ్లో॥ శక్యా సీతా సమానారీ మర్త్యలోకే విచిన్వతా,
న లక్ష్మణ సమోభ్రాతా సచివ స్సాంపరాయికః. 6

మర్త్యలోకమునందు సీతకు సమమైననారియు, లక్ష్మణునికి సముడగు సోదరుడును దుర్లభులు.

ఈ మాటలవలన రాముడు వారి సేవాసంపత్తిని గణుతించెను. వారికి తనపై గల ప్రేమను గ్రహించెను. కాని సీతకు తా నొసర్చిన దేమి ?

ప్రజాసన్నిధిని స్త్రీ భరించరాని నీచమగు నిందమోపుట.

శీలపరీక్షకై అగ్నిపరీక్ష కనుమతించుట.

గర్భిణిని నిందలపాల్జేసి వనముల కంపుట.

వృద్ధాప్యములో నామెను దిక్కులేని దానినిగ చేయుట.

ఆమె జీవితమునంతను శోకముల పాల్జేయుట.

అయోధ్య. 19వ సర్గము : రాముడు

శ్లో॥ అహం హి సీతాం రాజ్యం చ ప్రాణా నిష్టాన్ ధనాని చ,
హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతా యా ప్రచోదితః 7

నేను సీతను, రాజ్యమును, ప్రియములగు ప్రాణములను, ధనమును ఒకరు చెప్పకయే సోదరుడగు భరతున కిచ్చెదను.

దీనినిబట్టియు రాముడు భార్యను (స్త్రీని) తనకు సంబంధించిన ఒక వస్తువుగ తలచినాడు. దాసిగతలచి, భరతున కిచ్చెదనని పలికెను. ఆ కాలమున స్త్రీలను యితరులకు ప్రీతిగ నొసంగుటను గురించి, రాముడు అయోధ్యకు వచ్చుచున్నాడను వార్త తెలిపిన హనుమంతునితో భరతుడు, తనకు ప్రియమగు వార్తను తెలిపినందుకై,

అయోధ్య. 128వ సర్గము :

శ్లో॥ గవాం శతసహస్రంచ గ్రామాణాం చ శతం పరమ్,
సుకుండలా శ్శుభాచారా భార్యాః కన్యాశ్చషోడశ. 43
హేమవర్ణా స్సునా సోరూశ్శశి సౌమ్యాననా స్త్రియః,
సర్వాభరణ సంపన్నా స్సంపన్నాః కులజాతిభిః. 44

గో సహస్రమును, శతగ్రామములను, కుండలములను, సద్వర్తనలగు భార్యలను, పదునాల్గురు కన్యలను, బంగారుఛాయ కలిగి చక్కని ముక్కులు, తొడలు, ముఖములుగల ఉత్తమకుల - జాతిగల వారిని సర్వాభరణములతో నిచ్చుచున్నాను" అని వచించెను.

రాజుల యీ చర్యవలన రాజగు రాముడు భార్యయగు సీతను దాసివలె చూచెనని స్పష్టము.

యుద్ధ. 118వ సర్గము : రాముడు సీతతో

శ్లో॥ ఏషా సి నిర్జితాభద్రే శత్రుం జిత్వా మయారణే,
పౌరుషాద్య దనుష్ఠేయం త దేత దుపపాదితమ్. 2

నాచేత శత్రువు రణమందు జయింపబడెను. నీవు పొందబడితివి, నా పౌరుషము చూపబడెను—

దీనినిబట్టియు రాముని యభిప్రాయము ప్రకారము స్త్రీ ధనము మొ॥ వానివలె నొకవస్తువు. వీటన్నిటినిబట్టి రాముడు సీతను భార్యగ స్వీకరించెను. భోగవస్తువుగ కాముకుడై యనుభవించెను. దాసిగ, తృణమువలె చూచెను.

## 10. రాజ్యకాంక్ష :

రాముడు, తన వంశధర్మప్రకారము తన తండ్రికి పిమ్మట, అయోధ్యరాజ్యమునకు వారసుడు. కాని తన తండ్రి కైకను వివాహ మాడువాడు కైక తండ్రి కిచ్చిన వాగ్దానము ప్రకారము కైక పుత్రు డగు భరతుడు, దశరథుని పిమ్మట రాజ్యము నధిష్టించవలసియుండెను. కాని దశరథుడు రాజ్యమును రామున కప్పగింపదలచి, భరతుని పురమున లేకుండ చేయుట. మొదలగు చర్యలు చేయుచుండ రాముడు తెలియని వానివలె నటించుచు తండ్రి తనకై చేయు ప్రయత్నములను దలచి, తండ్రి కెంతయో విధేయుడుగ మసలెను. రామునకు తండ్రి చేయు మంత్రాంగము తెలియుటని తలచిన, మఱునాడు రాముని పట్టాభిషేకమును నిర్ణయించి, రామునితో 'భరతుడు వచ్చులోపలనే నీ పట్టాభిషేకమునకు తగిన సమయము, నీవు నీ యాప్తమిత్రుల రక్ష ణలో జాగరూకుడవై యుండుము'ని పలుక, రాముడు కారణమడిగి యుండెడివాడు గదా! కేవలము తన తండ్రి-కైక కిచ్చిన వరముల చేతనే భరతునకు రాజ్యము వచ్చినదని తలచిన, రాముడు భరతునితో అయోధ్య. 107వ సర్గము :

శ్లో॥ పురా భ్రాతః పితా నః స మాతరం తే సముద్వహన్,
మాతామహే సమాశ్రౌషీద్రాజ్య శుల్క మనుత్తమమ్.

పూర్వము మన తండ్రి మీ తల్లిని వివాహమాడుచు రాజ్య శుల్కముగా మీ తాతకు ప్రదానము చేసెను.

అని యేల పలుకును. కనుక రాజ్యము భరతునకు సంక్రమించి వలసియున్నదని రామునికి పూర్తిగా తెలియును. కాని ఆ నెపమంతయు తన తండ్రియందే పెట్టదలచినవాడై, తన తండ్రి తనకై చేయు రాజ్య ప్రయత్నములన్నిటిని గ్రహించియు, తనకేమియు సంబంధము లేని వానివలె నటించెను. కాని యదార్థము బట్టబయలై భరతునకు రాజ్య పట్టాభిషేకము. తనకు వనవాసము నియోగించబడ తనయందేమి దోషము లేకనియు, తనకు రాజ్యకాంక్షయు లేదని కైకకు చెప్ప దలచి యీ క్రింది విధముగ పలికెను.

అయోధ్య. 19వ సర్గము :

శ్లో॥ నాహ మర్థ పరో దేవి లోకమావస్తు ముత్సహే,
విద్ధిమా మృషిభి స్తుల్యం విమలం ధర్మమాస్థితమ్. 20

దేవి! నే నర్థపరుడను గాను-లోకమందు వసింప నుత్సహింపను, కేవలము ధర్మపరుడనగు నన్ను ఋషితుల్యునిగా నెఱుగుము.

ఇదే విధముగ రాజ్యము నందాసక్తి లేనట్లు రాముడనేక మారులు వచించెను.

అయోధ్య. 4వ సర్గము .

శ్లో॥ సౌమిత్రే భుంక్ష్వ భోగాం స్త్వ మిష్టాన్ రాజ్యఫలాని చ
జీవితం చాపి రాజ్యం చ త్వదర్థ మభికామయే. 44

సౌమిత్రీ! నీవు భోగములను, ఇష్టములను, రాజ్యఫలము ననుభవింపుము. జీవితమును, రాజ్యమును నీకొఱకై కోరుచున్నాను.

అయోధ్య 97వ సర్గము :

శ్లో॥ ధర్మమర్థం చ కామం చ పృథివీం చాపి లక్ష్మణ
ఇచ్ఛామి భవతామర్థే ఏతత్ప్రతి శృణోమి తే. 5

భ్రాతౄణాం సంగ్రహార్థం చ సుఖార్థం చాపి లక్ష్మణ,
రాజ్యమప్యహ మిచ్ఛామి సత్యే నాయుధమాలభే. 6

లక్ష్మణా! ధర్మమును, అర్థమును, కామమును, పృథ్విని మీ కొఱకు సమ్మతింతునని శపథము చేయుచున్నాను.

సోదరుల యర్థసుఖములపై రాజ్యమును సమ్మతింతును. ఆయుధముతో సత్యముగ జెప్పుచున్నాను.

అయోధ్య 19వ సర్గము :

శ్లో॥ అహం హి సీతాం రాజ్యం చ ప్రాణా నిష్టాన్ ధనాని చ
హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతాయ ప్రచోదితః. 7

నేను సీతను, రాజ్యమును, ప్రాణములను, ధనమును ఒకరు చెప్పకయే భరతున కిచ్చెదను—

రాముని పై మాటలచే, రామునికి రాజ్యముసందాసలేదని తెలియుచున్నది. కాని, రాముని యీ క్రింది వచనములను, చేష్టలను చూడుడు.

అయోధ్య. 34వ సర్గము :

శ్లో॥ ఇయం సరాష్ట్రా సజనా ధనధాన్య సమాకులా,
మయా వి సృష్టా వసుధా భరతాయ ప్రదీయతామ్. 41

ఈ దేశము జనము ధనధాన్య సంకులమగు నీ భూమి నాచే వదలబడినవి. భరతున కీయబడు గాక.

రాము డివియన్నియు వదలుటకు, అతని కెప్పుడు సంక్రమించి నవి? అతనికి చెందనివానిని, అతని యధీనములో లేనివానిని, అతడు రాజరీవితో భరతునకై వదలుచున్నాననుట యెంత హాస్యాస్పదము.

రాముని యిట్టిమాటలే అయోధ్య. 34వ సర్గము 55, 56 శ్లోకము లందును గలవు.

అయోధ్య. 19వ సర్గము :

శ్లో॥ అభిషేచనికం భాండం కృత్వా రామః ప్రదక్షిణమ్,
శనైర్జగామ సాపేక్షో దృష్టిం తత్రా విచారయన్. 31

రాము డభిషేచన సంభారమునకు ప్రదక్షిణము చేసి, అపేక్షతో వానియందు దృష్టినిలిపి మెల్లగ వెళ్ళెను.

20వ సర్గము : రాముడు తల్లితో

శ్లో॥ భరతాయ మహారాజో యావరాజ్యం ప్రయచ్ఛతి,
మాం పునర్దండ కారణ్యే వివాసయతి తాపసం. 30

మహారాజు భరతునకు యావరాజ్య మిచ్చుచున్నాడు. నన్ను ఒక తాపసిగ దండకారణ్యములకు పంపుచున్నాడు.

26వ సర్గము :

శ్లో॥ తాం దృష్ట్వా స హి ధర్మాత్మా న శశాక మనోగతమ్,
తం శోకం రాఘవ స్సోఢుం తతో వివృత తాం గతః. 7

ధర్మాత్ముడగు రాము డామెను జూచి తన మనస్సునందున్న శోకము నణచుకొనలేక దుఃఖమునందెను.

ఈ చేష్టలనుబట్టి రాజ్యము చేజార, రాము డెంత దుఃఖాక్రాంతు డైనది తెలియుచున్నది.

అయోధ్య. 22వ సర్గము :

శ్లో॥ కృతాంత ఏవ సౌమిత్రే ద్రష్టవ్యో మత్ప్రవాసనే,
రాజ్యస్య చ వితీర్ణస్య చ పునరేవ నివర్తనే. 15

లక్ష్మణా ! నా ప్రవాసమందును, ఈయబడిన రాజ్యము మరలా వచ్చుట యందును దైవమే చూడదగియున్నది.

దీనినిబట్టి తండ్రితో కలసి తాను రాజ్యమునకై చేసిన యత్నము విఫలముకాగా, రాముడు రాజ్యమునకై దైవమును నమ్ముకొనెను.

అయోధ్య. 104వ సర్గము : రాముడు తనకు రాజ్య మీయ వచ్చిన భరతునితో

శ్లో॥ కులీనః సత్వసమ్పన్న స్తేజస్వీ చరితవ్రతః,
రాజ్యహేతోః కథం పాప మాచరే న్మద్విధో జనః. 16

కులీనుడు సత్వసంపన్నుడు వ్రతాచరణుడగు నీవంటివాడు రాజ్యకారణమున నెట్లు పాపమాచరించును ?

ఈ మాటలనుబట్టి రాముని యభిప్రాయము ప్రకారము, తండ్రి వాగ్దానమున కనుగుణముగ భరతుడు రాజ్యమును పొందియుండిన - పాపమాచరించిన వాడే గదా ! ఇట్టి సందర్భమున, భరతునికి సంక్రమించవలసిన రాజ్యమునకై, ప్రయత్నించిన తన నే మనవలయును ! ఇట్టి యత్నము లొనర్చిన రాముని-ధర్మజ్ఞుడు,నీతిజ్ఞుడు, బుద్ధిమంతుడు, సత్యసంధుడు, జ్ఞానసంపన్నుడు, సాధువు, సర్వధర్మములను-స్వజనమును రక్షించువాడు-అనుట యెంతవరకు సమంజసము ?

అయోధ్య 94వ సర్గము : రాముడు

శ్లో॥ ఇమం తు కాలం వనితే విజహ్రివాం
స్త్వయా చ సీతే సహ లక్ష్మణేన
రతి ప్రపత్స్యే కులధర్మ వర్ధినీం
సతాం పథిస్త్వైర్నియ మమైః వరైః స్థితః. 27

సీతా ! ఇంతకాలము (14 సం॥లు) నీతోను లక్ష్మణునితోను, విపినముల వసించి. ఉత్తమ నియమములచే సత్పథము నవలంబించెదను. పిమ్మట కులధర్మమును వర్ధిల్లజేయు - రాజ్యపాలన రూపమగు సుఖము నందెదను.

రాము డీ మాటలు వచించునాటికి భరతుడు, రాముని జేర వనములకు రాలేదు. అట్టి సమయమున వనవాసమునకు పిమ్మట రామునకు రాజ్యమెట్లు లభించును ? దీనినిబట్టి రాముడు వనవాసము గడుపుచున్నను, రాజ్యకాంక్షతోనే కాలము గడిపినట్లు విదితమగుచున్నది.

అరణ్య. 75వ సర్గము : రాముడు లక్ష్మణునితో

శ్లో॥ రాజ్యభ్రష్టేన దీనేన తస్యా మాసక్త చేతసా,
కథం మయా వినాశక్యం సీతాం లక్ష్మణ జీవితమ్. 28

రాజ్యభ్రష్టుడనై, అందుచే దీనుడనై, ఆ దీనత్వము పోగొట్టుకొనుటకు సీతపై మనస్సు మళ్ళించుకొంటిని. ఆ సీతకూడ లేనిచో నెట్లు జీవించగలను.

ఈ మాటలవలన రామునకు రాజ్యముపై నెంతటి యాపేక్ష యున్నదో విదితమగుచున్నది. సహజముగ నెల్లరకు మిక్కిలి ప్రీతి యగునది-యనుకూలయగు భార్య. రామున కనుకూలపతియగు భార్యకంటెను మిక్కిలి ప్రీతిపాత్రమైనది రాజ్యము.

అయోధ్య. 53వ సర్గము :

శ్లో॥ అధర్మ భయభీతశ్చ పరలోకస్య చానఘ,
తేన లక్ష్మణ నాద్యాహ మాత్మాన మభిషేచయే. 26

లక్ష్మణా ! అధర్మమువలన కలుగు పరలోకనాశనమునకు భయపడి నన్ను నేనిపుడు అభిషేకించుటకొనుటలేదు.

శ్లో॥ ఏత దన్యచ్చ కరుణం విలప్య విజనే బహు
అశ్రుపూర్ణముఖో దీనో నిశి తూష్ణీ ముపావిశత్. 27

ఈ విధమైనట్టి మాటలతో చెప్పరానట్టి విధముగ దయ గొలుపుచు నిర్జనమగు వనమున నేడ్చి రాముడా రాత్రి కన్నీటితో నిండిన ముఖముగలవాడై యుండెను.

దీనినిబట్టి రాజ్యమునకై రామునకుగల కోరిక యెంతటి మిక్కుటమైనదో యవగతమగుచున్నది. మరియు, లక్ష్మణుడు, రాముని రాజ్యాభిషేకమునకై తండ్రిని బంధింతును లేక వధింతునని వచియించినపుడు, తల్లియగు కౌసల్య తనను 'లక్ష్మణుని మాటలు వింటివి గదా ! కర్తవ్యమును గ్రహింపుము'ని నపుడు, వారి నివారించినది - పరలోక భీతికాస్పదమగు నధర్మమునకు భయపడిగాని, లేనిచో నేనును అందుకు సందేహించెడివాడనుకాను'అను భావ మతని మాట లనుబట్టి తెలియుచున్నది. ఇట్టి భావోద్రేకములతో గడపిన రాముడు నీతిజ్ఞుడు, మహర్షితుల్యుడు, ధర్మానుపరుడు, బుద్ధిమంతుడు అగునా ?

## 11. రాముని పరస్పర విరుద్ధపు మాటలు, కార్యములు :

అయోధ్య. 19వ సర్గము : కైకతో

శ్లో॥ హితేన గురుణా పిత్రా కృతజ్ఞేన నృపేణ చ
నియుజ్యమానో విస్రబ్ధః కి న కుర్యా మహంప్రియమ్. 5

హితుడు, గురువు, కృతజ్ఞుడు, రాజునగు తండ్రిచే నియోగించబడి, నిశ్శంకముగ ప్రియముగ దేనిని చేయను ?

అయోధ్య. 21వ సర్గము : కౌసల్యతో

శ్లో॥ ఏతైరన్యైశ్చ బహుభిర్దేవి దేవసమైః కృతమ్,
పితుర్వచన మక్లీబం కరిష్యామి పితుర్హితమ్. 34

దేవీ ! దైవసములగు పెక్కురచే పితృవాక్యము సఫలము చేయబడెను. నేనును తండ్రి హితమును చేసెదను.

అయోధ్య. 24వ సర్గము : లక్ష్మణునితో

శ్లో॥ ఉవాచ పిత్రోర్వచనే వ్యవస్థితం
నిబోధ మామేష హి సౌమ్యసత్పథః. 41

సౌమ్యా ! నన్ను తండ్రి మాటలయందు నిలచినవానిగా తెలుసుము. ఇదియే సన్మార్గము.

అయోధ్య. 29వ సర్గము : కైకతో

శ్లో॥ భరతః పాలయేద్రాజ్యం శుశ్రూషేచ్చ పితుర్యథా,
తథా భవత్యా కర్తవ్యం సహి ధర్మం సనాతనః. 26

భరతుడు రాజ్యమును పాలించును. అతడు తండ్రికి శుశ్రూష చేయునట్లుగ నీచే చేయబడినది. అదియే సన్మార్గము.

అయోధ్య. 53వ సర్గము : రాముడు లక్ష్మణునితో

శ్లో॥ అనాథశ్చ హి వృద్ధశ్చ మయాచైవ వినాకృతః,
కిం కరిష్యతి కామాత్మా కైకేయ్యా వశగతం. 8

అనాధుడు, వృద్ధుడు, నన్ను వదలినవాడు, కామాత్ముడు, కైకేయికి వశమైనవాడు, అయిన రాజేమి చేయును ?

శ్లో॥ కోహ్యవిద్వానపి పుమాన్ ప్రమదాయాః కృతే త్యజేత్,
ఛందానువర్తినం పుత్రం తాతో మామివ లక్ష్మణ. 10

ఎంతటి తెలివిలేనివాడైనను తన భార్యకు ప్రీతిని చేకూర్చుటకై, తన కనుకూలుడై చరించు పుత్రుని, మన తండ్రి నన్నువలె

త్యజించునా !

ఈ విధముగ రాముడు తన తండ్రిని హితుడు - గురువు - కృతజ్ఞుడు అని వచించుచు, మరల అనాధుడు, వృద్ధుడు, కామాత్ముడు, మతిభ్రమించినవాడు. మూర్ఖుడు అని పలుకుచున్నాడు. ఇది రామునికి తండ్రియందుగల గౌరవమా ?

రాముడు తన తండ్రితోను, తల్లులతోను, భరద్వాజాది ఋషులతోను, గుహుడు-మొదలగు మిత్రులతోను, తా నడవిలో ఋషితుల్యునిగ నామిషమును వదలి కందమూలముల భుజించుచు గడిపెదనని వచించెను.

అడవిలో వేటాడుచు జంతువులను చంపి మాంసభక్షణ చేయుచు గడిపెను.

అయోధ్య. 16వ సర్గము : సీతతో

శ్లో॥ లక్షయిత్వా హ్యభిప్రాయం ప్రియకామా సుదక్షిణా,
సంచోదయతి రాజానం మదర్థ మసి తేక్షణా. 10

మిక్కిలి నేర్పరియును-నాకు హితమునుగోరునదై కైకేయి రాజు నభిప్రాయమును గుర్తించి నాకొఱకు రాజును ప్రోత్సహించుచున్నది.

అయోధ్య. 53వ సర్గము : లక్ష్మణునితో

శ్లో॥ క్షుద్రకర్మా హి కైకేయీ ద్వేషా దన్యాయ మాచరేత్,
పరిదద్యాహి ధర్మజ్ఞే భరతే మమ మాతరమ్. 18

నీచపువనులు చేయునట్టి కైకేయి (నాతల్లికి) అన్యాయము చేయును. భరతుని రక్షణకైనా నాతల్లి నొసగును.

శ్లో॥ మన్యే దశరథాంతాయ మమ ప్రవ్రాజాయ చ
కైకేయీ సౌమ్య సంప్రాప్తా రాజ్యాయ భరతస్య చ. 14

దశరథుని యంతము కొఱకును, నా వనవాసమువకును, భరతుని రాజ్యము కొఱకు కైకేయి మన యింటికి చేరినట్లు తోచుచున్నది.

ఈ విధముగ రాముడు, కైక తన కనుకూలముగ వర్తించుచున్న దని తలచిన సమయమున యామెను, ఆమె గుణగణములను పొగడుట, తనకు వ్యతిరిక్తముగ చరించినపు డామెను తెగనాడుటయే గాక.

అరణ్య. 16వ సర్గము : లక్ష్మణుడు రామునితో

శ్లో॥ భర్తా దశరథో యస్యాస్సాదు శ్చ భరత స్సుతః,
కథం ను సాంబా కైకేయీ తాదృశీ క్రూరశీలినీ. 35

క్రూరస్వభావముగల కైకేయి, సాధుస్వభావముగల దశరథు నకు భార్య. సజ్జనుడగు భరతునకు తల్లి యెట్లైనదో గదా!

అని పలుక రాము డతనితో 'మన రెండవతల్లిని నిందింపతగ దని' హెచ్చరించెను.

అయోధ్య. 104వ సర్గము : రామునితో భరతుడు

శ్లో॥ సారాజ్య ఫల మప్రాప్య విధవా శోక కర్శితా,
పతిష్యతి మహాఘోరే నరకే జననీ మమ. 7

నా తల్లియగు నామె రాజ్యఫలమును పొందకయే విధవయై దుఃఖపీడితయైనది. ఘోరమగు నరకమున పడగలదు.

అని పలుక, రాము డతనితో 'అజ్ఞానమువలన నీవు తల్లిని దూషింప దగదు' అని హితవు చెప్పెను.

ఈ విధముగ రాముడు తల్లియగు కైకను తాను నిందించు చునే, తమ్ములగు భరత-లక్ష్మణు లామెను నిందింప తగదని వారిని వారించెను.

మరియు సుమంత్ర-వసిష్ఠు లామెను నిందించుచుండ నోరెత్తక మిన్నకుండెను. ఆ సమయమున తండ్రి యచట నుండుటచే నూరక యుండెను గాబోలు.

అయోధ్య. 96వ సర్గము : వనములకు వచ్చుచున్న భరతుని జూచి, అతని వలననే రామునకు రాజ్యవిహీనత కలిగినందున, యాతనిని చంపెదనని లక్ష్మణుడన,

97వ సర్గము : రాముడు లక్ష్మణునితో

శ్లో॥ విప్రియం కృతపూర్వం తే భరతేన కదానుకిమ్,
ఈదృశం వా భయం తేఽద్య భరతం యద్విశంకసే. 14

ఇదివరకు భరతుడు నీ కప్రియమును చేసెనా? అట్టి భయము నీ కిపుడేల? భరతుని యేల శంకించెదవు? అని పలికెను.

కాని తండ్రి తనతో "నీ స్నేహితులప్రమత్తులై నిన్ను రక్షింతురు గాక! భరతుడు పంపబడినాడు. అతడు వచ్చులోపలనే నీ యభిషేకమునకు తగిన సమయము.... భరతుడు - ధర్మాత్ముడు - జితేంద్రియుడు, సత్పురుషుడు, అయినను మనుజుల మనస్సు స్థిరముగాదు" అని పలుక, తండ్రితో నిదివరకెన్నడు తన కప్రియముచేయని భరతుని శంకించుటేల? అని యడుగలేదు.

రాముడు లక్ష్మణునితో సుగ్రీవుడు తన మాటయందులేడు.... సత్యము నతిక్రమించిన యతనిని బంధువులతోగూడ చంపెదను. కార్యమందేది హితమో నీవది సుగ్రీవునితో వచింపుము. (కిష్కింధ 30వ సర్గము 81, 82, 83, 84 శ్లోకములు).

ఆ మాటలు వినిన లక్ష్మణుడు రామునితో సుగ్రీవుడు సాధు వర్తనమందులేడు. అతని నిపుడు చంపెదను (కిష్కింధ. 31 సర్గము 4వ శ్లోకము).

అంత రాముడు లక్ష్మణునితో 'నీవంటివా డిట్టి పాపమును చేయరాదు.... వెనుకటి బాంధవ్యమును ప్రీతి ననుసరింపుము (కిష్కింధ. 31వ సర్గము 6, 7, 8 శ్లోకములు).

రాము డనిన మాటలే లక్ష్మణుడు పలుక, రాము డది తగదని యతని వారించెను—

అరణ్య. 44వ సర్గము :

శ్లో॥ తమేవ మృగ ముద్దిశ్య శ్వసంత మివ పన్నగమ్,
ముమోచ జ్వలితం దీప్త మస్త్రం బ్రహ్మవినిర్మితమ్. 14

పామువలె నిట్టూర్చుచున్న యీ మృగముపై ప్రకాశించుచు వెలుగుచున్న బ్రహ్మనిర్మితమగు వస్త్రమును (బ్రహ్మాస్త్రమును) ప్రయోగించెను.

సుందర. 38వ సర్గము : సీత హనుమంతునితో

'నా స్తన మధ్యమున ముక్కుతో పొడిచిన కాకిని చూచి, రాముడు దానిపై బ్రహ్మాస్త్రము నభిమంత్రించి వదిలెను.

యుద్ధ. 80వ సర్గము : లక్ష్మణు డింద్రజిత్తుపై బ్రహ్మాస్త్రమును ప్రయోగించెదననఁ, రాము డతనితో

"శ్లో॥ నైక తస్య హేతో రక్షాంసి పృథివ్యాం హంతు మర్హసి.''38

ఒక్కని కారణమున భూమియందలి రాక్షసులను చంపదగవు.

రాముడు లేడిని చంపుటకు, కాకిని చంపుటకు బ్రహ్మాస్త్రము ను ప్రయోగించెను. కాని తన తమ్ముడగు లక్ష్మణుడు మహాపరాక్ర వంతుడగు నింద్రజిత్తును చంపుటకు బ్రహ్మాస్త్రమును ప్రయోగించెద నన, వలదని వారించెను. అనగా తాను (రాముడు) చంపదలచిన మృగము, కాకి, లక్ష్మణుడు చంపదలచిన యింద్రజిత్తుకంటె బలమైన వని రాముని యభిప్రాయమా ? లేక బ్రహ్మాస్త్రమును సంధించదగిన వాడు తానే కాని, లక్ష్మణుడు కాదని తన యభిప్రాయమా ? లేక బ్రహ్మాస్త్రమును సంధించవలసిన సమయము తనకు తెలిసినవిధముగ లక్ష్మణునకు తెలియదని, తాను తెలియజెప్పుటయా ? ఇందేది సమంజసము ?

మరియు లక్ష్మణుడు బ్రహ్మాస్త్రముతో నింద్రజిత్తును చంపెద నన, రాము డతనితో 'నొక్కని కారణముగ భూమియందలి రాక్షసుల చంపతగద'ని వచించుటలో, నా బ్రహ్మాస్త్రము-ఇంద్రజిత్తుకై ప్రయో గించిన-రాక్షసుల నందఱిని చంపునని ధ్వనించుచున్నది. రాము డరణ్యమున మృగముపై బ్రహ్మాస్త్రమును సంధించు నప్పుడు - ఆ యస్త్రము భూమియందున్న మృగములన్నిటిని, లేక రాక్షసుడే

మృగమైనందున, భూమియందున్న రాక్షసులందరిని చంపునని ప్రయోగించెనా ? అదేవిధముగ వాయసముపై తాను ప్రయోగించిన బ్రహ్మాస్త్రము-వాయసజాతినంతటిని చంపునని ప్రయోగించెనా ? ఒకవేళ నటులనే తలచినను తాను ప్రయోగించిన బ్రహ్మాస్త్రము మృగము నొక్క-దానినే చంపెను. కాకియొక్క- ఒక్క-కంటిని మాత్రమే నాశము నొనర్చెను. అట్టి బ్రహ్మాస్త్రమును గురించి లక్ష్మణునితో 'నొక్క-ని కారణముగ రాక్షసులందరిని చంపదగద'ని పల్కు-టేమి ! ఇట్టి మాటలు రాముని విజ్ఞానమును సూచించునా ? అజ్ఞానమును తెలియజేయునా ? ఇట్టి వానిని వాల్మీకి, జ్ఞానసంపన్నుడనుట యెంత వరకు సమర్థనీయము ?

## 12. రాముని ఏకపత్నీత్వము :

అయోధ్య. 8వ సర్గము : మంథర కైకతో

శ్లో॥ హృష్టాః ఖలు భవిష్యంతి రామస్యః పరమాః స్త్రియః
అప్రహృష్టా భవిష్యంతి స్నుషా స్తే భరతక్షయే. 12

భరతుని క్షీణదశయందు నీ కోడల సంతుష్టయగును, రాముని యుత్తమ స్త్రీలు సంతుష్టులగుదురు.

ఇచట "పరమాః స్త్రియః" అనుటచేతను, భరతుని భార్యలతో పోల్చుటచేతను రాముని భార్యలనుట స్పష్టమగుచున్నది.

పరమా. సం. కనిష్ఠాగ్ర పరీణాహాం సత్వచం నిర్వ్రణం ఋజు.

"పరమ" అనగా సర్వోత్తమము, ముఖ్యము-అని యర్థములు. రాముని యొక్క- సర్వోత్తమములగు స్త్రీలనగా రాముని తల్లి మొదలగు వారనియు తలంచవచ్చును. కాని భరతుని భార్యలతో పోల్చుట వలన, రాముని భార్యలనియే ధ్వనించుచున్నది.

"స్నుషా" శబ్దమునకు "కోడలు, వధువు" అను అర్థములు గలవు. "ఇంటి పనులకు నీళ్ళు తెచ్చునది"అనియు అర్థము కలదు.

వధూ : పుత్రునిచేత వహింపబడునది.

పై అర్థములనుబట్టి 'స్నుషా' శబ్దము, "కోడలు" అను అర్థముతోనే వాల్మీకి వాడియుండెను. కానిచో "పరమాః స్త్రియః" అనుపదముతో పోల్చుట సమంజసము కాదు.

అయోధ్యా. 42వ సర్గము : కౌసల్య దశరథునితో

శ్లో॥ యః సుఖే షూపధానేషు శేతే చందన రూషితః,
వీజ్యమానో మహార్హాభిః స్త్రీభి ర్మమ సుతోత్తమః. 15

ఏ నా తనయుడు చందనము పూసికొని, యుత్తమకాంతలు చామరములతో విసరుచుండగా, సుఖము కలిగించు మెత్తనిదిండ్లపై పరుండెనో....

ఇచట "మహార్హాభిః, స్త్రీభిః", అనుటచేతను, శయనించు నపుడు చామరములతో వీచుచుండగా"-అనుటచేతను, వీరు రాముని భార్యలని ధ్వనించుచున్నది.

ఇచట "మహార్హాభిః, స్త్రీభిః" అను పదములు రాముని తల్లుల కేల చెందవని కొందఱి యభిప్రాయము. రాముడు బాలుడై యుండగా తల్లులు వీచుట సంభవించును. కాని వివాహమై భార్యలచెంత శయ నించు రామునికి తల్లులు వీచుట సంభవించదు గదా ! ఒకవేళ దాసీలు విసరుచుండెడివారని భావించినను, దాసీలకు "మహార్హాభిః, స్త్రీభిః" అనుపదములు వాడుట సమంజసముకాదు. కనుక రాముడు శయ నించుచుండ నతని భార్యలు చామరములతో వీచుచుండెడి వారనుట సమంజసము.

సుందరకాండము 28వ సర్గము : సీత రాముని గురించి

శ్లో॥ పితుర్నిదేశం నియమేన కృత్వా వనాన్నివృత్త శ్చరత వ్రతశ్చ,
స్త్రీభిస్తుమన్యే విపులేక్షణాభిః త్వం రంస్యసే వీతభయః
కృతార్థః. 13

తండ్రి యాజ్ఞప్రకారము వనవాసమును ముగించి కృతార్థుడవై విశాలనేత్రములుగల స్త్రీలతో క్రీడింపగలవు.

ఈ శ్లోకము రాముని బహుభార్యాత్వమును పూర్తిగ సమర్థించుచున్నది.

యుద్ధ. 21వ సర్గము :

శ్లో॥ వరకాఞ్చన కేయూరముక్తా ప్రవర భూషణైః,
భుజైః పరమనారీణా మభిమృష్టమనేకధా. 3

ఉత్తమ స్త్రీలయొక్క హస్తములచేత అనేక విధములుగ నలంకరింపబడిన సువర్ణాభరణములు గల.... దక్షిణహస్తమును.

ఇచట "పరమ నారీణాం" అనుటచేత, రాముని బాహువుల నలంకరించినవా రతని భార్యలని తెలియుచున్నది. అలంకరణ చేయువారు తల్లులును కావచ్చును. కాని వివాహమై భార్యలున్నవారికి తల్లులలంకరణచేయుట జరుగదు. అలంకరణచేయువారు దాసీలుకూడ కావచ్చును. కాని దాసీలను 'పరమనారీణాం' అనుట సమంజసము కాదు గదా!

"నారీ" యను శబ్దమునకు "పురుషుని తన స్వవశము గావించుకొన్నది"అని యర్థము. ఇట్టి శబ్దమును మహాకవియగు వాల్మీకి పరిచారికల కన్వయించునా?

పై విషయములన్నియు రాముని బహుభార్యాత్వమును సమర్థించుచున్నవి.

(రాముని బహుభార్యాత్వమును గురించి-అగస్త్య-దూర్వాస-వసిష్ఠాది మహామునులు రచించిన రామాయణాంశములు, స్కాంధ-బ్రహ్మాండాది పురాణములందు గల విషయములు, ఈ గ్రంథము యొక్క రెండవ సంపుటమగు "ప్రపంచసాహిత్యములో రామ కథ" యందింకను విపులముగ వ్రాయబడినవి).



## 13. రాముని శీలము :

యుద్ధ. 118వ సర్గము : రాముడు సీతతో

శ్లో॥ న హి త్వాం రావణో దృష్ట్వా దివ్యరూపాం మనోరమామ్,
మర్షయేత చిరం సీతే! స్వగృహే పరివర్తినీమ్. 24

సీతా! రావణుడు, మనోహరమగు దివ్యరూపము కలిగి తన గృహమందు చిరకాలము వసించు నిన్ను చూచుచు, సహనము గలిగి యుండడు.

రాముని యీ మాటలనుబట్టి, రాముడు తన యంతఃపురము నందున్న యందమగు స్త్రీలనుగాంచి సహనము కలిగియుండెనా ? యను సందేహము గలుగుచున్నది.

మరియు రాముడు 'దేశే దేశే కళత్రాణి' (యుద్ధ. 102వ సర్గము 12 శ్లోకము) అనుటను బట్టి యతని భావనలో భార్య యనగా సీత యొక్కతే కాదనియు ధ్వనించుచున్నది.

(రాముని యేక పత్నీత్వమును గూర్చి ప్రత్యేకముగ వ్రాయ బడినది.)

## 14. ముగింపు :

రాముని గురించి వాల్మీకి, "పరాక్రమవంతుడు, ధీరుడు, ఇంద్రియ నిగ్రహముగలవాడు, బుద్ధిమంతుడు, నీతిజ్ఞుడు, రమ్యభాషణుడు, శ్రీమంతుడు, శత్రునిషూదనుడు, ధర్మజ్ఞుడు, సత్యసంధుడు, ప్రజాహిత రక్షుడు, జ్ఞానసంపన్నుడు, ఆశ్రితపరతంత్రుడు, సర్వప్రజలయందు సమ బుద్ధిగలవాడు, సర్వధర్మములను-సర్వజనులను రక్షించువాడు, వేద వేదాంగతత్వము నెఱిగినవాడు, సమయస్ఫూర్తిగలవాడు, గంభీరుడు, సాధువు, విచక్షణుడు, సత్పురుషులకు సదాగమ్యుడు, క్షమయందు ధరిత్రీసముడు" అనుచు సద్గుణములన్నిటి నేర్చి-కూర్చి వ్రాసెను.

వీటన్నిటిని గురించి విపులముగా వ్రాయబడినది.

తనను మిక్కిలిగ ప్రేమించి, రాజ్యమును తన హస్తగతము చేయుటకై, కుతంత్రము పన్ని, చివరకు తన కుట్రవిఫలముకాగా, విఫల మనోరథుడైన తండ్రియగు దశరథుని, "మూర్ఖుడు కాముకుడు" అని పరిపరివిధముల నిందించుటచేతను. తనకు సంక్రమించిన రాజ్యమును నిశ్చింతగ రామునకు వదలి ఋషివలె నగరమున నివసింపక, యన్న పాదుకలను సింహాసనమునందుంచి పాలించిన తమ్ముడగు భరతుని శంకించినందువలనను నిత్యకాల నిత్యావస్థల యందును భర్తయగు తననే మనస్సు నందుంచుకొని జీవితమును గడపిన భార్యయగు సీతను-పరులచెంత నివసించుమని నీచోక్తులు పలుకుటయే గాక గర్భిణియగు నామెను కాననముల వెడలనంపిన రాముని, "బుద్ధిమంతుడు, నీతిజ్ఞుడు, ధర్మజ్ఞుడు, సత్యసంధుడు, జ్ఞానసంపన్నుడు, సర్వధర్మములను-స్వజనులను రక్షించువాడు, సాధువు, విచక్షణుడు. సత్పురుషులకు సదాగమ్యుడు, క్షమయందు ధరిత్రీసముడు" అనుట వాస్తవ విరుద్ధముగనున్నది.

పితృవాక్యపాలనపై కందమూలముల భుజించుచు వనముల ఋషివలె జీవించెదనని వచించిన రాముడు, వనముల తండ్రిని నిందించుచు, మాంసభక్షణచేయుచు ఋషిధర్మములకు విరుద్ధమైన యుద్ధము లాచరించుచు కాలముగడుపుటచే పితృకార్యమును నిర్వర్తించలేదు. దీనిని బట్టి యతని మాటలకు చేతలకు పూర్తి వైరుధ్యము గన్పించుచున్నది. దీనినిబట్టియే రాముడు-"ధర్మజ్ఞుడు, నీతిజ్ఞుడు, సత్యసంధుడు"అనుట వాస్తవవిరుద్ధముగ నున్నది.

విరాధ-కబంధుల బాహువుల బంధింపబడినపుడు, నోరు తడి యారుట కార్యచింతనయందు విచక్షణా శూన్యుడగుటచే, రాముని - ధీరుడు-పరాక్రమవంతుడు, సమయస్ఫూర్తిగలవాడు, విచక్షణుడు. అనుట యసమంజసముగనున్నది.

భార్య పరులచే నపహరింపబడ, కాలమంతయు విలపించుచు గడిపిన రాముని, ధీరుడు, ఇంద్రియనిగ్రహముకలవాడు అనుట సమంజసముగలేదు.

సమరమున కాహ్వానించినంతనే రణభిక్షయొసగు వాలిని, సుగ్రీవుని స్నేహము నపేక్షించి, చెట్టుచాటునదాగి చంపుట రాముని యసమర్థతను, అధైర్యమును, అధర్మమును, అవినీతిని చాటుచున్నది. మరియు వాల్మీకి వచించినట్లు రాముడు-సర్వధర్మములను రక్షించువాడు, సర్వప్రజలయందు సమబుద్ధిగలవాడు, సత్పురుషులకు సదాగమ్యుడు, ప్రజాహితరక్తుడు, సత్యసంధుడు, ధీరుడు శత్రునిషూదనుడు, పరాక్రమవంతుడు-అనుటయు సత్యదూరముగనున్నది.

కాని సుగ్రీవుని స్నేహమపేక్షించి వాలిని చంపుటలో రాముని రాజనీతి, సమయస్ఫూర్తి విశదమగుచున్నది.

తనను కామించివచ్చిన శూర్పణఖతో పరిహాసములాడి యామెను విరూపిగ నొనర్చుట సత్శీలతగల యొక క్షత్రియుడు చేయవలసిన కార్యముగ కన్పింపదు.

సుతీక్ష్ణుడు రామునితో నచటి యడవిమృగముల వలన యే దోషము లేదని వచింప, నా మృగములను చంపెదనని-విల్లెక్కుపెట్టుట రాముని విదూషకత్వమును సూచించుచున్నది.

వాలితో రణమునకేగుచు నచటి వనమును చూచినపుడు, సుగ్రీవుడు రామునితో నా వనమందు నివసించిన మునులకు నమస్కరించిన శరీరాశుభము కలుగదని వచింప, సుగ్రీవుడా వనమునకేల నమస్కరించలేదని యాలోచింపక, తాను నమస్కరించుట రాముని విచక్షణారాహిత్యమును మరియు మునుల యందాతనికి గల మూఢ నమ్మకమును తెలియజేయుచున్నది.

"సముద్రము నింకింపజేతును, పర్వతవనములతోగూడిన స్థితి నంతయు నాశనముచేయుదును. పిశాచ-దానవ-యక్ష - రాక్షసులను జూటనవ్రేలికొనతో చంపగలను"-ఇట్టి వచనములు రాముని ప్రగల్భములు పలుకువానిగ నిరూపించుచున్నవి. వీని కుదాహరణములు - సముద్రముపై బాణములు వేసిన సముద్రము చలింపలేదు. రావణుడు-

లక్ష్మణునిపై శక్తిని ప్రయోగింప, రాముడు స్వస్తియని పలికినను ఆ శక్తి లక్ష్మణుని పీడించెను.

ఎవడో శూద్రుడు తపమొనరించుచుండ, తన కుమారుడు మరణించెనని బ్రాహ్మణుడు వచించినతోడనే యా శూద్రుని చంపిన రాముని ధర్మజ్ఞుడు–నీతిజ్ఞుడు–జ్ఞానసంపన్నుడు – ప్రజాహితరక్తుడు– ఇంద్రియ నిగ్రహముకలవాడు–సర్వప్రజలయందు సమబుద్ధిగలవాడు – వేదవేదాంగ తత్త్వము నెఱిగినవాడు–సాధువు. విచక్షణుడు, సత్పురుషు లకు సదాగమ్యుడు–అనుట ధర్మవిరుద్ధమగుచున్నది.

రాముడు దినములో నుదయకాలము పూజాపురస్కారముల తోను, ద్విజ–పురోహితాదుల నాదరించుటలోను, మధ్యాహ్నకాలము నుండి యంతఃపుర స్త్రీలతోను, గడిపెడివాడనుటచే నతడు పరిపాలన యందును శ్రద్ధవహించినట్లు గన్పించదు. వాల్మీకి–రామరాజ్యమును పొగడుటేగాని రాముడు ప్రజలకై యొనర్చిన ప్రజాహిత కార్యముల నేమియు ప్రస్తావించలేదు. దీనినిబట్టి రాముడు తన రాజ్యభోగముల యందాసక్తిచూపెనుగాని ప్రజలక్షేమ మరసినట్లు కన్పింపదు.

రాముడు రాజ్యభ్రష్టుడగుట వలన నందలి దీనత్వమును పోగొట్టుకొనుటకై సీతపై మనస్సు మరలించుకొంటినని వచించుటచే, నతనికి రాజ్యకాంక్ష మిక్కుటముగలదని తెలియుచున్నది. అట్టివాడు సాధువు–ఇంద్రియ నిగ్రహముకలవా డెట్లగును ?

తనకు సర్వమును భర్తయేయని భర్తను మనసా – వాచా – క్రియా ప్రేమించిన భార్యను–అనేక జనసమక్షమున నీచాతినీచముగ నవమానించి–వారియొద్దనుండుము–వీరి యొద్దనుండుము – అని పలుకు టయేగాక, స్వరాజ్యమునకు గొంపోయి కొంతకాల మామె ననుభ వించి, పిమ్మట నెవరో యేదో పలికినారను నెపముతో గర్భిణియగు నామెను వనముల కంపి తుదకామె మరణించినది – బ్రతికినది – ఎట్టి కష్టములలోనున్నదో యేమియు నాలోచింపక, తెలిసికొనక ప్రవర్తిం

చిన రాముని ప్రవర్తనను గురించి పూర్తిగా నవగాహనలేకనే, నేటి యాధునికులలో కొందఱు నూతనవధూవరులను 'సీతారాములవలె జీవింపుడు'' అని యాశీర్వదించుట యాశ్చర్యమును గొలుపుచున్నది.

రాముడు కైకను, దశరథుని తాను నిందించెను. కాని లక్ష్మణుడు, భరతుడు నిందించ తగదని వారించెను. రాముడు సుగ్రీవుని, తన మాటయందు నిలబడనందున చంపెదనని పలికెను. కాని లక్ష్మణు డాతని చంపెదననకూడదని వారించెను. రాముడు కాకిపైనను బ్రహ్మాస్త్రము సంధించెను. కాని లక్ష్మణుడు శత్రుఘాతియగు నింద్రజిత్తు బలపరాక్రమముల కడలి యతనిపై బ్రహ్మాస్త్రము ప్రయోగించెదననకూడదని పలికెను. ఇట్టి మాటలచే రాముడు యితరులకు నీతి చెప్పువాడేకాని, తా నాచరింపడని వెల్లడియగుచున్నది.

భరతునకు సంక్రమింపవలసిన రాజ్యమును తనకు కట్టబెట్టుటలో తన తండ్రిచేసిన కుట్రలో తానుపాల్గొనియు, కుట్రబహిర్గతమై తన తండ్రి నిందితుడుకాగా, తానేమియు నెఱుగనట్లు నటించి తన సమయస్ఫూర్తిని గనబరచెను.

రావణుని చంపుటకై విభీషణుని చేరదీయుటలోను, సుగ్రీవుని సహాయమును పొందుటకై వాలిని చంపుటలోను, రాము డవలంబించిన రాజనీతి మిక్కిలి గణనీయమైనది. సుగ్రీవుని సహాయము లేనిచో రాముడు లంకకు చేరగలిగెడివాడు కాడు. విభీషణుని సహాయమే లేనిచో రావణుని చంపగలిగియుండెడివాడు కాడు. ఈవిధముగ తమ్ము డొక్కడు సహాయముగ గల రాముడు, లంకాధిపతి-మహాబలవంతుడగు రావణుని సైన్యసమేతముగ చంపుట కుపయోగించిన రాజనీతి రాముని యపారమేధాసంపత్తి కొక గీటురాయి.

వాల్మీకి రాముని గుణగణముల నెంతయో ప్రశంసించెనేగాని, యందొక్క దానినైన సమర్థించలేకపోయెను. రాముడు – అర్థ-బల-హీనుడైనను మహాబలవంతుడగు రావణు నెదుర్కొని జయించి చరిత్రలో సార్థకనామధేయుడయ్యెను.

## 15. రాముని జీవితకాలము :

రాముని రాజ్యకాలమును గురించి బాలకాండము 1వ సర్గము 97వ శ్లోకమునందును, యుద్ధకాండము 131వ సర్గము 101వ శ్లోకము నందును, ఉత్తరకాండము 51వ సర్గము 30వ శ్లోకమునందును, 104వ సర్గము 12వ శ్లోకమునందును గలదు.

వీటన్నిటి యందును రాముని రాజ్యపాలనకాలము "దశవర్ష సహస్రాణి-దశవర్ష శతానిచ" అని యున్నది.

"తృతీయం శతమిత్యాహుః చతుర్థంతు సహస్రకం"

సంఖ్యామాన అను ప్రమాణములనుబట్టి

దశ సహస్రము లనగా $10\times4=40$

దశ శతము లనగా $10\times3=30$

మొత్తము : 70 సంవత్సరములు

రాముని జీవితకాలమును నిర్ణయించుటకు, వాల్మీకి రామాయణములో నీ క్రింది యాధారములు కలవు.

బాల. 20వ సర్గము : దశరథుడు విశ్వామిత్రునితో "నా రాముడు పదునాఱు వర్షములవాడు".

ఇది రాముని వివాహమునకు కొద్దిరోజులముందు జరిగిన విషయము.

అరణ్య. 47వ సర్గము : సీత రావణునితో 12 సంవత్సరములు ఇక్ష్వాకు గృహమున నుంటిని.

(ఇదే సందర్భమున సీత నా భర్తకు యిరువదియైదు వర్షములు, నాకు పదునెనిమిది వత్సరములు అని వచించినది. కాని యిది సమంజసముగ లేదు. కారణము-రామునికి వివాహమునాటికి 16 వత్సరములు. కనుక సీత రావణునితో వచించునాటికి రాముని వయస్సు-

| | | |
|---|---|---|
| వివాహమునకు పూర్వము | : | 16 సంవత్సరములు |
| ఇక్ష్వాకు గృహమున వివాహమునకు పిమ్మట | : | 12 సంవత్సరములు |
| అప్పటికి గడచిన వనవాసకాలము | | 13 సంవత్సరములు |
| మొత్తము | : | 41 సంవత్సరములు |

మరియు సీత వచించినట్లు రామునకు 25 వత్సరములు, సీతకు 18 వత్సరములని తలచినచో వారిరువురి వయోభేదము 7 సం॥లున్నది. కాని సీత-అనసూయతో తన వివాహమును గురించి తెలుపుచు 'తన యొక్క వివాహయోగ్యమగు వయస్సును జూచి తన తండ్రి తనకు తగిన భర్తను వెదకుటకై మిక్కిలి చింతించెననియు, స్వయంవరమును చాటు, ననేకులు వచ్చి శివధనుస్సు నెక్కిడజాలక తిరిగి వెళ్ళిరనియు వచించెను. ఈ మాటలనుబట్టి సీతయు యుక్తవయస్కురాలు. రాముని వయస్సున కామె వయస్సు నేమాత్రము తక్కువయుండ దని విదితమగుచున్నది. రాముని వయస్సుకంటె నామె వయస్సించుక ఎక్కువయునై యుండవచ్చును.

పై విషయములనుబట్టి రాముని జీవితకాలము నీ క్రింది విధముగ నిర్ణయించవచ్చును—

| | | |
|---|---|---|
| వివాహమునకు పూర్వము రాముని వయస్సు | : | 16 సం॥లు |
| వివాహమైన పిదప వనవాసమునకు ముందుకాలము | : | 12 సం॥లు |
| వనవాసకాలము | : | 14 సం॥లు |
| పట్టాభిషేకానంతరము అయోధ్యయందు ఆమెకు కుశలవుల ప్రసవించునాటికి | : | 2 సం॥లు |
| సీత ప్రసవించునాడు శత్రుఘ్ను డచట నేయుండెను పిమ్మట 12॥కు అతడు అయోధ్యకు తిరిగివచ్చెను | : | 12 సం॥లు |
| పిమ్మట అశ్వమేధము | | |
| రాముడు రాజ్యమును పాలించిన కాలము | : | 70 సం॥లు |
| రాముని జీవితకాలము | : | 112 సం॥లు |

ఉత్తరకాండము 42వ సర్గము : రాముడు సీతను పరిత్యజించు సమయమున, "అప్పటికి రామాదులకు పదివేల వర్షములు గడచి పోయెను" అని యున్నది. పైన వచించిన ప్రకారము రాముని వయస్సప్పటికి 16 + 12 + 14 = 42 సం॥లు. కనుక యిదియు రాముని జీవితకాలము 11వే సం॥లు అనుటను, పై సంఖ్యామానప్రమాణమును స్థిరీకరించుచున్నది.

# 13. దశరథుడు

వాల్మీకి దశరథుని గురించి వేదవేత్త, సర్వమును సంగ్రహించువాడు, దూరదృష్టిగలవాడు. మహాతేజస్వి, పౌరులకు, దేశమునకు హితుడు, ఇక్ష్వాకులలో నతిరథుడు, యజ్ఞములు చేయువాడు, ధర్మాసక్తుడు, వశ్యుడు, మహర్షి సమానుడు, రాజర్షి, త్రిలోకఖ్యాతుడు, బలవంతుడు, శత్రువుల జయించినవాడు, మిత్రవంతుడు, జితేంద్రియుడు ధనవంతుడు, మహాతేజుడగు మనువువలె లోకరక్షకుడు, సత్యసంధుడు, ధర్మార్థకామముల నాచరించువాడు'అని వ్రాసెను. బాల 6వ సర్గము 1 నుంచి 5 శ్లోకములు).

దశరథునకు కౌసల్య, సుమిత్ర, కైకేయి, మరియు మున్నూట యేబదిమంది భార్యలు. ఇందఱు భార్యలున్నను అతనికి సంతానము లేదు. అతడు కేకయరాజు పుత్రియగు కైకను పరిణయమాడువేళ, కేకయ, రాజుతో కైకకు జన్మించు సుతునకే రాజ్యమొసంగుదునని వాగ్దానము చేసెను. పిమ్మట వైజయంతీరాజగు తిమిధ్వజునితో రణమొనర్చుచుండ నతనిని, అతని భార్యయగు కైకేయి, ప్రాణ సంకటస్థితినుండి కాపాడెను, అందుల కతడు ప్రీతుడై యామెను వరద్వయము కోరుకొమ్మనె, నామె వలసినప్పుడు కోరుకొందునని వచించెను.

దశరథునకు వృద్ధాప్యమున కౌసల్యయందు రాముడు కైకయందు భరతుడు, సుమిత్రయందు లక్ష్మణ శత్రుఘ్నులు జన్మించిరి. దశరథునకు జ్యేష్ఠపుత్రుడగు రామునకు రాజ్యమప్పగించవలయునను కోరిక గలిగెను. దశరథుని పుత్రులకు యుక్తప్రాయము వచ్చెను. కుమార్తెయగు సీతాస్వయంవరమున శ్రీరాముడు ధనుర్భంగము చేయగా, మిథిలరాజగు జనకుడు తన కుమార్తెలను దశరథపుత్రుల కీయదలచి పురోహితునితో నాహ్వానము బంప దశరథుడు, పుత్ర, బంధు - మిత్ర పురోహిత సైన్యసమేతముగ మిథిలకు జేరెను.

భరతుని మేనమామయగు యుధాజిత్తు, తండ్రియాజ్ఞపై మేనల్లుడగు భరతుని జూడగోరి, అయోధ్యకు రాగా, నచట మేనల్లుండ్ర పరిణయవార్త వినినవాడై యచటనుండి మిథిలకేతెంచెను.

జనకుడు తన కుమార్తెలగు సీత, ఊర్మిళలను రామ-లక్ష్మణులకు, తన తమ్ముడగు కుశధ్వజుని కుమార్తెలైన మాండవి, శ్రుతకీర్తి యనువారలను భరత-శత్రుఘ్నుల కిచ్చి వివాహమొనరించెను. వివాహమైన పిమ్మట దశరథుడు కుమారులతోను-కోడండ్రతోను తన బంధుమిత్ర వర్గముతో నయోధ్యకు తిరిగి వెళ్ళెను.

కొలది రోజులైన పిమ్మట దశరథుడు, తన జ్యేష్ఠకుమారుడగు రాముని పట్టాభిషేకమునకు భరతుని దూరముగనుంచదలచినవాడై యతనితో 'నీ మేనమామ నీకై వచ్చి, మిథిలయందు నన్ను కోరినాడు. కనుక నీ మేనమామ కోరిక తీర్పదగును' అని పలుక, భరతుడు సంతసించినవాడై మేనమామతో కేకయ రాజ్యమునకేగెను. తండ్రి మనస్సు గ్రహించిన రాముడు, తండ్రి తనకై భరతుని రాజ్యమునుండి పంపుట గ్రహించి, తండ్రిని మిక్కిలి గౌరవించెను. దశరథుడు రామునికి ప్రజలయం దాదరాభిమానములు కలుగజేయుటకై నతనితో ప్రజాహితకార్యములు చేయించుచుండెను. ఇట్లు పండ్రెండు వత్సరములు గడువగా, దశరథుడు తన ప్రీతిపాత్రులగు మంత్రి, పురోహిత - పుర

ప్రజల సమావేశపరచి, "తాను మిక్కిలి వృద్ధుడైనందున, రాజ్యమున రాముని నియమించదలచినాననియు, అందులకై మీ యభిప్రాయమును తెలుపుడనియు, వారిని కోరెను. వారందులకు సంతసించిరి. ప్రజాభిప్రాయముతోనే తాను రాముని రాజ్యాభిషిక్తుని చేయుచున్నానని ప్రజలకు చూపదలచి, ప్రజాభిప్రాయమును మరియొకసారి కోరుచు 'మీరు నేను చెప్పినందున రాముని రాజుగ కోరుచున్నారా? లేక రాముని యందలి గుణగణములనుజూచి రాముని రాజుగ కోరుచున్నారా!' యని యడిగెను. అందుల కచట ప్రజలు, 'రాముడు సద్గుణసంపన్నుడగుటచేతనే - యతనిని రాజుగా కోరుచున్నా'మని పలికిరి.

దశరథు డందుల కెంతయు సంతసించి. గృహమున కేగి, రాముని పిలిపించి మఱునాడు తెల్లవారగనే యతని పట్టాభిషేకము జరుగబోవుచున్నదనియు, భరతుడు వచ్చులోపలనే పట్టాభిషేకము జరుగవలయుననియు, కనుక యాప్తులగు మిత్రులరక్షణలో నుండుమనియు, ఆ రాత్రికి తగు నియమములు పాటింపుమనియు నతనికి తెలిపిపంపెను. పిమ్మట రాత్రికాగా కైకగృహమునకు బయలుదేరెను.

దశరథు డొనర్చుచున్న ప్రయత్నమంతయు కనిపెట్టిన కైకయొక్క పుట్టినింటి దాసియగు మంథర, కైకతో జరుగుచున్న విషయము లన్నియు తెలిపెను. దశరథుడు తన గృహమునకు వచ్చినంతనే కైక భర్తతో తన కుమారుడగు భరతుని రాజ్యపు హక్కునుగురించి ప్రశ్నించెను. ఎన్నో సంవత్సరములనాడు జరిగిన విషయమును, తానెంతో గుప్తముగానుంచి, ఒక్కరోజు వ్యవధిలో రాముని పట్టాభిషేకమును నిర్ణయించినను, తన పథకమంతయు పటాపంచలుకాగా, దశరథుడు నిర్వీర్యుడై, తుదకెట్లో ధైర్యము కల్పించుకొని కైకతో నా ప్రమాణ మామెకు చేసినది కాదని తృణీకరించెను. అంత కైక, దశరథునితో, నతడు తిమిధ్వజునితో జరిగిన యుద్ధమున తన కొసంగిన

వరములైవా జ్ఞప్తియున్నవా? అవి యైనా నెరవేర్తువా? యని యడుగ, దశరథు డందుల కంగీకరించెను. నిపుణురాలగు కైక వెంటనే తన రెం వరములలో నొకటి భరతుని పట్టాభిషేకము. రెండవది రాముడు పదునాలుగేండ్లు ఋషితుల్యుడై దండకారణ్యమున వసించుట'యని తెలిపెను. దశరథుడు నిర్ఘాంతపోయెను. కైకను ప్రతిమాలాడెను. ప్రార్థించెను. నిందించెను. తుదకు రాముని వనవాసమునకు బదులు ఏదైనా కోరుమని యెంతయో దీనుడై వేడెను.



దశరథు డెంత దీనుడై విలపించినను, కైక వరములు నెరవేర వలయుననియే పట్టుబట్టెను.

పిమ్మట కైక యాజ్ఞపై రాముడు పిలిపించబడెను. కైకయే రామునితో నతని తండ్రి తన కిచ్చిన వరములను తెలుప, గత్యంతరము లేని రాముడు భార్యతోను-తమ్ముడగు లక్ష్మణునితోను వనముల కేగెను.

తరువాత నారుదినములకు దశరథుడు మరణించెను.

కౌసల్యా, సుమిత్రాది అగ్రభార్యలున్నను కైకను పెండ్లి యాడుటకై, యామెకు జన్మించిన వానికే రాజ్యము నొసంగుదునని పలికిన దశరథుడు ధర్మాసక్తుడు, ధర్మార్థ కామముల నొనరించువాడు, దూరదృష్టిగలవాడు, మిత్రవంతుడు, పౌరులకు - దేశమునకు హితుడగునా?

కౌసల్యా-సుమిత్రలు గాక మున్నూటయేబదిమంది భార్యలున్నను తృప్తినొందక కైక యందాసక్తుడై, ధర్మాధర్మవిచక్షణమూని, అగ్రభార్య లున్నారని తలచక, కనిష్ఠభార్యయగు కైకకు జన్మించినవానికే రాజ్యము నొసంగుదునని వాగ్దానము గావించిన దశరథుడు వేదవేత్తయగునా? అతనిని మహర్షితుల్యుడు, రాజర్షి యనుట సమంజసమా?

మున్నూటయేబదిమందికిపైగా భార్యలున్నను, తృప్తినొందక

కైకను పరిణయమాడుటకై పరితపించినవాడు, రాజ్యమును రామునకు కట్టబెట్టు తన మంత్రాంగము విఫలముకాగా కైకయొద్ద ఘోరున విలపించినవాడు, కౌసల్యా-కైకలయొద్ద నా యా సమయములందు వారిపాదములబట్టి ప్రార్థించినవాడు జితేంద్రియుడగునా? అతడు కామ క్రోధముల జయించినట్లెచటను కన్పింపదు.

వాల్మీకి దశరథుని బలవంతుడనియు, శత్రువుల జయించిన వాడనియు, ఇక్ష్వాకులలో నతిరథుడనియు, మహాతేజుడనియు, మనువు వలె లోకరక్షకుడనియు వ్రాసెను. కాని పై పొగడ్తల కాధారము లెచటను కన్పించుటలేదు. వాల్మీకి రామాయణము అయోధ్య కాండము 9వ సర్గలో మాత్రము, దశరథుడు, దేవేంద్రునికి సహాయముగ వైజయంతీ పురాధీశుడగు తిమిధ్వజునితో రణమొనర్చినట్లున్నది. కాని యీ రణమందును అతడు గాయపడియుండ, కైక, భర్తను రణభూమినుండి దూరముగా గొనిపోయి రక్షించెను—

బాల. 20వ సర్గలో : విశ్వామిత్రుడు రావణుని పేరు చెప్పినంతనే అతని జయింప నశక్యుడనని వచించెను.

బాల. 75వ సర్గము : పరశురాముడు రాముని ద్వంద్వయుద్ధమునకు పిలువ, దశరథుడు దీనుడై పరశురాము ననేక విధముల ప్రార్థించెను.

ఇట్టి వానిని బలవంతుడు, శత్రువుల జయించినవాడు, అతిరథుడు, మహాతేజుడు, లోకరక్షకుడు-అనుట సమంజసమా?

## కైకేయి తన కోర్కెలకై యలుగ దశరథుడు పలికిన మాటలు చూడుడు.

అయోధ్య. 10వ సర్గము :

శ్లో॥ కస్య వా తే ప్రియం కార్యం కేనవా విప్రియమ్ కృతమ్
కః ప్రియమ్ లభతా మద్యకోవా సుమహాద ప్రియమ్
మాలో దీర్ఘాశ్చ కాక్షి స్త్వం దేవి సం-పరిశోషణమ్. 32

అవధ్యో వధ్యతాం కో వా కో వావధ్యో విముచ్యతామ్,
దరిద్రః కో భవత్వాఢ్యో ద్రవ్యవాన్ వాప్య కించనః. 33.

ఎవనికి ప్రియము చేయవలయును ? నీ కెవడపకారము చేసెను ? నాకు హితులగు వారలలో నెవడు నీ కప్రియమును చేసెను ?

దేవి ! దుఃఖింపకుము. నాకు దుఃఖము కలిగింపకుము అవధ్యులలో వధ్యు డెవడు ? చంపదగినవారలలో నవధ్యు డెవడు ? ఏ దరిద్రుడు ధనవంతుడుగను, ఏ ధనవంతుడు దరిద్రుడు కాదగును ?

ఈ మాటలనుబట్టి దశరథు డెట్టివాడై నది తెలియుచున్నది.

భార్య ప్రీతికై చంపదగనివారలను చంపువాడు, ధనవంతులను దరిద్రులుగా నొనరించువాడు సత్పురుషుడా ? ప్రజలకు హితముచేయువాడా ? ధర్మాత్ముడా ? లోకరక్షకుడా ? త్రిలోకఖ్యాతుడా ? ధర్మార్థ కామముల నాచరించువాడా ? పౌరులకు-దేశమునకు హితుడా ?

రాజ్యమును కైక పుత్రున కిచ్చెదనని వాగ్దానముచేసి, యామెకు తెలియకుండ రామునికి రాజ్యము కట్టబెట్టుటకు యత్నించిన దశరథుడు సత్యసంధుడా ?

దశరథుని సమక్షమున పురోహితుడగు వసిష్ఠుడు, మంత్రియగు సుమంత్రుడు, తన భార్యయగు కైకేయిని జనుల యెదుట నిందించుచుండ దశరథుడు వారి నేమియు ననలేదు. దీనినిబట్టి దశరథు డెంతటి యసమర్థుడో విశదమగుచున్నది. ఇట్టి రాజును త్రిలోకఖ్యాతుడని వాల్మీకి వచించుట వింతగనున్నది.

## 14. భరతుడు

ధర్మాసక్తుడు, దూరదృష్టిగలవాడు, మహర్షితుల్యుడు రాజర్షి. పుట్టుకచేతనే, అయోధ్యరాజ్యమునకు తండ్రియగు దశరథునికి పిమ్మట రాజు కాదగినవాడు. తండ్రిని పూర్తిగ విశ్వసించెను. తండ్రి

తనకు జెందవలసిన రాజ్యమును, రాజునకు కట్టబెట్టుటకు యత్నించి నాడని వినియు, నిర్వికారుడై, తన తండ్రికి జరుగవలసిన క్రియలలోనే లోపము రాకుండ నిర్వర్తించెను. తాను లేని సమయమున తన తల్లి తనకు తన తండ్రి వాగ్దానము ప్రకారము రావలసిన రాజ్యమును సంపాదించినదని తెలిసియు, తన తల్లితో, తన పూర్వీకులనుండి తన వంశములో వచ్చుచున్న యాచారము ప్రకారము రాజ్యము తన యన్నకే చెందవలయునని తెలిపి ధర్మాచరణీయు డాయెను.

అమాత్యులు - పురోహితులు రాజ్యము స్వీకరింపుమనికోర, రాజ్యమును తృణప్రాయముగ వదలి, యడవులకేగి యన్నయగు రాముని రాజ్యము స్వీకరింపుమనికోరెను. రాముడు నిరాకరింప, రాముని పేరుతోనే యతని పాదుకలను సింహాసమునుంచి రాజ్యము పాలించెను.

సోదరులగు రామ లక్ష్మణులు కాషాయాంబరధారులై వనముల నుండ, వారికిలేని సుఖములను తాను పొందదలచనివాడై తానును కాషాయాంబరములు ధరించి, అయోధ్యను వదలి, అయోధ్య కనతి దూరమునగల 'నంది'యను పల్లెయందు వసించెను. సోదరు లయోధ్యకు తిరిగివచ్చు వఱకు ఫలమూలముల భక్షించుచు, జడలుధరించి, తాపసిధర్మము నాచరించుచు, నారచీరలు-జింకజర్మములు ధరించుచు కాలముగడిపెను. హనుమంతుడు భరతుని 'ధర్మజ్ఞుడు, శరీరము ధరించిన సర్వోత్కృష్టునివలె నున్నవాడు' (తం ధర్మమివ ధర్మజ్ఞం దేహవంత మివా పరమ్, యుద్ధ. 128 సర్గము 34 శ్లోకము 1వ పాదము) అని శ్లాఘించెను.

రాముడు, సీతా లక్ష్మణులతో వచ్చుచున్నాడని వినిన వెంటనే యమిత సంతోషముతో నా వార్త తెలిపిన హనుమంతునకు గోసహస్రమును, శతగ్రామములను, కుండలములను, సద్వర్తనలగు భార్యలను, బంగారుమేని ఛాయగలిగి - సుందరులైన - సర్వాభరణభూషితలగు పదునార్గురు కన్యల నొసగెను.

రాముడయోధ్యకు వచ్చినంతనే యతనికి రాజ్యము నొసగి, అతని కోరికపై యౌవరాజ్యమందుండి రాజ్యభారమును వహించెను.

రామ - భరతులకు గల వ్యత్యాసములు :

1. దశరథుని వాగ్దానము ప్రకారము రాజ్యము భరతునకు సంక్రమింపవలయునని తెలిసియు, తండ్రితో కలిసి రాజ్యమునకై కుట్ర పన్నినవాడు రాముడు. తన వంశధర్మమును గుర్తించి, సంక్రమించిన రాజ్యమును అన్నకై తృణప్రాయముగ వదలినవాడు భరతుడు.

2. రామునియందే దోషమును మనస్సులో నెంచక జీవితాంతము భాతృప్రేమతో గడపినవాడు భరతుడు. తన రాజ్యమును రామునకు వదలి, యతని పాదుకలను ప్రతినిధిగనుంచి రాజ్యమును పాలించుచున్నను, భరతుని యనుమానించి, యతని చర్యల గమనించుమని హనుమంతుని యతని యొద్దకు పంపియు, తనకు సన్నిహితులగు భరద్వాజ-గుహులతో భరతుని చర్యను పరీక్షించ యత్నించినవాడు రాముడు.

3. వనమున కందమూలములు భుజించుచు గడుపుదునని కనుపించిన వారందఱితో తెలిపి, మాంసము నారగించినవాడు రాముడు. సోదరులు వనమున ఋషులై చరించుచుండ తాను భోగముల నిచ్చగించనివాడై, పట్టణనివాసమును వదలి కాషాయాంబరములు, నారచీరలు ధరించి, ఫలమూలముల భుజించుచు తపస్వియై గడిపినవాడు భరతుడు.

# 15. లక్ష్మణుడు

భ్రాతృ ప్రేమ : అన్నయగు రాముని బాల్యము నుండియు నభిమానించెను. తండ్రికంటె మిన్నగ నతనిని నారాధించెను. అన్నకు రాజ్యము రాబోవు తృటిలో చేజార తన మనస్సులోని యా వేదనను, ఆవేశమును, అణచుకొనజాలక, నిర్భయముగ దశరథునకు జ్యేష్ఠ పుత్రుడగు రామునకే రాజ్యము రావలయుననియు, అట్లు కానిచో తండ్రిని-నిర్విచారముగ బంధింతుననియు లేనిచో వధింతుననియు (అయోధ్య 21వ సర్గము 12 శ్లోకము), భరతుని పక్షమునకు చెందిన వారిని-భరతుని హితముగోరు వారిని పట్టివధింతుననియు పలికెను (అయోధ్య. 21వ సర్గము 11వ శ్లోకము) చివరకు, అన్న మాటలకు తలయొగ్గి, అన్నతో వనములకేగి, వనముల-రామునికెంతయో సేవ జేసెను. రాముడు విరాధ-కబంధాది రాక్షసులచే జిక్కి-విలపింప, యతని నోదార్చి ధైర్యముగ నా రాక్షసవీరుల చంపు నుపాయము దెలుపుటేగాక, వారిని చంపుటలో తోడ్పడెను.

సీతాపహరణ సమయమున. సీతకు రక్షణగ, అన్నచే నియమింపబడి, సీత-తనపై మోపిన ఘోరాతినిందలనుగూడ చాలవఱకు భరించెను. పిమ్మట సీతచే తీక్ష్ణముగ నిందింపబడి, దీనుడై యన్న కడకేగెను. రాముడు తనమాట త్రోసిపుచ్చి-సీతను వదలి వచ్చినందుకు లక్ష్మణుని నిందించెను. ఈ విధముగ నిరువురచే నిందింపబడియు తన సేవాతత్పరతను వదలక యన్నను సేవించెను. సీతా వియోగముచే దుఃఖించు రాముని యెన్నియోమారు లోదార్చెను.

సముద్రముపై వారధికట్టుసమయమున రాముడు తన పరిస్థితిని, తన శక్తినిపరిగణించక-సముద్రము నింకింతునని, వానరుల యెదుట సముద్రముపై బాణము లిడుచుండ, పరిస్థితిని గ్రహించి, తన విచక్షణ నుపయోగించి, అన్నను పొగడుచు, సముద్రముపై బాణములు ప్రయోగించకుండ చేసి, యతనిని నవ్వులపాలు గానీయక కాపాడెను.

రావణాది రాక్షసులతో జరిగిన భయంకర యుద్ధములో తన యన్నకు ముందునిలిచి ప్రాణములను తృణప్రాయముగ నెంచి రణమొనరించెను. ఈ విధముగ లక్ష్మణుడు భార్యను, సుఖములను వదలి పదునాలుగేండ్లు రామునికై నిరతము శ్రమించెను. లక్ష్మణుడే తోడు లేకున్న రాముడు–వనవాసమును నిర్విఘ్నముగ గడిపియుండ లేడు. రాముని ప్రతి కష్టదశయందును లక్ష్మణుడే ముందుండి కార్యము నిర్వర్తించెను. ఈ విషయమున కైక వనవాస శిక్ష విధించినది రామునికైనను, రామునికంటె మిన్నగ వనవాసకష్టము లనుభవించినవాడు లక్ష్మణుడు.

గర్భవతియగు సీతను పరిత్యజించుసమయమున రాముడు లక్ష్మణుని నియోగింప, నతడు వాల్మీకి వనసమీపమున సీతతో నావార్త తెలుపుచు నెంతపరితపించెనో వర్ణింపశక్యముకాదు. ఈవిధముగ తాను చేయుదగని–చేయజాలని కృత్యములుకూడ నిర్వర్తించి లక్ష్మణుడు తన జీవితాంతము రాముని సేవకే వినియోగపడెను.

రాముడు పట్టాభిషిక్తుడగు సమయమున, లక్ష్మణుని త్యాగమునే గురించి యువరాజుగ నుండుమని కోరెను, తనకంటె పెద్దవాడగు భరతు డుండుటచే తాను యువరాజుగ నుండగూడదని తలచినవాడై, ధర్మానురక్తుడై వర్తించెను. కాని చివరకు వృద్ధాప్యములో రామునిచే బహిష్కరింపబడి ప్రాణముల వీడెను.

## 16. మంధర

కైక పుట్టినింటి దాసి–కైక వివాహమైన పిదప కైకతో నత్తవారింటి కేగినది. అయోధ్యానగరము, రాజభవనము లోకరాత్రి యందలంకరింపబడుటను జూచి యాశ్చర్యమునందినదై, కొంతనున్నదాదివలన మరునాడు రామునకు యువరాజ్యమునందభిషేకము జరుగబోవుచున్నదను వార్తను తెలిసికొనినదై త్రుటిలోకార్యమును నిరయించెను. వెంటనే యామె మనస్సులో – దశరథుడు కైకను

వివాహమాడు సమయమున, కైకకు పుట్టినవానికే రాజ్యమొసంగెదనని దశరథుడు కేకయరాజుతో వచించుట. రామ భరతాదులకు వివాహమైన వెంటనే, భరతుని రాజ్యమున లేకుండ జేసి - రామునిచే మంత్రి పురోహితాదుల కోర్కెలు నెరవేర్చునట్లు చేయుట మొదలగు సంఘటనలన్నియు మెదలెను.

వెంటనే కార్యోన్ముఖురాలై, నిశ్చింతగ పరుండియున్న కైకేయి యొద్దకేగి రాముని పట్టాభిషేకవార్త నామెకు తెలిపెను. రాజవంశములలో రాజ్యమునకై జరుగు కుతంత్రము లెఱుగని యమాయకపు కైకేయి, సవతి బిడ్డలయందును - తన బిడ్డయందును భేదముచూడని కైకేయి యెంతయో ముదమందెను. కైకేయి అమాయకతను, దశరథుని కుటిలపన్నాగమును గ్రహించిన మంధర కైకతో భరతునకు పుట్టుకతో గలిగిన రాజ్యసాన్నిహిత్యమును, రాజ్యార్హత గోల్పోయిన రామునికి, దశరథుడు పట్టాభిషిక్తు నొనరించుయత్నమును, రాముడు రాజగుచో రాముని సంబంధులగు కౌసల్యాదులకు గలుగు హితవు, అధికారము, భరతునికి-భరతుని సంబంధులగు కైకకు-యామె కోడలికి జరుగు హీనదశ విన్నవించెను. అప్పటికిని, కుతంత్రము లెరుగని కైకేయి కార్యోన్ముఖురాలు కాకుండుట గ్రహించి, మంధర కైకేయిని మందలించుచు రాజ్యమును గురించి, రాజులను గురించి కైకేయికి బోధపరచుచు, రాముడు రాజైనచో, నతని పిమ్మట రాముని జ్యేష్ఠపుత్రుడే రాజగుననియు, ఈవిధముగ భరతుడు రాజ్యమునుంచి తొలగించబడి, యనాథునివలె సుఖములనుండి-రాజవంశమునుండి నిరస్తుడగుననియు. రామునివంశమే ఖ్యాతినిపొందగలదనియు, అతని జ్ఞాతి పక్షమునకే ప్రయోజనము కలుగుననియు-యీ విధముగు రాజఖ్యాతిని గురించిన విషయము లనేకములు దెలిపి, యామెను కార్యోన్ముఖురాలిని చేసెను.

కైక-మంధర జ్ఞానసంపత్తి కాశ్చర్యము నొందుచు నామెనోటి వంకనే జూచుచుండెను. అంత మంధర, కైక పుట్టినింటినుండి కైకతో

తనను పంపిన రాజవంశమువారి కృతజ్ఞతను తీర్చుకొనదలచినదై, తన విధినిర్వహణను మనసునందు తలచి కైకతో నిట్లు వచించెను.

దశరథుడు నీ వివాహమునాడు చేసిన వాగ్దానమును మనస్సునందుంచుకొనుము. మఱియు నీవు నాకు దెల్పిన విషయమొకటి గలదు. పూర్వము తిమిధ్వజునితో జరిగిన యుద్ధమున నీవు నీ భర్త ప్రాణముల కాపాడినందుల కతడు సంతుష్టుడై నీకు రెండువరములు ప్రసాదించెదనన, నీవు 'వలసినప్పుడు కోరుకొనెదన'ని నాడతనితో వచించితివి. కనుక నీవిప్పుడు వానిని యాచింపుము. అందొకటి భరతునికి పట్టాభిషేకము. రెండవది రామునికి పదునాలుగేండ్ల వనవాసము. అట్లు జరిగిన యీ పదునాలుగేండ్లలో నీ పుత్రుడు ప్రజల మనస్సునుపొంది రాజ్యమున స్థిరత్వము పొందగలడు. కనుక నీవు నీ సౌందర్యశక్తిని దెలిసికొని మలినాంబరధారివై కోపగృహమును జేరి నీ కార్యమును సాధించుకొనుము

ఈ విధముగ హితవుదెలిపిన మంథర మధురవచనముల నాలించి కైకేయి తన కార్యమును సాధించుకొనెను. కాని మంథర, తనయందు తప్పులేకున్నను రాజసభయందు పలువురి యెదుట శత్రుఘ్నునిచే జుట్టుపట్టుకొని నేలపై యీడ్చబడి పరాభవము పాలయ్యెను.

ఈ విధముగ మంథరయొక్క పాత్ర చక్కగా పోషింపబడినది. ఆమె కైక పుట్టినింటినుండి-కైక హితముగోరి వచ్చుటచే, కైక యత్తగారింటిలో కైకకు జరుగు నన్యాయమును గుర్తించి, యంతకు పూర్వము జరిగిన విషయములు తెలిపి, జరగవలసిన విషయముల కొక కార్యక్రమమును సూచించినది. మంథర కైక కావిధముగ తెలుపకపోయినచో కైక పుట్టినింటి దాదిపాత్రకే కళంకము కలిగియుండెడిది. ఆ విధముగ మంథర తన విధిని గుర్తించి, నిర్వహించినది. ఫలితముగ రాజ్యకాంక్షలేని భరతుని సమ్ముఖమున, శత్రుఘ్నునిచే పరాభవించబడినది. ఇది రాజుల చేష్టలను వెల్లడించుచున్నది.

"రాజుల కత్తికి రెండువైపుల పదునే" యన్నట్లు, కైక యట్లు చెప్పక పోయిన తన విధినిర్వాహణలో కళంకము చేసిన దగును, చెప్పియు శత్రుఘ్నునిచే దండింపబడెను.

తన తండ్రి పూర్వీకుల ప్రకారము తన యన్నయే రాజ్య మేల వలయునని రాజ్యమును తృణీకరించి భరతుడు ప్రశంసింపబడినాడు. కాని తన తల్లి పుట్టినింటదాసి, తనకు రాజ్యమునుకోరి, విదుషీమణియై-వాక్చాతురితో తన తల్లిని కార్యోన్ముఖురాలుచేసి, తననుంచి చేజారి పోవుచున్న రాజ్యమును తిరిగి తనకు కట్టబెట్టిన-దాసియగు మంథర-మేలును మరచి, కృతఘ్నుడై, మంత్రి పురోహితాదుల సమక్షమున వారి మనస్సులకు సంతృప్తి కలుగజేయుటకై, స్త్రీ యను విచక్షణను, తన తల్లిని-తనను బాల్యమునుండి ప్రేమతో నెత్తుకొని, లాలించి-బుజ్జగించిన మమతాపేక్షలను, సేవానిరతిని మరచి, తన యెదుట తన తమ్ముడు దండించి పరాభవించుటను చూచుచు నూరకుండిన రాజ వంశపు భరతుడు నిందించబడలేదు. (శత్రుఘ్నుడు దండించిన పిమ్మట యామెభయబడి భరతుని శరణుగోర నతడు శత్రుఘ్నుని వారించెను.)

వాల్మీకి యీ విధముగ 'మంథర' పాత్రను చక్కగా రచించుటయేగాక, రాజుల నిరంకుశత్వమును - రాజుల దుండగములను విశదీకరించెను.

కాని వాల్మీకి-మంథరను పాపియనియు-అసూయాపరురాలనియు నిందించుట యసహజముగ నున్నది. దీనినిబట్టి వాల్మీకి రాముని పక్షమువారినే పొగడుచు, రాముని వ్యతిరేకులను నిందించు స్వభావము గలవాడని విదితమగుచున్నది. ఇట్టి భావములతో రచన సాగించిన వాల్మీకి, రామాయణమును రాముని పక్షముగ రచించుటలో వింతయేమున్నది?



# 17. కైకేయి

కేకయ రాజగు అశ్వపతి కుమార్తె, యుధాజిత్తు సోదరి, అయోధ్యరాజగు దశరథుని చిన్న భార్య. సౌందర్యవతి, రాచ విద్యల యందారితేరినది. వృద్ధుడగు భర్తను కల్మషమెరుగక ప్రేమించినది. సవతి పుత్రులను తన పుత్రులవలె కల్మషములేకుండ పెంచి పెద్దజేసినది.

భర్తయగు దశరథునితో, వైజయంతీ పురాధీశుడగు తిమి ధ్వజునితో జరుగు రణమునకేగి, రణమున తన భర్తగాయపడి స్మృతిని గోల్పోవ రథమును రణభూమినుండి దూరముగ తీసికొనిపోయి తన భర్తప్రాణములు కాపాడుకొనినది. దీనినిబట్టి కైక సమయజ్ఞురాలనియు, రాచవిద్యల యందారితేరిన రాచబిడ్డయనియు వ్యక్తమగు చున్నది.

దశరథుడు రాముని యువరాజ్యాభిషిక్తుడుగ జేయుచున్నాడని విని మొదట రాముడు తన కుమారుడే యని యెంతయో సంతో షించినది. దీనినిబట్టి యామె మనస్సులో రామునకు - భరతునకు తేడా లేదని వ్యక్తమగుచున్నది. కాని తన కుమారునకు చెందవలసిన రాజ్యమును, దశరథుడు దుర్బుద్ధితో భరతుని దేశమునుండి దూరముగా బంపి రామునకు కట్టబెట్టుచున్నాడని, రాముడును, భరతునకు చెందవలసిన రాజ్యమునకు తాను పట్టాభిషిక్తుడగుటకు యత్నించు చున్నాడని తెలిసికొనినపుడు, కార్యోన్ముఖురాలై తన భర్తతో - రాజ్యమునకై తన కుమారుడగు భరతునకు రావలసిన హక్కును నిలదీసి ప్రశ్నించినది. తన కుమారుడగు భరతు దూరలేకున్నను రామ దశరథులు భరతునినుండి యప్రమత్తులుగా నుండుటను గ్రహించి, రాముని వనవాసమునకు గట్టిగాపట్టుబట్టెను. సర్వవిధముల తన కార్యమును సాధించుకొనదలచిన దశరథు డామెను దూషించియు- నిరసించియు-కన్నీళ్ళతో ప్రార్థించియు-పాదములు పట్టుకొని బ్రతిమ లాడియు-యామెకై యెట్టి నీతి-ధర్మవిరుద్ధకార్యములైన చేయుదుమని

ప్రమాణములుచేసియు నెన్నివిధముల ప్రయత్నించినను కైక తన వరములను మార్చలేదు. రాముడును ఆమె ప్రాపుసంపాదింపదలచి, భరతునకై తన ప్రాణములను-ధనములను. రాజ్యమును, సీతను త్యజించెదనని బలుక, భరతునిపై యంతటి ప్రేమగలవాడైనచో భరతుని రాజ్యమునకై యింతటి తాపత్రయమేలపడుచున్నాడోనని మనస్సునదలచి, "తండ్రిని సత్యసంధునిగ జేయుదలచినచో వనముల కేగుమని నిష్కర్షముగ బలికెను.

దశరథ-రాముల యెదుట వసిష్ఠ-సుమంత్రు లామెను నిందించు చున్నను, తగదని వారింపక మిన్నకున్న తండ్రీ కొడుకులగాంచి, తన విరోధులెల్ల సమకూడియున్న నా సమయమున సహనము వహించి మిన్నకుండుట యుచితమని, గ్రహించి వారి మాటలను లక్ష్యపెట్టక మౌనముగ మిన్నకుండెను. ఆమె సహనమును, దశరథాద్యుల కుట్రను గ్రహించిన ప్రజలే రాముడు సీతయు వల్కలాజినములు కట్టుచుండ దశరథుని నిందించిరి.

ఈ విషయములనుబట్టి కైక యెంతటి నిష్కల్మషురాలో యంతటి కఠినురాలని వ్యక్తమగుచున్నది. తాను నిర్మలప్రేమతో నాదరించిన రామ-దశరథులు తనకు పరోక్షముగ కుట్రపన్నుట గమనించిన పిమ్మట. తాను వారిని క్షమింపలేకపోయెను. దీనినిబట్టి యామె యొకసారి తన నమ్మకమును వమ్ముచేసిన వారిని మరియొక సారి నమ్మదని తెలియుచున్నది.

కైక యెవరినీ ద్వేషించినట్లు, ఎవరియందసూయ జెందినట్లు రామాయణమున కన్పింపదు. కాని యామె భర్తచేతను, కౌసల్యా సుమిత్రలచేతను, రామ-లక్ష్మణ-భరతులచేతను, వసిష్ఠ - సుమంత్రుల చేతను ద్వేషింపబడినది. కౌసల్య పెంపుడు చిలుకసహితము 'కైక కాలు కొరుకుము'అని వచించునని రాముడు పల్కుటచే, కౌసల్య తన ద్వేషపుమాటలను చిలుకకుకూడా నేర్పినదని తెలియుచున్నవి.

మరియు కౌసల్య సీతను వనమున కంపునపుడు, కైకపై గల తన ద్వేషమును, సీతకు సలహాలు చెప్పునెపముతో 'కులటలు ప్రియులచే సతతము సత్కరింపబడుదురనియు, అట్టి స్త్రీలు పూర్వము సుఖము ననుభవించియు యాపదను బొందిన భర్తను దూషింతురు - హింసింతురు' అనియు నీ విధముగ బయలుపరచెను.

రాముడు బాల్యమునుండియు తన నెంతో గారాబముగ పెంచిన పినతల్లియగు కైకేయిని వనవాసకాలమున 'నీచకృత్యయనియు, చెడు తలంపుగలదనియు నిందించెను.

పురోహితుడగు వసిష్ఠుడు, మంత్రియగు సుమంత్రుడును, ఏ పాపమెరుగని కైకేయిని, దుష్ప్రవర్తనగల దశరథుని సన్నిధిని మూర్ఖురాలనియు, దుష్టురాలనియు నిందించిరి.

కాని కైకమాత్ర మెవరినీ-యెప్పుడూ దూషించినట్లు వాల్మీకి వ్రాయలేదు. కైక-సౌభాగ్యము నోర్వలేక కౌసల్య-సుమిత్రాదులు, హక్కులేని రాజ్యాధికారమునకై ప్రాకులాడినందుకు రాజ్యమునుండి వెడలనడిపినదను ఈర్ష్యాకోపములతో రామ లక్ష్మణులు, దశరథుని మెప్పుబొందుటకై వసిష్ఠ-సుమంత్రాదులు కైకను నిందించిరి.

కైక, తన నెవరెన్ని విధముల నిందించినను, తాను వారిపై నీర్ష్యాద్వేషముల చూపలేదు. వారిని నిందింపలేదు. దీనినిబట్టి కైకయొక్క యుత్తమశీలము తెలియుచున్నది.

కైక-వృద్ధుడగు దశరథుని భర్తగాపొందియు, నతనియందెంతటి మమకారము చూపినదో తెలుపుటకు, దశరథు డామెచెంత నిరంతరము గడుపుటయే నిదర్శనము. కౌసల్య కిది సహింపరానిదిగ గన్పించినది. కాని తనలో లేని యే ప్రేమానురాగములు-మోహబంధములు కైకలోజూచి భర్త తనను నిరాకరించుచున్నాడోయని, ఒక్కసారియు కౌసల్య తన యాత్మావలోకనము చేసికొనలేకపోయినది. తన ఆడతనము జూపి, వలచి, వలపించుకొనగలిగిన జాణతనము లేని

కౌసల్య, కైకపై యీర్ష్యాద్వేషములు పెంచుకొనినది. కాని కైక మాత్ర మమాయకురాలు. భర్తను-కపట ద్వేషములు లేక ప్రేమించినది. సవతిపుత్రులను సైతము తనబిడ్డలవలె పెంచిన సాధ్వి.

కేవలము తన కుమారునకు చెందవలసిన రాజ్యమును తానుకోరినందులకై యిందరిచేత నిన్నివిధముల ద్వేషింపబడెను. నిందింపబడెను. కాని, తనదికాని రాజ్యమునకై ప్రాకులాడిన రాముడు, భరతుని రాజ్యమును రామునికై యపహరించుటకు - కుతంత్రములు పన్నిన దశరథుడు, రాజస్త్రీయని - రాజు భార్యయని రాజమాతయని పరిగణించక-రామ-దశరథుల నండగా జూచుకొని తన హద్దులనుమీరి కైకను నిందించిన వసిష్ఠ-సుమంత్రులు-నిందించ బడలేదు. దీనినిబట్టి వాల్మీకి రచనలో రాముని పక్షమువారిపై వాల్మీకికిగల పక్షపాతము విదితమగుచున్నది.

వాల్మీకియు కైకను "దుష్టస్వభావ, పాపశీలి, అనార్య, మూర్ఖ రాలు" అని పలువిధముల నిందించెను. ఇట్లు కైకను నిందించి వాల్మీకి-రాముని పక్షపాతి యనిపించుకొనెను. కాని కైక స్వభావములో 'నధర్మమున్నదని' వాల్మీకి నిరూపించలేకపోయెను.

## 18. కౌసల్య

దశరథుని జ్యేష్ఠభార్య. ఈమెకు భర్తయందుగాని, భర్త కీమె యందుగాని మిక్కిలి యనురాగమున్నట్లు గన్పింపదు. దశరథున కీమె గాక యనేకమంది భార్యలుండుటయే యిందుకు నిదర్శనము. మరియు దశరథుడు తన కాలమునంతయు కైక యొద్ద గడుపుటవలననే కౌస ల్యకు కైకయందు ఈర్ష్యాద్వేషములు ప్రబలినట్లు తెలియుచున్నది. తన పెంపుడు చిలుకకుగూడ 'కైక కాలుకొరుకుము' మొదలగు మాటలను నేర్పినదనుటచే, నీమెకు కైకయందెంతటి ద్వేషమున్నదో తెలియుచున్నది.

అయోధ్య. 4వ సర్గము : రాముడు, తన తండ్రి తనకు రాజ్యాభి షేకము చేయబోవుచున్నాడని చెప్పగనే,

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా తు కౌసల్యా చిరకాలాభి కాంక్షితమ్,
హర్ష బాష్పాకులం వాక్యమిదం రామ మభాష త 38
వత్స రామ చిరంజీవ హతా స్తే పరిపంథినః,
జ్ఞాతీన్ త్వం శ్రియా యుక్తః సుమిత్రాయాశ్చ నందయ. 39

కౌసల్య, తన చిరకాలాభి వాంఛితమగు నామాట విని హర్ష బాష్పములతో రామునితో నిట్లనెను.

బిడ్డా! రామ! చిరంజీవ! నీ శత్రువులు చంపబడిరి. నీవు సంపదతోగూడి నా జ్ఞాతులను, సుమిత్ర యొక్క కుమారులను సంతోషపెట్టుము.

ఈ మాటలనుబట్టి కౌసల్య, కైకను-కైకవైపువారిని శత్రువులుగ పరిగణించుచున్నట్లు తెలియుచున్నది. కాని యా శత్రుత్వము, కైక-దశరథునకు సన్నిహితురాలైనందు వలననా? లేక దశరథుడు కైక పుత్రునకు రాజ్యమిచ్చెదనని వాగ్దానము చేసినందులకా?

దశరథుడు తనను రాజుగా చేయబోవుచున్నాడని రాముడు వచియించినంతనే కౌసల్యపట్టరాని సంతోషమును పొందినదనుటచే, 'రాజ్యము భరతునకు చెందినచో తన పుత్రుడు హీనదశనందునని, కౌసల్య యప్పటివరకు దిగులుతో బాధపడుచున్నదని, కౌసల్యయొక్క మాటలవలన తెలియుచున్నది. మరియు కౌసల్య

యేన త్వయా దశరథో గుణై రారాధితః పితా. (అయోధ్య. 4-40)

నీచేత నీ తండ్రియగు దశరథుడు గుణపూజ్యుడాయెను." అని వచించెను. అనగా కౌసల్య యభిప్రాయములో రామునకు రాజ్యమిచ్చినందు వలన దశరథుడు గుణములచే పూజ్యుడాయెను.

రాముడు తల్లితో "భరతుడు రాజ్యమును పొందుచున్నాడు.

నే నడుపులకేగ నుంటిని'' అని పలికినతోడనే, కౌసల్య తనయాశలన్నీ నిరాశలు కాగా పుత్రునితో తన దుర్విధి నీ విధముగ వచించెను.

రామా! భర్తయున్నను అనురాగముగాని సుఖముగాని చూచి యెరుగను. భర్తచే నిరాకృతురాలనైతిని. ఇంతకాలమునుండియు నిన్ను చూచుచు దుఃఖోపశమనమును పొందుచుంటిని.

ఈ మాటలనుబట్టి కౌసల్య భర్తచే నే విధి చూడబడినది. జీవితకాలమంతయు జీవచ్ఛవము పగిది నేగతి వెళ్ళబుచ్చినది విదిత మగుచున్నది. కట్టుకున్న భార్య నీ విధి జూచుచు, జ్యేష్ఠభార్య సుమంగళియైయుండ, చిన్నభార్యయగు కైకేయి పుత్రునకు రాజ్య మిచ్చెదనని వాగ్దానము జేసిన దశరథుని ధర్మాత్ముడనియు - అపాపు డనియు నెన్నియో విశిష్టపదముల వాల్మీకి కీర్తించెను.

కౌసల్య పుత్రునితో తన దీన-హీనదశను విన్నవించి 'తండ్రివలె నేనును నీకు పూజ్యురాలను, నా మాటలనుకూడ గౌరవింపవలసినది. నేనును నిన్ననుసరించి వచ్చెదన'ని పలికెను. రాము డీ మాటలకు విముఖుడు కాగా, కౌసల్య రామునితో, "లక్ష్మణుడు వచించిన - తండ్రిని బంధించెదను లేక చంపెదను" అనిన మాటలు వింటివిగదా! అందు నీ కిష్టమగు కార్యముచేయుము" అని వచించెను.

ఈ మాటలనుబట్టి కౌసల్యకు భర్తపై నెంతటి విరక్తిగలదో యవగతమగుచున్నది. ఈ విధముగ రాజ్యమునకై తన భర్తను చంపుమని కుమారుని ప్రోత్సహించిన కౌసల్యను వాల్మీకాదులు మహా పతివ్రతయని పొగడిరి. కాని తన కుమారునకు చెందవలసిన రాజ్యమును కుమారున కీయవలసినదని కోరినందుకు కైక, వాల్మీకాదులచే దుష్టురాలనిపించుకొనెను.

సీత రామునితో వనములకు బయలుదేర, కౌసల్య కోడలిని చేరదీసి "ఈ లోకమందు కులటలు ప్రియులచే నెల్లపుడు సత్కరింప బడుదురు (ఈ మాట దశరథు డెల్లపుడు కైకతో గడపుటను దృష్టి

యందుంచుకొని పలికినట్లున్నది). అట్టి స్త్రీలు పూర్వము సుఖము ననుభవించియు, నాపదపొందిన భర్తను దూషింతురు. హింసింతురు. స్త్రీల కిది స్వభావము (ఈ మాటలు కైకను మనసు నందుంచుకొని - కైక భర్తతో-తన వరముల నీయవలసినదని గట్టిగా నడుగుటను జ్ఞప్తికి తెచ్చుకొనుచు పలికినవే). ఈ విధముగు మాటలచే కౌసల్య, కైక నన్యాపదేశముగ నిందించెను. దీనినిబట్టి కౌసల్యకు - కైకపై పూర్తి ద్వేషముగలదని తెలియుచున్నది.

ఈ విధముగ కౌసల్య పతీవిదూర అయినను భర్తను నిందించియు, యతనిని చివరిదశయందు చేరదీసి యాదరించెను. ఆమె భర్తతో 'స్త్రీకి పతియే మొదటిగతి. కాని నీవు నాకు లేవు. రెండవ గతి పుత్రుడు, అతడు వనముల కేగెను. అందుచే నే నన్నివిధముల నీచే చంపబడితిని' అని పలుక, దశరథుడామెతో 'నీ యనుగ్రహము కొరకు నమస్కరించుచున్నాన'ని వణకుచు పలికెను. అపుడు కౌసల్య కన్నీటితో భర్త చేతులనుపట్టుకొని, యాతని నూరడించెను. పిమ్మట దశరథుడామె గృహముననే ప్రాణములు వదలెను. ఈ విధముగ కౌసల్య జీవితకాలమంతటిని, భర్తకు దూరమై గడపి, యంత్యదశ యందతడు చేర, నిరాదరించక యతనితో దుఃఖమును పంచుకొనెను.

## 19. రావణుడు

పులస్త్య బ్రహ్మమనుమడు. విశ్రవసుముని పుత్రుడు. మహాశివభక్తుడు. వేదవేదాంగవేత్త. మహాపరాక్రమశాలి. వివేకవంతుడు. భాతృప్రియుడు.

సుకేశుని పుత్రులగు మాల్యవంత-సుమాలి-మాలి యనువారు లంకాపురిని పాలించుచుండ విష్ణువువారిపై దండెత్తెను. ఆ యుద్ధములో వాడు పరాజితులై లంకాపురిని వీడి వెళ్ళిరి.

విశ్రవసమునికి భరద్వాజుని పుత్రికయైన దేవవర్ణియందు కుబేరుడను పుత్రుడు కలిగెను. విశ్రవసుముని యతనిని 'లంక'యందు వసింపుమని తెలిపెను పిమ్మట విశ్రవసుముని సుమాలి కుమార్తె యగు కైకసిని పెండ్లాడెను. ఆమెయందతనికి వరుసగా రావణ-కుంభకర్ణ పుత్రులును, శూర్పణఖ యను కుమార్తెయు, విభీషణుడను పుత్రుడును కలిగిరి.

రావణుడు కశ్యపుని పుత్రుడగు మయుని కుమార్తెయగు మండోదరిని పెండ్లాడెను. కుంభకర్ణుడు బలికుమార్తెయగు వజ్రజ్వాలను పెండ్లాడెను. విభీషణుడు గంధర్వరాజగు శైలూషుని పుత్రికయైన సరమను పెండ్లాడెను.

రావణుడు గోకర్ణమున కొంతకాలము తపస్సుచేసెను. ఒకనాడు సుమాలి రావణునితో, లంకాపురి పూర్వము తమదేననియు, విష్ణువు దండయాత్రలకు పరాజితులై లంకాపురిని వదలితిమనియు, కనుక కుబేరునకు వార్తనంపి తమ లంకాపురిని తమ కిమ్మని తెలియజేయ వలసినదనియు వచించెను. ఆ మాటలకు రావణుడు వ్యథజెంది, కుబేరుడు తనకు అన్నయనియు, గురువుతో సమానుడనియు, కనుక ఆ రాజ్యము నాశించుట తగదనియు తాతయగు సుమాలితో వచించెను.

కాని సుమాలి మొదలగువారు దేవతలు పూర్వమునుండియు తమ నే విధముగ వంచనచేసినదియు, హిరణ్యకశిప - హిరణ్యాక్షాది మహావీరుల నేపగిది యధర్మయుద్ధములచే చంపినదియు, అమృత మథనమున వారలనెట్లు వచించినదియు, బలిచక్రవర్తి నే విధముగ మోసముచే రాజ్యమునుండి బహిష్కృతుని జేసినది మొదలగు విష యములన్నియు రావణునితో వివరింప రావణుని మనస్సు కలత జెందెను. అంత రావణుడు ప్రహస్తుని కుబేరుని యొద్దకు దూతగ బంపుచు తమ మాతామహుల రాజ్యము తమకొసంగవలసినదిగ

మొనరించుచుండ నా రణము చాల దినములు సాగెను. అంత బ్రహ్మ యచటికేగి వారికి సఖ్యము చేయగా, రావణు డచట కొలది దినములు గడిపి, యచట నుండి అశ్మనగరమున కేగి కాలకేయులపై దండెత్తి విజయముగాంచెను. ఆ యుద్ధమున తన చెల్లెలు శూర్పణఖ భర్తయగు విద్యుజ్జిహ్వుడు చంపబడెను. అచటనుండి అయోధ్య కేగి మాంధాతపై దండెత్తెను. ఈ యుద్ధము చాల దినములు జరిగెను. చివరకు పులస్త్య-గాలవులను మును లచటికేతెంచి వారి యుద్ధము నాపి సంధియొనర్చిరి. ఈ విధముగ ననేక *దండయాత్రల నొనర్చి విజయదుందుభుల మ్రోగించి రావణుడు లంకకు చేరెను.

శూర్పణఖ లంకకేతెంచి రావణునితో 'నీతో జరిగిన యుద్ధమున నా భర్త మరణించినాడని విలపించ రావణు డామె నోదార్చుచు, కాలకేయులతో జరిగిన యుద్ధ మతిభీకరముగ సాగినదనియు, అందు తాను విద్యుజ్జిహ్వుని ప్రత్యేకముగ గుర్తించలేక పోయితిననియు, కనుక జరిగినదానికి వగవక దండకారణ్యమును పాలించుటకేగుచున్న ఖరదూషణాదులతో నేగుమనియు, అచట వారు నీయాజ్ఞ ప్రకారము వర్తించగలరనియు తెలిపెను.

దండకారణ్య ప్రాంతములందును, తత్పరిసర రాక్షసభూముల యందును ఆర్యఋషులు ప్రవేశించి తమ యాచారవ్యవహారములకు విరుద్ధముగ సంచరించుచు రాక్షసుల చంపుచున్నారని యెరిగి, రాక్షస నాయకులను వారి చర్యల గమనించుచు తమ రాక్షసుల రక్షణకు తగు నేర్పాట్లు చేయుటకు నియోగించెను.

రావణు డిట్లు అరివీర భయంకరుడై, రాక్షస విరోధులైన మునిజనకంటకుడై, రాక్షసుల కత్యంతప్రీతిపాత్రుడై రాజ్యపాలన మొనర్చుచుండ, ఆర్యులు వారి రాజ్యముల నాక్రమించుటకు, ఆ ప్రజలలో తమ మతాచారముల ప్రచార మొనర్చుటకు తగిన యత్నముల చేయుచుండిరి. ఆర్యసామ్రాజ్య విస్తరణకై ఆర్యఋషులు ముఖ్య

పాత్రను నిర్వహించిరి. అగస్త్య-విశ్వామిత్రాదులు అపరిమితాయుధములతో ఋషి వేషధారులై, వీరాధివీరులగు ననేక శిష్యగణములతో రాక్షసపాలిత భూముల ప్రవేశించి రాక్షసుల యాచారములకు విరుద్ధములగు యజ్ఞయాగాదు లొనరించుచు బలహీనులగు రాజుల చంపుచుండిరి.

అగస్త్యుడు మలద-కరూశ దేశములను పాలించు ఝర్ఝర పుత్రుడగు సుందుడను రాజును చంపి, యతని రాజ్యముల నాక్రమించెను. అంత సుందుని భార్యయగు తాటకి, సుందుని పుత్రుడగు మారీచుడు అగస్త్యుని పైకిరాగా నగస్త్యుడు తన బలముతో వారి నెదిరించ వారు పారిపోయిరి. విశ్వామిత్రుడు యజ్ఞమిషతో క్షత్రియ కుమారులగు రామ లక్ష్మణులచే తాటకిని, సుబాహుని చంపించెను. అగస్త్యుడు వాతాపి, ఇల్వలుడు అను రాక్షస సోదరుల చంపి రాక్షసులకు భయంకరుడై విరాజిల్లెను.

భరతుని రాజ్యమునకై యాసపడి తండ్రితో కలిసి కుట్రసలిపి పిదప ఆ కుట్రవిఫలమై తత్ఫలితముగ పినతల్లియగు కైకచే వనముల కంపబడిన రాముడు, తన పూర్వీకులగు మాంధాత-అనరణ్యుల చంపిన రాక్షసుల చంపదలచి మునుల తోడ్పాటుతో వనముల చరించుచుండెను. ఆర్యఋషులును, తమను సరకు జేయని రాక్షసుల చంపించుటకై రామునితో కలిసి మంతనములాడుచుండిరి. ఈ కుట్రల నెరుగని శూర్పణఖ రామ లక్ష్మణుల నొకనాడు చూచి, వారియందు మనస్సు గలదై వారిచెంతకు వచ్చెను. స్వేచ్ఛావిహారిణియు, కల్లకపటములెరుగనిదియు నగు నా శూర్పణఖ నిర్మలమగు మనస్సుతో రాముని వంకజూచి తన మనోభిప్రాయమును దెలిపి తనను పరిణయమాడుమని కోరెను. విప్పారిన నేత్రములతో ప్రశాంతవదనముతో తన యెదుట నిలబడి తనవంకజూచుచు పరిణయమాడుమని కోరిన యా యాటవిక యపరిచిత స్త్రీ ధైర్యసాహసముల వీక్షించుచు రాముడామె సౌంద

ర్యమును పొగడి, తనకు భార్యగలదనియు, సవతిపోరు లేకుండ గడ పుటకై తన తమ్ముడగు లక్ష్మణుని పరిణయమాడుమనియు వచించెను. రాముడు వచించిన విధమున శూర్పణఖ లక్ష్మణునితో తనను పరిణయమాడుమని కోరెను. లక్ష్మణు డామెతో "నేను మాయన్నకు దాసుడను. రూపలావణ్యములుగల నీవు దాసిగానుండదగవు. నిన్ను చూచినంతనే కోరని మగధీరు డెవడుండును? నీవు మా యన్నకు భార్య కావలసినదానవు" అని పలికెను. ఆ మాటలు నిజమని తలచి యా యమాయిక మరల రామునివైపు జూచెను. ఈ విధముగ నామె నా యిరువురు సోదరు లాటలుపట్టించ నామె విసిగి, చెంతనేయున్న రూపవతియగు సీతనుగాంచి, యామె లేనిచో నా రాముడు తనను స్వీకరించునని తలచి యామె పైకిపోయెను. అంత రామ లక్ష్మణు లామెను పట్టుకొని యామె ముక్కు-చెవులు కోసిరి. ముఖమునుండి రక్తముకారుచుండ నామె భయముతో పరుచుచు అచటినుండి పరు గెత్తి సోదరుడగు ఖరునితో నా విషయము దెలిపెను.

అంత ఖర-దూషణ-త్రిశిరులు వరుసగా రామునిపై కేగి యతని తోడి పోరులో మరణించిరి. అపుడు శూర్పణఖ అన్నయగు దశాననుని యొద్దకేగి తన భంగపాటును తెలుప నతడు కోపోద్రిక్తుడై మంత్రు లతో నాలోచించి, తన చెల్లెలిని పరాభవించినందుకు ప్రతిగా, రామ లక్ష్మణుల పర్ణశాలనుండి దూరముగానే నేగునట్లు మంత్రాంగ మొన రించి, రాముని భార్యయగు సీతను బలవంతముగ తీసికొనివచ్చి యశోక వనమున రాక్షసస్త్రీల రక్షణలో నుంచెను.

రాముడు, జటాయువువలనను-కబంధునివలనను, సీత-రావణు నిచే నపహరింపబడుట తెలిసికొనెను. పిమ్మట కిష్కింధరాజగు వాలిచే, నతని తమ్ముడు రాజ్యమునుండి వెడలగొట్టబడుట గ్రహించిన వాడై, సుగ్రీవునితో స్నేహ మొనరించి, యతని యన్నయగు వాలిని చెట్టుచాటున దాగి వాడిబాణముతో గొట్టిచంపెను. తత్ఫలితముగ

సుగ్రీవుడు రావణునితో యుద్ధమొనరించుటకై రామునికి సహాయముగ తన బలమునంతయు సమీకరించెను.

సౌందర్యవతియగు సీతను గాంచిన రావణుడు మన్మధవశుడై తన కోర్కెను దెలుప, సీత నిరాకరించెను.

సుగ్రీవుడు సైన్యసమీకరణ మొనర్ప, రాముడు తొలుతగ రావణుని బలము తెలిసికొనదలచి హనుమంతుని చారునిగ లంకాపురికి బంపెను. రహస్యముగ లంకను చేరదలచిన హనుమంతుడు, సముద్ర మార్గమును దారిగ నెన్నుకొని రహస్యముగ లంకను జేరి, రాత్రియందు రహస్యముగ సంచరించి రావణుని బలాబలములన్నియు తెలిసికొని యశోకవనమును జేరెను. అచట సీతనుగాంచి యామెతో రహస్య ముగ మాట్లాడుచుండ రాక్షసులుగాంచి యతనిని బంధించి రావణుని యొద్దకు జేర్చిరి. చారుడగు హనుమంతుని వధింపుమని రావణు డాజ్ఞ యొసగుచుండ, రావణుని తమ్ముడగు విభీషణు డతని రక్షించదలచిన వాడై యన్నతో దూతయగు నతని చంపవలదనియు, వాలముచుట్టి- దానికి నిప్పంటించి పరాభవించవలయుననియు దెలిపెను. తమ్ముని హితుడని నమ్మి రావణు డట్లే చేసెను. హనుమంతు డచటనుండి బయలుదేరి కిష్కింధ చేరి రామ సుగ్రీవులతో తాను చూచిన దంతయు తెలిపెను. రామ సుగ్రీవులు తమ బలముతో లంకను జేరిరి.

రాముడు రణమున కేతెంచుచున్నాడని వినిన రావణుడు యుద్ధ సన్నద్ధుడగుచుండ, నతని తమ్ముడు, రాజ్యకాంక్షతో సుగ్రీవుడు రాముని చేరిన విధముగ తానును అన్నను వదలి రాముని జేరి, లంకా రహస్యములన్నియు రామున కెరిగించి, రామునిచే తను - అతని పరి వారము చేతను రావణుని-యతని బలమును పూర్తిగనాశనము జేయించి, తాను లంకకు రాజై సీతను రామున కప్పగించెను.

రావణుని యాకారము : రావణుని యాకారమును హను మంతుడు సుందరకాండము 10, 11, 18 మరియు 49వ సర్గములలో

వర్ణించుట జరిగినది. యుద్ధకాండము 40, 59 సర్గములలో నితని గురించిన వర్ణనలు గలవు 59వ సర్గములో రాముడు రావణుని గురించి యిట్లు పలికెను. "రావణుడు ప్రకాశించు మహాతేజస్వి, తేజస్సుచే గప్పబడిన ఇతని రూపమును స్పష్టముగ జూచుచున్నాను. ఇతని దేహము ప్రకాశించుచున్నట్లు యే దేవదానవ వీరుల యొక్క దేహములును ప్రకాశించుటలేదు".

హనుమంతుడు రావణుని గురించి యిట్లు వచించెను. "చక్కని రూపముగలవాడు. అతని బాహువు లింద్రధ్వజతుల్యములు, ఏనుగు తొండములకు సమములైనవి బలిసి సమసుందరములగు మూపురములు గలిగినవాడు. బలిష్ఠములై శుభలక్షణములగు గోళ్ళు వ్రేళ్ళు గలవాడు. కిరీట కుండలములచే శోభించు ముఖముగలవాడు. బలిసిన విశాలమగు వక్షముగలవాడు. మేఘమువలె ప్రకాశింపజేయబడిన సర్వాంగములు గలవాడు. వంకరలై-ఎర్రనైన నిడుపాటి కన్నులు గలవాడు. శంఖమువంటి చెవులుగలవాడు. వింటిని వదలిన సాక్షాత్ మన్మథునివంటివాడు. తేజోవంతుడు పూర్ణచంద్రునివంటి ముఖము - కాటుకవంటి దేహముగలవాడు. సర్వలక్షణసంపన్నుడు. ఇతని రూపము-ధైర్యము బలము-తేజము ఆశ్చర్యకరముగ నున్నవి. ఇత డధర్ముడుగా కున్నచో దేవలోకమునకు దేవేంద్రునకు రక్షకుడగును. అమిత తేజస్కుడగు నితని ప్రభావమునుజూచి దేవదానవు లతనికి భయపడుచున్నాడు. ఇతడు కోపించిన జగము నేకార్ణవముగ జేయును.

మహాబలవంతుడు : దేవతలను, యక్షులను, నాగులను, క్షత్రియ రాజుల ననేకుల జయించెను. హనుమంతు డితనిని "ఊహింపరాని బల పౌరుషములు గలవాడ"ని వచించెను. (సుందర. 18వ సర్గము)

మహాపరాక్రమవంతుడు : ఉత్తరకాండము 34వ సర్గములో రావణుని గురించి యిట్లు చెప్పబడినది. "రాక్షసునిగాని-మనుష్యుని గాని బలవంతుడని వినినచో రావణుడు బలగర్వితుడై యతనిని యుద్ధమునకు పిలుచును".

సోదరునితోను బలగముతోను సముద్రము నింకింపజేయును. లేదా వీర్యముతో వేఱువిధముగనైన చేయును.

వానరులతో గూడ నీ కార్య మిట్లు విరుద్ధముకాగా పురమునందును సైన్యమునందును నాకు హితమగు నట్లాలోచింపుడు.

పై మాటలవలన రామునికి రావణుడు భయపడినట్లున్నది.

యుద్ధ. 24వ సర్గము : రావణుడు శుకునితో

శ్లో॥ సాగరస్యేవ మే వేగో మారుతస్యేవ మేగతిః,
న హి దాశరథి ర్వేద తేన మాం యోద్ధు మిచ్ఛతి. 41
న మే తూణీశయా న్బాణాన్ సవిషానివ పన్నగాన్,
రామః పశ్యతి సంగ్రామే తేన మాం యోద్ధు మిచ్ఛతి. 42
న జానాతి పురా వీర్యం మమ యుద్ధే స రాఘవః.

నా వేగము సాగరము వంటిది. నా గమనము వాయువువంటిది. దీనిని రాము డెఱుగడు. దానిచే నాతో యుద్ధము చేయ నిచ్ఛగింపడు.

నాకు గల బాణముల వీర్యమును రాము డెఱుగడు. అందుచే నాతో రణముచేయ రాము డిచ్ఛగింపడు.

నాకు గల యుద్ధవీర్యమును రాఘవు డెఱుగడు.

రావణుడు–రామునకు భయపడిన యీ విధముగా మాట్లాడునా? కనుక యుద్ధకాండ మూరవసర్గములోని రావణుని మాటలు– వాల్మీకి మాటలుగనే వ్యక్తమగుచున్నవి గాని రావణుని మాటలుగ లేవు.

యుద్ధ. 101వ సర్గము :

శ్లో॥ స కీర్యమాణ శ్శరజాల వృష్టి భిర్మహాత్మనా దీప్త ధనుష్మతార్దితః
భయాత్ ప్రదుద్రావ సమేత్య రావణో
యథాఽనిలేనాభి హతో వలాహకః. 63

(రాముని) బాణసమూహ వర్షముచే వ్యాపించబడినవాడై ప్రకాశించు ధనుస్సు గల మహాత్మునిచే పీడింపబడినవాడై రావణుడు వాయువుచే కొట్టబడిన మేఘమువలె భయమువలన పరుగెత్తి పోయెను.

బలవంతులని తెలిసినచో వారిపై రణమునకేగి యాహ్వానించు రావణుడు రణభూమియందు భయముచే పరుగెత్తిపోయినాడనుట వింతగనున్నది. కేవలము రాముడు బలవంతుడని తెలియజేయుటకే వాల్మీకి యీ శ్లోకమును రచించినట్లున్నది.

శ్లో॥ స దత్త్వా తుములం యుద్ధం రావణస్య దురాత్మనః,
విసృజన్నేవ బాణౌ ఘాన్ సుషేణం వాక్య మబ్రవీత్. 2

యుద్ధ. 102వ సర్గము : రాముడు రావణునితో భయంకరముగ రణమొనర్చుచు సుషేణునితో "నాకు ప్రాణప్రియుడగు లక్ష్మణుడు, రావణ వీర్యముచే భూమియందు పడియుండ, మనస్సు కలిగియున్న నాకు యుద్ధముచేయుటకు శక్తి యెక్కడిది? నా చేతినుండి ధనుస్సు జారిపడిపోవుచున్నది. బాణములు క్షీణించుచున్నవి. కనుల నీరు గ్రమ్ముచున్నది. నా యవయవములు జారిపోవుచున్నవి. నాకు విచార మధికమగుచున్నది. మూర్ఛయు కలుగుచున్నది...." అని పలికెను.

రాముడు రణమొనర్చుచు సుషేణునితో మాట్లాడినాడని వచించుటచే, రావణుడు భయపడి పారిపోవుటయు నబద్ధముగ కన్పించు చున్నది.

రావణుని శీలము : హనుమంతుడు రావణుని గురించి యీ క్రింది విధముగ వచించెను.

"రాజర్షులు-పితృదేవులు, దైత్యులు, గంధర్వులు, రాక్షసుల యొక్క కన్యలతని కామవశమును బొందిరి. వారందఱు రణకాముడగు రావణునిచే తేబడినవారు. మదముచే కామవశులై మోహించి వచ్చినవారు కొందరు. అచట నున్న యే తరుణియు బలవంతముగ

పరాక్రమముచే పొందబడినదిలేదు-జానకి తప్ప, ఇతరుని కోరినదిగాని, నాథుడుకలదిగాని యొక్క తెయులేదు." (సుందర. 9వ సర్గము)

ఉత్తరకాండము 24వ సర్గము : దురాత్ముడగు రావణుడు సుందరియగు కన్యనుగాని, యువతినిగాని చూచినచో, దాని బంధు జనమును చంపి, దానిని విమానమున నిరోధించును. ఇట్లతడు దైత్య-దానవ-యక్ష-రాక్షస-నాగ-మనుజ కన్యలను గ్రహించెను. వారు శోకాయత్తులు, వివశులై, వణకుచు కన్నీటితో రోదనముచేయు చుండిరి. వారు తమ తల్లి-తండ్రి-సోదరుల, పతి-సుతుల తలచుకొనుచు రోదించిరి. 'నేను లేకపోగా నా పుత్రుడేమగునో' యని కొందరు, దైవరూపుడగు భర్తను వదలి యేమిచేయుగలన'ని కొందరు రోదించిరి.

సుందరకాండము 9వ సర్గములోని మాటలకు, ఉత్తరకాండము లోని 24వ సర్గములోని మాటలు పూర్తిగ భిన్నముగనున్నవి. సుందర కాండములోని మాటలు హనుమంతునిచే వచింపబడగా, ఉత్తరకాండ ములోని మాటలు కథా రచయితయగు వాల్మీకిచే వచింపబడినవి. వాల్మీకి-రావణుని మొదటనే దురాత్ముడని వచించుటచే - వాల్మీకి రావణుని పాత్రకు న్యాయముచేసినట్లు కన్పించదు. కనుక రావణుని గురించి హనుమంతుడు రచించిన మాటలే యదార్థముగ కన్పించు చున్నవి.

సుందర. 20వ సర్గము : రావణుడు దీనయు, ఏకాకియు, నిస్సహాయయునగు సీతతో "సిరికిదానా! పరస్త్రీలను పొందుట-బలా త్కారముగ దెచ్చుట రాక్షసుల ధర్మము. నా శరీరమున కామము యథేచ్ఛగా ప్రసరించినను, నన్ను కామింపని నిన్ను స్పృశింపను. ఓ దేవీ! నీవు భయపడకుము. నా మాట నమ్ముము. యదార్థముగ నన్ను నమ్ము. శోకింపకుము". (5, 6, 7 శ్లో).

ఈ మాటలనుబట్టి రావణు డెంతటి శీలవంతుడు, ధర్మపరుడై నది తెలియుచున్నది. పరస్త్రీలను బలాత్కారముగ తీసుకొనివచ్చుట

రాక్షసుల యాచారమని రావణుడు వచించుటచే, యా కాలపువారి యాచారధర్మముల నిపుడు చర్చించుట యనవసరము.

ఉత్తర. 26వ సర్గము : రావణుడు రంభను బలవంతముగ ననుభవింప, నామె-తన భర్తయగు నలకూబరునితో జరిగిన విషయము దెలిపెను. అపుడు నలకూబరుడు "రావణుడు సమ్మతములేని యువతిని పొంది, కామించని యబలను కామించినవాడు అతని శిరస్సు వేయి తునుకలుగా నగును" అని శపించెను.

యుద్ధకాండము 13వ సర్గము : రావణుడు మహాపార్శ్వునితో "చాలకాలము క్రింద జరిగిన విషయమును తెలుపుచున్నాను. వినుము. నేను-బ్రహ్మగృహమునకు పోవుచున్న పుంజికస్థలను జూచితిని. ఆమె నాచే వస్త్రహీనముగ జేయబడి బలాత్కారముగ ననుభవించబడినది. పితామహు డా విషయమును తెలిసికొని "నేడు మొదలే యువతిని బలాత్కారముగ పొందుదువో అపుడు నీ తల నూరుముక్కలుగా పగులును" అని శపించెను-అందువలన నేను సీతను బలాత్కారముగ నాశయనము నెక్కించలేదు. (10 నుండి 15 శ్లోకములు వరకు).

పై సంఘటనలు జూచిన బ్రహ్మ-నలకూబరు లిరువురు రావణు నొకే విధముగ శపించిరి. పై రెండు సంఘటనలు ఒకేసారి జరుగవు గదా ! వీనిలో నేదో యొకటి ముందుగను, పిమ్మట రెండవది జరిగి యుండును. బ్రహ్మశాపమే ముందుగా నిర్ణయించబడిన - రంభను సంభోగించినపుడే రావణుని తల నూరుముక్కలై యుండవలయును గదా ! అటులకాదేని, నలకూబరుని శాపమే ముందుజరిగియుండునని తలచిన, రావణుడు పుంజికస్థల ననుభవించినపుడే యతని తల నూరు ముక్కలై యుండవలసినది. అదియు జరుగలేదు.

దీని ననుసరించి యీ రెండు కథలు రావణుని యందలి పక్షపాతముతో కల్పించబడిన వనుట నిస్సందేహము.

కిష్కింధ. 66వ సర్గము : పుంజికస్థల' యను నప్సరస శాపముచే కుంజరుడను వానరుని కూతురై జన్మించి, 'అంజన'యను పేర

ప్రసిద్ధమై, 'కేసరి'యను వానరునికి భార్యయయ్యెను. (8, 9. 10 శ్లోకములు).

రాముని యవతారపురుషుడుగ చూపించుటకై యొకచోట విష్ణువు రామునిగ జన్మించెననియు, మరియొకచోట రుద్రుడు రాముడుగ జన్మించెననియు వచించిన వాల్మీకి, రావణుని మంచితనమును చెడ్డగా నిరూపించుటకే రావణునికి–నలకూబరుని శాపము బ్రహ్మ శాపము రూపొందించినట్లు తెలియుచున్నది.

కానిచో దేవవేశ్యయగు రంభకు వావివరుసలేమి. రణమున మరణించిన వీరులు రంభాసంయోగమును పొందుదురని వచించిన పురాణముల గాంచిన–అట్లు మరణించిన తండ్రి–కుమారులు, బావ-మరదులు, అన్నదమ్ములు రంభ కేమగుదురు. ఇంద్రుని వేశ్యయగు, నూర్వశి–ఇంద్ర పుత్రుడగు అర్జునుని కామించుటేమి ? అతడు కాదన–అతనిని శపించుటేమి ? ఇట్టి వ్రాతలకు సమాధానమేమి ?

సీతను బలాత్కారముగ దెచ్చియు, ఆమె సౌందర్యమునకు తాను వశుడయ్యెను, నిస్సహాయయగు నామెను భయపడకుమని యోదార్చుటలో రావణుని యుత్తమోత్తమ శీలము వ్యక్తమగుచున్నది. రాక్షసద్వేషియు, ఆర్యుల కభిమానుడగు వాల్మీకి రచన వలననే రావణుని శీల మన్యథా రచింపబడినది,

వేదవతి విషయమునను, తన కులధర్మము ప్రకారము రావణుడామెను బలాత్కరింప, నామె యగ్నియందుపడి, సీతయై జన్మించినట్లు ఉత్తరకాండము 17వ సర్గమునందు తెలుపబడగా, ఉత్తరకాండము అధికపాఠము రెవ సర్గయందు – "నారాయణుని భార్య లక్ష్మి – 'సీత' యని పిలువబడును"అని వచింపబడియున్నది.

దీనిని బట్టి యవతారములనునవి వాల్మీకి కల్పించినట్లు గన్పట్టుచున్నది.

భ్రాతృప్రేమ : తమ్ముడగు విభీషణుడు, రాజగు తన నవమానించుచు సభయందు మాట్లాడినను, అతనిని దండింపక వదలుటయే

లంకాపురి నాశనమునకు-రాక్షసవంశ నిర్మూలనకు హేతువయ్యెను. శత్రుపక్షమును చేరవలయునను కాంక్షతో విభీషణుడు రావణుని తూలనాడి, రావణుని నోటనుండి దుర్వార్త-వినీ-వినకముందే, తన మిత్రులతో రాముని యొద్దకేగెను.

తమ్ముడట్లు దూరమైనను, తమ్ముని భార్యాబిడ్డలు లంక యందుండ వారిని తన కుటుంబ సభ్యులుగనే యాదరించి పోషించెను. కాని విభీషణుని మనస్తత్వమేగల విభీషణుని భార్య సరమ, రావణుని చర్యలన్నియు గూఢచారిగ గమనించుచు, తాను స్వయముగను, తన కుమార్తె ద్వారను శత్రుపక్షమునకు చేరవేసి రావణుని వంశనిర్మూలనకు, తన భర్త రాజ్యాభిషిక్తుడగుటకు తగు యత్నములు చేసెను.

తమ్ముడగు విభీషణుని మూలముగ తన వంశము-రాక్షసులు-అందరు నిర్మూలనలగుచున్నను, తమ్ముని భార్యాబిడ్డల నేమనక మిన్న కుండుట, తనను, తన యాప్తులను నిండుసభయందు తూలనాడినను అతనిని దండింపక వదలుట, రావణునికి తమ్మునియందుగల యపార ప్రేమకు నిదర్శనములు.

రాజ్యరక్షణ : హనుమంతుడు రామునితో లంకాపురిని వర్ణించుచు నది నిత్యసంతుష్టమై, రథ-గజ-హయ సమృద్ధమై, రాక్షస గణములచే నిబిడమై శత్రువులకు ప్రవేశింపరానిదై యున్నదనియు, విశాలమగు నగద్వారలు గలిగి-గట్టిగ కట్టబడిన తలుపులు గలిగి యున్న దనియు, రావణుడు సైన్యమును స్వయముగ వప్రమత్తుడై చూచు చుండు ననియు వచించెను. (యుద్ధ. 3వ సర్గము)

హనుమంతుడు ప్రప్రథమముగ లంకను ప్రవేశించి, లంకను చూచి యిట్లు తలచెను. "వానరు లిచటకు వచ్చినను వ్యర్థమే యగును. యుద్ధముచేసి లంకను జయింప దేవతలకును సాధ్యము గాదు. సామదానభేదోపాయములు రాక్షసులయందు ప్రయోగింప నవకాశములేదు. లంకకు వచ్చియు రాము డేమి చేయగలడు" (సుందరకాండము 2వ సర్గము).

దీనిని బట్టి రావణుని రక్షణక్రింద 'లంకాపురి' యెంత సురక్షిత ముగ నున్నది తెలియుచున్నది.

రావణుని పాలనలో లంకవైభవము : లంకాపురి యంతయు చక్కని వనములతోను, ఉద్యానవనములతోను నిండియుండెను. తామరలు కలువలతో నిండిన నడబావులు, వివిధ జలాశయములు లంకయందు గలవు. బలమగు ప్రాకారముచే నావృతమై యనేక బురుజులు కలిగియున్నవి. విశాలమగు వీధులు గలిగి తెల్లని భవనములచే నిండియున్నది. ఏడెనిమిది యంతస్థులుగల భవనములాపురము నందున్నవి.

పురమధ్యమునగల యశోకవనము, చైత్యప్రాసాదము లాపురికి శోభను తెచ్చుచుండెను. వివిధాకారములగు పల్లకీలను, చిత్రములగు పొదరిండ్లను, చిత్తరువులు గల గృహములను, క్రీడాగృహములను, దారు నిర్మితగృహములను మారుతి చూచెను.

వీని నన్నింటి ననుసరించి చూచినచో రావణుని పాలనలో లంక సర్వసమృద్ధమై వైభవముగ విలసిల్లినదని వ్యక్తమగుచున్నది.

హనుమంతుడు లంకయందు మధురగీతములను, అందెల చప్పుళ్ళను, చప్పట్లమ్రోతలను, మంత్రములను, వేదములు పఠించువారి మాటలను వినెను. దీనిని బట్టి లంకాపురియందు సంగీత విద్వాంసులు, నాట్యకళాకారులు, వేదమంత్రములు తెలిసినవారు గలరని విదితమగుచున్నది.

రావణుని సభ : యుద్ధకాండము 11వ సర్గము : "రావణ దశరథుల యందలి భేదములు" అను సంశములో — నుండి

రావణుడు సభకు పోవుచుండగా అందఱును ప్రభువు ముఖమును చూచుచు కూర్చుండిరి.

పై వచనములను బట్టి లంకయందలి ప్రజలకు రావణుని యందెంతటి భక్తి-యనురాగము లున్నది విదితమగుచున్నది.

# 20. సుగ్రీవుడు

ఉత్తరకాండము. అధికపాఠము ఆరవ సర్గములో వాలి-సుగ్రీవుల జన్మమును గురించి యీ క్రింది విధముగ నున్నది.

మేరుపర్వత మధ్యశిఖరముపై, బ్రహ్మ సదావసించును. ఒకనా డతని కనులనుండి జలముస్రవింప, బ్రహ్మ యీ కన్నీటిబిందువును చేతితో తాకి భూమియందుంచగనే, యందుండి వానరము పుట్టెను. అతడే ఋక్షరజసుడు.

అత డొకనాడు మేరుశిఖరము నందుగల యొక జలాశయము నందు మూకి స్త్రీగా మారిపోయెను. స్త్రీయగు నాఋక్షరజసుని చూచి దేవేంద్రుడు, సూర్యుడు కామవశ్యులై వీర్యస్ఖలనము గావించిరి. ఇంద్రుని వీర్య మామె శిరస్సునందుపడి వాలి జన్మించెను. సూర్యుని వీర్య మామె కంఠమునందు నిలిచెను. ఇట్టి విధానముచే నా తరుణియు నేమియు పలుకలేదు. అంత నామెకు సుగ్రీవుడు జన్మించెను. పిమ్మట సూర్యు డుదయింప నా తరుణి వానరరూపమును పొందెను. అంత బ్రహ్మ ఋక్షరజసుని కిష్కింధకు రాజునుగా స్థాపించెను.

ఈ కథ యెంత అసహజముగ నున్నదో పరికింపుడు.

దీనినిబట్టి యీ క్రిందివిధముగ జరిగియుండ వచ్చునని తోచెడిని. ఋక్షరజసుడు-బ్రహ్మ-కుమారుడు. ఆ ఋక్షరజసుని భార్య-యింద్రుని వలన వాలిని, సూర్యుని వలన సుగ్రీవుని కనియుండనోపు.

మహాబలపరాక్రమవంతుడగు వాలి, రణమున కాహ్వానించిన యొక రాక్షసునితో నొకబిలమందు రణమొనరించుచుండ, సుగ్రీవు డా బిలద్వారమును పెద్దబండరాతితో మూసివైచి, కిష్కింధ కేగి, తన యన్న-రణమున మరణించెనని పౌరులకు తెలిపి, కిష్కింధకు రాజుగా ప్రకటించుకొనెను. కొద్దికాలము గడచిన పిమ్మట వాలి మెట్టెటో బిలము ముఖద్వారమునందుగల రాతిని త్రోసివైచి, కిష్కింధకు వచ్చి దుష్టుడగు తన తమ్ముని దండింప, నతడు హనుమంతాది తన మంత్రులతో పురము వదలి పారిపోయెను.

కొంతకాలము గడచిన పిదప, భార్యాపహృతుడగు రాముడు, తమ్మునితో ఋష్యమూక పర్వతసానువుల దిరుగాడుచుండుట చూచి, హనుమంతుడు వారిచెంతకేగి, వారు సుగ్రీవుని సహాయమునకై వచ్చుచున్నారని తెలిసికొని సుగ్రీవునితో వారికి సఖ్యముగలిపెను. భార్యావిదూరులగు రామ-సుగ్రీవు లొకరి కొకరు సహాయముచేసికొనునట్లు నిర్ణయించుకొనిరి.

రాజ్య కాంక్షగల సుగ్రీవుడు, రామునిచే తన యన్నయగు వాలి నధర్మముగ చంపించి కిష్కింధ సింహాసన మెక్కెను. పిమ్మట తన బంధుమిత్ర పరవారము నంతటిని చేరదీసి రామునికి సహాయుడై రావణునితో రణమొనరించి విజయము గాంచెను.

రామ లక్ష్మణుల గాంచినంతనే భయపడి యనుచరులతో గూడ కాలికొలది పరుగెత్తిన భీరువు.

తా నెన్ని తప్పుతొనర్చినను, 'నిన్ను హింసింపను-పొమ్మ'ని దండించి వదలిన యన్నను రాజ్యకాంక్షతో క్రూరముగ చంపించిన భ్రాతృద్రోహి, దుర్మార్గుడు.

కఠినశాసనుడు, సుగ్రీవుడు సైన్యమును సమీకరించుచు పదునైదు దినముల లోపల తనయొద్దకు చేరని వానికి మరణదండన విధింపబడునని తెలియజేయుటయే యిందుకు నిదర్శనము (కిష్కింధ. 29వ సర్గము 3౦వ శ్లోకము). హనుమంతుడు స్వయంప్రభతో "మాకు సుగ్రీవు డొసగిన మాసము గడువు గడచుటచే మా యాయువు తీరినట్లే" (కిష్కింధ. 53వ సర్గము 4వ శ్లోకము).

అంగదుడు-సుగ్రీవుని గురించి యీ విధముగ వచించెను. "స్థిరత్వము, ఆత్మశుద్ధి, మనశ్శుద్ధి, దయ, కపటము లేకుండుట, పరాక్రమము, ధైర్యము-అనునవి సుగ్రీవునియందు సరిపడవు. తన యన్న బ్రతికి యుండగనే తల్లివంటిదియగు వదినను స్వీకరించినవాడు, తన యన్న బిలములో శత్రువుతో రణమొనరించుచుండ, బిలద్వారము మూసినవాడగు సుగ్రీవునకు ధర్మమెక్కడిది". ఈ మాటలెంతయు సమంజసములు.

# 21. విభీషణుడు

రావణుని తమ్ముడు. రాజ్యకాంక్షతో అన్నను బంధువులను వదలి విరోధియగు రాముని జేరి రాక్షసవీరులందరిని, దగ్గరవుండి శత్రువులచే చంపించి, రావణుని పిమ్మట లంకాసింహాసన మధిష్ఠించెను.

వాల్మీకి యితనిని మహాత్ముడనియు, ధర్మాత్ముడనియు, సద్గుణవంతుడనియు పొగడెను.

ఉత్తరకాండము 10వ సర్గము : బ్రహ్మ-విభీషణుని వరమడుగుమని కోర నతడు "ఆపదల నందినను నాకు ధర్మమునందు బుద్ధియుండవలయును" అని కోరెను. బ్రహ్మయు నతని కావరము నొసగెను.

బ్రహ్మను విభీషణుడు కోరిన వరము-బ్రహ్మ యతనికి వరమిచ్చుట, వాల్మీకి యతనిని పొగడుట-యివి యన్నియు నీ క్రింది సంఘటనలచే సత్యదూరములుగ నున్నవి.

విభీషణుడు, బలప్రతాపవంతుడు-రాజు అగు తన యన్న యొద్ద పలుమారులు సీతను రామున కిమ్మని వచించుటేగాక, రాముని ప్రతాపమును పొగడుచు రావణుని, రాక్షసవీరులను మిక్కిలిగ నిందించుచు-రాముని బాణములచే మీరు మరణించగలరని వచించి, రావణుని రెచ్చగొట్టి, రావణుడు "మరియొక డిట్లు పలికినచో నీ క్షణముననే జీవించియుండడ"ని వచించినంతనే, తన యనుచరులతో రాముని యొద్ద కేగెను. దీనినిబట్టి విభీషణుడు కావలయుననియే రావణుని, రాక్షసవీరులను నిందించినట్లు గన్పించుచున్నది. కానిచో, రామునితో రావణునివైపు యోధుల పరాక్రమములు తెలిపి "యీ విషయమున కోపమునందకుము. నే నీ విషయములు మిమ్ము భయపెట్టుటకు చెప్పుటలేదు. నీవు వారిని నిశ్చయముగ చంపగలవు (యుద్ధ. 37 సర్గము) అని ధైర్యము చెప్పిన విభీషణుడు, రామునితో నా విధముగ నేల మాట్లాడడు ? రాముడు విభీషణుని రాక్షసుల బలాబలములు తెలుపుమని యడుగ, రాక్షసవీరుల బలపరాక్రమములు వారి ఆయుధములు మొదలగు నవన్నియు రామునకు విపులముగ తెలిపి,

రాక్షసవధ యందును, లంకానాశమందును సహాయము చేసెదననియు, సైన్యమును లంకయందు ప్రవేశింపజేతుననియు వచించెను. (యుద్ధ. 19వ సర్గము).

అట్లు చెప్పుటయేగాక వీరాధివీరులగు నింద్రజిత్తాదులను చంపుటలోను, సోదరులగు రావణ-కుంభకర్ణులను చంపుటలోను రామ లక్ష్మణుల దగ్గర నిలబడి తాను వారికి చేయగలిగినంత సహాయముచేసి, రాక్షసయోధుల చంపించెను.

ఇట్టి భ్రాతృద్రోహి, కులద్రోహి, వంశనాశకుడు ధర్మమునందు బుద్ధిగలవాడగునా ? మహాత్ముడగునా ?

మరియు రామ లక్ష్మణు లింద్రజిత్తు బాణఘాతములకు మూర్ఛితులై రణభూమియందు పడియుండ, విభీషణుడు వారలగాంచి 'యెవరి పరాక్రమము నాశ్రయించి, నాచే శాశ్వతమగు స్థానముకోరబడినదో- ఆ పురుషోత్తము లిరువురు దేహనాశమునకై నిద్రనందియుండ - నేను బ్రతికియుండియు రాజ్యము, కోరికలు నశించినవాడనై యాపదనందిన వాడనైతిని' అని వగచెను (యుద్ధ. 50వ సర్గము).

ఇట్టి రాజ్యకాంక్షగల వానిని, రాజ్యకాంక్షతో శత్రువులను జేరి తనవారినందరిని చంపించిన మహాపాపిని 'ధర్మమునందు బుద్ధిగల వాడుగ నుండుము'ని బ్రహ్మదీవించినాడనుట యెంత ధర్మవిరుద్ధము. వాల్మీకి మహాత్ముడని, ధర్మాత్ముడని సంబోధించుటెంతటి వైపరీత్యము.

రాక్షస రాజ్యవిస్తరణకు, రాక్షసరాజుల బలపరాక్రమములు చాటుటకు, లంకాపురి మహదైశ్వర్యముగ వర్ధిల్లుటకు నిరంతర శ్రమ నొనర్చినవాడు రావణుడు. రాజ్యకాంక్షతో పరులపాదాక్రాంతుడై, స్వజాతిని నిర్మూలమొనరించి-యెవరిచేతను జయింపనలవికాని రావణ-కుంభకర్ణ-యింద్రజిత్తాది మహావీరుల నధర్మముగ చంపించి లంకాపురి వైభవమునే సమూలముగ నాశనమొనరించినవాడు విభీషణుడు. ఇట్టి కులపాంసనుడు వాల్మీకిచే పొగడబడుటచే, ధర్మసంరక్షణము జరిగినదా ? ధర్మవిఘాతము జరిగినదా ? యను సందేహము కలుగుచున్నది.

# 22. హనుమంతుడు

హనుమంతుడు కేసరి భార్యయగు అంజనకు వాయువుయందు జన్మించెను. ఇతని తండ్రియగు కేసరి సుమేరుపర్వత ప్రాంతమున రాజ్య మేలెనని ఉత్తరకాండము 35వ సర్గమునందు గలదు.

అట్టి హనుమంతునకు కిష్కింధ రాజకుమారుడగు సుగ్రీవునితో బాల్యమునుండియు బద్ధసఖ్యమేర్పడెనని ఉత్తరకాండము 36వ సర్గము నందు గలదు.

సుమేరుపర్వతప్రాంత రాజకుమారుడగు హనుమంతునకు, కిష్కింధ రాజకుమారుడగు సుగ్రీవునకు సఖ్యమేరీతి కలిగినది, తండ్రియగు 'కేసరి'కి పిమ్మట రాజ్యమేలవలసిన హనుమంతుడు కిష్కింధలో సుగ్రీవుని మంత్రిగ నేల గడుపవలసి వచ్చినది వాల్మీకి రామాయణమునందు విశదపరచబడలేదు.

మరియు నతడు నవవ్యాకరణవేత్త యనియు, శాస్త్రము నందును-పాండిత్యమునందును, । ఛందగతియందును, సకలవిద్యల యందును బృహస్పతికి సమానుడనియు ఉత్తరకాండము 36వ సర్గ ములో వచింపబడినది. కాని అతడా విద్యలన్నియు నెవరివద్ద నభ్య సించినది యిందు తెలుపబడలేదు. అతనికి దేవతలనేకు రనేక వరము లిచ్చినట్లు 36వ సర్గమునందు తెలుపబడెను.

మహార్షుల శాపముచే నతడు తన బలమును తా నెఱుగడనియు, ఎవరిచేనైన జ్ఞప్తిచేయబడినపుడు అతని బలమభివృద్ధిజెందునని ఉత్తర 36వ సర్గమునందున్నది.

జాంబవంతుడు హనుమంతున కతని బలమును తెలిపెను. (కిష్కింధ. 66వ సర్గము) దీనినిబట్టి జాంబవంతుని వలన తన బలమును

---

అంజన పూర్వజన్మలో 'పుంజికస్థల'యను నప్సరస. ఆమె శాపవశమున కుంజరుడను వానరునకు కుమార్తెగా జన్మించి, 'అంజన' యను పేరుతో ప్రసిద్ధయై, 'కేసరి'యను వానరునకు భార్యయయ్యెను.

తెలిసికొని నప్పటినుండి హనుమంతునకు తా నెవరినైనా జయింప గలనని ధైర్యము కలిగినట్లే గదా! అట్టియెడ హనుమంతుడు లంక కేగి నపుడు లంకాపురి రక్షణనుజూచి "వానరు లిచటకు వచ్చినను వ్యర్థమేయగును. యుద్ధముచేసి లంకను జయింప దేవతలకును సాధ్యము గాదు. రావణపాలితమగు లంకకు వచ్చి రాము డేమి చేయగలడు ?" సుందర. 2వ సర్గము) అని చింతించుటేల ? "యుద్ధమున రాక్షసులచే నేను చంపబడినను, పట్టుకొనబడినను కార్యసాధనకై రామునికి సహాయపడువాడు నాకంటె వేరొకడు లేడు" (సుందర. 30వ సర్గము) అని వాపోవుటేల ? తన బలము తాను తెలిసికొనిన పిమ్మట హనుమంతు డజేయుడు గదా! అట్టి వానికి 'యుద్ధమున నేను మరణించిన' అను అనుమానమేల కలుగును ? దీనినిబట్టి హనుమంతునికి మహర్షు లిచ్చిన శాపము కల్లయనియు, హనుమంతుడు - మహాత్ముడనియు - మహావీరుడనియు సమర్థించుచున్న వాల్మీకి-అట్టి మహాపరాక్రమవంతు డగు హనుమంతుడు సహాయుడై యుండ సుగ్రీవుడు వాలిని జయించ లేక యవస్థలబడుటేల ? యను దానిని సమర్థించుటకై, హనుమంతున కీ శాపకథ కల్పించి నటులున్నది.

హనుమంతుడు మహాబలవంతుడు-పరాక్రమవంతుడు కాదను టకు దగిన యాధారము లెచటను గన్పించవు. అతడు రణమున తన ధైర్యపరాక్రమము లనేకమారులు చూపెను. కాని కిష్కింధ పరిస్థితుల నవలోకించిన హనుమంత-నల - నీల - తారులు సుగ్రీవున కాప్తులు. వీరి మంత్రాంగముతోనే, సుగ్రీవుడు అన్నయగు వాలిని బిలమున బంధించి, యతడు రాక్షసులతోడి రణమున మరణించెనని ప్రచారము గావించి, కిష్కింధాసింహాసన మధిష్ఠించియుండును. మహా బలపరాక్రమశాలియగు వాలి, గుహనుండి వెలువడి కిష్కింధ కేతెంచి సుగ్రీవుని బట్టి మర్ధించ, సుగ్రీవుని మంత్రులగు హనుమంతాదులు తమ దుశ్చర్య బహిర్గతమగుననియు, అట్లు బహిర్గతమైనచో వాలి

వలన తమకు చావుతప్పదనియు నిర్ణయించుకొనినవారై, కిష్కింధనుంచి పారిపోయి, సుగ్రీవుడును అన్నచే దేహమంతయు హూనము చేయబడి కిష్కింధ వెలువడిరాగా, అతనితో గలసి ఋష్యమూక పర్వతము నందు నివసించుచుండిరనియు తోచుచున్నది.

హనుమంతుడు గొప్పమేధావి. ఇతని ప్రాపుతోనే సుగ్రీవుడు రాజ్యమును పొందినాడనుట నిస్సందేహము. రామ లక్ష్మణులగాంచి సుగ్రీవుడు భీతుడై యనుచరులతో పారిపోవుచుండ, కొంతసేపు పారిన పిదప, ఆ యనుచరులలో నొకడైన హనుమంతుడు వివేకియై, వా రెవరో-వారి విషయము తెలిసికొనకయే పారిపోవుట కూడదని పలుక, సుగ్రీవు డాలోచించి వారి విషయము కనుగొనిరమ్మని హనుమంతుని వారి యొద్దకు బంపెను.

హనుమంతుడు రామ లక్ష్మణుల చెంతకరిగి, వారు సుగ్రీవుని కొరకై వచ్చుచున్నారని గ్రహించి, వారితో వాలిని చంపించుటకు తన మనస్సులో నిర్ణయించినవాడై, వారితో సుగ్రీవునకు మైత్రి గరపెను. పిమ్మట రామునిచే వాలిని చంపించి, సుగ్రీవుడు కిష్కింధాభిషిక్తుడగుటకు తోడ్పడెను.

ఇతని శక్తిని గ్రహించియే సుగ్రీవు డితనిని చారునిగ లంకకు అనుచరులతో బంపెను. జాంబవంతుడును యితని శక్తిని గమనించియే యితని నొక్కని లంకకు పోయిరా నియమించెను. రాముడును యితని శక్తి యుక్తులు గమనించియే యితని ద్వారా సీత కంగుళీయకమును బంపెను. సీతయు నితని శక్తియుక్తులను-యితని నిస్వార్థపు సేవాభి మానములను, కార్యనిరతిని, దీక్షాసక్తులను గమనించియే రామరాజ్యాభి షేకానంతర మితనిని మిక్కిలిగ సత్కరించెను.

విభీషణు డన్నను వదలి రాముని జేరినపు డెల్లరు తమ తమ యభిప్రాయములు వెల్లడించుచుండ, హనుమంతుడు రామునితో "సుగ్రీవుడు మీ తోడ్పాటుతో వాలిని చంపి రాజ్యసంపాదించు

జెరిగి, విభీషణుడు రాజ్యకాంక్షియై మిమ్ములను చేరినా''డని వచించి, విభీషణుని మనస్సునందుగల కుటిలత్వమును బహిర్గత మొనరించి, రావణాది రాక్షసుల జంపుట కతని సహాయమవసరమగుటచే నతనిని చేరదీయుట రాజనీతియని రాముని కంతర్గతముగ తెలియబరచెను. హనుమంతుని రాజనీతితోనే రామునిచే వాలి చంపబడి, సుగ్రీవుడు రాజ్యమును పొందెను. వీటన్నిటి నవలోకించిన, వాలి బిలమున సుగ్రీవునిచే బంధించబడుట, తత్సమయమున సుగ్రీవుడు కిష్కింధకు రాజగుట, హనుమంతుని రాజనీతివలననే యనుట విశదమగుచున్నది. అందువలననే, వాలి బిలమునుండి వెలువడి సుగ్రీవుని దండింప తమ దుశ్చరిత్ర బహిర్గతమైనచో వాలిచే ప్రాణములు గోల్పోవుట నిశ్చయమని తలచి హనుమంతుడు తన యాప్తమిత్రులతో పురమువెలువడి పారిపోయి, పిమ్మట నగరబహిష్కృతుడైన సుగ్రీవునిచేరి, రామలక్ష్మణుల గాంచినంతనే, వారికి సుగ్రీవునితోడ పనియున్నదని యెఱిగి, ముందుగా రామునిచే వాలిని చంపించి, సుగ్రీవుని కిష్కింధకు రాజుగా నొనర్చి తన రాజనీతిని చాటెను.

ఈ రాజనీతిని గ్రహించియే రాము డితనిని మిక్కిలిగ నాదరించెను.

వీటన్నిటిని బట్టి హనుమంతుడు గొప్పమేధావి, రాజనీతిజ్ఞుడు, వాక్యవిశారదుడు, సాహసి, బలపరాక్రమవంతుడు, అని విశదమగుచున్నది.

హనుమంతుడు 'రాము డయోధ్యకు వచ్చుచున్నాడ'ని తెలుపగనే భరతు డతనికి గోసహస్రమును, శతగ్రామములను సుందరులు, అలంకారులు, కులము-జాతిగల సద్వ్రతలగు పదునాల్గురు కన్యలను భార్యలుగా యిచ్చుచున్నానని ప్రకటించెను. హనుమంతుడు వాటిలో దేనిని తిరస్కరించలేదు. కనుక హనుమంతుడును స్త్రీ లోలుడనియే తెలియుచున్నది.

# 23. సీత

సీత జన్మమును గురించి ఉత్తరకాండము 17వ సర్గము నందీ క్రింది విధముగ నున్నది. రావణుడు హిమగిరి ప్రాంతమున చరించుచు నొకదినమున బృహస్పతి మనుమరాలును-కుశధ్వజుని పుత్రికయు నగు వేదవతిని జూచి మదోన్మత్తుడై యామె ననుభవించగోరి యామె కేశములను పట్టుకొనెను. వేదవతి రావణుని తృణీకరించుచు రావణుడు పట్టుకొనిన కేశముల నంతవరకు ఖండించి 'నేను నిన్ను చంపుటకై మరలా జన్మింతున'ని రావణునితో వచించి జ్వలించుచున్న యగ్ని యందు ప్రవేశించెను. పిమ్మట ఆ వేదవతి పద్మమునందు జన్మించెను. రావణుడా పసికందును గ్రహించి గృహమునకేగి మంత్రికి జూపెను. మంత్రి యా బాలికను చూచి యామె యిటనుండుట నీ వధము కొరకే యని తెలుప, రావణు డామెను సముద్రమందు వైచెను. ఆమె జనకుని యాగభూమినిపొంది, జనకుడు నాగటిచే దున్నుచుండ ఆ నాగటికొనచే లాగబడి బయల్పడి జనకునికి పుత్రికయై పెంచబడెను.

ఉత్తరకాండము అధికపాఠము 8వ సర్గమునందు లక్ష్మి సీతగా జన్మించెనని యున్నది.

కనుక సీత వేదవతి యవతారమా? లక్ష్మి యవతారమా?

వాల్మీకి యభిప్రాయము ప్రకారము సీతను రావణుడు పెట్టెయందు భద్రపరచి సముద్రమునందు వైచినాడని తలచినచో, నీ క్రింది విధముగ నూహించదగును. నదులనుంచి సముద్రములోనికి నీరు ప్రవహించును. గాని సముద్రములోనుండి నదులలోనికి నీరు ప్రవహించదు. కాని సముద్రములో ఉప్పెన సంభవించినపు డట్లు ప్రవహించుట జరుగును. అట్లు ప్రవహించినను సముద్రమునుండి కొంత దూరము వరకే ప్రవహించగలదు. కొందరు చారిత్రీకు లూహించి నట్లు ఆ కాలమున పశ్చిమమున నేటి రాజపుత్ర స్థానమంతయు సముద్రముగా నుండినదనియు, తూర్పున ఒరిస్సాలోని చాల భాగము, మిథిలవరకు సముద్రము వ్యాపించినదనియు, అందుచే లంక

నుండి సీతయున్న పెట్టె మిథిలకు కొట్టుకొనివచ్చినదనియు తలచినను, లంకనుండి మిథిలకు ఆ పెట్టె వచ్చుట కెంతకాలము పట్టియుండును? అప్పటికి పాలైనను స్వయముగ తాగలేని పసిపాప అందెట్లు జీవించి యుండును? ఆ పెట్టె మిథిలకు కొట్టుకొనివచ్చి మిథిలలోని యాగ భూమియందు నేలలో స్థాపితమై యుండినగదా జనకుని నాగలికి తగిలి బయటకు వచ్చినది. అంతకాల మా పెట్టెలోని శిశువు జీవించి యుండుట కెట్టి యాధారములును కన్పించవు. కనుక యీ కథ, పురాణకల్పిత కథలవలె నొక కల్పితగాథయనుటలో నెట్టి సందేహమును లేదు. లేనిచో భారతమున యజ్ఞవేదినుండి ద్రౌపది, దృష్టద్యుమ్నుడు జన్మించినట్లు దశరథుని యజ్ఞహోమమునుండి ప్రాజాపత్యనరు డుద్భవించినట్లు ఏదియో పురోహితుల తతంగముచేత యజ్ఞభూమియందెవరి పసిపాపయో గల పెట్టె జనకుడు భూమినిదున్నుటకు ముందు కొలదిసేపటి క్రితము పెట్టి యుండవలయును. కథ యెట్టి కల్పితమైనను యందలి సారాంశము సీత జనకునకు దొరకిన పసిపాప. అత డామెకు పెంచిన తండ్రి. ఆ పాప యెవరి బిడ్డయైనది తెలియవలయునన్న నాటి పురోహితులకు మాత్రమే తెలిసియుండవలయు.

జనకుని యింట తన పూర్వీకుల కాలమునుండియు నొక శివ ధనుస్సు గలదు. అది చాల బరువైనది. జనకుడా శివధనుస్సునెత్తి యెక్కుపెట్టిన వారికి తన కుమార్తె నిత్తునని వచించెను. అనేకు లా ధనుస్సునెత్తి యెక్కుపెట్టుటకు విఫలురైరి.

విశ్వామిత్రుడు రామ లక్ష్మణులతో మిథిలకేగి, జనకుని యింట నున్న శివధనుస్సు నతనికి జూపెను. రాము డా ధనుస్సునెత్తి, యల్లె త్రాటిని గూర్చుచుండ నా ధనస్సు విరిగిపోయెను. జనకుడు దశరథునికి కబురంపి తన కుమార్తెలగు సీతా, ఊర్మిళలను రామ – లక్ష్మణులకు, తన తమ్ముడగు కుశధ్వజుని కుమార్తెలైన మాండవి, శ్రుతకీర్తి యను వారలను భరత-శత్రుఘ్నుల కిచ్చి వివాహ మొనరించెను. వివాహ

నైమిన పిమ్మట దశరథుడు కుమారులతోను-కోడండ్రతోను అయోధ్య కేగెను.

దశరథుడు కైకను వివాహమాడునాడు కైకకు జన్మించిన పుత్రునకే రాజ్యమిచ్చెదనని వచించెను. కాని పిమ్మట తన పెద్ద భార్యకు జన్మించిన రామునకు రాజ్యమీయదలచినవాడై రాముని తోను, తన కాప్తులగు మంత్రి పురోహితులతోను సంప్రదించి మరు నాడే రాముని పట్టాభిషేక మహోత్సవము జరుప నిశ్చయించెను. ఆ విషయమును గ్రహించిన కైక, దశరథుడు తన కిచ్చిన వాగ్దాన ముల ప్రకారము తన కుమారుడే గద్దెనెక్క-వలయుననియు, రాముడు పదునాలుగు వత్సరములు వనవాసమున కేగవలయుననియు తెలిపెను. తత్ఫలితముగ రాముడు వనవాసమునకు బయలుదేర నతనితో తమ్ము డగు లక్ష్మణుడు, భార్యయగు సీతయు బయలుదేరిరి.

అడవులయందు ఋషులు రావణాది రాక్షసుల చంపుమని కోర రాముడు వల్లెయనెను. కాని సీత రామునితో వనవాస చర్యలకు విరుద్ధముగ కారణములేకయే రాక్షసుల చంపుట తనకు సమ్మతము గాదని భర్తతో వచించెను. కాని రాము డామెతో రాక్షసుల చంపుదునని తాను ఋషులకు మాటయిచ్చుటచే రాక్షసవధ యని వార్యమని యామెకు తెలిపెను.

దండకావనమున రామ లక్ష్మణుల జూచి రావణుని చెల్లెలగు శూర్పణఖ మనస్సుపడినదై, వారిని చేరి, రామునితో తనను పరిణయ మాడుమని కోరెను. రాము డామె యందమును పొగడి, తనకు భార్య యున్నదనియు, కనుక తన తమ్ముడగు లక్ష్మణుని పరిణయమాడు మనియు కోరెను. లక్ష్మణు డామె యందమును పొగడి, యామెను వివాహమాడుటకు రాముడే తగినవాడని వచించెను. ఇట్లా సోదరు లిరువురు నామెతో కొంతసేపు పరిహాసములాడి చివరి కామెను పట్టు కొని ముక్కు-చెవులుకోసి పంపిరి. అంత నా శూర్పణఖ తన సోదరు

డగు ఖరునితో తన దుర్గతిని వచింప, ఖరుడు, దూషణ - త్రిశిరులను రామ-లక్ష్మణుల దండింపబంపెను. వారిరువురు రామునిచే రణమున హతముకాగా తానును రణమునకేగి రణమున హతుడయ్యెను. అంత శూర్పణఖ తన యన్నయు, లంకాపురి రాజగు రావణుని యొద్దకేగి తన పరాభవము విన్నవించెను.

రావణుడు కోపోద్రేకుడై తన చెల్లెలిని పరాభవించినందుకు ప్రతిగ రాముని భార్యయగు సీత నపహరించి లంకకు గొంపోయెను. రాము డా విషయము తెలిసికొని, సుగ్రీవునితో మైత్రి యొనరించి యతని సహాయముతోను, రాజ్యకాంక్షగలవాడై యన్ననువీడి తన యొద్దకు వచ్చిన విభీషణుని సహాయముతోను రావణాది రాక్షసుల చంపి విభీషణుని లంకకు రాజుగా ప్రకటించెను.

పిమ్మట రాముడు తన విజయమును సీతకు తెలిపి, రావణుని గృహమునన్న సీతను శీలవంతురాలుగా తాను తలచుటలేదనియు, కనుక సీత నామె కిష్టమగు భరత-లక్ష్మణ-సుగ్రీవ - విభీషణాదులలో నెవరి యొద్దనైనను నివసించుమని వచించెను. సీత దుఃఖితయై యగ్ని ప్రవేశ మొనరింతుననె రాముడు సమ్మతించెను. లక్ష్మణుడు అగ్నిని జ్వలింపజేసెను. అచట గల వారెల్లరు హాహాకారము లొనర్చిరి. సీతకు కాపలాకాసిన రాక్షసులు సీత శీలము పవిత్రమైనదని వచించిరి. విభీషణాదులు రావణుడు బలాత్కారముగ పరస్త్రీల ననుభవించువాడు కాదని యతని శీలమును తెలియపరచిరి. అపుడు రాముడు సీతను పరిగ్రహించి అయోధ్యచేరి పట్టాభిషిక్తుడయ్యెను.

కాని రామునకు మాత్రము సీతపై గల యనుమానము పోలేదు. పిమ్మట కొంతకాలమునకు సీత గర్భవతి యయ్యెను. రాము డామెను లక్ష్మణునిచే వాల్మీకి యాశ్రమ పరిసరమున వదలిపెట్టించెను. వాల్మీకి యామెను చేరదీసెను. ఆమెకు కవలపిల్లలు జన్మించిరి. వాల్మీకి వారికి లవ కుశులని నామకరణము చేసెను. వాల్మీకి రామాయణ గాథను రచించి వారిచే నధ్యయనము చేయించెను.

రాము డశ్వమేధ యాగముచేయ నారంభించెను. ఆ వార్తను విని వాల్మీకి తన శిష్యులగు లవ కుశులతో నా యజ్ఞమున కేగెను. కుశలవు లచట రామాయణ గానమొనర్చుచుండ నందఱు ముచ్చట పడిరి. రాముడా బాలకులచే రామాయణ కథ నామూలాగ్రముగ వినెను. వాల్మీకిచే నా బాలకులు తన పుత్రులుగా నెఱిగి సీతను తీసికొనివచ్చి యామె శీలమును నిరూపించుకొనవలసినదిగ వాల్మీకితో వచించెను. మఱునాడుదయము వాల్మీకి సీతతో యజ్ఞభూమి కేతెంచెను. భర్త నిరాకృతయగు నామె శుష్కించియుండెను. ఆమెను గాంచిన నచటి జనులెల్లరు ఖేదమును బొందిరి. రాముడు సీతను తన శీలమును నిరూపించుకొనవలసినదిగ యాదేశించెను. సీత శుష్కించిన వదనములతో-దీనములగు నేత్రములతో తాను మనసార ప్రేమించిన తన భర్తయగు రాముని తెప్పలార్పక చూచెను. ఆచూపు లోనే యామె ప్రాణములును గతించి యామె భూమిపై పడెను. ఈ విధముగ భర్తనే మనోవాక్కాయ కర్మలయందు ప్రేమించి సీత విషాదముతో ప్రాణములు గోల్పోయెను.

సీత మహాపతివ్రత : ఆమె మనోవాక్కాయ కర్మలయందు భర్తనే ప్రేమించెను. భర్తలేక జీవింపజాలక వనముల కేగు భర్తతో తానును వనములకు బయలుదేరినది. రాము డామెతో నడవుల యందలి కష్టములు తెలిపి వనవాసము సుఖముకాదని వచింప, భర్తతో కలిసియుండుటే తనకు సుఖమని వచించెను. రాము డామె నంతఃపురమున నుండి వృద్ధులగు నత్తమామల సేవింపవలసినదని వచింప, తన కత్తమామలసేవకంటె భర్తసేవయే యుత్తమమని నిర్భీతిగ వచించెను. రాము డామెను రాజగు భరతుని కనుకూలముగ వర్తించుమన, తన తండ్రియగు జనకుడు అల్లుడగు రాముని తన భార్యను పరులయొద్ద వదలునట్టుగ తలచలేదని రాముని పురుషాకార మును రెచ్చగొట్టుచు వచించెను.

వనముల నామె పదమూడు వత్సరములు చరించినను, ఏ నాడైన తాను కష్టము లనుభవించుచున్నానని తలపలేదు. తన కుచితమగు రాజభోగముల త్యజించితినని యెన్నడైన వగవలేదు.

రావణాంతఃపురమున నున్నను, తాను నిస్సహాయురాలనని తలచియు, రావణుని సుందరాకారమునుగాని వైభవమునుగాని తలపక, నిశ్చలముగ రావణునితో తాను తన భర్తను తప్ప మరెవ్వరినీ తన మనస్సున తలచుట లేదని నిర్భయముగ వచించి తన మనో నిశ్చలతను తెలిపెను. రాముడు లంకకువచ్చి తనను తీసికొని వెళ్ళునని మనోనిశ్చయముతోనే యామె కాలమును గడపెను. రావణుడామె మనోభిప్రాయమును, రాముని యందామెకు గల యపార ప్రేమ, విశ్వాసములను తలచియే యామెతో 'దేవీ! వగవకుము. నాకు నీయం దెంతటి కామోద్రేకములు గల మనసున్నను నన్ను కామింపని నిన్ను స్పృశింపను' అని యామె నోదార్చి, యశోకవనము నందామెను రాజస్త్రీవలె వసించుటకు తగిన యేర్పాటు లన్నియు గావించెను.

రాముని దూతగా హనుమంతుడు తన చెంతకువచ్చినాడని గ్రహించిన సీత యతనితో రామునికి వార్తనంపుచు 'నేను బ్రతికి యుండగా నన్ను రాముడు దుఃఖసముద్రము నుండి యెట్లు దాటించునో, అట్లు నీవతనితో చెప్పవలసినది. శోకముచే కృశించియున్న యా మహాత్ముని నే నెట్లు స్పృశింపగలనో, నా యందట్లు దయ యుంచుము." అనుచు పరిపరివిధముల పలికెను. ఈ మాటలను బట్టి యామెకు రామునిపై నెంతటి అనురాగము గలదో వెల్లడియగుచున్నది.

రావణుని చంపిన పిమ్మట, ప్రియమగు తన భర్త చెంతకు రాక పోవుట యేగాక హనుమంతునిద్వారా తన విజయమును–తన కీర్తిపతాక చంద్రికల వెల్లడించుచు సీతకు కబురుపంప, సీత యెంతటి మనోవ్యథ ననుభవించినది. యామె తన భర్తకు పంపిన "నా భర్తను చూడ గోరుచున్నాను" అను ఒక్క వాక్యములో వెల్లడియగుచున్నది.

విభీషణుడు సీతతో రాముని యొద్దకేగుటకు స్నానమొనర్చి యలంకృతవు గమ్మనగా నామె 'స్నానముచేయకయే భర్తను చూడ దలచుచున్నాన'ని వచించెను. దీనినిబట్టి యామె తనభర్తను చూచుట కెంత యాతురపడినది వ్యక్తమగుచున్నది.

సీత తనభర్తను చూడగనే 'ఆర్యపుత్రా'యని పలుకుచు రోదనము చేసెను. ఆమె యెంతో కాలమునుండి చూడవలయునని తపన పడుచున్న తనభర్తను చూడగనే తన మనోగతము నాపుకొనలేక విలపించెను. దీనినిబట్టి యామెకు భర్తపై నెంతటి యనురాగమున్నది వెల్లడియగుచున్నది.

అట్టి సమయమున రాము డామెను గ్రహింపక తన విజయమును గురించి, యుద్ధపరిశ్రమను గురించి వివరించుచు సీతను బహుజన సమక్షమున 'నీవు సందేహింపదగిన నడవడి గల దానవు. రావణుని యంకమునుండి జారిపడిన నిన్ను నావంశము నగౌరవపరచుచు నెట్లు పరిగ్రహింతును. నా కీర్తి కొఱకే రావణుని జయించితినిగాని నీయందు ప్రేమతో నిన్ను స్వీకరించుటకుగాదు. నాచే విడువబడిన నీవు భరత-లక్ష్మణ-సుగ్రీవ-విభీషణుల యందెవరి యందైనను మనస్సునుంచి వారియొద్ద కేగుము''అని వచింప, సీత యెంతటి మనోవ్యథనొందినదో, యెంత విలపించినదో, యామెకు తప్ప మరియొకరి కవగతము కాని విషయము.

అప్పు డామె లజ్జచే ఖిన్నురాలయ్యు, మనస్సును కూడగట్టుకొని ధైర్యమునుపొంది రామునితో "నీచుడు-నీచురాలితో పలికినవిధముగ నిట్లేల కర్ణకఠోరమగు తగని పలుకులు పలికెదవు. నేను నీవు తలచునట్టి హీనురాలను గాను, నీ శంకను త్యజింపుము. నీచురాండ్రగు స్త్రీల తలచుచు, స్త్రీజాతినంతయు సందేహించుట సరియైనదిగాదు. క్రోధమునే యనుసరించుచున్న నీచే, నీచునిచేతవలె స్త్రీత్వమే ముఖ్యముగా నుంచుకొనబడినది'' యని రాముని మనస్సును ఛేదించుచు

పలికి, కన్నీటితో నేడ్చుచు సౌమిత్రీ! నాకు చితిపేర్పుమని పలికెను.

దీనిని బట్టి యామె, రాముని యభిప్రాయమున కెంత కలతనొంది నది తెలియుచున్నది. అడవులయందు సీతా! సీతా! యని విలపించి, యిప్పు డామె కన్పించ, నీ విధి వర్తించుచున్న రాముని చేష్టల కచటి వారెల్ల వ్యథచెందిరి. లక్ష్మణుడు చితిపేర్చ, నామె యగ్నియందు దుముకుటకు సిద్ధముకాగా నచటి వారెల్ల రాముని గుండెలు వ్రయ్య లగునట్లు హాహాకారము లొనరించిరి. అనేకు లామె శీలమును శ్లాఘించిరి.

అపుడు రాము డామెను స్వీకరించెను. కాని తన మనస్సు లోని కళంకము పూర్తిగపోనందున, పిమ్మట కొంతకాలమునకు నిండు గర్భవతియగు నామెను వాల్మీకి యాశ్రమ ప్రాంతమునకు తమ్మునిచే పంపి వదలివేసెను. కాని సీత అపుడును తన భర్తను నిందింపక తమ కర్మయని వాపోయెను. వృద్ధాప్యములో నీ విధిగ భర్తచే క్రూరముగ నిరాదరింపబడి, పసిపాపలను చూచుకొనుచు కొంతకాలము జీవించెను. కాని యామెకు భర్తపై ప్రేమ మాత్ర మిసుమంతయు తగ్గలేదు. చివరకు భర్తను చూచుచునే ప్రాణములు వీడెను.

ఆమె వనముల గడుపునపుడు తన భర్త శ్రేయస్సునే కోరెను. తన భర్తకు రాజ్యప్రాప్తి కలుగవలయునని చెట్లను-నదులను పూజించెను.

వనమున మారీచుడు తన భర్తకంఠము ననుసరించుచు 'హా సీతా! లక్ష్మణా!' యని యాక్రోశింప, తన భర్తకంఠముగా దలచి లక్ష్మణుని యనరాని మాటలని, యన్న యొద్దకు బంపెను. వీటన్నిటిని బట్టి సీతకు భర్తపై మిక్కిలి యనురాగము గలదని తెలియుచున్నవి. కాని దానికి ప్రతిగా నామె పొందినది భర్తృనిరాదరణ.

రాజవంశగౌరవమునకు వన్నె తెచ్చిన వనిత సీత :

భర్త వనముల కేగుచుండ, నంతఃపుర రాజ్యసౌఖ్యముల తృణప్రాయముగ నెంచి భర్తతో ఘోరాటవుల పయనించిన వీరవనిత సీత.

భర్తయగు రాముడు, తనను రాజగు భరతున కనుకూలముగ మెలగుమన, తన తండ్రి తనను రామున కిచ్చునపుడు తన యల్లుని నట్టువగ తలప లేదని వచించి భర్తకు పురుషాహంకారమును నూరి పోసెను.

రావణుడు తనను బలాత్కారముగ గొంపోవుచుండ భయపడక అతనితో "నన్నిట్లు గొనిపోయి యేమిచేయగలవు?" అని రాచరికపు ఠీవితో ప్రశ్నించెను.

రావణుని లంకాపురియందు ఏకాకియు, నిస్సహాయయునైయుండియు, రావణుడామెను తనయందు మనస్సును మరల్చుకొమ్మన, తాను రాముని తప్ప మరి యెవ్వరిని మనస్సున గూడ దలపననియు, రాముడు వచ్చి యతని ప్రాణములు తీయుటకు ముందే తనను రామున కప్పగింపుమనియు నిర్భీతిగ పలికెను.

హనుమంతు డామెను తన వీపుపై నెక్కించుకొని రాముని యొద్దకు చేర్చెదనన సీత యతనితో "రాముడు బంధువులతో దశకంఠుని చంపి నన్ను తీసికొని వెళ్ళుట యతనికి తగిన కార్యము. అదియే నాథుని కీర్తిదాయకము" అని వచించి రాముని పరాక్రమమును పరీక్షకు నిలిపి రాజవంశమునకే వన్నెతెచ్చు నట్లు వచించిన వనిత.

రాముడు తన నెంతహీనముగ బలికినను, గృహమునుంచి వెడలబంపినను రాముని సమక్షమున రాముని నిలదీసి యడిగినదిగాని, భర్తయొక్క పరోక్షమున భర్త నేమియు నిందించక యది తన కర్మయని తలపోసిన యుత్తమురాలు.

ధర్మాచరణము : రాముడు దండకారణ్యమున ఋషులతో

రాక్షసుల వధింతునని పలుక సీత అతనితో పలికిన ఈ క్రింది పలుకు లెంతయు శ్లాఘ్యములు.

"ఈ ఋషిధర్మము సూక్ష్మవిచారముచే పొందబడినది. ఇది కామాది వ్యసన నివృత్తుడగు వానికే సాధ్యమగును. ఈ విషయమున 1) మిథ్యావాక్క 2) పరస్త్రీ గమనము 3) వైరములేని క్రౌర్యము అను వ్యసనములు కలవు. అందు వైరములేని క్రౌర్యము పరప్రాణి హింసారూపమైనది. అదియు మోహమువలన నీకు తటస్థించుచున్నది. నీచే రాక్షసవధము ప్రతిజ్ఞాతమైనది. దీని కొఱకే నీవు సోదరునితో ధనుర్బాణములు ధరించి దండకాటవికి బయలుదేరితివని వినికిడి. అట్టి నీ నడవడిచే నా మనస్సు చింతాక్రాంతమైనది. అందుచే నీ దండకాటవీ గమనము నాకు సమ్మతము గాదు.

రాక్షసులను వైరములేకయే చంపుట చేయదగదు. అపరాధము లేకయే యితరులను చంపుటకు నేను సమ్మతింపను. శస్త్రసేవనమువలన నీ బుద్ధి కలుషితమైనచో నయోధ్యకు వెళ్ళి క్షాత్రధర్మము నాచరింపుము. నా అత్తమామలయందు తరుగని ప్రీతి గలిగినచో రాజ్యమును వదలి నిశ్చయముగ ముని వగుము.

ధర్మము వలన-అర్థసుఖములు, సర్వమును కలుగును. ఈజగము ధర్మసారమైనది. సుఖమువలన సుఖము లభింపదు. శుచిమతివై తపోవనమందు ధర్మము నాచరింపుము. (అరణ్యా. 9వ సర్గము).

పై విషయములు పరిశీలించిన సీతకు రాజధర్మములందు, తపోధర్మములందు, సాధారణ ధర్మములందు నెంతటి పాండిత్యమున్నది వెల్లడియగుచున్నది. మరియు నామె తన భర్తను ధర్మమూర్తిగ తీర్చిదిద్దుట కెంత యత్నించినది విశదమగుచున్నది.

వీటన్నిటి బట్టని సీత పతియందు మిక్కిలి యనురాగము గల స్త్రీయనియు, ధర్మము ననుసరించుటయందు మిక్కిలి ప్రీతిపాత్రురాలనియు, రాజవంశముయొక్క గౌరవమును - తన పుట్టినింటి గౌరవ

యును–మెట్టినింటి గౌరవము నినుమడింపచేసిన యుత్తమ వనితయనియు తెలియుచున్నది.

కాని రావణునిచే నపహరింపబడి కొంతకాలము క్లేశము పొందినది. పిమ్మట తాను తనకంటె మిన్నగ ప్రేమించిన, భర్తచే పరిత్యజింపబడి నిరంతర ఖేదముతో తన యంత్యకాలము గడపి, యొక మహోత్తమురాలు, ఒక నిర్భాగ్యగ మరణించెను. ఇట్టి ప్రేమస్వరూపిణిని, నానా వెతలపాల్జేసిన రాముని మహోత్తముడని, సకలసద్గుణోపేతుడని వచించి వాల్మీకి చరిత్రకు కీడు దెచ్చెనా ? కీర్తి దెచ్చెనా ?

# 24. వాల్మీకి రామాయణములోని పరస్పర విరుద్ధాంశములు

1. శివధనుస్సు జనకున కిచ్చిన దెవరు ?

బాల. 66వ సర్గము : జనకుడు విశ్వామిత్రునితో

శ్లో॥ దేవరాత ఇతి ఖ్యాతో నిమేః షష్ఠో మహీపతిః,
న్యాసోఽయం తస్య భగవన్ హస్తే దత్తో మహాత్మనా. 8

ఈ ధనుస్సును శివుడు నిమిచక్రవర్తికి ఆరవవాడైన దేవరాతుడనెడు రాజునొద్ద న్యాసముగా నుంచెను.

అయోధ్య. 118వ సర్గము : సీత అనసూయతో

శ్లో॥ మహాయజ్ఞే తదా తస్యవరుణేన మహాత్మనా,
దత్తం ధనుర్వరం ప్రీత్యా తూణీ చాక్షయ్యసాయకౌ. 39

అపుడు మహాయజ్ఞమందు వరుణునిచే తనకు (జనకునకు) ధనుస్సును, అక్షయబాణములు గల తూణీరములు యీయబడెను.

2. విశ్వామిత్రుడు యజ్ఞముచేసిన ప్రదేశము :

బాల. 29వ సర్గము : విశ్వామిత్రుడు రామునితో

శ్లో॥ ఏష పూర్వాశ్రమో రామ వామనస్య మహాత్మనః,
సిద్ధాశ్రమ ఇతి ఖ్యాతః సిద్ధో హ్యత్ర మహా తపాః. 3

ఇది వామనుని పూర్వాశ్రమము. అత డిచట సిద్ధుడగుటచే నిది సిద్ధాశ్రమమని ఖ్యాతినొందెను.

శ్లో॥ తేనైష పూర్వ మాక్రాంత ఆశ్రమః శ్రమనాశనః,
మయాఽపి భక్త్యా తస్యైవ వామన స్యోప భుజ్యతే. 22

ఆ వామనునిచే శ్రమనాశకమగు నీ యాశ్రమము పూర్వ మాక్రమించబడినది. ఆ వామనుని యందలి భక్తిచే నే నీ యాశ్రమము నాశ్రయించితిని.

అరణ్య. 38వ సర్గము : మారీచుడు రావణునితో

శ్లో॥ తం తదా దండకారణ్యే యజ్ఞ ముద్దిశ్య దీక్షితమ్,
బభూవోపస్థితో రామ శ్చిత్రం విస్ఫారయన్ ధనుః. 13

అపుడు దండకారణ్యమున యాగదీక్షబూనిన విశ్వామిత్రునికి సన్నిహితుడై రాముడు చిత్రమగు తన ధనుస్సును సారించుచు యజ్ఞ రక్షణ చేసెను.

3. రావణుడు సీతతో మాట్లాడుచుండగా నడ్డగించిన దెవరు ?

సుందర. 22వ సర్గము :

శ్లో॥ ఉపగమ్య తతః క్షిప్రం రాక్షసీ ధాన్యమాలినీ,
పరిష్వజ్య దశగ్రీవ మిదం వచన మబ్రవీత్. 39

అపుడు ధాన్యమాలిని యను రాక్షసి వేగముగ వచ్చి రావణుని కౌగలించుకొని యిట్లు పలికెను.

సుందర. 58వ సర్గము :

శ్లో॥ స్త్రీణాం మధ్యా త్సముత్పత్య తస్య భార్యా దురాత్మనః,
వరా మండోదరీ నామ తయా సంప్రతి షేధితః 75

అపుడు స్త్రీల మధ్యనుండి యా దురాత్ముని భార్యయగు మండోదరి లేచి యతనిని వారించెను.

4. రావణుని నిలయమును గురించి సుగ్రీవుడు రామునితో

కిష్కింధ. 7వ సర్గము :

శ్లో॥ న జానే నిలయం తస్య సర్వథా పాపరక్షసః,
సామర్థ్యం విక్రమం వాపి దౌష్కులే యస్య వా కులమ్. 2

నేనా పాప రాక్షసుని నిలయముగాని, బలపరాక్రమములుగాని, కులమునుగాని యెఱుగను.

కిష్కింధ. 41వ సర్గము :

శ్లో॥ స హి దేశ స్తు వధ్యస్య రావణస్య దురాత్మనః. 25
రాక్షసాధిపతే ర్వాస స్సహస్రాక్ష సమద్యుతేః,
దక్షిణస్య సముద్రస్యమధ్యే తస్య తు రాక్షసీ. 26

ఆ దేశము ఇంద్రునకు సాటియగు ప్రకాశముగలవాడును, దురాత్ముడు, మనకు చంపదగినవాడు నగు రాక్షసరాజగు రావణునిది.

ఆ దక్షిణ సముద్రము నడుమ....

5. విరాధుడు తనను గురించి రామునితో

అరణ్య. 3వ సర్గము :

శ్లో॥ పుత్రః కిల జయ స్యాహం మమ మాతా శతహ్రదా,
విరాధ ఇతి మామాహుః పృథివ్యాం సర్వరాక్షసాః. 6

నేను 'జయుడు' అనువాని పుత్రుడను. నా తల్లి శతహ్రద. ఈ పృథ్వియందుండు రాక్షసులు నను 'విరాధుడ'ని పిలుతురు.

అరణ్య 4వ సర్గము :

శ్లో॥ అభిశాపా దహం ఘోరాం ప్రవిష్టో రాక్షసీం తనుమ్,
తుం బురు ర్నామ గన్ధర్వ శ్శప్తో వై శ్రవణేన హ. 14

నేను తుంబురుడను గంధర్వుడను. కుబేరుని శాపముచే రాక్షస శరీరము నొందితిని.

6. కబంధుని గురించి :

అరణ్య. 71వ సర్గము : కబంధుడు.

శ్లో॥ శ్రియా విరాజితం పుత్రం దనో స్త్వం విద్ధి లక్ష్మణః. 9

లక్ష్మణా ! శ్రీ విరాజితుడగు దనువు పుత్రునిగా నెఱుగుము.

శ్లో॥ ఏవ ముక్త స్తు ధర్మాత్మా దను నా తేన రాఘవః. 20

ధర్మాత్ముడగు రాము డట్లు దనువుచే జెప్పబడినవాడై.

కిష్కింధ 4వ సర్గము : లక్ష్మణుడు హనుమంతునితో

శ్లో॥ దనుర్నామ దితేః పుత్ర శ్శాపాద్రాక్షస తాం గతః. 15

శాపము వలన రాక్షసత్వమును బొందిన 'దనువు'అను దితి పుత్రుడు.

7. వాలితో రణమొనర్చిన రాక్షసుని గురించి :

కిష్కింధ. 9వ సర్గము : సుగ్రీవుడు రామునితో

శ్లో॥ మాయావీ నామ తేజస్వీ పూర్వజో దుందుభేః సుతః,
తేన తస్య మహద్వైరం స్త్రీ కృతం విశ్రుతం పురా. 4

దుందుభి పుత్రుడగు మాయావి యను వానితో నతనికి (వాలికి) స్త్రీ కృతమగు వైరమేర్పడెను.

శ్లో॥ స తు సుప్తజనే రాత్రౌ కిష్కింధా ద్వార మాగతః,
నర్దతి స్మ సు సంరబ్ధో వాలినం చాహ్వయ ద్రణే. 5

అతడొకనాటి రాత్రి జనులు నిద్రించుచుండగా కిష్కింధ ద్వారము కడకు వచ్చి యార్భాటముతో నఱచుచు వాలిని రణమునకు పిలిచెను.

కిష్కింధ. 10వ సర్గము : వాలి.

శ్లో॥ సూదయిత్వా తు శత్రుం విక్రాంతం దుందుభే స్సుతం,
నిష్క్రామ న్నైవ పశ్యామి బిలస్య పిహితం ముఖమ్. 22

---

మహర్షుల చరిత్రలు :

కాత్యాయన మహర్షి సంతతివాడగు కబంధుడను ఋషి.

నేను శత్రుడు—పరాక్రమవంతుడగు దుందుభి కుమారుని చంపి వచ్చుచు మూయబడియున్న బిలద్వారమును జూచితిని.

దుందుభిని జంపి, పైకి వచ్చిన యతని సుతుని జంపి.

కిష్కింధ. 11వ సర్గము :

శ్లో॥ శ్రుత్వా హిమవతో వాక్యం క్రోధావిష్ట స్స దుందుభిః,
జగామ తాం పురీం తస్య కిష్కింధాం వాలిన స్తదా. 24

శ్లో॥ ధారయన్ మాహిషం రూపం తీక్ష్ణ శృంగో భయావహః,
ప్రావృషీవ మహామేఘ స్తోయపూర్ణో నభ స్తలే. 25

హిమవంతుని మాటవిని కోపమునొందిన యా దుందుభి, వాలి యొక్క కిష్కింధాపురమునకు వెళ్ళెను. మహిషరూపము ధరించి, వాడికొమ్ములు గలిగినవాడై వర్షాకాలమందు నాకాశమున నీటితో నిండిన మేఘమువలె నొప్పెను.

కిష్కింధ. 11వ సర్గము :

శ్లో॥ తత స్తద్వార మాగమ్య కిష్కింధయా మహాబలః,
ననర్ద కంపయన్ భూమిం దుందుభి ర్దుందుభి ర్యథా. 26

మహాబలుడగు దుందుభి కిష్కింధా ద్వారమునకు వచ్చి, భూమి కంపించునట్లు దుందుభి ధ్వనివలె నఱచెను.

శ్లో॥ తయో స్తు క్రోధ సంరంభా త్పరస్పర జయైషిణోః,
యుద్ధం సమ భవద్ఘోరం దుందుభే ర్వానరస్య చ. 42

ఒండొరుల జయింపగోరు నా దుందుభి వానరులకు భయంకర యుద్ధము జరిగెను.

శ్లో॥ యుద్ధే ప్రాణహరే తస్మి న్నిష్పిష్టో దుందుభి స్తదా,
పపాత చ మహాకాయః క్షితౌ పంచత్వ మాగతః. 46

ప్రాణములు హరించు నా యుద్ధమున మహాశ్శరీరముగల దుందుభి నలుగగొట్టబడి నేలబడి మరణించెను.

శ్లో॥ తం తోలయిత్వా బాహుభ్యాం గత సత్త్వ మచేతనమ్,
చిక్షేప బలవా న్వాలీ వేగేనై కేన యోజనమ్. 47

బలవంతుడగు వాలి, ప్రాణములు హరించబడి యచేతనుడగు నా దుందుభిని చేతులతో నెత్తివేగముగ నొక్క-యోజనము దూరము విసరివై చెను.

కిష్కింధ. 46వ సర్గము : సుగ్రీవుడు రామునితో

శ్లో॥ యదా తు దుందుభిః నామ దానవం మహిషాకృతిం,
పరికాలయ తే వాలీ మలయం ప్రతి పర్వతమ్. 3
తదా వివేశ మహిషో మలయస్య గుహాం ప్రతి,
వివేశ వాలీ తత్రాపి మలయం తజ్జిఘాంసయా. 4

దుందుభి యను రాక్షసుడు మహిషరూపముదాల్చి వాలితో యుద్ధమునకు వచ్చి, వాలి యతని తఱుముకొనిపోయెను. అపుడు దుందుభి మలయపర్వతపు గుహను ప్రవేశించెను.

వాలి, యతనిని చంపగోరి యా మలయపర్వతపు గుహలో ప్రవేశించెను.

శ్లో॥ తతః క్షతజవేగేన ఆపురే తదాబిలమ్.
తదహం విస్మితో దృష్ట్వా భ్రాతృశోక విమార్దితః,
అథా హం కృతబుద్ధిస్తు సువ్యక్తం నిహతో గురుః. 6
శిలా పర్వత సం కాశా బిలద్వారి మయా వృతా,
అశ క్నువ న్నిష్క్ర- మితుం మహిషో వినశే దితి. 7

రక్తప్రవాహముతో నా బిలము నిండెను. అది చూచి నా యన్న కాపదకలిగెనేమో యని యాశ్చర్యమును శోకమును పొందితిని.

నా యన్న మరణించెనని నిశ్చయించుకొని, నా యన్నను సంహరించిన మహిషము గుహనుండి వెలువడలేక, అందులోనే నశింపవలయునని తలచి పర్వతమువలెనున్న రాతితో బిలద్వారమును మూసితిని.

ఉత్తరకాండ. 12వ సర్గము : రావణుడు వేటకై సంచరించుచు నరణ్యమున దితిపుత్రుడగు మయుని, యతని కుమార్తెయగు మండోదరిని చూచెను. మయు డతనితో హేమయను నప్సరస దేవతలచే నా కీయబడినది. ఆమె యందాసక్తుడనై పురము నిర్మించుకొని నివసించుచుంటిని. ఆమె దైవకార్యమునకై వెళ్ళి పదునాలుగు వత్సరములైనది. హేమవలన నాకు 'మండోదరి' యను యీ కుమార్తె మరియు నిరువురు సుతులు జన్మించిరి.

ప్రథముడు మాయావి, ద్వితీయుడు దుందుభి.

పై కథలోని విశేషాంశములు :

1. దుందుభి పుత్రుడగు మాయావితో వాలి బిలమున ప్రవేశింప సుగ్రీవుడా బిలద్వారమును మూసివైచెను.

2. వాలి దుందుభిని చంపి యోజనదూరము విసరివైచెను.

3. దుందుభితో వాలి బిలమున ప్రవేశింప సుగ్రీవుడా బిలద్వారమును మూసివైచెను.

4. మయుని కుమారులు మాయావి దుందుభి.

ఈ విషయములను బట్టి వాలి, దుందుభిని చంపి యోజన దూరము విసరివైచుట యబద్ధము. దీనిచే దుందుభి రక్తబిందువులు మతంగాశ్రమమున బడుటయు, మతంగఋషి-వాలిని 'తన యాశ్రమము చుట్టును ఆమడదూరములోనికి వచ్చిన యతడు మరణించునని శపించుటయు నబద్ధము.

దీనినిబట్టి రాముడు

శ్లో॥ రాఘవో దుందుభేః కాయం పాదాంగుష్ఠేన లీలయా,
తోలయిత్వా మహాబాహుః చిక్షేప దశయోజనమ్. 84

"దుందుభి శరీరమును తన కాలిబొటనవ్రేలితో ముందు వెనుకల కూగించి పదియోజనముల దూరము విసరివైచెను" అనునదియు నబద్ధమే.

వాలి చంపినది 'మాయావి'నా? 'దుందుభి'నా?

మాయావి-దుందుభి పుత్రుడా? మాయావి-దుందుభులు సోదరులా! పై యంశములో నేవి యదార్థములు?

8. అహల్య దేవేంద్రుల కథ:

బాల. 48వ సర్గము: విశ్వామిత్రుడు రామ లక్ష్మణులతో

శ్లో॥ తస్యాంతరం విదిత్వా తు సహస్రాక్ష శ్శచీపతిః,
మునివేషధరోఽహల్యా మిదం వచన మబ్రవీత్. 17
ఋతుకాలం ప్రతీక్షంతే నార్థిన స్సు సమాహితే,
సంగమం త్వహ మిచ్ఛామి త్వయా సహా సుమధ్యమే. 18

అతడు (గౌతముడు) లేని కాలము నెఱిగి, యింద్రుడు ముని వేషమును ధరించి, అహల్యతో నిట్లనెను.

సుందరీ! భోగార్థులు ఋతుకాలమును నిరీక్షింపరు. నేను నీతో సంగమమును కోరుచున్నాను.

శ్లో॥ మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన. 19
మతిం చకార దుర్మేధా దేవరాజ కుతూహలాత్,
అథా బ్రవీత్ సురశ్రేష్ఠం కృతార్థే నాంతరాత్మనా. 20
కృతార్థాస్మి సురశ్రేష్ఠ గచ్ఛ శీఘ్ర మితః ప్రభో,
ఆత్మానం మాం చ దేవేశ సర్వథా రక్ష మానద. 21

మునివేషధారుని యింద్రునిగా నెఱిగి, యింద్రుడు తనయందాసక్తు డగుట వలన దుర్మతియై సమ్మతించెను.

అంతట కోరికతీరిన మనస్సుతో 'ఇంద్రా! కృతార్థురాలనైతిని. శీఘ్రముగ నిచటనుండి పొమ్ము. నిన్ను - నన్ను సర్వదా కాపాడు కొనుము.

గౌతము డింద్రుని:

శ్లో॥ మమ రూపం సమాస్థాయ కృతవా నసి దుర్మతే,
అకర్తవ్య మిదం తస్మా ద్విఫల స్త్వం భవిష్యసి. 27

దుర్మతీ! నా రూపమును ధరించి యకృత్యమును చేసితివి, అందువలన వృషణములు లేనివాడ వగుదువు.

గౌతము డహల్యను :

శ్లో॥ ఇహ వర్ష సహస్రాణి బహూని త్వం నివ త్స్యసి,
వాయుభక్షా నిరాహారా తప్యంతీ భస్మశాయినీ. 30
అదృశ్యా సర్వభూతానా మాశ్రమేఽస్మి న్నివ త్స్యసి.

"ఇచట నీవు పెక్కు వేల సంవత్సరములు వాయువును భక్షించుచు, నిరాహారవై తపముచేయుచు. బూడిదయందు పరుండి సర్వ భూతముల కదృశ్యవై యీ యాశ్రమమందు వసింపగలవు." అని శపించెను.

ఉత్తరకాండ. 30వ సర్గము : బ్రహ్మ యింద్రునితో

శ్లో॥ సాత్వయా ధర్షితా శక్ర కామార్తేన స మన్యునా,
దృష్ట స్త్వంచ తదా తే న హాశ్రమే పరమర్షిణా. 32

ఇంద్రా, కామార్తుడవగు నీచే నామె ధర్షింపబడెను. అపుడు పరమర్షి యగు నతనిచే యాశ్రమమందు చూడబడితివి.

శ్లో॥ తతః క్రుద్ధేన తేనాఽసి శ ప్తః పరమ తేజసా,
గతోఽసి యేన దేవేంద్ర దశాభాగవిపర్యయమ్. 33
యస్మాన్మే ధర్షితాపత్నీ త్వయా వాసవ నిర్భయమ్,
తస్మాత్త్వం సమరే రాజం చ్ఛత్రుహ స్తమ్ గమిష్యసి. 34

క్రుద్ధుడగు నా ఋషిచే శపించబడితివి. "దేవేంద్రా! ఏ కారణమున విపరీతమ దశాభాగమును పొందితివో, దేనివలన నిర్భయముగ నా పత్ని నీచే ధర్షింపబడెనో, అందువలన నీవు యుద్ధమున శత్రువులచే చిక్కుదువు" అని.

శ్లో॥ తాం తు భార్యాం స నిర్భ త్స్య సోఽబ్రవీత్సు మహా తపాః,
దుర్వి నీతే వినిధ్వంస మమాఽఽశ్రమ సమీపతః. 38

ఆ తపంసపన్నుడు భార్యను బెదరించి అవినీతురాలా! 'నాశకు లారా! నా యాశ్రమసమీపమున నీ వుండదగవు.

అహల్య గౌతమునితో

శ్లో॥ అజ్ఞానాద్ధర్షితానాథ త్వద్రూపేణ దివౌకసా,

న కామ కారా ద్విప్రర్షే ప్రసాదం కర్తు మర్హసి. 42

"నాథా! అజ్ఞానముతో, నీ రూపము నందిన యింద్రునిచే ధర్షింపబడితిని. కామము వలన గాదు. అనుగ్రహింపవలసినది".

శ్లో॥ తతశ్చచార సుమహత్తాపత్న బ్రహ్మవాదినః,

శాపోత్సర్గాద్ధి తస్యేదం మునే స్సర్వముపస్థితమ్. 47

తత్స్మరత్వం మహాబాహో దుష్కృతం యత్త్వయా కృతమ్,

తేన త్వం గ్రహణం శత్రో ర్నాఽన్యేన వాసవ. 48

బ్రహ్మవేత్తయగు నతని పత్ని గొప్ప తపస్సుచేసెను. నీసంసర్గముచే, పాపముగలదై యామె శిలారూపము నొందెను. రెండు సర్గములందలి కథలోని తేడా : 1) బాలకాండలో అహల్య యిష్టపడియే యింద్రునితో సంపర్కము చేసి నటులున్నది, 2) ఉత్తరకాండములో, ఇంద్రుడు గౌతముని యాకారములో నుండుటచే భ్రాంతిపడినదై సంపర్కము చేసి నటులున్నది 2) ఇంద్రుని కిచ్చిన శాపములో : బాలకాండలో వృషహీనుడవు గమ్మని, ఉత్తరకాండలో శత్రువులచే జిక్కుదువని. 3) అహల్య కిచ్చిన శాపములో బాలకాండలో అదృశ్యము కమ్మని, ఉత్తరకాండలో శిలవుగా నుండుమని.

శ్లో॥ ఏవం శాపో మయాముక్త ఇత్యసౌ త్వాం తదా బ్రవీత్

రూపం చ తత్త్వజా స్సర్వా గమిష్యన్తి న సంశయః

యత్తవేదం సమాశ్రిత్య విభ్రమోఽయ ముపస్థితః. 7

శిలారూప మనుప్రాప్య త్వత్సంగ కృత కిల్బిషాః,

తదా ప్రభృతి భూయిష్ఠం ప్రజారూప సమన్వితా. 8

## 9. వాలిని గురించి సుగ్రీవుడు :

కిష్కింధ 24వ సర్గము :

శ్లో॥ న త్వాం జిఘాంసామి చరేతి యన్మా
మయం మహాత్మా మతిమా నువాచ,
తస్యైవ తద్రామ వచోఽను రూప
మిదం పునః కర్మ చమేఽను రూపమ్.

"సుగ్రీవా! నేను నిన్ను హింసింపను. నీ వెచ్చటకైన య
చ్ఛగా పొమ్ము" అని యీ మహాత్ముడు బుద్ధిశాలియగు వాలి త
స్వభావమున కనురూపముగ పలికినాడు. అట్టి నా యన్నను చంప
యును యీ దుష్కృత్యము దురాత్ముడ నగు నాకు తగియున్నది.

శ్లో॥ ద్రుమశాఖావ భగ్నోఽహం ముహూర్తం పరినిష్టనన్,
సాంత్వయిత్వా త్వనే నోక్తో న పునః కర్తు మర్హసి.

నా యన్న నన్ను చెట్టుకొమ్మచే కొట్టగా నే నొక్క
మూర్తనాదము చేసితిని. అపుడతడు నన్నోదార్చి 'మరల నా
నిట్టి యుద్ధము చేయకుమ'ని విడిచిపెట్టినాడు.

అట్టి వాలి సుగ్రీవుని వెంటబడి తఱుమునా? సుగ్రీవుని
క్రింది మాటలు చూడుడు.

కిష్కింధ. 46వ సర్గము :

శ్లో॥ తతోఽహం వాలి నా తేన సానుబంధః ప్రధావితః,
నదీశ్చ వివిధాః పశ్యన్ వనాని నగరాణి చ.

నే నట్లు వాలిచే తఱుమబడుచు మంత్రి సమేతుడనై నద
వనములు, నగరములు చూచుచు పారిపోతిని.

అను ఏ మాటయు నబద్ధము. మరియు వాలి రామ లక్ష
లను చూచి.

కిష్కింధ. 2వ సర్గము :

శ్లో॥ ఏతౌ వన మిదం దుర్గం వాలి ప్రణి హితౌ ధ్రువమ్,
ఛద్మనా చీరవసనౌ ప్రచరంతౌ విహాగతౌ.

వీరు నిశ్చయముగ వాలి పంపగా వచ్చిన చారులే. ఋషి వేషము నెపముతో నారవస్త్రములు ధరించి యిట కేతెంచినారు.

శ్లో॥ వాలి ప్రణిహితా వేతౌ శంకేఽహం పురుషోత్తమా. 21

ఈ నరశ్రేష్ఠులను వాలియే పంపియుండునని శంకించుచున్నాను.

అట్టి వాలి రామ లక్ష్మణులను చారులనుగా తన పైకి పంపినాడని సుగ్రీవుడు వచించుటయు, సుగ్రీవుని పై మాటలను వ్యతిరిక్తముగా నున్నది.

## 10. సంపాతి వానరులతో సీతను గురించి :

కిష్కింధ. 58వ సర్గము :

శ్లో॥ తరుణీ రూప సంపన్నా సర్వాభరణ భూషితా,
హ్రియమాణా మయా దృష్టా రావణేన దురాత్మనా. 15

సౌందర్యవతి, సర్వాభరణములచే నలంకృతమైన యొక స్త్రీని దుర్మార్గుడైన రావణుడు తీసికొనిపోవుచుండగా నేను చూచితిని.

శ్లో॥ తాం తు సీతా మహం మన్యే రామస్య పరికీర్తనాత్. 18

రాముని స్మరించుట వలన నామె సీతయే యని తలచుచున్నాను.

కిష్కింధ. 59వ సర్గము :

శ్లో॥ శ్రూయతా మిహ వైదేహ్యా యథా మే హరణం శ్రుతం,
యేన చాపి మమాఖ్యాతం యత్ర వాఽఽయతలోచనా. 6

సీతా హరణమును గురించి నేను వినిన విధము, ఆమె యెచట నున్నది? ఎవనిచే నాకు చెప్పబడినది తెలిపెదను.

ఈ విధముగ సంపాతి యొకసారి తాను రావణుడు సీతను తీసికొనిపోవుట చూచితిననియు, మరియొకసారి యెవరో చెప్పగా వింటిననియు తెలిపెను. ఇందేది నిజము ?

## 11. తార తండ్రి యెవరు ? సుషేణుడా ? తారుడా ?

ఉత్తర. 34వ సర్గము : తార తండ్రి తారుడు.

శ్లో॥ తతస్తు వానరామాత్యస్తారస్తారా పితా ప్రభుః,
ఉవాచ వానరో వాక్యం యుద్ధ ప్రేప్సు ముపాగతమ్. 4

అపుడు వానరామాత్యుడును-తారకు తండ్రియగు తారుడు, యుద్ధముచేయగోరి వచ్చిన రావణునితో నిట్లుపలికెను.

కిష్కింధ. 42వ సర్గము :

శ్లో॥ అధ ప్రస్థాప్య సుగ్రీవస్తాన్ హరీన్ దక్షిణాం దిశం,
అబ్రవీ న్మేఘ సంకాశం సుషేణం నామ యూధపమ్. 1

సుగ్రీవు డా వానరులను దక్షిణ దిశకు పంపి, మేఘ సదృశు డగు సుషేణునితో నిట్లనెను.

శ్లో॥ తారయాః పితరం రాజాశ్వశురం భీమ విక్రమం,
అబ్రవీత్ ప్రాంజలి ర్వాక్య మభిగమ్య ప్రణమ్య చ. 2

తారకు తండ్రి-తనకు మామయును, భీమవిక్రముడు నగు నతని సమీపించి, అంజలి ఘటించి, ప్రణామ మొనర్చి యిట్లు పలికెను.

కనుక తార తండ్రి సుషేణుడా ? తారుడా ?

12. సుగ్రీవుడు పట్టాభిషిక్తుడైన పిదప రాముడు వసించిన దెక్కడ ?

సీతా రామ లక్ష్మణులు వసించిన పంచవటికి సమీపమున ప్రస్రవణ పర్వతముగలదు. కిష్కింధకు సమీపమున మలయ పర్వతము గలదు.

వాలితో రణముకోరి వచ్చిన దుందుభి-వాలికి భయపడి, అతనిచే తఱుమబడి మలయగిరి గుహను ప్రవేశించెను. (కిష్కింధ.46-4)

కిష్కింధ. 26వ సర్గము : రాముడు సుగ్రీవుని కిష్కింధ కేగుమని పలికి, మరియు నతనితో నిట్లనెను.

శ్లో॥ అస్మిన్ వత్స్యామ్యహం సౌమ్య పర్వతే సహ లక్ష్మణః,
ఇయం గిరిగుహా రమ్యా విశాలా యుక్త మారుతా. 15

సౌమ్యా! నే నీ పర్వతమున లక్ష్మణునితో కలిసి నివసింతును. ఈ గిరి గుహ సుందరము-విశాలము-చక్కగా గాలి ప్రసరించును.

27వ సర్గము :

శ్లో॥ ఇతశ్చ నాతి దూరే సా కిష్కింధా చిత్రకాననా,
సుగ్రీవస్య పురీ రమ్యా భవిష్యతి నృపాత్మజ. 26

రాజపుత్రా! చిత్రములగు వనములతో కూడిన కిష్కింధాపురి యిచటికి దాపుననే గలదు.

28వ సర్గము :

శ్లో॥ స తథా వాలినం హత్వా సుగ్రీవ మభిషిచ్య చ,
వసన్ మాల్యవతః పృష్ఠే రామో లక్ష్మణ మబ్రవీత్. 1

రాము డట్లు వాలిని చంపి, సుగ్రీవుని రాజ్యాభిషిక్తు నొనర్చి, మాల్యవంతమున నివసించుచు లక్ష్మణునితో నిట్లనెను.

పై విషయములన్నియు నొకదానితో నొకటి సంబంధమును కలిగియున్నవి. కనుక రాముడు మాల్యవంతమున నివసించినాడనుట సమంజసము.

ప్రస్రవణపర్వతము కిష్కింధకు దూరమగుటచే యీ క్రింది వాక్యములు అసమంజసములు.

27వ సర్గము :

శ్లో॥ అభిషిక్తేతు సుగ్రీవే ప్రవిష్టే వానరే గుహాం,
ఆజగామ సహ భ్రాత్రా రామః ప్రస్రవణం గిరిమ్. 1

సుగ్రీవుడు వానరరాజ్యమున కభిషిక్తుడై కిష్కింధను ప్రవేశింపగా, రాముడు తమ్మునితో ప్రస్రవణగిరి కేగెను.

శ్లో॥ ఇత్యుక్త్వా న్యవస త్తత్ర రాఘవ స్సహ లక్ష్మణః,
బహుదృశ్య దరీకుంజే తస్మిన్ ప్రస్రవణే గిరౌ. 29

అని పలికిన రాముడు పెక్కు గుహాలు-పొదరిండ్లు గల ప్రస్రవణ పర్వతముపై నివసించెను.

47వ సర్గము :

శ్లో॥ తదహం ప్రథమం కృత్వా మాసే ప్రస్రవణం గతాః,
కపిరాజేన సంగమ్య నిరాశాః కపియూథపాః. 6

(వానరులు) వారు తమ బయలుదేరినచోటునుండి నెలరోజులు గడువగనే నిరుత్సాహము నొంది ప్రస్రవణగిరికి వచ్చి సుగ్రీవునికి తమ శాక తెలియజేసిరి.

ఇదే విధముగ హనుమంతుడు సీతతో ప్రస్రవణగిరిపై త్వరలో రాముని జూచెదవు. (సుందర. ౩౬వ సర్గము).

13. అయోధ్య :

బాల. 5వ సర్గము :

శ్లో॥ అయోధ్యా నామనగరీ తత్రాసీల్లోక విశ్రుతా
మనునా మానవేంద్రేణ యా పురీ నిర్మితా స్వయమ్. 6

అయోధ్య యను నగరము లోకవిశ్రుతమై మానవేంద్రుడగు మనువుచే స్వయముగ నిర్మించబడినది.

శ్లో॥ ఆయతా దశ చద్వే చ యోజనాని మహాపురీ,
శ్రీమతీ త్రీణి విస్తీర్ణా సువిభక్త మహాపథా. 7

ఆ నగరము పంద్రెండామడల పొడవుగలిగి, మూడామడల వెడల్పుగలిగి చక్కని బాటలచే విభజింపబడియున్నది.

బాల. 6వ సర్గము :

శ్లో॥ సాయోజనే చద్వేభూయ స్స త్యనామా ప్రకాశతే. 26

(అయోధ్య) రెండామడల విస్తృతి గలిగి సత్యనామముగలదై ప్రకాశించెను.

14. ఋశ్యశృంగుడు :

బాల. 9వ సర్గము :

శ్లో॥ కాశ్యపస్య తు పుత్రోఽస్తి విభండక ఇతిశ్రుతః
ఋశ్యశృంగ ఇతిఖ్యాత స్తస్య పుత్రో భవిష్యతి. 3

కాశ్యప పుత్రుడు విభండకుడు. అతని పుత్రుడు ఋశ్యశృంగుడు రోమపాదుడు పంపిన వారస్త్రీలతో ఋశ్యశృంగుడు.

బాల. 10వ సర్గము :

శ్లో॥ పితా విభాండకోఽస్మాకం తస్యాహం సుత ఔరసః,
ఋశ్యశృంగ ఇతి ఖ్యాతం నామ కర్మ చ మే భువి. 14

మా తండ్రి విభండకుడు. అతని పుత్రుడను. ఋశ్యశృంగుడను పేరుగలవాడను.

శ్లో॥ గతాసు తాసు సర్వాసు కాశ్యప స్యాత్మజో ద్విజః
అస్వస్థ హృదయ శ్చాసీ ద్దుఃఖ స్మ పరివర్తతే. 23

వారందఱు (వారస్త్రీలు) వెళ్ళగా కాస్యపపుత్రుడు (ఋశ్యశృంగుడు) స్వస్థచిత్తము లేక కష్టముతో సంచరించుచుండెను.

15. అయోధ్య పురప్రజల శీలమును గురించి వాల్మీకి :

బాల. 7వ సర్గము :

శ్లో॥ నాసీత్ పురే వా రాష్ట్రే వా మృషావాదీ నరః క్వచిత్,
కశ్చి న్న దుష్ట స్తత్రా సీత్ పరదారరతో నరః. 13

ఆ పురమందు-రాష్ట్రమందు - అసత్యమాడువాడు, దుష్టుడు, పరస్త్రీలతో రతియందాసక్తుడా డొకడును లేడు.

అయోధ్య. 71వ సర్గము : భరతుడు రథసారథితో

శ్లో॥ ఉద్యానాని హి సాయహ్నే క్రీడి త్వోపరతైర్నరైః
సమన్తా ద్విప్రధా వద్భిః ప్రకాశంతే మమాన్యదా. 22

(పూర్వము) ఉద్యానములు సాయంకాలమున క్రీడించి విరమించి పరువిడుచున్న జనముతో ప్రకాశవంతముగ నుండెడివి.

శ్లో॥ ఉద్యానాని పురా భాంతి మత్తప్రముది తాని చ
జనానాం రతి సంయోగే ష్వత్యంత గుణవంతి చ. 25

పూర్వము ద్యానములు జనుల రతి సంయోగమందు ప్రకాశవంతములై గుణవంతముగ దోచుచుండెడివి.

16. చిత్రకూట పర్వతమును గురించి :

అయోధ్య. 54వ సర్గము : భరద్వాజుడు.

శ్లో॥ యావతా చిత్రకూటస్య నరః శృంగాణ్య వేక్షతే.
కల్యాణాని సమాధత్తే న పాపే కురుతే మనః. 30

ఎంతదూరము చిత్రకూట శిఖరములను నరుడు చూచునో అంతదూరము శుభములనే పొందును.

అరణ్య. 6వ సర్గము : ఋషులు రామునితో

శ్లో॥ పంపానదీ నివాసానా మనుమందాకినీ మపి,
చిత్రకూటాలయానాం చ క్రియతే కదనం మహత్. 17

పంపానదీ నివాసములందును, మందాకిని ననుసరించిన చిత్రకూటాలయములందును గొప్ప హింసచేయబడుచున్నది.

17. ఉత్తర. 35వ సర్గము :

శ్లో॥ సూర్య దత్తవర స్స్వర్ణ స్సుమేర ర్నామ పర్వతః,
యత్ర రాజ్యం ప్రశా స్త్యస్య కేసరీ నామ వై పితా. 19

సూర్యునిచేత వరముపొందిన సువర్ణమగు సుమేరు పర్వతము గలదు. అచట యితని (హనుమంతుని) తండ్రియగు కేసరి రాజ్యమేలుచుండెను.

36వ సర్గము :

శ్లో॥ సుగ్రీవేణ సమం త్వస్య అద్వైధం చిద్రవర్జితమ్,
ఆ బాల్యం సఖ్యమభవ దనిలస్యాఽగ్నినా యథా. 40

అగ్నితో వాయువునకువలె, హనుమంతునకు సుగ్రీవునితో బాల్యమునుండియు భేదములేని, యెడతెగని బద్ధసఖ్యమేర్పడెను.

కేసరి రాజ్యము సుమేరు పర్వతప్రాంతమున గలదు. అనగా హిమాలయములందు కిష్కింధ-వింధ్యపర్వతములందు గలదు. సుమేరు పర్వతప్రాంతవాసి యగు హనుమంతునకు, కిష్కింధ రాజవంశమునకు చెందిన సుగ్రీవునకు ఆ బాల్యస్నేహమెట్లు సంభవించినది ? హను

మంతుడు–కేసరి పుత్రుడనుటచే–కేసరి రాజ్యమున కతడు వారసుడు గదా! అతడా రాజ్యమునువదలి, కిష్కింధయందు సుగ్రీవునకు మంత్రిగా జీవించవలసిన యగత్యమేల కలిగెను.

18. ఉత్తర 107వ సర్గము : కుశలవుల రాజ్యములను గురించి – భరతుడు రామునితో

శ్లో॥ ఇమే కుశలవే రాజన్నభిషించ నరాధిప,
కోసలేషు కుశంవీర ముత్తరేషు తథా లవమ్. 7

రాజా! కోసలమందు వీరుడగు కుశుని, ఉత్తరకోసలమున లవుని యభిషేకింపుము.

శ్లో॥ కోసలేషు కుశంవీర ముత్తరేషు తథా లవమ్,
అభిషిచ్య మహాత్మానా వుభౌ రామః కుశీలవౌ. 17

కోసలమందు వీరుడగు కుశుని, ఉత్తరకోసలమందు లవుని, రాముడు కుశలవుల నభిషేకించెను.

108వ సర్గము : రాముడు పంపిన దూతలు శత్రుఘ్నునితో నిట్లు వచించిరి.

శ్లో॥ కుశస్య నగరీ రమ్యా వింధ్యపర్వత రోధసి,
కుశావతీతి నామ్నా సాకృతా రామేణ ధీమతా. 4
శ్రావస్తీతి పురీరమ్యా శ్రావితా చలవస్యచ.

వింధ్యపర్వత తటమున 'కుశావతి' యను పేరుతో చక్కని నగరమును కుశునకు, లవునకు 'శ్రావస్తి'యను నందమగు పురమును, రాముడు నిర్మించుట వినిపించిరి.

పై వైరుధ్యములను చూడుడు. రాముడు కుశలవుల నభిషేకించిన దెచ్చట?

19. యుద్ధ. 121వ సర్గము : రామునకు–సీత నిచ్చుటను గురించి

శ్లో॥ ఏతచ్ఛ్రుత్వా శుభమ్ వాక్యం పితామహ సమీరితమ్,
అంకే నాదాయ వైదేహీ ముత్పపాత విభావసుః. 1

బ్రహ్మచే చెప్పబడిన శుభవాక్యమును విని, యగ్ని వైదేహిని యంకమున గ్రహించి పైకి వచ్చెను.

శ్లో॥ తదా రామాయ వైదేహీం మంకే కృత్వా విభావసుః. 4

అగ్ని-వైదేహిని యంకమందుంచుకొని వచ్చి రాముని కిచ్చెను.

ఉత్తర. 45వ సర్గము : రాముడు లక్ష్మణునితో

శ్లో. ఏవం శుద్ధసమాచారా దేవగంధర్వ సన్నిధే,

లంకాద్వీపే మహేంద్రేణ మమహస్తే నివేశితా. 9

దేవగంధర్వుల సన్నిధియందు సీత శుద్ధురాలని, లంకయందు మహేంద్రునిచే నా చేతి యందుంచబడినది.

వీటినిబట్టి రామునకు సీత నిచ్చినది అగ్నియా ? ఇంద్రుడా ?

20. ఉత్తర. 23వ సర్గము రావణుడు అశ్మనగరము వెళ్ళి కాలకేయులను వధించెను.

ఉత్తర. అధికపాఠము 1వ సర్గము : అశ్మనగరమున దానవేంద్రుడున్నాడు (బలి) ఈ రెంటిలో ఏది నిజము ?

21. ఉత్తర. 17వ సర్గము : బృహస్పతి మనుమరాలు వేదవతి. సీతగ జన్మించెను.

ఉత్తర. అధికపాఠము 8వ సర్గము : నారాయణుడు రాముడుగా నున్నాడు. లక్ష్మి-సీత యని పిలువబడును.

వేదవతియా ? లక్ష్మియా ? సీతగా జన్మించిన దెవరు ?

22. ఉత్తర. 3వ సర్గము : విశ్రవసుడు కుబేరునితో "లంక రాక్షసులచే వదలిపెట్టబడి యున్నది. రాక్షసులచే శూన్యమైయున్నది. ఇపుడు ప్రభువు లేక యున్నది. కొలదికాలములోనే రాక్షసులచే నా లంకపూర్ణమయ్యెను.

ఉత్తర. 11వ సర్గము : కుబేరుడు రాక్షసులు లేని యీ లంక తండ్రిచే నీయబడినది. యక్షులతో నాచే ప్రవేశించబడినది.

పై మాటలలో నేది యదార్థము ?

23. ఉత్తర. 5వ సర్గము : సుమాలి, భార్యయగు కేతుమతియందు పుష్పోత్కట, కైకసి, కుంభీనసి-యను పుత్రికలు కలిగిరి.

ఉత్తర. 25వ సర్గము : విభీషణుడు రావణునితో మన తల్లి యొక్క అక్క పుష్పోత్కట తల్లియొక్క పెద్ద తండ్రి మనకు పూజ్యుడు. అతని కూతురు కుంభీనస. ఆమె వరుసకు మనకు సోదరి.

ఇందేది నిజము ?

24. సుందరకాండము 9వ సర్గము : (రావణుని) హనుమంతుడు రాజర్షులు, దైత్య, గంధర్వ - రాక్షసకన్య లతనికి కామవశమును బొందిరి.... నాధుడు కలది ఒక్కతెయు లేదు.

ఉత్తర. 24వ సర్గము : రావణుడు సుందరియగు కన్యనుగాని, యువతిని గాని చూచినచో దాని బంధుజనముల చంపి దానిని విమానమున నిరోధించును.... కన్యలు విమానమున రోదనము చేయుచుండిరి. 'నేను లేకపోగా నా పుత్రుడేమగునో' యని కొందఱు, భర్తను వదలి యేమి చేయుదునని కొందఱు విలపించుచుండిరి.

పై వచనముల యందు యదార్థమేది ?

25. యుద్ధ. 13వ సర్గము : రావణుడు 'పుంజికస్థల' యను నప్సరసను బలాత్కరింప బ్రహ్మ యతనిని 'ఇప్పటి నుండి యే స్త్రీనైన బలాత్కరించిన నీ తల నూరువ్రక్కలగునని శపించెను.

ఉత్తర. 26వ సర్గము : రావణుడు రంభను బలాత్కరింప నలకూబరు డతనిని బలాత్కారముగ నే స్త్రీనైనా పొందిన రావణుని తల నూరువ్రక్కలగునని శపించెను.

ఈ రెండును యదార్థములైనచో, రెండవసారి జరిగిన సంఘటన యందు రావణుని తలవ్రక్కలై యుండును.

కనుక యిందేది నిజము ? రెండును కల్పితములా ?

26. అరణ్య. 27వ సర్గము : రాముడు త్రిశిరుని చంపెను.
యుద్ధ. 70వ సర్గము : హనుమంతుడు త్రిశిరుని చంపెను.

27. యుద్ధ. 43వ సర్గము : ప్రజంఘుడు—సంపాతిచే చంపబడెను.
యుద్ధ. 76వ సర్గము : ప్రజంఘుడు—అంగదునిచే చంపబడెను.

28. యుద్ధ. 43వ సర్గము : నీలుడు-నికుంభుని చంపెను.
యుద్ధ. 77వ సర్గము : హనుమంతుడు-కుంభుని చంపెను.
29. యుద్ధ. 70వ సర్గము : నీలుడు మహోదరుని చంపెను.
యుద్ధ. 98వ సర్గము : సుగ్రీవుడు మహోదరుని చంపెను.
30. యుద్ధ. 70వ సర్గము : ఋషభుడు మహాపార్శ్వుని చంపెను.
యుద్ధ. 99వ సర్గము : అంగదుడు మహాపార్శ్వుని చంపెను.
31. బాల. 1వ సర్గము :

శ్లో॥ గుహేన సహితో రామో లక్ష్మణేన చ సీతయా,
తే వనేన వనం గత్వా నదీ స్తీర్త్వా బహూదకాః. 30

రాముడు గుహునితోడను, సీతా లక్ష్మణులతోడను గూడి యొక వనమునుండి మఱియొక వనమునకుబోయి, అధికజలములు గల నదులను దాటిరి.

అయోధ్య. 52వ సర్గములో "గంగానదిని దాటుటకు రాముడు తీరముననున్న గుహుని సమ్మతినంది సీతా లక్ష్మణులతో నావనెక్కి నావికులను ప్రోత్సహించెను" అనియే యున్నది.

కనుక గుహుడు బాలకాండములో వచించిన విధముగ రాముని యనుసరించినట్లు కన్పించదు.

32. లక్ష్మణుడు-సీత ముఖము నెప్పుడును చూడలేదా ?

అయోధ్య. 52వ సర్గము : గంగాతీరమందు నావను జూచి రాముడు లక్ష్మణునితో

శ్లో॥ ఆరోహ త్వం నరవ్యాఘ్ర స్థితాం నావ మిమాం శనైః,
సీతాం చారోప యాన్వక్షం పరిగృహ్య మనస్వినీమ్. 75
స భ్రాతుః శాసనం శ్రుత్వా సర్వ మప్రతి కూలయన్,
ఆరోప్య మైథిలీం పూర్వమారురోహాత్మవాం స్తతః. 76

లక్ష్మణా ! నిలచియున్న యీ నావను మెల్లగానెక్కుము. పట్టుకొని సీత నెక్కింపుము.

అతడు సోదరుని యాజ్ఞవిని సర్వమనకూలముగ జేయుచు మొదట సీత నెక్కించి, పిమ్మట తా నధిరోహించెను.

అరణ్య. 45వ సర్గము : మారీచుని రాముని కంఠస్వరము ననుసరించి చేసిన యార్తనాదమును విని, సీత మనస్సు కలతజెందినదై, లక్ష్మణుని కఠినోక్తులాడి దుఃఖించుచుండగా.

శ్లో॥ తా మార్తరూపాం విమనా రుదంతీం,
సౌమిత్రి రాలోక్య విశాలనేత్రామ్,
ఆశ్వాసయామాస నచైవ భర్తు
స్తం భ్రాతరం కించి దువాచ సీతా. 40

శ్లో॥ తతస్తు సీతా మభివాద్య లక్ష్మణః
కృతాంజలిః కించి దభిప్రణమ్యచ,
అన్వీక్షమాణో బహుశశ్చ మైథిలీం
జగామ రామస్య సమీప మాత్మవాన్. 41

దుఃఖరూపిణియు, విశాలనేత్రయు నగు నామె మనస్సుచెడి యేడ్చుచుండగా, లక్ష్మణు డామె నోదార్చెను. కాని సీత భర్త సోదరు డగు నతనితో నేమియు పలుకలేదు.

పిమ్మట లక్ష్మణుడు సీతకు చేతులొగ్గి నమస్కరించి, ఆమెను పలుమారులు చూచుచు రాముని కడ కేగెను.

కిష్కింధ. 6వ సర్గము : రాముడు, సుగ్రీవు డిచ్చిన యాభర ణముల చూడుమని లక్ష్మణునితో వచించ, నతడు

శ్లో॥ నాహం జానామి కేయూరే నాహం జానామి కుండలే,
నూపురే త్వభి జానామి నిత్యం పాదాభి వందనాత్. 22

నేను అంగదము నెఱుగను, కుండలముల నెఱుగను, నిత్యము పాదాభివందనము చేయుటచే నూపురముల నెఱుగుదును.

ఈ మాటలు అయోధ్య-అరణ్యకాండములలోని పై వాక్యము లకు విరుద్ధముగ నున్నవి.

# 25. రావణాయణ కాలమున విమానములుండెనా?

రామాయణములో నీ క్రింది సందర్భములయందు విమానము లను గురించి ప్రస్తావించబడినది

ఇంద్రజిత్తుతో జరిగిన యుద్ధములో రామ లక్ష్మణులు రణ భూమియందు మూర్ఛితులై యుండగా, వారిని చూచుటకై, రావణుడు సీతను పుష్పకవిమానములో రణభూమికి పంపెను. (యుద్ధ. 47వ సర్గ.)

రావణుని మరణానంతరము రాముడు వానర – రాక్షసులతో పుష్పకవిమానముపై అయోధ్యకు వెళ్ళెను. (యుద్ధ. 125వ సర్గము) రాముడు పుష్పకముపై తపస్సుచేయు శూద్రుని యొద్దకు బయలు దేరి, యచటనుండి యగస్త్యుని యొద్దకేగి, అచటనుండి తిరిగి అయో ధ్యకు చేరెను. (ఉత్తర. 75 నుండి 82వ సర్గము వరకు).

రావణుడు కుబేరుని జయించి పుష్పకమును తీసికొనెను (ఉత్తర. 15వ సర్గము) అచటనుండి విమానముపై అనేక ప్రదేశములకు పయ నించెను.

పుష్పకవిమానమును గురించిన వర్ణన (ఉత్తర. 15వ సర్గము) సర్వకాలములయందు ఫలించువృక్షములు గలది. మనోవేగము–కామ గమనము–కామరూపముగలది. సోపానములు–వేదికలుగలది. శీతోష్ణ ములు లేనిది. బ్రహ్మచే నిర్మించబడినది.

యుద్ధ. 120వ సర్గము : కుబేరుడు–యముడు – ఇంద్రుడు–వరు ణుడు–శివుడు–బ్రహ్మ–పీరందరు విమానములపై లంకకు వచ్చి రాముని సమీపించిరి.

యుద్ధ. 122వ సర్గము : మరణించిన దశరథుడు ఇంద్రలోకము నుండి విమానములో యింద్రాదులతో వచ్చి–సీతా రామ లక్ష్మణు లతో మాట్లాడెను.

ఉత్తర. 77వ సర్గము : హంసలతో గూడిన దివ్యవిమానము నందు స్వర్గపురుషుడగు శ్వేతుడు అప్సరసల సహస్రముతని సేవించు చుండ, తన శవమున్న మడుగు నొద్ద కేతెంచెను.

పై విషయముల పరిశీలింపుడు. కుబేరుని విమానమును రావణుడు గొంపోయెను. కుబేరునకు మరియొక విమానమున్నట్లు పురాణములందు గన్పించదు. అటులనే ఇంద్ర-యమ-వరుణ-శివ-బ్రహ్మలకు విమానము లున్నట్లెచటను గన్పింపదు. ఇంద్రునకే విమానములేనపుడు, అప్సరసలు స్వర్గమునుండి విమానములో పయనించుట కల్పితమేగదా!

రావణుడు కుబేరుని యొద్దనుండి సంగ్రహించిన పుష్పకవిమానమును గురించి పైన కొలదిగ వివరించబడినది. సుందరకాండము 7వ సర్గమునుండి 13వ సర్గము వరకు రావణుని పుష్పకవిమానమును హనుమంతు డీ క్రింది విధముగ వర్ణించెను. ఉత్తమ భవనములకంటె నున్నతమైనది. పర్వతపంక్తిచే నిండిన భూమిగా చేయబడినది. వృక్షములచే నిండిన శైలములుగా జేయబడినది. పత్రపుష్పములతో నిండిన వృక్షములు గలది. పద్మములతో గూడిన సరస్సులు, వనచిత్రములు, తెల్లనిగృహములు గలది. మనస్సు తలచిన విధముగ చరించునది. విచిత్రమగు కొలువుకూటముగలది. ఆ యుత్తమాలయము మధ్యమున నొక యుత్తమభవనము గలదు. ఆ ప్రాసాదమధ్యమున మరియొక గృహము. చక్కగా చేయబడిన స్తంభములతోను - కూటాగారములతోను-సోపానములతోను-చక్కని వేదికలతోను - పలకిటికీలతోను- వివిధములగు సభాభవనములచే నలంకరింపబడిన పుష్పకవిమానమును మారుతి చూచెను. అందు పానశాలలు - శయనాగారములు గలవు.

దీనిని బట్టి పుష్పకవిమాన మనునది యొక భవనముల సముదాయముగ గన్పించుచున్నది.

యుద్ధ. 75వ సర్గము : వానరులు లంకను తగులబెట్ట,

శ్లో॥ విమానేషు ప్రసుప్తాశ్చ దహ్యమానా వరాంగనాః,
త్యక్తాభరణ సర్వాంగా హాహేత్యుచ్చైర్విచుక్రుశుః. 28

విమానములందు నిద్రించుచు దహింపబడుచున్న ఉత్తమాంగనలు భూషణములు త్యజించిన సకలావయవములు గలవారై హాహా యని పెద్దగ నేడ్చిరి.

దీనిని బట్టి విమానములనునవి అంతస్తులు గల భవనములని తెలియుచున్నది.

విమానములను గురించిన గ్రంథములలోని కొన్ని వివరములు :

సమరాంగణ సూత్రధార : అందు విమానలక్షణములు (64 అ. 55 నుండి 63 శ్లో.) విపులముగ వర్ణింపబడినవి. అందలి ముఖ్యాంశములు : చతురస్ర ప్రదేశమును 20 భాగములు చేయవలయును. జలమార్గము మధ్య చేయవలయును.

మొదటి అంతస్తు 6 భాగములు. శతపత్రమును, కపోతముల వరుసను మధ్యను రచించవలెను. రెండవ అంతస్తు 5 భాగములు. అందులో సగము స్తంభములును, ఉచ్చాలకు, కూటము కలిసి సగమును చేయవలయును. మూడవ అంతస్తు 4½ భాగములు, నాలుగవ అంతస్తు 4 భాగములు, ఐదవ అంతస్తు 3½ భాగములు చేయవలయును, స్తంభములు, కూటములు, భరణములు శూరసేన పద్ధతిలో రచించవలయును. ఈ విమానప్రాసాదమును భక్తితో రచించినవారు సమస్తభోగముల ననుభవింతురు.

59 అధ్యాయము : ఇందు 64 రకముల విమానజాతి ప్రాసాదముల నిర్మాణమును గురించి వివరించబడినది. అందు మొదటిది యగు విమానప్రాసాదమును గురించి వివరించుచు, అది అన్ని ప్రాసాదములలో ప్రధానమైనదనియు, స్వర్గ – మర్త్య – పాతాళలోకములయందు అలంకారమైనదనియు, 5 అంతస్తులు గలది యనియు తెలుపబడెను. ఇందు రెండవ అంతస్తు నందలి ద్వారములకు చెక్కల తలుపు లుండవలయుననియు, మూడవ అంతస్తు నందలి ద్వారములకు వాటంతట అవియే మూసికొను తలుపు లుండవలయుననియు, ఇత్యాదిగ వివరింపబడెను.

ఈ 64 విధముల విమానప్రాసాదములలో శివప్రాసాదములు–8, విష్ణుప్రాసాదములు–8, బ్రహ్మప్రాసాదములు–8, సూర్యప్రాసాద

వ లు-8, చండికా ప్రాసాదములు-8, గణపతి ప్రాసాదములు-8, లక్ష్మీప్రాసాదములు-8, సమస్తదేవతా ప్రాసాదములు-8 విధములు గలవు. అందు విష్ణుప్రాసాదములు : గరుడ, వర్ధమాన, శంఖావర్త, పుష్పక, గృహరాజ, స్వస్తిక, రుచక పుణ్యవర్ధన.

పుష్పకవిమానప్రాసాదము : విమానప్రాసాదమునకు జేసిన కొలతలు, లక్షణములు చేయవలయును. కాని 5 అంతస్తులు నలు చదరములుగ నుండవలయును. మంజరి మాత్రము విమానప్రాసాద మున చేసినట్లే చేయవలయును. జలమార్గములు కల్పించనవసరము లేదు.

చైత్యప్రాసాదము : అన్ని లక్షణములును వృత్తప్రాసాదమును పోలియుండును. మూడంతస్తులుగ రచించవలయును.

వృత్తప్రాసాదమును గురించి 58వ అధ్యాయములోను 5వ అ. 232, 233 శ్లోకములలో వివరింపబడియున్నది.

అపరాజితపృచ్ఛ : భూమిజప్రాసాదముల కొలతలతోనే అంతస్తులును, నలుచదరములును కలిగి రథములు, ప్రతిరథములు, భద్రములు మొదలగు వానితో 5 అంతస్తులతో రచింపబడినవి. విమాన జాతియగును. ఇందు నాగరపద్ధతిలో 25 విధముల విమానప్రాసాదములు మరియు 64 విధముల (శివ-8, విష్ణు-8, బ్రహ్మ-8, సూర్య-8, దేవీ-8, గణపతి-8, జినేంద్ర-8, సమస్త దేవతాప్రాసాదములు-8 విధములు) ప్రాసాదముల రచనను గురించి విపులముగా దెలిపెను.

పై వివరములను బట్టియు, హనుమంతుని సుందరకాండములోని వర్ణనలనుబట్టియు, ఉత్తరకాండము 15వ సర్గములోని వర్ణనలనుబట్టియు, యుద్ధకాండము 75వ సర్గములోని వర్ణనలనుబట్టియు రావణుని పుష్పక విమానము అంతస్తులుగల భవనమని విదితమగుచున్నది.

కొందఱు ప్రాచీన విమాన గ్రంథముల నుదాహరించుచు, రామాయణకాలమున సంచార విమానములుండెనని తలచిరను,

ఆ విమానములందు, ఒక రిద్దరు ప్రయాణముచేసియుండిన యుండ వచ్చును. కాని రావణుని పుష్పకవిమానము 5 అంతస్తుల భవన మనుట నిస్సందేహము.

రావణునకు సంచారవిమానముండిన, సీత నపహరించుటకై గాడిదల రథముపై నేల పయనించును? కనుక రావణునికి సంచార విమానముగలదనుట యసత్యము. రావణుని విమానమంతస్తుల భవన మనుట వాస్తవము.

## 26. రామాయణములోని ప్రేమ విలువలు

రామాయణములో మాతృప్రేమ, పుత్రప్రేమ, పితృప్రేమ, భ్రాతృప్రేమ, భార్యాభర్తలప్రేమ, మొదలగు నానావిధ ప్రేమలు వెల్లడింపబడినవి. వీటన్నిటిలో రాముని ప్రేమను గురించి "రామునికి మిక్కిలి ప్రియమైనదేది?" అను నంశము క్రింద వివరింపబడినది. మిగిలినవారి ప్రేమస్వరూపములు యీ క్రింది వివరింపబడినవి.

దశరథుడు : ఇతని కనేకమంది భార్యలుండిరి. అందువలన నితనికి ప్రియమగు భార్య యెవ్వరును లేరని విదితమగుచున్నది. ఇతనికి భార్యల యందున్నది కామమేగాని ప్రేమకాదు. ఇతనికి నలుగురు పుత్రులున్నను, పెద్దకుమారుడగు రామునియందే యితనికి మిక్కుట మగు ప్రేమగలదని తెలియుచున్నది. ఆ కారణమునసే, కైక పుత్రు నకు రాజ్యమిచ్చెదనని తొలుతవచించియు, పిమ్మట రాముని రాజ్యాభి షిక్తునిగ జేయుట కెన్నియో కుతంత్రములు పన్నెను. తత్ఫలితముగ రామునికి వనవాసము విధింపబడ, దానినుండి యతనిని విముక్తుని జేయుటకు భార్యపాదములు పట్టుకొని ప్రాధేయపడియు ఫలితమును పొందలేక పుత్రశోకముతో మరణించెను.

కౌసల్య : ఈమె భర్తచే తృణీకరింపబడినది. రాజ్యమునకై

భర్తను చంపుమని కుమారుని కర్తవ్యోపదేశముగ వివరించినది. ఈమె పుత్రప్రేమతోనే కాలమంతయు గడిపినది.

సుమిత్ర : జ్యేష్ఠభార్యవలె నీమెయు భర్తచే నిరాదరింపబడినది. ఈమె తనలోని భావముల తనలోనే యిముడ్చుకొన్నది. కాని బహిర్గతము కానీయలేదు. "జ్యేష్ఠభార్యా పుత్రుడగుటచే రాముడు, కైకకు వివాహము నాడిచ్చిన వాగ్దానముచే భరతుడు – రాజ్యమునకర్హులు"ని తెలిసియుండుటచే, తన కుమారుల కేలాగూ రాజ్యార్హత లేదని గ్రహించి, తన పుత్రుల నిర్వురను, ఒకరిని రామునకు మరొకరిని భరతునకు చేరువగానుంచి, వారిరువురిలో నెవరు రాజైనను తన పుత్రులు సుఖించుటకు మార్గము నేర్పరచిన సునిశిత రాజనీతిజ్ఞురాలు. పుత్రులిరువురియందు సమాన ప్రేమజూపినది.

కైక : భర్త ముసలివాడైనను, ముగ్ధమోహన సౌందర్యమంతయు వెచ్చించి యతనిని ముద్దులమగనిగనే యారాధించెను, కాని యతడాడి తప్పి, తన పుత్రునకు ద్రోహముచేయ, నతనిపై తనకు గల ప్రేమ విరిగిపోయి యతనిని క్షమింపలేకపోయినది.

లక్ష్మణుడు : ఇతడు భార్యను వదలి అన్నా–వదినెలతో నడవి కేగెను. ఇతనికి రామునిపై గల ప్రేమ భ్రాతృప్రేమ యనుటకంటె–సేవకావృత్తియందలి ప్రేమ యనుటుచితము. రాముడు రాజ్యము నుండి దూరమైనాడని వినుటతోడనే, తన కోపము నణచుకొనజాలక, తండ్రినైనా బంధించెదనని లేక వధించెదనని వచించెను. భరతుడు రాజైనందున, అతనిపై గల ద్వేషము–భరతుడు రామునకై రాజ్యము త్యజించినను, లక్ష్మణునకు పోలేదు.

శత్రుఘ్నుడు : ఇతడు భరతునకు మిక్కిలి ప్రీతిపాత్రుడు. కాని యితనికి భరతునియందు గల ప్రేమ, సోదరప్రేమయా లేక సేవక ప్రేమయా ? యని వివరించు నాధారములు లేవు.

భరతుడు : ఇతనికి సోదరప్రేమ మిక్కుటము. అందులకై రాజ్యమునుగూడ తృణీకరించెను. ఇట్టి ప్రేమస్వరూపుడు – తల్లిని

నిందించె ననుట సత్యదూరముగ గన్పించుచున్నది. (తనకై భర్త - పురోహిత మంత్రులచే నిందలుపడి రాజ్యమును సంక్రమింప జేసిన).

వాలి సుగ్రీవుల భ్రాతృప్రేమ : వాలి, భ్రాతృప్రేమతో తమ్ము డెట్టి దుష్కార్యముల నొనరించినను సహించెను. సుగ్రీవుడు రాజ్యా పేక్షతో మహాత్ముడగు అన్నను హీనముగ చంపించి చరిత్రహీనుడు - భ్రాతృద్రోహియయ్యెను.

రావణ-విభీషణుల ప్రేమ : వాలి-సుగ్రీవుల ప్రేమవంటిదే, రావణుడు, తమ్ము డెంతహీనముగ ప్రవర్తించినను, సోదరప్రేమతో నతనిని దండింపక వదలివేయుటే గాక, యతని కుటుంబమును తన కుటుంబమువలె నాదరించెను. అతడు విభీషణు నొక్కని దండించిన, అతని వంశము, అతని బంధువులు, లంకలోని రాక్షసులందఱు సుఖించెడివారు.

విభీషణు డన్నయగు రావణునేగాక, సోదరుడగు కుంభకర్ణుని, సోదరుల పుత్రులను, తన రాక్షసవంశమునే, రాజ్యాపేక్షతో, సమూలముగ నాశనమొనరించిన కులపాంసనుడు. మహాపాతకుడు. రామ - సుగ్రీవులకువలె నితనికిగూడ రాజ్యమునందే ప్రేమ యెక్కువ. అందు వలననే యీ ముగ్గురు మిత్రులైరి.

రామ-సుగ్రీవుల ప్రేమ : వీరి యందున్నది మైత్రీ ప్రేమ యనుటకంటె, యెవరి కార్యమును వారు సాధించుకొనుటకు, వారి వారి కార్యసాధనలకై యేర్పరచుకొనిన కారణప్రేమ యనుట సమంజసము

రామ-విభీషణుల ప్రేమ : రామ-సుగ్రీవుల ప్రేమవంటిదే.

హనుమంతుడు : ఇతనికి సుగ్రీవ-రాములపై గల ప్రేమ యుత్తమ సేవకావృత్తికి సంబంధించినది.

రామునకు హనుమంతునిపై గల ప్రేమ - మిక్కిలి విశ్వాస పాత్రునియందు కృతజ్ఞతాభావముతో గూడిన ప్రేమ. రాముడు,

రాజ్యమునందు తప్ప మరెవ్వరియందు నేవిధమగు ప్రేమగలవాడు కాదు గనుక నీ ప్రేమయు కల్మషరహితమనుటకు వీలులేదు.

కాని సీతకు హనుమంతునిపై గల ప్రేమ మాత్రము విశ్వాసము తోను-కృతజ్ఞతతోను కూడిన కల్మషరహితమగు ప్రేమ.

హనుమంతుడు రాముని విజయమును తెలిపినపుడు సీత యతనితో "నాకు ప్రియమును దెలిపిన నీకు బదులుచేయ యోచించియు సమమగు దానిని కనుగొనలేకున్నాను". ఈ మాటలో ఆమెకు హనుమంతునిపై గల మిక్కిలి కృతజ్ఞత తెలియుచున్నది.

వాల్మీకి : రాముడు నిండుగర్భవతియగు సీతను పరిత్యజించ. నామెను చేరదీసి కల్మషరహితమగు మానవ వాత్సల్య ప్రేమజూపెను. ఇతనిది కరుణారసభరిత ప్రేమ.

సీత : "రాముడు" తనకు రాజ్యముపోగా నా దిగులును పోగొట్టుకొనుటకై భార్యయగు సీతయందు మనస్సును మరలించు కొనినా"నని వచించెను.

కాని సీతకు రామునిపై గల ప్రేమ గాఢమైనది. మమతానురాగములతో గూడినది. పవిత్రమైనది. కల్మషములేనిది; ఉత్తమమైనది. విలువగట్టలేనిది.

## 27. వాల్మీకి రచనావైచిత్ర్యములు

బాలకాండము 5వ సర్గము : సగరుడు అరువదివేలమంది పుత్రులతో దండయాత్రకు వెళ్ళుచు సాగరమును త్రవ్వించెను. సాగరమును త్రవ్వుట సంభవమా ?

21వ సర్గము : 1) రోషగతుడగు విశ్వామిత్రునకు భూమి యంతయు చలించెను. అతడెంత రోషగతుడైనా భూమి యతని రోషముచే చలించునా ?

2) విశ్వామిత్రుడు ముల్లోకముల యందలి వివిధాస్త్రముల నెఱుగును. ఋషులుగాని, దేవా-సుర-రాక్షస-యక్ష-గంధర్వ-పన్నగ కిన్నరులుగాని యెఱుగరు.

అతడు ఋషియగుచో వివిధాస్త్రములతో నేమి పని?

3) దక్షప్రజాపతి పుత్రికలగు జయ-సుప్రభలు అస్త్ర - శస్త్రములు కనిరి. ఇట్లు జరుగునా?

4) అగస్త్యుడు సుందుని చంప, సుందుని భార్యయగు తాటక కోపించి, పుత్రుడగు మారీచునితో నగస్త్యుని భక్షించుటకై రాగా, నగస్త్యుడు రాక్షసుడవు గమ్మని మారీచుని, మనుష్యుల దినుమని తాటకిని శపించెను. ఆ శాపమువలన తాటక అగస్త్య సంచారముచే శుభమైన మలద-కరూశ దేశముల నాశము చేయుచున్నది.

పై విషయములను బట్టి యగస్త్యుని శాపమునకు పిమ్మటనే, అనగా నగస్త్యుని శాపమువలననే తాటక మనుష్యుల తినుచున్నది. అట్టి తాటక అగస్త్యుని భక్షించుట కెట్లు వచ్చును?

మరియు నగస్త్యసంచారముచే శుభమైన మలద-కరూశ దేశము అని వాల్మీకి వచించెను. కాని అగస్త్యుని రాకకు ముందచట నశుభము లున్నట్లు వాల్మీకి వచించలేదు. మలద-కరూశ దేశముల నాశము చేయుచున్నది యని వాల్మీకి వచించెను. తాటకిని మనుష్యుల మాంసము దినుమని అగస్త్యుడు శాపము పెట్టిన పిమ్మట నే కదా! యామె మలద-కరూశ దేశముల నాశము చేయుచున్నది.

కనుక వీటన్నిటికి మూలకారణ మగస్త్యుడని తెలియుచున్నది. అగస్త్యుడు సుందుని యేల చంపెనో వాల్మీకి వచింపలేదు. దీనిని బట్టి అగస్త్యుడు సుందుని చంపి యతని రాజ్యమపహరించియుండును. అందుచే కోపగించి తాటకి, కుమారుడగు మారీచునితో నగస్త్యుని యొద్ద కేతెంచి యుండును. అగస్త్యుడు తన బలముతో వారిని వారించి యుండును. అందుచే బలహీనురాలగు తాటక అప్పుడపు డగస్త్యుని

పరివారముపై దండయాత్రలు చేసియుండును. ఈ కథ పై విధముగ వాల్మీకి రచనలో మార్పులు చెందియుండునని తోచుచున్నది.

ఈ తాటకను దుష్టురాలని వచించుచు విశ్వామిత్రుడు రాముని చే చంపించెను. (26వ సర్గము).

దీనిని బట్టి తాటకి దుర్మార్గురాలా ? ఎచటనుండియో తాటక భర్తయగు సుందుడు పాలించు రాజ్యమునకు వచ్చి నిష్కారణముగ సుందుని చంపిన అగస్త్యుడు దుర్మార్గుడా ? తాటకిని చంపించిన విశ్వామిత్రుడు దుర్మార్గుడా ?

30వ సర్గము : విశ్వామిత్రుని యజ్ఞవేదికపై మారీచ సుబాహులు వారి యనుచరులు రక్తప్రవాహమును గురిపించిరి. ఆ రక్తధారచే వేదిక యలంకరింపబడెను. రాముడు వేగముగ పరుగెత్తివచ్చి, వచ్చుచున్న మారీచ-సుబాహులను జూచి, మారీచుని యురమందు మానవాస్త్రము వేయ నతడు నూరు యోజనముల దూరమున సముద్రమందుపడెను. సుబాహుని చంపెను.

ఇచట మారీచ-సుబాహుల యనుచరు లేమైనట్లు ?

వారు యజ్ఞవేదికపై రక్తప్రవాహమును గురిపించిరి అనియు, రాముడు వచ్చుచున్న మారీచ సుబాహుల నెదుర్కొనియున్నట్లును రెండు విధములుగనున్నది. వారు వచ్చుచుండగనే రాముడు వారిపై బాణముల వదలెను. దీనిని బట్టి ఆ సమయమున వారు రక్తప్రవాహమును గురిపించిరనుట కల్లగనున్నది.

43వ సర్గము : జహ్నువు గంగను పానముచేసి చెవులనుండి వదలెను.

45వ సర్గము : జలమును మథించుటవలన కాలకూటము ధన్వంతరి, అప్సరసలు, ఉచ్చైశ్రవము (గుఱ్ఱము) కౌస్తుభము, అమృతము జనించెను. ఈ కథ లెంతటి యవాస్తవములో గ్రహింతురు గాక.

51వ సర్గము : విశ్వామిత్రుడు ఋషులతో 'సిద్ధాశ్రమము నుండి హిమవత్పర్వతమునకు పోదున'ని వచించి యుత్తరదిశకు బయలు దేరెను. అతనిని ఋషులు, మృగ-పక్షిగణములు కొంతదూర మనుస రించిరి. తరువాత విశ్వామిత్రుడు వారిని వెనుకకు మరలించెను.

ముని గణములు శోణానదీతీరమందు విశ్వామిత్ర పురస్సరముగ పరుండిరి. పిమ్మట విశ్వామిత్రుడు వారితో మిథిలకేతెంచెను.

ఈ విధముగ నతడు హిమవత్పర్వతమున కేగినట్లున్నది. మిథిల కేగి నట్లున్నది. కాని యతడు హిమవత్పర్వతమున కేగలేదు. మిథిల కేగెను.

52వ సర్గము : వాయువు కుశనాభునికి ఘృతాచియందు గలిగిన నూర్గురు కుమార్తెలను కామించి భార్యలుకమ్మని యడుగ వారు తిరస్కరించిరి. అంత నతడు వారి సకలావయవములను వంకరలుగా జేసెను.

ఇట్టి కాముకుని దేవుడనుట సమంజసమా ?

53వ సర్గము : చూళిమహాముని, ఊర్మిళతనయ సోమదయను గంధర్వకాంత యతనికి శుశ్రూష చేసెను. ఆమె కతడు బ్రహ్మదత్తు డను మానసపుత్రునిచ్చెను.

బ్రహ్మదత్తుడా కుశనాభుని కుమార్తెలను పెండ్లాడి వారిని స్పృశింపగనే వారి కుబ్జత్వబాధపోయి వారు కాంతితో ప్రకాశించిరి.

ఈ కథలు కేవలము ఋషుల యౌన్నత్యమును దెలుపుటకే రచింపబడినట్లున్నది.

54వ సర్గము : బ్రహ్మ సుతుడగు కుశుడు-కుశనాభునకు గాధి యను పుత్రుడు కలుగునని వచించి, ఆకసమును జొచ్చి ప్రాచీనమగు బ్రహ్మలోకమున కేగెను. సత్యవతి ఋచీకుని పత్నియై భర్త ననుస రించి శరీరముతో స్వర్గమునకేగెను. 'కౌశికి' యను మహానదిగ నాయెను.

(51వ సర్గములో బ్రహ్మపుత్రుడు కుశుడు. కుశుని పుత్రుడు కుశనాభుడు).

సత్యవతి భర్తయగు ఋచీకునితో శరీరముతో స్వర్గమున కేగ నగుటచే ఋచీకుడు కూడ శరీరముతో స్వర్గమున కేగినట్లు ధ్వనించు చున్నది. మరియు కౌశిక మహానదిగ నాయెనని యున్నది. దీనినిబట్టి కౌశిక భర్తనువదలి మహానదిగ యయ్యెనా? భర్తతో సశరీరముగ స్వర్గమున కేగిన మహాపతివ్రత, భర్తనువదలి మహానదిగా నగుటేల? ఋచీకుడు మరణించలేదా? ఇందేది నిజము?

36వ సర్గము : శివుడు రేతస్సును భూమియందు వదలెను. అగ్ని దానిని దహించ శ్వేతపర్వతము పుట్టెను. అందు తెల్లువన ముత్పన్నమాయెను. అందుండి కార్తికేయుడు జనించెను.

37వ సర్గము : అగ్ని - గంగ యంగము లన్నిటియందును తన తేజస్సును వదలెను. గంగ దానిని హిమవత్పాదమునందు వదలెను. దానిని భూమిధరించి కాంచనము, రజతము, రాగి, యినుము, తగరము సత్తుగనాయెను. గంగ గర్భమునుంచగనే శ్వేతపర్వతముతోగూడ సర్వవనము సువర్ణమయమాయెను. గంగ గర్భోత్సర్జనమునకు పిమ్మట పుట్టిన కుమారుని పాలిచ్చి పెంచుటకై యింద్రాదులు కృత్తికలను నియోగించిరి. అందువలన అతడు కార్తికేయుడని ప్రసిద్ధికెక్కెను.

పై రెండు కథలలోను వ్యత్యాసముండుటయేగాక యీ రెండు కథలు యెంత అసహజముగనున్నవో చదువరు లూహింతురుగాక. (కార్తికేయుడు పార్వతి కుక్షినుండియే జన్మించినట్లు వాయుపురాణాది గ్రంథములందున్నది).

38వ సర్గము : భృగుమహర్షి సగరునికి వరమిచ్చెను. ఆ వరముచే సగరుని భార్యయగు సుమతికి గర్భము కలిగెను. ఆ పిండమును ఛేదించుటవలన నరువదివేలమంది పుత్రులు వెలువడిరి. దాదులు వారిని ఘృతకుంభము లందు పెంచిరి.

(సగరుని పుత్రులు అరువదివేల యోజనముల భూమిని రసాతలము వరకు ఛేదించిరి).

ఇదియు ఋషుల మహాత్మ్యమును దెలుపు నొక హాస్యకథగ నున్నది.

46వ సర్గము : ఇంద్రుడు సవతితల్లియగు దితి యోనిద్వారా యామె గర్భమును ప్రవేశించి తల్లి చంప వద్దనుచున్నను వినక యా శిశువును 7 ఖండములుగా నఱుక వారు మరుత్తులై జన్మించిరి.

ఈ కథ యందలి ప్రతిచర్య యెంత అసహజమో వ్రాయ నవసరము లేదు.

48వ సర్గము : గౌతము డహల్యను-ఆశ్రమమును త్యజించి హిమవచ్ఛిఖరమునందు తపస్సుచేసెను. అతడచట తపమునను౦డ విశ్వామిత్ర రామ లక్ష్మణులు గౌతముని యాశ్రమమున నున్నపుడెట్లు వచ్చెను ? ఇది గూడ ఋషులమహాత్మ్యమును తెలుపుటకు వ్రాసిన సంఘటనగనే యున్నది.

51వ సర్గము నుండి 57వ సర్గము వఱకు : వసిష్ఠ-విశ్వామిత్రుల యుద్ధము.

వసిష్ఠుని ధేనువగు శబళ-విశ్వామిత్రునకు, అతని యనుచరులకు ఎవరికేది ప్రియమో అట్లు భోజనము నేర్పరచెను.

శబళ హుంభారవమునుండి కాంభోజులు, పొదుగునుండి శస్త్రపాణులగు పహ్లవులు యోనినుండి యవనులు, మయము నుండి శకులు, రోమకూపములనుండి మ్లేచ్ఛులు - కిరాతకులు - హారీతకులు జన్మించిరి.

వసిష్ఠ విశ్వామిత్రులు రణమొనర్ప విశ్వామిత్రుని యాయుధము లన్నిటిని వసిష్ఠుని బ్రహ్మదండము మ్రింగివేసెను.

పై కథలన్నియు ఋషుల మహాత్మ్యమును తెల్పు కల్పిత గాథలే క్షత్రియులకంటె ఋషులు బలవంతులనుటకు తెలిపిన గాథలు,

వారలట్టి బలవంతులు - మహాత్ముగలవారైనచో వారి విరోధులగు రాక్షసాదుల చంపుటకు వారు క్షత్రియరాజుల నాశ్రయించుటేల ?

57వ సర్గము : విశ్వామిత్రుడు భార్యతో గూడ దక్షిణదిశకు వెళ్ళి ఘోరమగు తపస్సు జేసెను. అచట నతనికి హావిష్యందుడు మొదలగు నలుగురు పుత్రులు జన్మించిరి.

ఘోరముగ తపస్సుచేసినాడన నింద్రియముల నిగ్రహించి తపస్సుచేసినాడనే గదా ! అట్టి సమయమున నతనికి పుత్రులు జన్మించుటేమి ? అట్లతడు వేయి సం॥లు తపస్సు జేయ బ్రహ్మ ప్రత్యక్షమై యతనిని రాజర్షిగ తలచుచున్నానని వచించెను. ఆ కాలముననే అతడు త్రిశంకునకు యజ్ఞ మొనర్చెను. ఘోరతపస్సులోనున్న వాడు యజ్ఞమును చేయించు టెట్లు సంభవము ?

58వ సర్గము : త్రిశంకుడు యజ్ఞముచేయింపుమని వసిష్ఠుని పుత్రులనుగోర వారు నిరాకరించిరి. అంత త్రిశంకుడు వేరొకచోట కేగెదనని పలుక వసిష్ఠ పుత్రు లతనిని ఛండాలత్వము పొందుమని శపించిరి. రాత్రి గడువగా నతడు ఛండాలత్వమును పొందెను.

తాము యజ్ఞముచేయ నిరాకరించిరి. వేరొకచోటునకు పోయెద నని త్రిశంకు బలికినంత యతనిని శపించిరి. మాత్సర్యోపేతులగు నిట్టి ఋషులా మహాత్ములు. వారు త్రిశంకుని శపింప రాత్రి గడువగా నతడు ఛండాలత్వమును పొందుటేమి ? శపించినంతటనే యతడు ఛండాలత్వమును పొందకుండుటకు హేతువేమి ? ఆ రాత్రి వార లతని నేమైనా చేసిరా ?

59వ సర్గము : విశ్వామిత్రుడు తాను చేయించు యజ్ఞమును దూషించిన వసిష్ఠ పుత్రులను భస్మీభూతులు గమ్మని, ఏడు జన్మలు శవములను, కుక్కమాంసమును దినుచు ముష్టికులను పేరుతో నుండుమని శపించెను.

62వ సర్గము : విశ్వామిత్రుడు తన మాట వినని పుత్రులను శునకమాంసము భుజించుచు నీచజాతుల యందుండుమని వచించెను.

ఈ విధముగ కేవలము తనమాట విననంతనే ఘోరముగ శపించిన విశ్వామిత్రుడు జితేంద్రియుడా ?

63వ సర్గము : విశ్వామిత్రుడు పుష్కరతీర్థమందు తపస్సుజేయుచు, మేనకనుగాంచి మోహావేశుడై, యామెతో పదిసంవత్సరములు సుఖముగా గడిపి, ఆమెను వదలి హిమాలయమున కేగెను. అచట నతడు వేయిసంవత్సరములు ఘోరతపస్సునుజేయ దేవతలచటకు వచ్చి యతనిని 'మహర్షి'యని పలికిరి. అతడు సంతృప్తినొందక మరలా వేయిసంవత్సరములు తపస్సుజేయ దేవతలతని తపోభంగమొనర్ప రంభను బంపిరి.

64వ సర్గము : విశ్వామిత్రుడామెను పదివేల సం॥లు శిలగానుండుమని శపించెను.

65వ సర్గము : పిమ్మట విశ్వామిత్రుడు పెక్కువేల సం॥లు తపమొనర్చ బ్రహ్మ ప్రత్యక్షమై యతనితో 'బ్రాహ్మణ్యమును పొందితివ'ని వచించెను.

ఈ కథ బ్రాహ్మణ్యము యొక్క యున్న తత్వమును తెలుపుటకు కల్పించబడినదిగా నున్నది.

బాల. 75వ సర్గము : పరశురాముడు కాశ్యపుడు నన్ను 'నా దేశమునందుండరాద'నెను. అందుచే నేను రాత్రియందీ భూమియందు వసింపను.

దేశమునందుండరాదని వచింపగా, రాత్రియందు వసింపననుటచే పగటియందుండ వచ్చుననియా ?

శివ-విష్ణువుల యుద్ధము : ఈ కథ శివునికంటె విష్ణువధికుడనుటకు విష్ణు భక్తులచే రూపొందించబడినట్లున్నది.

అయోధ్య. 91వ సర్గము : భరద్వాజుడు భరతునకు – అతని సైన్యమునకు ఆతిథ్యమీయదలచి, విశ్వకర్మ నాహ్వానించి కావలసినది చేయుమని కోరెను.

యమ, వరుణ, కుబేర, యింద్రాదులను బిలచి ఆతిథ్యమునకు వలసినవి చేయుడని కోరెను నదుల నాహ్వానించి కల్లు - సుర - నీరు స్రవించుమని కోరెను. దేవ-గంధర్వ-విశ్వావసు-హాహా హూహూలను, అప్సరసల నాహ్వానించెను.

ఈ కథ యంతయు భరద్వాజుని (ఋషుల) మహాత్తును తెలియ జేయుటకు వచింపబడి నట్లున్నది.

87వ సర్గము : గుహుడు భరతునితో రాముడు భుజించుటకై యన్నము, ఫలములు గొనివచ్చితిని. అతడు గ్రహింపక 'సదా మేమిచ్చాయవలయునేగాని గ్రహింపరా'దని మాతో పలికెను. (అగస్త్యుని యొద్దనుంచి, (అరణ్య. 12వ సర్గము), విశ్వామిత్రుని యొద్దనుండి (బాల. 27వ సర్గము) ఆయుధము లెట్లు గ్రహించెను ?

117వ సర్గము : అత్రిమహర్షి, అనసూయను గురించి రామునితో పదిసంవత్సరములు అనావృష్టిచే లోకముదహింపబడగా ఫలమూల సృష్టికై పదివేల సం॥లు తపముచేయబడగా నా విఘ్నములు నివర్తింపబడినవి.

పది సం॥లు అనావృష్టికలుగ, 10 వేల సం॥లు తపస్సుచేయ నా విఘ్నములు నివర్తింపబడుటేమి ? ఎంత హాస్యాస్పదముగ, అసమంజసముగనున్నది. ఇదియు కేవలము ఋషుల మహాత్తును ప్రచారముగావించుటకు కల్పింపబడిన కథ తప్ప యన్యము గాదు.

అరణ్య. 5వ సర్గము : ఇంద్రుడు ఆకాశమున గుఱ్ఱములుపూన్చిన రథమునుండి దిగి భూమిని స్పృశింపక నిలచి శరభంగునితో మాట్లాడెను.

ఆకసమున గుఱ్ఱములుపూన్చిన రథమేల ? గుఱ్ఱములు శూన్యములో నే విధముగ నడచును ?

శరభంగమహర్షి రామునితో 'ఇంద్రుడు నన్ను బ్రహ్మలోకమునకు గొనిపోదలచి వచ్చినాడు. నిన్ను చూడక బ్రహ్మలోకమునకు

గాని స్వర్గమునకుగానిపోను. నాచే అక్షయములగు శుభలోకములు జయింపబడినవి. నావియగు బ్రహ్మ-దేవలోకములను గ్రహింపుము. రాముడు "నేనే సర్వలోకములను సంపాదింపగలను". శరభంగుడా జ్యముచే హోమముచేసి, యగ్నిని ప్రవేశించి, వైశ్వానరసదృశు డగు కుమారుడై యగ్నినుండి లేచి ఋషుల, దేవతలలోకముల నతిక్ర మించి బ్రహ్మలోకము నధిరోహించెను.

ఇదియు మహర్షుల మహిమ తెలుపు నొక కల్పితగాథ తప్ప నన్యముకాదు.

లోకములు జయించితినని వచించిన శరభంగమహర్షి యగ్నిని ప్రవేశించి మరలా నా లోకమున కేగుటేమి? (ఋచీకుని భార్యయగు సత్యవతి శరీరముతో స్వర్గమునకేగెను (బాల. 34వ సర్గము) సప్త మునులు సశరీరులై స్వర్గమును జొందిరి. (కిష్కింధ. 13వ సర్గము) లోకములనే జయించిన శరభంగమహర్షి శరీరముతో నేల స్వర్గమున కేగలేదు.

74వ సర్గము: శబరి కూడ నవిధముగనే, యగ్నియందుపడి స్వర్గమున కేగెను.

ఇట్టి కథలన్నియు ఋషులమహిమల ప్రచారమునకై రచించిన కల్పితకథలుగ నున్నవి.

7వ సర్గము: సుతీక్ష్ణుడు రామునితో "నిన్నెదురు చూచు కారణమున నీ భువియందు దేహమును వదలి దేవలోకమునకు పోక ఉన్నాను. దేవరాజిచటకు వచ్చి నే నేడులోకముల జయించితినని వచించినాడు".

రాముని చూచిన తరువాత సుతీక్ష్ణుడేల దేహమును వదలి దేవలోకమునకు పోలేదు! ఈ కథయు ఋషుల ప్రభావమును తెలుపు కల్పితగాథయే. మరియు నీ కథలు రాముని భగవంతునిగ చిత్రీక రించుటకు కల్పించిన కథలుగ నున్నవి.

అరణ్య. 11వ సర్గము : మాండకర్ణి పదివేల సం॥లు జలమందుండి తీవ్రతపస్సు చేసెను. దేవత లతనిచెంత కైదుగురు అప్సరసలను బంప, ముని వారిని భార్యలుగ చేసికొని వారితో గడుపుచుండెను. అంతటి దీర్ఘకాలము తీవ్రతపస్సుచేయ గలిగిన ముని జితేంద్రియుడు కానిచో చేయలేడు గదా! ఆ స్త్రీల జూచినంతనే వారితో సంసార మొనరించు ముని యంతటి జితేంద్రియు డగునా?

అగస్త్యునిచే నీ దక్షిణదిశ యాక్రమించబడినది.

12వ సర్గము : అగస్త్యుడు రాముని కాయుధముల నిచ్చెను.

ఋషుల కాయుధములతో నేమిపని? ఆయుధములతో సంచరించువారు ఋషులౌదురా?

22వ సర్గము : ఖరుడు గాడిదగొంతు గలవాడై యఱచెను.

27వ సర్గము : త్రిశిరుడు మూడు శిరస్సులు గలవాడు.

వీరల పేర్లను బట్టి వ్యాఖ్యానించుట సహేతుకముగ లేదు.

కిష్కింధ. 11వ సర్గము : మహిషరూపుడగు దుందుభి వాలి దుందుభిని చంపి, యతనిని చేతులతో పట్టుకొని యోజనదూరము విసరివైచెను. రాముడు దుందుభి కళేబరమును కాలిబొటనవ్రేలితో పదియోజనముల దూరము విసరివైచెను.

ఇవి యన్నియు నొకరికంటె మరియొకరు ప్రతాపవంతులని తెలుపుటకు అతిగా వర్ణించుట జరిగినది.

24వ సర్గము : తన భర్తను చంపిన రాముడోదార్ప, తార కలకలలాడు ముఖముతో నుండెను.

ఇది కేవలము రాముని పొగడ్తకై వ్రాసిన మాటగానున్నది.

రాముడు తార నోదార్చుచు "ఈ సర్వలోకము ధాతచే చేయబడినది. సుఖ-దుఃఖయోగమంతయు బ్రహ్మచే చేయబడినది" అని వచించెను.

దీనినిబట్టి తన భార్యయగు సీతను రావణుడు గొనిపోవుట

విధికృతమే గదా! రాముడు విచారించుటేల? రావణుని చంపుటకై యత్నములు చేయుటేల?

47వ సర్గము : 'కండువు' అను ఋషి తన పుత్రుడు మరణింప అచటి వనమును అశరణ్యముగను, దురాధర్షముగను, మృగ - పక్షి శూన్యముగను శపించెను.

తన కుమారుడు మరణింప ప్రజాహితమగు ప్రకృతి నని శపించు ఋషులు మహాత్ములా? ధర్మాత్ములగుదురా?

56వ సర్గము : సంపాతి, తన సోదరుడగు జటాయువు, రావణునిచే మరణించెనని విని, తన పక్షములు తెగులబడుటచే, తన సోదరుని వైరము తీర్చుటకు శక్తి లేదని వగచెను.

63వ సర్గము : సంపాతికి ఋషి వాక్కుచే రెక్కలు వచ్చెను. తాను యువకుడుగా నున్నపుడుగల బల-పౌరుషము లతనికి గలిగెను. కాని అతడేల పగతీర్చుకొనలేదు? ఈ కథయు ఋషుల మహత్తును దెలుపు నొక వింతకథయే.

సుందర. 17వ సర్గము : రాక్షస స్త్రీలు-ఒక కన్నుది. ఒక చెవిది, చెవిలేనిది, చుట్టు చెవులుగలది, తలపై ముక్కుగలది. వాల్మీకి రాక్షసులపై గల ద్వేషముతో వీరిని వర్ణించినట్లున్నది.

30వ సర్గము : హనుమంతుడు సీతకు తనపై నమ్మకము కలుగుటకు రాముని చరితమును వినిపించెను. పిమ్మట ఆమెతో చాల సేపు సంభాషించిన పిమ్మట ఆమెకు రాముని యుంగరమిచ్చెను. (36వ సర్గము) కేవలము కథ పెంపునకే వాల్మీకి ఈ విధానము ననుసరించినట్లున్నది.

38వ సర్గము : సీత, చూడామణిని రామున కిమ్మని హనుమంతున కిచ్చెను.

40వ సర్గము : సీత, చూడామణిని రామున కిమ్మని హనుమంతున కిచ్చెను.

హనుమంతుడు సముద్రమును లంఘించుట, మహేంద్ర పర్వతమునుండి వానరు లాకాశమున కెగురుట (61వ సర్గము), దధిముఖుడు వనపాలురతో నాకసమున కెగురుట (62వ సర్గము) - ఇదేవిధముగ యుద్ధకాండములో సుగ్రీవుడు, అంగదుడు, విభీషణుడు - అతని యనుచరులు, శుకసారణులు-వీరందఱు నాకసమున కెగురుట ఇవియన్నియు కల్పితములు గాక సహజములా ?

యుద్ధ. 74వ సర్గము : మరణించిన రాక్షసులు సముద్రమునందు పారవేయబడిరి. ఇది సంభవమా ?

హనుమంతుడు ఓషధిపర్వతమును తెచ్చిన గాథకు యిది యొక కల్పితగాథ.

91వ సర్గము : లక్ష్మణుడు, కుబేరుడు తనకు స్వప్నము నందిచ్చిన యస్త్రమును గ్రహించెను. స్వప్నమునందీయబడిన యస్త్రము స్వప్నము గతించిన పిమ్మట అతని చెంతనుండు టెంతటి విపరీతము ?

101వ సర్గము : రావణుడు లక్ష్మణునిపై శక్తిని ప్రయోగింప, రాముడు "లక్ష్మణునకు స్వస్తియగు గాక !" యని పలికెను. కాని ఆ యస్త్ర మతనిని బాధించెను.

రాముని-భగవంతునిగ జూపించదలచిన వాల్మీకి యిదెట్లు రచించెనో ?

107వ సర్గము : అగస్త్యుడు రామునకు యుద్ధమునందు జయమును గలిగించు 'ఆదిత్య హృదయమును' పదేశించెను.

ఉత్తర. అధికపాఠము 4వ సర్గము : బ్రహ్మ రావణునకు మృత్యువును జయించు మంత్రము నుపదేశించెను.

35వ సర్గము : హనుమంతుడు సూర్యునిపైకి, రాహువుపైకి ఎగురుట.

37వ సర్గము : బ్రహ్మ కన్నీటిబిందువునుంచి వానరము జనిం

చుట స్త్రీయగు ఋక్షరజసుని శిరస్సునందింద్రుని యింద్రియము, గ్రీవమునందు సూర్యుని యింద్రియముపడి వాలి సుగ్రీవులు జనించుట.

56వ సర్గము : మిత్రావరుణులు ఊర్వశియందు మనస్సు లగ్నముచేసి కుంభమునందు రేతస్సు నుంచిరి. అందుండి అగస్త్యుడు : సిష్ఠుడు జన్మించిరి.

57వ సర్గము : నిమి శరీరమును మథింప మిథి జనించెను.

పై కథలన్నియు వారి వారి ప్రభావముల దెలుపు కల్పిత గాథలుగ నున్నవి.

53వ సర్గము : నృగుడు బ్రాహ్మణునకు గోదానముచేయుట ఆ గోవు దూడతో కలసి మరియొక బ్రాహ్మణుని గృహము జేరుట, ఆ బ్రాహ్మణులకు నృగువు దర్శనము లభించనందున వారతని తొండగా శపించిరి.

ఈ కథ బ్రాహ్మణులు శపింప సమర్థులని నిరూపించుటకు కల్పించబడిన గాథగ నున్నది.

77, 78, 79వ సర్గములు : శ్వేతుని కథ : అతడు భిక్షుకునికి భిక్షయొసగనందున మరణించి స్వర్గమునుపొందియు, దినదినము ఆకలి గొన్నవాడై తన శవమును తానే వచ్చి భక్షించుచుండెను. అగస్త్య మహార్షినిగాంచి యతడు శాపవిముక్తిపొందెను.

ఈ కథ భిక్షుకునికి, భిక్షనీయ కునికి గలుగు దుర్గతిని, అగస్త్యుని మహాత్మ్యమును వచించుటకు కల్పించబడిన కథగ నున్నది.

86వ సర్గము : ఇంద్రునికి కలిగిన బ్రహ్మహత్య నదులయందు- భూమియందు, స్త్రీలయందు మూడురాత్రులు, నిర్దోషులకు బ్రాహ్మ ణుల చంపిన వారియందు విభజింపబడిన గాథయు, బ్రాహ్మణుల దండించరాదనుటకు కల్పించిన కథగ నున్నది.

# 28. కిష్కింధావాసులు

వాల్మీకి వీరికి వానరులని వచించుచు కొన్ని చోటులయందు తోకలు వర్ణించెను. కిష్కింధాకాండము 33వ సర్గములో కిష్కింధను వర్ణించుచు రాజమార్గమందున్న గృహములు, సుగ్రీవుని భవనము యిటువంటివన్నియు వర్ణించి వారిని నాగరకులుగ జూపెను. హనుమంతుడు విద్యాపారంగతుడనియు, నవవ్యాకరణవేత్తయనియు నుడివెను. వాలి మహాబలవంతుడని నుడివెను. వాలి-రావణుల యుద్ధము వారి సఖ్యము, రామ-సుగ్రీవుల సఖ్యము-ఇట్టి వన్నియు విపులముగ వర్ణించి వారిని మానవులుగనే చూపెను.

కాని రాముడు హనుమంతు నధిరోహించుట, లక్ష్మణు డంగదు నధిరోహించుట-యిత్యాది సంఘటనల ద్వార ఆర్యుల ఔన్నత్యమును చూపుటకై ప్రాచీన దక్షిణ భారతవాసులగు హనుమంతాది వనచరులను హీనముగచూపి వాల్మీకి తన ఆర్యాభిమతమును చాటెను.

229 వ పేజినుండి

యుద్ధ. 74 సర్గము : హనుమంతు డోషధిపర్వతమును తీసికొని రాగా, నిహతులైన వానరవీరులందఱు ఔషధప్రసరములవాసనచే విశల్యులును-నిరోగులునై రాత్రులయందు నిద్రించిన వారు మేల్కొనిన విధముగ మేల్కొనిరి.

యుద్ధ. 102వ సర్గము : హనుమంతు డోషధిపర్వతమును గొని రాగా రాక్షసులందఱు నాశ్చర్యము నొందిరి. సుషేణుడా యోషధిని నలుగగొట్టి లక్ష్మణున కీయ, లక్ష్మణుడు దాని నాఘ్రాణించి శల్యములు లేనివాడు, నిరోగుడునై వెంటనే లేచెను.

74వ సర్గములో నా యోషధిని నలుగగొట్టలేదు. అపుడు మరణించిన వారందఱు లేచిరి.

యుద్ధ. 123వ సర్గము : రాముడు దేవేంద్రునితో యమాలయమున కేగిన వానర-భల్లూకముల పునర్జీవితుల చేయుమని యడుగ, నతడు యుద్ధమున చంపబడిన వారు లేవగలరనియు, నఱుకబడిన యవ

యవములుగలవారు, రోగములు-వ్రణములు లేక పునర్జీవితులగుదురని వచించెను. వెంటనే వానర-భల్లూక యోధులందఱు లేచిరి.

దేవేంద్రు డింతటి శక్తివంతుడైన, రాక్షసులతో జరిగిన యనేక యుద్ధములలో పరాజితుడగుట యెట్లు సంభవించెను ?

యుద్ధ. 120వ సర్గము : కుబేరుడు, యముడు, ఇంద్రుడు, వరుణుడు, శివుడు, బ్రహ్మ-వీరందఱు విమానములపై లంకకు వచ్చి రాముని సమీపించిరి.

యుద్ధ. 122వ సర్గము : శివుడు రామునితో నీ తండ్రియగు దశరథు డింద్రలోకమునుపొంది, విమానమునందు వచ్చియున్నాడని పలుక, రామ లక్ష్మణులు విమానమెక్కి తండ్రికి నమస్కరించి, దశరథుడు రామ లక్ష్మణులతోను, సీతతోను మాట్లాడెను.

సీత మొదట విమానమెక్కినట్లు లేదు.

కుబేరుని జయించి, యతని విమానమును రావణుడు తీసికొని వెళ్ళెనని కథలున్నవి. కాని ఇంద్ర, శివ, బ్రహ్మ, యమ, వరుణాదులకు విమానము లున్నట్లెచటను కథలు లేవు. వింతలలోకెల్ల వింత మరణించిన దశరథుడు సశరీరుడై విమానములో వచ్చి కుమారులతోను-కోడలితోను ప్రసంగించుట.

యుద్ధ. 121వ సర్గము : అగ్ని వైదేహిని యంకమందుంచుకొని, వైదేహిపై నున్న చిదుకులను నెట్టివేసి పైకివచ్చెను. దీనినిబట్టి అగ్ని వచ్చినది మంటల నుండియా ? భూమిలోనుండియా ? మంటల నుండి వచ్చిన చిదుగులను నెట్టివేయవలసిన పనిలేదు. భూమిలోనుంచి వచ్చినాడని తలచిన-అంతటి భూమిలోనుండియే వచ్చినవాడు చిదుకులను నెట్టివేయకుండా రాలేడా ? యను సందేహము కలుగును.

ఇన్ని కల్పితములు కల్పించుటకంటె నచటి జనుల హాహాకారములుగాంచి రాముడే యామెను చేరదీసెననిగాని, లేక రావణుని వృత్తాంత మెరిగిన రాక్షసులుగాని, సీతను కాపలాగాయు రాక్షసులుగాని, జరిగిన వృత్తాంతమును జెప్పి సీత పవిత్రురాలని వచించినంతనే రాము డామెను స్వీకరించిన మెంతయో సమంజసముగ నుండెడిది.

# 29. వాల్మీకి రచనా విధానము

వాల్మీకి రామాయణము నేకపక్షముగ రచించెను. అతడు, దశరథుడు-రాముడు-సుగ్రీవుడు-విభీషణుడు మొదలగు రాముని పక్షము వారందరిని మహాత్ములనియు, నీతిజ్ఞులనియు, ధర్మజ్ఞులనియు సంబోధించుటయే యిందుకు నిదర్శనము. అలాగే సతని బుద్ధికి వ్యతిరిక్తులగు కైక-రావణుడు-వాలి మొదలగు వారి నందరిని దుష్టులనియు, అధర్మ వర్తనులనియు నిందించుచు రచన సాగించెను. ఆ యా పాత్రల చర్యల ద్వారా తన మనోగతాభిప్రాయముల సమర్థించుట కెంతయో యత్నించెను. రామునకు లోకమునందలి సద్గుణము లన్నియు కట్టబెట్ట యత్నించెను. అతనిని భగవంతుడని నమ్మించుట కెంతయో యత్నించెను. కథను కొంత సహజముగ వాస్తవదృష్టితో నడిపెను. కొంత కథను అభూతకల్పనలతో వాస్తవవిరుద్ధముగ సాగించెను.

ఉదాహరణకు : రామునికి పదునాలుగు సంవత్సరముల వన వాసము-వాస్తవము.

రాముడు పదకొండువేల సంవత్సరములు రాజ్యమొనర్చుట - వాస్తవవిరుద్ధము.

వాల్మీకి కథను రాముని పక్షముగ నడిపినను, అత డచటచట నుడివిన వాక్యములు యదార్థగాథను వెలికితెచ్చుటకు పరిశోధకుల కుపయోగించినవి.

మరియొక ఉదాహరణ : దశరథుడు, రాముని పట్టాభిషిక్తునిగ జేయుటకు సకలసన్నాహములు చేసి మరునాడుదయము సుముహూర్తముగ నిశ్చయింప పాపియగు మంథర అసూయచెంది, స్వార్థపరురాలు-మూర్ఖురాలు-చెడ్డతలంపుగల కైకకు దుర్బోధచేయు, మధ్యస్థభావము లేని కైకేయి, అపాపుడగు దశరథునితో నతడు తనకు పూర్వమిచ్చెద ననిన వరములను యాచించెను.

కాని దశరథుడు రామునితో 'భరతుడు వచ్చులోపల నీ పట్టాభిషేకమునకు తగిన సమయము' అని వచించుటవలనను, నుంగగ కైక్యా

జన్మప్రకారము భరతునకే రాజ్యప్రాప్తి సన్నిహితము, 'రాజ్య సామాన్యముచే భరతుని వలన రామునకు భయము' అనుటవలనను, రాజ్యముపై భరతునకు పూర్తిహక్కుగలదనుట విశదమగుచున్నది. మరియు దీనికి సంబంధించిన ముఖ్యవిషయమును రాముడు వనవాసగతుడైన పిమ్మట, భరతుడు రాముని యొద్దకేగినపుడు రాముని ద్వారా భరతునకీ విధముగ తెలుపబడెను. "మన తండ్రి మీ తల్లిని వివాహమాడు సమయమున రాజ్యశుల్కమును మీ తాతకు ప్రదానము చేసెను".

కాని వాల్మీకి రచనలో కైకేయి తన భర్తతో రాజ్యముపై తన కుమారునకుగల హక్కును ప్రస్తావించినట్లు గన్పించదు. దశరథుడు-తిమిధ్వజునితో జరిగిన యుద్ధములో నతని ప్రాణరక్షణకు తోడ్పడినందుల కతడిచ్చెదనన్న వరద్వయమునే యాచించినట్లు గన్పించును.

మరియు దశరథుడు, వసిష్ఠుడు, సుమంత్రుడు మొదలగు వారెందరో కైకయొక్క దుర్నీతికి దశరథుడు మోసగింపబడెనని కైకను నిందించినను, వనములకేగునపుడు రాముడు సీతను నారవస్త్రములు కట్టుచుండ నచట జనులందరు దశరథుని నిందించిరి" అను మాటచే, రాముని వనవాసమునకు కారణము దశరథుడనుట విదితమగుచున్నది.

అటులనే మరికొన్ని సంఘటనలు : సీతాన్వేషణకై సుగ్రీవుడు వానరులను నలుదిశలకు పంపెనని యెంత సుదీర్ఘముగ వ్రాసినను, హనుమంతుడు సీతాన్వేషణకై సముద్రమునుదాటి లంకచేరెను. అని యెన్నిమారులు వచించినను, హనుమంతుడు పలికిన 'చారుడను, శత్రువుల శక్తి పరీక్షించువాడను, రహస్యముగ సంచరించువాడనగు నాచే లంకయంతయు చూడబడినది. రావణుని శక్తి తెలిసికొనబడినది' అను మాటలచే, హనుమంతుడు లంకాపురికి చారుడుగ వెళ్ళినట్లు తెలియుచున్నది.

రాముడు పరాక్రమవంతుడని పలుమారులు వ్రాసెను. కాని

విరాధ-కబంధులు రామ లక్ష్మణుల తమ బాహువుల బంధించినపుడు రాముని చేష్టలను వర్ణించి రాముని భీరువుగ రూపుదిద్దెను.

రాముని జితేంద్రియుడని వర్ణించుచు, రాజ్యకాంక్షతోను - సీతా విలాపముతోను కాలమంతయు గడిపినట్లు చూపించెను.

రాముడు భగవంతుని యవతారమని చాటించదలచి యొకచోట విష్ణువుయొక్క యవతారమనియు, మరియొకచోట రుద్రుని యవతారమనియు వచించి, యతని యవతారమును సంకటస్థితియందుంచెను. అటేవిధముగ సీత నొకచోట వేదవతి యవతారమలయు, మరియొకచోట లక్ష్మియవతారమనియు వచించి యామె యెవరి యవతారమైనది స్పష్టపరచక మఱుగున నుంచెను. విష్ణువునకు సహాయముగ దేవతలు వానరులను సృజించిరని వచించెను. కాని యింద్రునివలన జన్మించిన వాలిని రామునిచే జంపించి యవతారములు ప్రహసన మని విశదపఱచెను.

రాముడు ఋషియనియు-పితృవాక్య పరిపాలకుడనియు వచించుచు, నతడు ఋషుల యాచారములకు విరుద్ధముగ వేటాడుట - మాంసము తినుట, యుద్ధములు చేయుట, తండ్రిని నిందించుట తెలియబరచెను.

దశరథుని దూరదృష్టిగలవాడని ధర్మాసక్తుడని వచించుచు, చిన్న భార్యకు జన్మించు కుమారునకు రాజ్యమిచ్చునట్లు వాగ్దానము చేసెనని వచించెను. అతిరథుడని వచించుచు, పరశురాముని గాంచి నంతనే యతని ప్రాథేయపడువానిగ నిరూపించెను. సత్యసంధుడని వచించుచు, భార్యకిచ్చిన వాగ్దానమును భూస్థాపితము చేయుటకై యెన్నియో కుట్రలు పన్నుట విశదపరచెను. ధర్మాసక్తుడు, పౌరులకు దేశమునకు హితుడని వచించుచు, భార్యాప్రియమునకై యెట్టి ధర్మ విరుద్ధ కార్యములు చేయుటకైనా వెనుతీయుని వానినిగ నిరూపించెను.

కౌసల్యను, భర్తయందు మిక్కిలి యనురాగముగలదిగ తెలుపుచు, ఆమెచే రామునకు "రాజ్యమునకై లక్ష్మణుడు వచించినట్లు

తండ్రిని బంధించుటగాని లేదా నిర్జించుటగాని చేయుము"ని పలికించి, యీ యామెకు దశరథునిపై గల ద్వేషమును వివరించెను.

రాముని కులపర్వతముల కూల్చగల సమర్థునిగ, సముద్రమును బంధింపజేయగల సమర్థునిగ నొకవైపు జూపుచు, మరియొకవంక సముద్రమును దాటుమార్గము తెలియక విలపించు వానినిగ నిరూపించెను.

"రాముడు స్త్రీల సమక్షమున నొకప్పుడును అసత్యమాడడు" అని వచించుచు శూర్పణఖతో రామ లక్ష్మణుల పరియాచకముల చూపెను.

శూర్పణఖ రావణునితో

అరణ్య. 34వ సర్గము :

శ్లో॥ నీతా కథంచి న్మూకత్వాఽహం పరిభూయ మహాత్మనా,
స్త్రీ వధం శంకమానేన రామేణ విదితాత్మనా. 11

మహాత్ముడును ఆత్మవిదుడునగు రాముడు, స్త్రీని వధించుట కనుమానించుచు నన్ను పరాభవించి ప్రాణములతో వదలెను.

శూర్పణఖకు-రాముడు తాటకిని వధించినది తెలియదా ?

రాము డేక పత్నీవ్రతుడని వచించుచు, రాముని బహుభార్యాత్వమును సమర్థించు మాటల నందందు వివరించెను

ఈ విధమగు రచనా విధానముచే వాల్మీకి దశరథుని, రాముని చాల ఉత్తములుగ వచించుచునే, యథార్థములు బట్టబయలుపరచుచు వారి సహజస్వభావమును బహిర్గత మొనరించెను.

కైకేయిని దుష్టురాలు, స్వార్థపరురాలు, మూర్ఖురాలు-అని మొన్నియోమారులు వచించియు నామె గుణగణముల నా రీతి చిత్రీకరించలేకపోయెను. రాజ్యమునకై యీ యామె కుమారునకు హక్కు-గలదని రాముడే వనవాసకాలమున భరతునితో వచించుటచే, దశరథుడే భరతునకు చెందవలసిన రాజ్యమును రామున కప్పజెప్పుటకు కుట్ర జేసెనని విదితమగుచున్నది. కైకేయి హక్కు-ను వాల్మీకి, రాముని

పట్టాభిషేక సమయమున మఱుగుపరచినను, దశరథునిచే 'భరతుడు వచ్చులోపలే రాముని పట్టాభిషేకము జరుగవలయు'నని పలికించి యదార్థమును బయలుపఱచెను. కాని కైకచే పై కారణమున రాజ్యము భరతున కొసంగుమని దశరథుని యడిగినట్లు చూపక, తిమిధ్వజాని తో రణమొనర్చునాడు దశరథుడు తనకిచ్చిన వరముల యాచింప జేసి, యామెను రాముని రాజ్యము నాశించిన స్వార్థపరురాలుగ చూపుటకు యత్నించెను. కాని యీ సందర్భమున నిజమగు దుష్టులు, స్వార్థపరులు-దశరథుడు-రాముడు మాత్రమేనని కథ ఆద్యంతము చదివిన పాఠకులకు తెలియునట్లు చేసెను.

అదేవిధముగ కైక పుట్టినింట దాసియగు మంధర కైకకు యదార్థములు చెప్పినదను మాటను మఱుగుపరచుచు నామెను పాపియనియు, అసూయాపరురాలనియు వాల్మీకి వచించెను. కాని యామె వచించిన 'రాజ్యము-పుట్టుకచే భరతునకు చెందవలసియున్నది'యను మాట యదార్థవిరుద్ధమా? 'దశరథుడు నీ కొసంగిన వరములను నీవు యాచించు' మని సలహాయొసంగుట ధర్మవిరుద్ధమా?" ఇచట వాల్మీకి యొక్క విషయమును మఱుగున పరచినట్లు చూపరులకు స్పష్టముగ గోచరించుచున్నది. "రాజ్యము పుట్టుకచే భరతునకు చెందవలసియున్నది. రాజ్యసామాన్యముచే రామునకు భరతుని వలన భయము" అని వచించిన మంధర కైకతో ప్రప్రథమున, తనను వివాహమాడు సమయమున దశరథుడు వచించినట్లు భరతునకు రాజ్యమొసంగుమని యడుగుమనియు, అతడది నిరాకరించిన తన కొసంగిన వరములను యాచించుమనియు పలికియుండును. దశరథుడు తాను కైకను పరిణయమాడునాడు వచించినమాటను తిరస్కరించుటచే కైక, తనకు పూర్వమిచ్చిన వరములను యాచించియుండును. వాల్మీకి కొంత విషయమును మఱుగుపరచుచు, 'మంధర కైకకు చెడ్డసలహా నిచ్చినది'యని మంధరను నిందించుటచే, కథలోని యదార్థవిషయముల నర్థముచేసి

కొనలేని పాఠకులు వాల్మీకివలెనే మంథరను నిందించుట జరుగుచున్నది. కాని భరతునకు సంక్రమించవలసిన రాజ్యమును, భరతుని రాజ్యమునకు దూరముగ బంపి-దశరథుడు, రాముని రాజుగా నొనర్పుటకు దుర్మంత్రాంగము చేయుచున్న యదార్థవిషయము - మంథర కైకకు తెలుపుట నేరమా? అట్టి యత్నము చేయుచున్న దశరథుడు మహాత్ముడా? ధర్మాత్ముడా? నీతిపరుడా? అట్లే రాజ్యము భరతునిదని తెలిసియు, పట్టాభిషేకమునకు తయారైన రాముడు సన్మార్గుడా? ధర్మపరుడా? రామ-దశరథులను మహాత్ములనియు, ధర్మపరులనియు నెన్నియో సద్గుణములతో పొగడు వాల్మీకి మహాత్ముడగునా? పక్షపాతబుద్ధితో తనరచన నేక పక్షముగా జేయకుండునా? అందువలననే కథలో నభూతకల్పన లపారముగా కల్పించెను. కాని పొరపాటుననో, గ్రహపాటుననో యదార్థవిషయముల నచ్చటచ్చట వెలిబుచ్చి, యదార్థగాథను సూక్ష్మముగ జనుల కందించెను.

వానరజాతిని-అచటచట కోతులుగ వర్ణించుచు-వారికి తోకలు పెట్టియు, వారి గృహములు, రావణుడు మొదలగు రాజులతో వారికి గల సంబంధము, వారి రాజ్యములు, గుణగణములు వర్ణించుచు వారిని మానవజాతిగ చిత్రీకరించెను.

రాక్షసజాతి వారిని కొందరిని వికృతరూపులుగ వర్ణించినను, రావణుడు, మండోదరి మొదలగు కొందరిని సహజముగ వర్ణించెను.

కల్పనలు : హనుమంతుడు దేహమును పెంచ, నతని కాళ్ళ క్రిందనున్న కొండలతని బరువునకు క్రుంగుట, హనుమంతుడు సముద్రమును లంఘించి లంకనుచేరుట సుగ్రీవుడు త్రికూటపర్వతమునుండి యెగిరి, ప్రాసాదముపైనున్న రావణుని యొద్దకుచేరి, యతనితో మల్లయుద్ధ మొనర్చి యతని కిరీటమును తన్ని, మరలా యెగిరి రాముని యొద్దకు జేరుట, విభీషణుడు మంత్రులతో నాకసమున కెగురుట, శుకసారిణు లాకాశమున కెగురుట, అంగదుడు ఆకాశమున కెగురుట,

హనుమంతుడు లంకనుపూర్తిగా దహనముచేయుట, ఒక్కొక్కరు రణమున వేలమందిని చంపుట, హనుమంతు డాకాశమున పయనించుట, పర్వతములను పెళ్ళగించి తెచ్చుట మొదలగు నూహాతీతకల్పనలచే పండితులకు కథయందు వినోదమును, పామరుల కాసక్తియు కలిగించెను.

రామాయణమున ఋషుల మహిమలు కోకొల్లలు. వినువారుండవలయునేగాని చెప్పుటకు కొదవయేమున్నది? అన్నట్లున్నవి. ఇవి సహజములా? అసహజములా? సాధ్యములా? అసాధ్యములా? అను విచక్షణయు అందు కన్పింపదు.

వానిలోని కొన్ని ఉదాహరణలు: జహ్నువు గంగాజలము నంతయు త్రావి, గంగను చెవులనుంచి వదలెను.

వాయువు, తన మాటను తిరస్కరించినందున కుశనాభుని నూర్గురుపుత్రికల యవయవములు వంకరలగునట్లు చేసెను. బ్రహ్మదత్తుడు వారిని పెండ్లాడి స్పృశింపగనే, వారి యవయవములు స్వస్థత జెంది వారు కాంతితో ప్రకాశించిరి. సగరునికి అరువదివేలమంది పుత్రులు. కపిలుని హుంకారమున వారందరు నశించిరి. వశిష్ఠుని గోవు (శబళ), విశ్వామిత్రుడు సైన్యముతో రాగా భోజనమున యెవరికేది ప్రియమో అట్లేర్పరచెను.

శబళనుండి పప్లవులు, శకులు, కాంభోజులు, మ్లేచ్ఛులు, కిరాతకులు మొదలగు వారెందరో జనించిరి.

భరద్వాజుడు–భరతునకు–అతని సైన్యమునకు వారికి కావలసిన విధముగ భోజనపానీయములు నేర్పరచెను.

పది సంవత్సరములు అనావృష్టిచే లోకముదహింపబడగా, అనసూయ పదివేల సం॥లు ఘోరతపస్సుజేయ, నా విఘ్నములు నివర్తింపబడెను.

మాండకర్ణి పదివేల సం॥లు జలమునందుండి తీవ్రతపస్సుజేయ,

దేవత లతని యొద్ద కైదుగురు అప్సరసలను బంపిరి. అతడు వారిని భార్యలుగ చేసికొనెను.

(అతడు 10 వేల సం॥లు తపస్సుచేసినదా భార్యల కొఱకా ?)

కండువు, అతని పుత్రుడు మరణింప అచటి వనమును అశరణ్యముగను, మృగ-పక్షి శూన్యముగను శపించెను.

సంపాతికి ముని ప్రభావమున తెక్కలు వచ్చెను.

మతంగమహర్షి యుపవాసముచే శ్రమనొంది యలసిపోవుటకు శక్తిచాలక సప్తసముద్రముల నాహ్వానించ-అవి అతని చెంతకు వచ్చినవి. (సప్తసముద్రముల తన యొద్దకు తెప్పించుకొనగల శక్తిగలవాడచటికి పోలేడా ?).

వాల్మీకి ఋషుల మహిమలను రామాయణము ద్వార ప్రచారములోనికి తీసికొని వచ్చుటకు యత్నించి సఫలీకృతుడాయెను. రాముడును ఋష్యుల యండదండలతోనే వనముల గడపి, వారి యొద్దనుండి ఆయుధములు గ్రహించి రాక్షసవధకు, రాజ్యవిస్తరణకు తోడ్పడెను.

పాత్రపోషణ : వాల్మీకి దశరథుని-రాముని యెంతో ఉన్నతులుగా సృజింపదలచి విఫలుడయ్యెను (దీనికి సంబంధించిన విషయములు పైన వ్రాయబడినవి) అటేవిధముగ కైకను-మంధరను దుష్టులుగా చిత్రింపదలచియు విఫలుడయ్యెను.

సుగ్రీవుని-విభీషణుని మహాత్ములనియు, ధర్మపరులనియు, నీతివేత్తలనియు పలుమార్లు వచించెను.

కాని సుగ్రీవుడు, వాలిని చంపిన పిమ్మట తన యన్నయొక్క మహోన్నత గుణములు వర్ణించుచు 'తనను హింసింపను, వెళ్ళిపొమ్మ'ని చెప్పినాడని వచించి తన యన్నయొక్క భ్రాతృప్రేమను, తన దుష్టబుద్ధిని తానే బయలుపరచి, వాల్మీకి వచించినట్లు మహాత్ముడు, గుణోత్తముడు కాలేకపోయెను.

విభీషణుడును, తానెన్ని ధర్మములు వచించినను, రాము

లక్ష్మణులు—ఇంద్రజిత్తు బాణములచే పీడితులై ధరణియందుపడియుండ వారిని నమ్ముకొనిన, తన రాజ్యమునందలి యాస—అడియాసయైనదని విలపించి, తన దుర్బుద్ధిని తానే వెల్లడించుకొని, వాల్మీకి వచించినట్లు, బ్రహ్మ—అతని కిచ్చిన 'నీ బుద్ధి యెల్లప్పుడు ధర్మమునందే నిలచును' అను—వరము మిథ్య యని నిరూపించుకొనెను.

ఈ విధమగు రచనచే వాల్మీకి మభ్యపెట్టదలచిన వారి గుణములను, వాల్మీకియే తనకు తెలియకుండ బయల్పరచి యథార్థమును లోకమునకు తెలియబరచెను.

భరతుడు : దశరథుడు మరణించినపుడ యోధ్యనుండి దూతలు తనయొద్దకు రాగా, భరతుడు వారితో ధర్మదర్శినియగు కౌసల్య, ధర్మజ్ఞయగు సుమిత్ర కుశలమా? స్వార్థపరయా—చండియు—గర్వియునగు నా తల్లి రోగము లేకయున్నదా? యని యడిగెను. భరతుడు రామునికై యరణ్యమునకేగి నపుడును తన తల్లిని నిందించెను.

వాల్మీకికి, కైకపై కోపము—ద్వేషము నుండుగాక. అతడు భరతునిచే, నతని తల్లి నావిధముగ నిందించుట యసహజముగనున్నది. భరతుని పాత్రకు తగిన విధముగ లేదు. తనకు తన తండ్రి వాగ్దానము ప్రకారము రాజ్యము సంక్రమించినను, తన పూర్వుల ధర్మము ననుసరించి, రాజ్యమును తృణప్రాయముగ దలచి, యన్నకీయుటకు సిద్ధపడినవాడు, తన యన్న వనముల విరాగియైయుండ తాను సుఖముల ననుభవించదలచక, విరాగిగ, కాలము గడిపిన ధర్మపరాయణుడు తల్లి నా విధముగ నిందించునా?

వాల్మీకి రాముని మానవాతీతునిగ చిత్రీకరించుట కతనిచేత ననేక ప్రగల్భములు పలికించెను. (రాముని ప్రగల్భములు ప్రత్యేక వ్యాసముగ నీయబడినది). కాని అతని భార్యయగు సీతచేత నా విధముగ ప్రగల్భములు పలికించలేదు. ఒకసారి మాత్రము రావణునితో 'నా భర్త యాజ్ఞ లేకపోవుటచే నా తేజస్సుచే నిన్ను భస్మముచేయకున్నాను' అనిపించెను.

హనుమంతుని పాత్రను వాల్మీకి కొన్నిచోట్ల లసహజముగ చిత్రీకరించెను. కొన్ని ప్రదేశములందు మహామహిమగలవానిగ చిత్రీకరించెను. ఇతని చేతను రావణునితో గూడ లంకను పెకలించి తెచ్చెదను. అను ప్రగల్భములు పలికి చెను. మహాసముద్రమును దాటినవాడుగను, అనేకమంది రాక్షసుల నొక్కడే చంపినవాడుగను తెలియబరచుచు, 'ఈ రాక్షసులచే నేను చంపబడినను, పట్టుకొనబడినను రాముని కార్యము విఫలమగును' అనుచు యదార్థమును విశదపరచెను.

రావణుని—'దుర్మార్గుడు. పాపి, క్రూరుడు, పరదారాసక్తుడు' అని వచించుచునే వాల్మీకి, యతనిని 'అతని యొద్దనున్న యే తరుణియు నతనిచే బలాత్కారముగ పొందబడినది నాథుడుకలదియు, లేదని వర్ణించి, యతని యుత్తమోత్తమ చరితమును తెలిపెను.

రామాయణ రచనయంతయు దాదాపు యీ విధముగనే రచింపబడిన దనుటలో నతిశయోక్తి లేదు.

పరస్పర విరుద్ధ రచనలు : వాల్మీకి—ఒకచోట రచించిన దానికి, మరియొకచోట రచించిన దానికి సంబంధము లేకుండ విరుద్ధములగు రచనలు కొన్ని చేసెను. అవి ప్రత్యేక వ్యాసముగ నీయబడినవి.

ఉదాహరణకు : ఒకచోట తార తండ్రి సుషేణుడు. మరియొకచోట తారుడు.

ఒకచోట జనకునకు శివధనుస్సు నిచ్చినది రుద్రుడు. మరియొకచోట వరుణుడు.

కొన్ని అసహజపు పలుకులు, వర్ణనలు :

అయోధ్య. 9వ సర్గము : రాముడు లక్ష్మణునితో 'అగస్త్యుని, కౌశికుని పిలిపించి రత్నములచే పూజింపుము' — వారిరువురు ఆ నగరమందు లేరు, అట్టి వారిని పిలిపించి పూజించుటేమి ?

అయోధ్య. 41వ సర్గము : రాముడు వనవాసమున కేగ సూర్యుడు మఱగిపోయెను. నవగ్రహములు దారుణములయ్యెను.

సముద్రము పైకిలేచెను. నగరము చలనమునందెను. గ్రహ నక్షత్రములు ప్రకాశించలేదు. అయోధ్య యందలి స్త్రీలు—భర్తలను సోదరులను సర్వమును వదలి రాముని స్మరించుచుండిరి (ఇచట రాముడు వారికిచేసిన మంచిపనులేమియు వచింపబడలేదు.

అరణ్యా. 35వ సర్గము : నూరు యోజనముల దీర్ఘముగు కొమ్మలుగల వటవృక్షము.

అయోధ్య. 48వ సర్గము : రాము డెచటనుండునో యచట భయపరాభవములుండవు.

శ్లో॥ యత్ర రామో భయం నాత్ర నాస్తి తత్ర పరాభవః. 15

చిత్రకూటములో రాము డున్నపుడేగదా. ఋషులచటనుండి రాక్షసులకు భయపడి పారిపోయినది. విరాధ-కబంధులను జూచి, రాముడే శోకించినాడు గదా!

61వ సర్గము : కౌసల్య భర్తతో 'రాముడు సారముతీసిన సురవలె, సోమములేని యాగమువలె యితరు డనుభవించిన రాజ్యము నాశింపడు'.

ఇతరు డనుభవించని రాజ్యమేదైన గలదా?

66వ సర్గము : దశరథుడు మరణించినపుడు — "చంద్రుడులేని రాత్రివలె, భర్తలేని స్త్రీవలె, రాజులేని యయోధ్య ప్రకాశించలేదు".

"రాజు స్వర్గమునకుపోగా భూమియందును, రాజ స్త్రీలయందును సంచారములేనివాడై సూర్యుడు వేగముగ వెళ్ళెను". సూర్యు డట్లేగునా?

67వ సర్గము : "రాజులేని రాజ్యమందు పర్జన్యుడు జలముల వర్షింపడు. పిడికెడు ధాన్యము ఫలింపదు". వర్షమునకు రాజునకు సంబంధమేమి?

104వ సర్గము : భరతుడు రామునితో "నా తల్లి రాజ్యఫలము నందకయే విధవయైనది".—కౌసల్యాదులును విధవలైరి గదా!

105వ సర్గము : రాముడు భరతునితో "మనుజులు సూర్యుడుదయించుటను—అస్తమించుటను జూచి యానందించుచున్నారు, తమ జీవితనాశము నెరుగకున్నారు".

అనగా తమ జీవితములో నొకదినము గడిచిపోయినదని యెఱుగ కున్నారు.

ఈ విషయము రామునికి గూడ తెలియును గదా! రాము డేమి చేసెను. భరతుని రాజ్యమునకై తపించెను. నమ్మిన యిల్లాలి నష్ట డవుల పాలుచేసెను. జీవితసత్యము నెఱిగిన తాను చేయవలసిన దిదియేనా!

114వ సర్గము : భరతుడు సారథితో "రాముడు వనవాసి కాగా, తరుణులు సంతప్తులై గంధాదుల ననుభవించుట లేదు. నరు లలంకృతులై విహారముల కేగుట లేదు."

రాముడు తరుణులకు, నరులకు చేసిన ప్రయోజనములు మాత్రము వాల్మీకి రామాయణమునందు తెలుపలేదు.

సుందర. 13వ సర్గము : హనుమంతుడు కిష్కింధ కేగి, సీత నాకు కనిపించలేదనిన రాముడు వెంటనే ప్రాణములు వదలును. రాముని మరణముగాంచిన లక్ష్మణుడు జీవింపడు. సోదరు లిరువురి మరణము వినిన భరతుడు మరణించును. అతని మరణమును జూచిన శత్రుఘ్నుడు మరణించును. పుత్రుల మరణమును జూచిన కౌసల్యా - సుమిత్ర-కైకేయిలు మరణింతురు. ఇవి జూచిన సుగ్రీవుడు మరణిం చును. సుగ్రీవుని మరణముగాంచిన రుమ మరణించును. ఇవి గాంచి తార మరణించును. ఇవి గాంచిన యంగదుడు మరణించును. రాజు వలని దుఃఖముతో వానరులందఱు మరణింతురు. సీతను వదలి రాముడు కాలమును బాగుగనే గడిపెను. కనుక పై మాటలెంత యసహజ ములో వర్ణింప నవసరము లేదు.

యుద్ధ. 91వ సర్గము : లక్ష్మణుడు కుబేరునిచే స్వప్నమందీయ బడిన యస్త్రమును ఇంద్రజిత్తుపై ప్రయోగించుటకు గ్రహించెను.

స్వప్నమందీయబడిన యస్త్రము స్వప్నమైన పిమ్మట యుండునా?

అరణ్య. 46వ సర్గము : రావణుడు సీత యొద్దకు వచ్చుచుండ రావణుని జూచి జనస్థాన మందలి వృక్షములు కంపింపసాగెను.

రావణుడు-సీత యొక్క తొడలను-స్తనములను వర్ణించుట.

అరణ్య. 60వ సర్గము : లక్ష్మణుడు చెంతనుండగా, రాముడు

వృక్షములతోను, జంతువులతోను వీనెకరువువంటి తొడలుగల మైధిలి కౌఉుగుదువా ? పండివతాళ ఫలములవంటి స్తనములుగల దానిని జూచితివా ? తొండమువంటి యూరువులుగల స్త్రీని జూచితివా ?

61వ సర్గము : సీతా ! అరటిబోదెలతో సమానమగు నీ తొడలను——

ఈ విధముగ రాము డితరులముందు తన భార్యయొక్క తొడలు- స్తనములు వర్ణించుట సమంజసముగ లేదు.

హనుమంతుడును సీతయొక్క వక్షములు వర్ణించెను. వాల్మీకియు సీతను గురించి ప్రస్తావనలో నిట్టి వర్ణన లొనర్చెను. ఇవి హనుమంతుని పాత్రకు, కవిగా వాల్మీకి పాత్రకు తగినవిగా కన్పించుట లేదు.

రాముని శ్లాఘించుట : వాల్మీకి దాదాపుగ ప్రతిపాత్ర చేతను రాముని గుణగణములను పొగిడించెను.

రామునిచే, నధర్మముగ చంపబడియు, మరణావస్థయందున్న వాలి, రామునికి నమస్కరించి "నీవు పలికినదంతయు ధర్మము. నాచే నప్రియము పలుకబడినది. నన్ను క్షమింపుము. నీవు అర్థతత్వము నెఱిగినవాడవు. ప్రజల హితరతుడవు. నీ బుద్ధి నిర్మలమైనది. అవ్యయమైనది....".

ఇదే విధముగ తారచేతను రాముని పొగిడించెను.

భర్త మరణించియున్న సమయమున, అతని నతినీచముగ చంపిన రాముడౌదార్య, తార ముఖము కలకలలాడినదట.

రావణుడు మరణించియుండ, మండోదరి రాముని కీర్తించుటయు చాల నసహజముగ నున్నది. వీరుడు-ప్రతాపవంతుడు నగు భర్త మరణించియుండ, నతనిని చంపినవారిని, అతని భార్య కీర్తించునా ?

వాల్మీకి మారీచునిచేతను, శుక-సారణులచేతను-అందరిచేతను

రాముని పొగిడించెను. రావణునిచేతను రాముని శ్లాఘింపజేసెను. ఇవి యన్నియు, వాల్మీకి-రాముని యవతారపురుషుడనియు-భగవంతుడనియు నిరూపించుటకు పడినపాట్లు తప్ప అన్యముగ కన్పించుటలేదు.

ఇట్టి శ్లాఘనీయాంశములచె వాల్మీకి ఆ పాత్రల ధర్మమున కన్యాయము చేసినట్లు కన్పించుచున్నది.

ఉత్తరకాండములోని కథలన్నియు, వాల్మీకి - తా నంతకు పూర్వము మిగతా కాండములలో వ్రాయుటకు సందర్భము కాక వదలినవి-మిగతా కాండములలోని కథలను సమర్థించునవి, యేర్చి కూర్చి వ్రాసినట్లు కన్పించుచున్నది.

బాలకాండము 48వ సర్గములో నింద్రుడు గౌతమునిచే వృషణహీనుడగునట్లు శపించబడెను. ఉత్తరకాండ 30వ సర్గములో గౌతముడింద్రుని 'శత్రువులచే జిక్కుదువ'ని శపించినట్లున్నది. గౌతమమహర్షి శాపమువలన నింద్రుడు యింద్రజిత్తు చేజిక్కినట్లు బ్రహ్మవచించెను. ఈ కథ ఋషుల ప్రభావమును తెలియజేయుటకై కల్పించినదిగా నున్నది.

రావణుడు సీతను బలాత్కారము చేయకుండుటకు కారణము అతని సద్బుద్ధి కాదనుటకే-అతనికి రంభతో గల సంబంధమును, నలకూబరు డతని శపించుటయు గల కథ వ్రాయబడినట్లున్నది.

యుద్ధకాండము 13వ సర్గములో రావణునికి శాపమును గురించిన మరియొక కథ గలదు. అందు రావణుడు పుంజికస్థలను బలాత్కారముగ ననుభవింప బ్రహ్మ రావణునకు ఏ స్త్రీ నయినా బలాత్కారముగ ననుభవించుచో నతని తల నూరువ్రక్కలగునని శపించెను.

ఈ రెండు సంఘటన లొకసారి జరుగుట సంభవించదు. కనుక వారల శాపములు నిజమైనచో పై రెండు సంఘటనలలో నేదియో నొకదానియందు రావణుని తల వ్రయ్యలు కావలసియుండును. కనుక యీ రెండు కథలు వాస్తవదూరములుగ గన్పించుచున్నవి.

వాల్మీకి రాముని మహాత్ముడనియు, సత్యసంధుడు నానావిధ

స్తుతులచే రామాయణము నందంతట ప్రశంసించెను. అదేవిధముగ రావణుని – క్రూరుడనియు, దురాత్ముడనియు, పరిపరివిధముల పలుచోటుల నిందించెను. కనుక రావణుని దుష్టునిగ చూపుటకు–అతడు సన్మార్గముతో సీతను వీక్షించినను, అతడు సన్మార్గముతో గాక–శాపముల వలననే సీతను బలాత్కారము చేయలేదని లోకమునకు చూపించుటకై రావణునికి–పై శాపకథలను కల్పించినట్లు విదితమగుచున్నది.

హనుమంతుడు సముద్రమును లంఘించుట, ఓషధిపర్వతమును తెచ్చుట–ఇట్టి కథలు నిజమని నిరూపించుటకే, హనుమంతుడు – సూర్యునిపై కి–రాహువుపై కి–ఐరావతముపై కి దూకుట ఋషులతని శపించుట మొదలగు పుక్కిటి పురాణగాథల నిందు చేర్చినట్లున్నది.

వాలితో రణమొనరించలేక, చెట్లమాటునదాగి, బాణములతో గొట్టి చంపిన–రాముని భీరుత్వమును కప్పిపెట్టుటకే యింద్రుడు వాలి కిచ్చిన కాంచనమాలకు మహాత్వము కల్పించినట్లున్నది.

రావణుని యొక్క వంశమును గురించి, రావణాదుల జననము–వివాహములు, విజయములు, యుద్ధములు యీ కాండములో విపులముగా తెలుపబడినవి. పురాణముల యందలి యనేక గాథ లిందు వ్రాయబడినవి.

రాముని యొక్క దినచర్య, రాజ్యపాలన, రాముని సోదరుల దిగ్విజయము లిందు రచింపబడినవి.

రాముని యశ్వమేధ యజ్ఞమునకు వాల్మీకి పిలువబడలేదు. కాని యతడు వచ్చెను. అతడు రాముని భార్యాబిడ్డల నతని కప్పగించ దలచినవాడై వచ్చినట్లు తెలియుచున్నది.

వాల్మీకి సీతయొక్క నిష్కల్మష చరిత్రను ఒక కథ ద్వారా రామునకు తెలియజేయ యత్నించెను. ఆ కథ విని రాముడు తన తప్పు తెలిసికొని సీతను స్వయముగ స్వీకరించునని తలచెను.

కాని వాల్మీకి యీవిధముగ ప్రారంభించిన సీతా చరిత్రము పౌలస్త్యవధతోఁగూడి 'రామాయణ మహాకావ్యమై' విలసిల్లి, సంస్కృత సాహిత్యములో 'ఆదికావ్యమై' ప్రపంచ సాహిత్యములోనే శాశ్వతస్థానమును పొందెను.

# 30. ఆదికావ్యము

వాల్మీకి రచించిన 'రామాయణమే' ఆదికావ్యమని పండితుల యభిప్రాయము. ఈ కావ్యమునందలి కవితా విశిష్టతను, రసజ్ఞతను, కావ్యసౌరభములను మహాపండిత-కవిశ్రేష్ఠు లెందఱో యాస్వాదించిరి. ఆదిగ రచించబడిన కావ్యమైనను, వేలాది సంవత్సరములనుండి దీని ప్రాశస్త్యము నానాటికి పెరుగుచున్నదేకాని తరుగుటలేదు. అనేక మంది మహాకవు లీ గ్రంథమును విశదీకరించుట - విశ్లేషించుటనుబట్టి యీ గ్రంథముయొక్క విలువ తెలియుచున్నది. ఆదిరచనమైనను, ఆదికావ్యమైనను యింతటి ఘనతర కావ్యమును రచించిన వాల్మీకి యెంతయు ప్రశంసార్హుడు.

ఆదిలోనే మహాకావ్యమును రచించి కవిపండితుల కాదర్శ మయ్యెను. వాల్మీకియొక్క పుర-ఉద్యాన-జలకేళి-పర్వత - అరణ్య-ఋతు-చంద్రోదయ - మధురపాన-ఆశ్రమవర్ణన లెంతయో సహజ రమణీయముగ నున్నవి. శృంగార వర్ణనలలో రాముడు తన భార్య యొక్క స్తన-పిరుదుల నితరుల యెద్ద వర్ణించుట కొంచెమతిగా నున్నను, రసమాధుర్యము ననుభవించెడి రసికాగ్రేసరుల మనస్సులు రంజిల్ల నెంతయో రమణీయముగ రచించెననుట అతిగాలేదు.

పతి వనవాసగతు డగుచుండగా నతని వదలి జీవించలేని సీతా మానసత్త్వమును వాల్మీకి చక్కగా విశదీకరించెను. సీతను పరిత్యజించు సమయమున లక్ష్మణు డనుభవించిన మనోవ్యధను - చదువువారి

హృదయములు కలతనొందించునట్లు రచించెను. లంకాపురియందు సీత–అగ్నిప్రవేశ ఘట్టము, రాముని యశ్వమేధయజ్ఞ నిర్వహణ సమయమున సీత – భూవివరమును ప్రవేశించు ఘట్టము లెంతయు హృదయవిదారకములు కరుణారసభరితములు. సీత–హనుమంతునితో తనను తీసికొని వెళ్ళుమని రామునితో వచించవలసిన మాటలను తెలుపుట గాంచిన యామెపై నెంతయో జాలికలుగును. ఈ విధముగ వాల్మీకి శృంగార–కరుణారసముల నెంతయో ప్రశంసనీయముగ రచించి రామాయణమునకే వన్నె తెచ్చెను.

ఆదికావ్యమైనను–మహాకావ్యముగ రచించి కవుల కాదర్శ ప్రాయుడైన వాల్మీకి చిరస్మరణీయుడు గదా !

# 31. రామాయణ విలువలు

రామాయణము ఆనాటి దేశ–రాజకీయ – సాంఘిక – ఆర్థిక – భౌగోళిక పరిస్థితులను, పరిపాలనా పద్ధతులను తెలియజేయుచున్నది.

ఆ కాలమున ఆదిత్యులు – వసువులు – రుద్రులు – విశ్వేలు – సాధ్యులు–మరుద్గణములు మొదలగు దేవతాగణములు – గంధర్వులు, అసురులు, పన్నగులు (నాగులు), దైత్యులు, దానవులు, రాక్షసులు, పిశాచులు, కిన్నరులు. కింపురుషులు, సుపర్ణులు (గరుడులు, పతగులు, గృధ్రములు), విద్యాధరులు, యక్షులు మొదలగు గణములు నిషాద వానర–భల్లూక–శబరులను యుపజాతులు గలవు. కాలక్రమమున అసుర–దైత్య–దానవ–రాక్షసులు ఒకేజాతిగ పిలువబడిరి.

జాతులమధ్య సన్నిహితము : రాముడు శబరి యాతిథ్యమును స్వీకరించెను. భరతుడు గుహుని యాతిథ్యమును, భరద్వాజుని యాతిథ్యమును స్వీకరించెను. భరద్వాజుని కుమార్తె రావణుని సవతి తల్లి, రావణుడు–రాజర్షి–దైత్య–గంధర్వ – రాక్షసకన్య లనేకమందిని

స్వీకరించెను. రాక్షసజాతికి చెందిన సుమాలి తన కుమార్తెలను విశ్రవసు మునికిచ్చెను. విభీషణుడు గంధర్వపుత్రియగు సరమను పెండ్లాడెను. ఇక్ష్వాకువంశములోని పురుకుత్సుడు నాగస్త్రీయగు 'నర్మద'ను పెండ్లాడెను. వీనిని బట్టి యాకాలమందు జాతులన్నిటి మధ్య వివాహ-భోజనములు జరుగుచుండెను. నిషిద్ధములు లేవు.

ఆర్యులు : ఆర్యఋషులు ఆయుధములతో వింధ్యపర్వతమునకు దక్షిణముననున్న రాక్షసపాలిత రాజ్యములందు ప్రవేశించి, బలహీనులగు రాజుల నిర్జించుచు, అవసరమైనపుడు క్షత్రియరాజుల తోడ్పాటును పొందుచు, ఆ భూముల నాక్రమించుచు తమ ఆచార వ్యవహారముల వ్యాపింపజేయుచుండిరి. రాముడు 'మునులు మాంసమును వదలి మధుఫలముల దినుచున్నార'ని వచించుటచే అంతకు పూర్వము ఋషులు మాంసమును దినుచున్నారని తెలియుచున్నది.

సీత గంగానదిని దాటుచు 'తాము సుఖముగ తిరిగివచ్చినచో గంగానదికి పదివేల ఆవులు, వేయి సురాభాండములను మాంసాన్నమును సమర్పించుకొందుమ'ని మ్రొక్కెను. అలాగే యమునానదిని దాటునపుడు వేయి ఆవులను, నూరు సురాభాండములను సమర్పింతునని మ్రొక్కెను. రామ లక్ష్మణులు వాలిని చంపుటకేగినపుడు సప్త మను లనబడు వృక్షములకు, కాళిందినదిని దాటిన పిమ్మట వట వృక్షమునకు నమస్కరించిరి. దీనిని బట్టి యార్యులానాడు వృక్షములను-నదులను పూజించుచుండిరని తెలియుచున్నది. సీత తనను గురించి జ్యోతిష్కులు వచించిన సాముద్రికశాస్త్రవిషయములు తెలిపెను. దీనినిబట్టి ఆనాటి ఆర్యులకు సాముద్రిక విషయములు తెలియును.

ఆర్యరాజులు : హనుమంతుడు సీతతో 'రాముడు నీ వియోగముచే మద్యమాంసములు వదలివేసినాడ'నుటచే, ఆర్యరాజులు మద్యమాంసములు వాడుచుండిరని తెలియుచున్నది. ఆర్యరాజులను ఋషులు శాసించుచుండిరి.

దశరథుడు కైకతో 'నీ కొఱకై చంపదగని వానిని చంపెదను. భాగ్యవంతుని ధనహీను చేసెదన'ని వచించుటచే, నార్యరాజులు నిరంకుశముగ రాజ్యపాలన జేయుచుండిరనియు, ప్రజలకు పూర్తిగ ధర్మన్యాయములు లభించుట లేదనియు తెలియుచున్నది.

దశరథ - రాముల యెదుటనే మంత్రి - పురోహితులు కైకను విచ్చలవిడిగ నిందించుచుండ రామ-దశరథు లెవరూ మాట్లాడలేదు. దీనినిబట్టి మంత్రి-పురోహితులు-రాజులను శాసించుచుండిరని తెలియుచున్నది.

రామ-దశరథులయందు దోషమున్నను, వారి పక్షమువహించు మంత్రి-పురోహితాదులు కైకను నిందించుచుండ, నచటి ప్రజలు రాజును నిందించుటచే, ప్రజలు నిర్భయముగ కొందరైనను ధర్మ పక్షమును వహించుచుండిరని విదితమగుచున్నది.

రాజులు చారులవలన దేశములోని విషయములను, పరదేశములలోని విషయములను సంగ్రహించుచుండిరి.

రాజుల కనేక భార్యలుండుట గన్పట్టుచున్నది. అంతఃపుర స్త్రీలు చాల కట్టుదిట్టములలో నుంచబడుచుండిరి.

అయోధ్య : వివిధ ప్రాకారములచే నావృతమైయుండెను. పురియందు చైత్యములు, దేవాలయ-కూప, తటాకములుండెను. బ్రహ్మ-క్షత్రియ-వైశ్యులు స్వకర్మములు నిర్వహించుచుండిరి. కృషీవలులు-గోరక్షకులు నుండిరి. నాగవనము-గణికాశ్వ కుంజర స్థానమై యుండెను. పురియందలి సకలదుర్గములు నెల్లపుడు ధన - ధాన్య - ఆయుధ-ఉదకముల చేతను-యంత్రముల చేతను శిల్పిధనుర్ధరుల చేతను సురక్షితములుగా నుండెను.

ఆదాయములో నధికభాగము దేవ-పితృ-బ్రాహ్మణ - అభ్యాగత-మిత్ర-యోధులకు వ్యయము చేయబడుచుండెను.

పురియందు నట-నాట్యములు, ఉత్సవములు జరుగుచుండెను.

రాత్రులలో వీథులయందు దీపములు వెలిగించుచుండిరి. పురమునందలి యుద్యానవనములకు సాయంకాలమందు కనకాభరణ భూషితులగు యువతులు క్రీడించుటకు వచ్చుచుండిరి. కాముకులు స్త్రీలతో వాహనములపై నుద్యానవనముల కేతెంచుచుండిరి.

ధనవంతులు వాకిండ్లు తెరచి సురక్షితముగ పరుండుచుంటిరి. వణిజులు దూరమునకు పెక్కు వస్తువులతో క్షేమముగ పోయివచ్చుచుండిరి. పురమందలి దేవతాగృహములను పుష్పమాలలతో నలంకరించుచుండిరి. గృహముల ముంగిళ్ళయందు నీళ్ళుచల్లి యలంకరించుచుండిరి.

రాజకుమారులకు విద్యలు నేర్పుట కాచార్యులుండిరి. శిల్పులు మిక్కిలిగ గౌరవింపబడుచుండిరి.

అయోధ్యలో యేనుగులు, గుఱ్ఱములు, ఒంటెలు, ఆవులు, ఎద్దులు, గాడిదలు పెంచబడుచుండెను.

శకునశాస్త్రము, సాముద్రికశాస్త్రము, జ్యోతిష్యము, వైద్యము తెలిసిన పండితులుండిరి.

అంతఃపుర స్త్రీలు : రాముడు భరతునితో "స్త్రీలతో రహస్యములు చర్చించవు గదా!" అనుటలో స్త్రీలు వారి దృష్టిలో నమ్మవలసిన వారు కాదని తెలియుచున్నది! కౌసల్య రామునితో "లక్ష్మణుడు వచించిన విధముగ తండ్రిని బంధించుమనియు లేదా వధించు" మనియు తెలుపుటచేతను, రాజవంశములో నంతఃపుర కలహము లున్నట్లు తెలియుచున్నది.

రాముడు సీతను లక్ష్మణుని యొద్దనో భరతుని వద్దనో సుగ్రీవ-విభీషణుల యొద్దనో యుండుమని వచించుటచేతను, శీలము బుజువుపరచుకొనుమని వచించుటచేతను రాజులు భార్యల నెంతనీచముగ చూచుచున్నారో తెలియుచున్నది. రాజస్త్రీలును భర్తలను తమ హక్కులకై నిలదీయుచుండిరి.

శిష్టులు : భరతుని వచనములచే బ్రాహ్మణ ధనము నపహ

రించిన వానికి, పరులను హింసించినవారికి, పరదారల నపేక్షించిన వారిని, భ్రూణహత్యలు చేసినవారిని దేశమునుండి బహిష్కరించు చుండిరని తెలియుచున్నది.

సాంఘికపరిస్థితులు : దేశములో వడ్డీవ్యాపారములు జరుగు చుండెను. కొందరికిచ్చిన బాకీలు వసూలగుటలేదు. వడ్డీ కిచ్చిన ధనము వసూలు కాని వర్తకులు, వారి గృహముల ముందు పరుండు చుండిరి.

వీధులయందు బిచ్చగాండ్రను కుక్కలవలె హీనముగ జూచు చుండిరి. వారికి బిచ్చమును లభించుటలేదు.

కుటుంబములో తండ్రి యధికారము ప్రకారము భార్యాబిడ్డలు వర్తించుచుండిరి.

చారులు రామునకు సీతను గురించి ప్రజలనుకొను మాటలు వచించుటనుబట్టి రచ్చబండలయందును రాజకులమును, రాజుల ప్రవర్తనను విమర్శించుచుండిరని తెలియుచున్నది.

కేకయరాజ్యము : దశరథుడు, కైకను వివాహమాడునాడు, కైకకు జన్మించిన కుమారునకే రాజ్యమొసంగుదునని వచించుటచే, కేకయ రాజ్యములో 'ఓలి' పద్ధతి యములు జరుగుచుండెనని తెలియు చున్నది.

కేకయరాజు భరతునితో ధనము, ఏనుగులు, రథములు, గుఱ్ఱములు, గాడిదలు, ఒంటెలు, ఎద్దులు, చిత్రకంబళములు కనకాభరణములు, శునకములు పంపెను. మరియు నా శునకములు అంతఃపురము నందు పెరిగిన గొప్ప శరీరములు గలవి యనుటచే నా ప్రాంతపు రాజులు శునకములను బాగుగా పెంచుచున్నారని తెలియుచున్నది.

కిష్కింధ : పురి-గుహారూపముగ నిర్మింపబడియుండెను. పురి యందు పణ్యవీథులు, నిబిడప్రాసాదములు, పుష్పితోద్యానములు, ఫలవృక్షములు గలవు. రాజమార్గమునందున్న గృహములు ధన

ధాన్యములతోడను, చెఱకు మద్యము వాసనగల యంగళ్ళతోను, దివ్యమాలాలంకృతులగు స్త్రీ రత్నములతోడను, దివ్యమాల్యాంబర ధరులగు సుందరులచేతను ప్రకాశించుచుండెను.

రాజగు సుగ్రీవుని గృహము విలువైన వస్తువులచేతను, ఆసనములచేతను, పర్యాంకములచేతను శోభిల్లుచు, తోరణములచే నలంకరింపబడియుండెను. రాజగృహమున రూప యౌవన గర్వితులు, వివిధాకారులు, ఉత్తమాలంకృతులునగు స్త్రీ లుండిరి. వీణను వాయించువారు, చక్కని గాయకులు నుండిరి. స్త్రీలు-కాలికి అందెలు, మొలనూళ్లు ధరించుచుండిరి. స్త్రీ-పురుషులు ఆభరణములు, పుష్పమాలలు ధరించుచుండిరి. స్త్రీ పురుషులు మద్యమును సేవించుచుండిరి. రాజు శిబికపై ప్రయాణము చేయుచుండెను. సుషేణ-జాంబవంతులు గొప్ప వైద్యులు.

కిష్కింధ చుట్టును ప్రాకారముండెను. ప్రాకారద్వారమున బలిష్ఠులగు వానరులు ఆయుధములు ధరించియుండిరి. వీరి ఆయుధములు రాళ్ళు-వృక్షములు మాత్రమే.

రాముడు విభీషణునితో "వానరయోధులకు ధన రత్నములోసంగుమనియు, అందుచే వారలనిని దాత-కష్టమునెఱిగినవాడు-దయగలవాడు-పేరుగలవాడనియు తలతు'రని వచించెను. ఈ మాటలను బట్టి వానరులు పేదలనియు, విశ్వాసపాత్రులగు సైనికులనియు తెలియుచున్నది. వీరికి విలువిద్య తెలియదు.

వీరు దేవరన్యాయమును పాటించుచుండిరి. దృఢకాయులు, బలిష్ఠులు, వానర-భల్లూక జాతులు-ఆటవిక జాతులుగ గన్పించుచున్నవి.

లంకాపురి : పర్వతశిఖరముపై నిర్మింపబడెను. నగరమున ఫల పుష్ప వృక్షములతో గూడిన చక్కని యుద్యానవనములు, సరస్సులు, అంతస్థుల భవనములు, రత్నములు-ధాన్యపుకొట్లుగలవు. నగరము సకలదోషములు లేని-ఎల్లగుణములచే శ్రేష్ఠమగు వాస్తుపద్ధతిని నిర్మింప

బడెను. గృహములు పద్మ-స్వస్తిక-విమానాది వివిధ యుక్తము రచనలుగలవియైయుండెను. భవనములు వారి వారి పరాక్రమ సంపదతో నిండియుండెను. స్త్రీలు మొలనూళ్ళు, కాలియందెలు, వివిధాభరణములు ధరించుచుండిరి. పురుషులు కూడా ఆభరణములు, కుండలములు ధరించుచుండిరి. వేదాధ్యయన సంపన్నులు, నియమ వ్రతులు, ముండితులు. జటాధరులు గో చర్మధారులు నానావేషధారులు నుండిరి. స్త్రీలతో నాట్యములు సల్పుచు-మధురగానాలాపన చేయువా రుండిరి. రాజభవనము నెదుట సేనావాహినియుండెను. రాజమార్గమున వింతకవచములు ధరించిన-ఆయుధపాణులుండిరి. సైన్యము రథ-గజ--హయ-పదాతులతో గూడియుండెను. సైనికులు ధనుర్బాణములు, శక్తి-శూలము-గండ్రగొడ్డళ్ళు - కత్తులు, గదలు, తోమరములు పరిఘలు, పట్టసములు ధరించియుండిరి. నగరముచుట్టును ప్రాకారము. అగడ్తయుండెను. స్త్రీలు-చక్కని ముఖములతో సౌందర్యవతులు, పరిశుద్ధభావుకులు, ప్రియులయందు-పానముల యందాసక్తులు, స్వర్ణాభరణ భూషితులు-మెరపుల బంతులవంటి యాభరణములు ధరించు చుండిరి. సువర్ణఛాయగలవారు, తెల్లనిఛాయగలవారు, గౌరవర్ణము గలవారు నగు స్త్రీలు విలువగల వస్త్రములను ధరించి మనోహరమై రమ్యమగు శరీరకాంతులతో విరాజిల్లుచుండిరి. భేరీ-మృదంగ - శంఖ ధ్వనులతో నగరము విరాజిల్లుచుండెను.

వివిధాకారములగు పల్లకీలు, చిత్రములగు పొదరిండ్లు, చిత్తరువులు గల గృహములు, విలువగల దారు నిర్మితమగు సురాపాత్రలు, శయనాసనములు, గవాక్షములుగల గదులు నగరవైభవమును దెల్పుచుండెను. మయుడు గొప్పశిల్పి. రాక్షసులు-మహాకాయులు, మహాబలవంతులు, నల్లనివారు, శివమతస్థులు. నగరము సర్వసమృద్ధము. రాజగు రావణుని భవనము పుష్పకమను విమానము. అనగా నైదంత స్థులు గలది. చక్కని స్తంభములతోను, కూటాగారములతోను,

సోపానములతోను, వేదికలతోను వలకిటికీలగలదై యలంకరింపబడి యుండెను.

రాజు—రాజమార్గమున పయనించుచుండ, సర్వులు నతనికి శిరము వంచి, చేతులుమోడ్చి నమస్కరించుచుండిరి. అతడు సభయందుండ, సభయందలి వారెల్లరు నిశ్శబ్దముగనుండి నతని నోటివెంట వెలువడు మాటల కెదురుచూచుచుండిరి. వీటన్నిటినిబట్టి ఆర్యులకంటె రాక్షసులు మిక్కిలి నాగరికులుగ గన్పించుచున్నారు.

ఆర్యరాజ కుటుంబములందు రాజకన్యలకు స్వయంవరములు, వరుడు కన్యల తల్లిదండ్రుల సమక్షమున వివాహములు జరుగుచుండెను.

రావణుడు సీతతో 'పరస్త్రీలను పొందుట – బలాత్కారముగ దెచ్చుట రాక్షసుల యాచారమ'నియు (సుందర. 20వ సర్గము), దైవ సంబంధము సీతతో తనకు కూర్చుచున్నదనియు, నది ఋషిప్రోక్తమనియు (అరణ్యా. 55వ సర్గము) వచించెను.

వితంతువగు శూర్పణఖ రామలక్ష్మణుల చెంతకుబోయి తనను పరిణయమాడుమని కోరెను. ఆర్యుల యజ్ఞయాగాదులు రాక్షసుల ఆచారములకు విరుద్ధముగనుండెను. వీనిని బట్టి ఆర్యధర్మములు, రాక్షసధర్మములు కొన్ని వ్యతిరిక్తములుగ నున్నవి.

రావణుడు ప్రేమ—కామములచే దహింపబడుచుండియు, తాను బలాత్కారముగ గొనితెచ్చిన నిస్సహాయయగు స్త్రీని ఓదార్చుచు 'యామె తనను కోరువంతవరకు తా నామెను తాక'ననియు. నిర్భయముగ నుండుమనియు వచించి తన ఔన్నత్యమును జూపెను. దీనినిబట్టి రాక్షసధర్మము లెంతటి ప్రేమ—కరుణలతో గూడినవో వ్యక్తమగుచున్నది.

రామ లక్ష్మణులు—తమలో నొకరిని వివాహమాడుటకై వచ్చిన స్త్రీని ముక్కు చెవులు కోసి కఠినాతి కఠినముగ శిక్షించిరి. దీనినిబట్టి యార్యరాజు లెంతటి కఠినవర్తనులో తెలియుచున్నది.

విశ్వామిత్రుడు-మేనకను, కుశనాభుడు-ఘృతాచిని, వసిష్ఠుడు-ఉదయంతిని, చూళి-సోమదను, మాండకర్ణి-ఐదుగురప్సరసలను పొందుటను జూడ నిట్టి మునులు జితేంద్రియులైనట్లు గన్పించదు. వీరు మహామునులుగనే పరిగణింపబడిరి.

గౌతముని భార్య అహల్య-యింద్రునితోగూడియు, జమదగ్ని భార్య రేణుక - మూర్తికావతపతియగు చిత్రరథునితో గూడియు, కొలదికాలము భర్తలచే పరత్యజింపబడి, పిమ్మట స్వీకరించబడిరి. కాని యిట్టివారిని మహాత్ములుగ దలచుచు, వారితో మెలగిన రాముడు భార్యయగు సీతను శీలము నిరూపించుకొనుమని యాజ్ఞాపించుట, పరిత్యజించి దేశమునుండి వెడలగొట్టుట యాశ్చర్యమును గొలుపుచున్నది.

పై విషయములచే నాటి ఆర్య-రాక్షస రాజుల ధర్మాధర్మములు, ఋషుల యాచారవ్యవహారములు వెల్లడియగుచున్నవి.

రాముడు విభీషణునితో "ప్రయత్నించిన కార్యములను నెఱవేర్చిన వానరులను వివిధ రత్నాభరణములచే పూజింపుము. వారు నిన్ను దాతవనియు, కష్టము నెఱిగినవాడవనియు, దయగలవాడవనియు, పేరుగలవాడవనియూ తెలిసికొందురు.''అని తెలిపెను. దీనినిబట్టి వానరులు బీదలనియు, కృతజ్ఞులనియు తెలియుచున్నది.



# 32. సారాంశము

దశరథుఁ డయోధ్యరాజు. అతనికి కౌసల్యా - సుమిత్రలతో కలసి యనేకమంది భార్యలుండిరి, కాని సంతానములేదు. కేకయ రాజగు నశ్వపతి కుమార్తె సౌందర్యవతి యని విని దశరథుఁ డామెను పరిణయమాడగోరి యశ్వజిత్తుకు కబురంపెను. అశ్వజిత్తు, తన కుమార్తెకు జన్మించిన పుత్రునకే రాజ్యమిచ్చుటకు దశరథు డొడంబడినచో నతనికి తన కుమార్తె నిచ్చెదనని తిరుగు జవాబిచ్చెను. దశరథు డందుల కంగీకరించెను. దశరథ-కైకల వివాహము జరిగెను.

వైజయంతీ పురాధీశుడగు తిమిధ్వజునితో రణమొనరించుచు దశరథుడు ప్రాణసంకటస్థితిని జెందగ కైక యతనిని రక్షించెను. దశరథు డందులకు ప్రీతుడై యామెకు వరద్వయము నొసంగ, నామె వాటిని వలసినపుడు గైకొందునని పలికెను.

దశరథుడు పుత్రులకొఱకై యనేక యజ్ఞములు చేసెను. కాని సంతానము కలుగలేదు. తరువాత కొంతకాలమునకు దశరథుని పుణ్యఫలమో యన నతని భార్యలు కౌసల్యా-సుమిత్ర-కైకలు గర్భముల ధరించిరి. అంతకు పూర్వము యజ్ఞఫలితముగ విరివిగ దానధర్మములు పొందిన పురోహితద్విజులు దశరథునకు యజ్ఞఫలితముగ భార్యలు గర్భవతులైరని విరివిగ ప్రచారమొనరించిరి. కౌసల్యకు రాముడు, కైకకు భరతుడు, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులు జన్మించిరి. రామునకు లక్ష్మణుడు, భరతునకు శత్రుఘ్నుడు మిక్కిలి సన్నిహితులైరి.

దశరథునకు రాముని రాజ్యాభిషిక్తునిగ జేయవలయునను తలంపుగలిగెను. భరతుని మేనమామ యింటికంపెను. రామునితోను తన ఇష్టులగు వసిష్ఠాది పురోహితులతోను, సుమంత్రాది మంత్రులతోను మంతనములు జరిపి దశరథు డొక్కరోజు వ్యవధిలో రాముని పట్టాభిషేకమును నిర్ణయించెను. ఈ విషయములు గ్రహించిన కైక - దశ

రథునితో, నతడు తనను వివాహమాడునపుడు చేసిన వాగ్దానమును గురించి ప్రశ్నించెను. దశరథు డందులకు నిరాకరింప, కైక, అతడు తనకిచ్చెదనన్న వరములను యాచించెను. దశరథు డందులకు నంగీకరించెను. అపుడు కైక తన వరముల నీ విధముగ కోరెను. 1) భరతుని పట్టాభిషేకము 2) రామునకు పదునాలుగేండ్లు దండకారణ్య వనవాసము. తత్ఫలితముగ రాముడు వనవాసమునకు బయలుదేర నతనితో సీతా లక్ష్మణులు బయలుదేరి వెళ్ళిరి.

రాముని మనస్సులో నతని పూర్వీకులగు ననరణ్య-మాంధాతలతో రణమొనరించిన రావణుని, యతని సహాయులగు రాక్షసులను చంపవలయునను కోరికగలిగెను. అందులకు ఋషులును రామునకు సహాయులైరి. అగస్త్యాదులు రామున కనేక యాయుధముల నొసంగిరి. రాము డిట్టి యాలోచనలలో నుండగా రావణుని చెల్లెలగు శూర్పణఖ రాముని జూచి మోహించినదై యతనితో తనను పరిణయమాడుమని కోరెను. రాము డాలోచించెను. శూర్పణఖను విరూపినిగ నొనర్చిన, రావణు డచటకు వచ్చుననియు, యేకాకి యగు నతనిని దండకావనమున తనవద్దగల నాయుధబలముతో చంపవచ్చుననియు తలచెను. ఇట్లు తలచి యతడు తమ్ముని సహాయముతో నామెను విరూపినిగ నొనర్చెను. ఈ విషయము తెలిసిన వెంటనే దండకారణ్యమున నున్న ఖరదూషణులు రామునిపై కేతెంచి, యతనితో జరిగిన యుద్ధములో మృతినొందిరి.

ఈ వార్తలన్నిటిని శూర్పణఖ లంకాపురికేగి రావణునకు తెలిపెను. రావణుడు రాముని తన పురికేరప్పించి యచటనే చంపదలచినవాడై లంకాపురినుండి రథముపై బయలుదేరి మారీచుని వద్దకేగి, అచటనుండి మారీచుని యతడు పెంచుచున్న మృగముతో గూడ సీతా రామ లక్ష్మణులున్న పర్ణశాల ప్రాంతమునకు తీసికొనివెళ్ళెను.

మారీచుడు, తన లేడి సహాయముతో రాముని పర్ణశాలనుండి దూర
ముగా కొనిపోయెను. రాముడు మారీచుని బాణముతో గొట్ట
మారీచుడు రాముని కంఠము ననుకరించుచు 'హా లక్ష్మణా! సీతా'
అని యఱచెను. ఆ యఱపు విన్న సీత, లక్ష్మణుని రామునకు సహాయ
పడుటకై బంపెను. ఆ సమయమున రావణుడు పర్ణశాలను ప్రవేశించి
సీతను బలాత్కారముగ తన రథముపై నెక్కించుకొని లంకకు బయలు
దేర, జటాయువదిగాంచి రావణు నెదిర్చి, యతని రథ ఖరముల
చంపెను. రావణు డంత జటాయువును తన ఖడ్గముచే నొప్పించి,
సీత నెత్తుకొని కిష్కింధ చెంత మలయపర్వతము ప్రక్కనేయున్న తన
లంకాపురికి తీసికొనిపోయెను. రావణుడు సీత నెత్తుకొనిపోవుట
ఋష్యలు, సుగ్రీవ-హనుమంతాదులు జూచిరి.

పిమ్మట రాముడు జటాయువుద్వారా రావణుడు సీత నెత్తు
కొని వెళ్ళుట తెలిసికొని, తన పథకము భిన్నరూపును దాల్చుటచే
హతాశుడాయెను. కాని ఖేదము నొందక ప్రత్యామ్నాయ మార్గము
లను వెదుకదలచెను. పిమ్మట కబంధుని ద్వారా వాలి సుగ్రీవుల
వైరమును దెలిసికొని, సుగ్రీవునకు తోడ్పడి వాలిని చంపెను. ఈ విధ
ముగ రాజ్యము సుగ్రీవుని హస్తగతమాటచే, రామునకు సైన్య
సహాయము లభించెను. ఈ విషయము తెలిసికొనిన రావణుని తమ్ము
డగు విభీషణుడును రాముని జేరి దగ్గఱుండి రావణుని, యతని బలగము
నంతయు జంపించి తాను లంకాపురికి రాజయ్యెను.

రావణుని యొక్క సుందరాకారమును, వైభవమును, శౌర్య
ప్రతాపములను దిలకించిన రాముడు, సీత యతని వశమైయుండునని
తలచి, నిరాకరించెను. పిమ్మట విభీషణుడు, హనుమంతుడు, రాక్షస
స్త్రీలు, రావణుని యొక్క గుణగణములను సీత సౌశీల్యమును ప్రశం
శించ, రాము డామెను స్వీకరించి యయోధ్య కేగెను. కాని సీతపై

నతనికిగల యనుమానము మాత్రము నశింపలేదు. పిమ్మట కొంత కాలమునకు, సీత గర్భవతికాగా, యామెపైగల యనుమాన మతనిని పీడించుచుండ రాము డామెను లక్ష్మణునిచే వాల్మీకి యాశ్రమము చెంత వదలిపెట్టించెను. వాల్మీకి విషయమును గ్రహించి, గర్భవతి యగు నామెను జేరదీసెను. పిదప సీతకు కవలపిల్లలు జన్మించిరి. భర్తపై పిచ్చివ్యామోహముగల సీత దిన దినము కృంగిపోవుచుండ వాల్మీకికి, యామెను నామె భర్తవద్ద జేర్చు నుపాయ మాలోచించు చుండెను.

వాల్మీకికి మొదటగా సీత యొక్క నిష్కల్మష చరిత్ర నొక కథగా వ్రాసి రామునకు వినిపించవలయునను నాలోచన కలిగెను. పిమ్మట రాజుల లక్షణము-విధులు-రాజ్యపాలన-స్త్రీలు-పాతివ్రత్యము-ఏకపత్నీవ్రతము మొదలగు సందేశములతో నొక కావ్యము వ్రాయ వలయునను తలంపుగలిగెను. ఇట్టి తలంపుతో వాల్మీకి యొక మహా కావ్యమునకు రూపురేఖలు కలిగించెను. ఇట్లు ప్రారంభింపబడిన మహా కావ్యము చక్కని వర్ణనలతోను, అలంకారములతోను, కావ్యకళ తోను శోభించి మహత్తరకావ్యమై చరిత్రలో చిరస్థాయిగ నిలచి పోయెను. వాల్మీకి, తన కథకు రాముని కథానాయకుడుగ నిర్ణయించు కొని, యతని నన్ని విధముల నుత్తముడుగ తీర్చిదిద్దవలయునని యత్నించి సఫలీకృతుడాయెను. కాని రాముని కథ యతనికి పూర్తిగా తెలిసి యుండుటవలన యదార్థసంఘటనలను కప్పిపుచ్చక యథావిధిగ రచించి, యదార్థ కథ నంతర్గతముగ వెలిబుచ్చెను.

మహాకవి వాల్మీకి, రామాయణమున నంతర్గతముగ వెలి బుచ్చిన యీ విశేషములే 'రామాయణ సౌరభాలు'గ నేను ప్రథమ సంపుటముగ సాహితీ లోకమునకు సమర్పించుచున్నాను.

ద్వితీయ సంపుటము : ఇందు బ్రహ్మ-గరుడ-వాయు-స్కంధ-పద్మ-నృసింహ-కాళిక-సౌర - శివ - బ్రహ్మాండాది పురాణములలోని రామ కథను గురించిన వివిధాంశములు వ్రాయబడినవి. మఱియు రామ కథ వాల్మీకికే గాక వసిష్ఠ-దూర్వాస-అగస్త్య-మార్కండేయ-భరద్వాజాది మహర్షుల కనేకులకు తెలియును. వారందఱు వేర్వేరుగ రామాయణములు రచించిరి. వారి రామాయణములందు రాముని కనేక భార్యలున్నట్లు తెలియుచున్నది. బ్రహ్మాండపురాణము, దూర్వాస రామాయణము మొదలగు గ్రంథములందు రాముడు సీతను పరిణయమాడిన పిమ్మట, యామె యంగీకారముతోనే భూదేవి, నీలాదేవి మొదలగు రాజకన్యలను వారి చేతులనుబట్టుకొని యగ్నిసాక్షిగ పరిణయమాడినట్లున్నది. స్కంధపురాణములో రాముడు సీత గాక 128 మంది కన్యలను వివాహమాడినట్లుగలదు. పాంచరాత్రము, పద్మసంహిత మొదలగు గ్రంథములలో రాముని 129 మంది భార్యలలో కొందఱి పేర్లుచెప్పి యిత్యాది యను శబ్దముతో ముగించబడినది అగస్త్య రామాయణములో రాము డడవికి వెళ్ళుచు కౌసల్య యొద్ద నామె శుశ్రూషార్థము మిగతా భార్యల నుంచినట్లు తెలియుచున్నది. వసిష్ఠుడు తన రామాయణములో రామునకు బహు పత్నులున్నను నతడేకపత్నీవ్రతుఁడేనని వ్రాసెను.

జైన-బౌద్ధ వాఙ్మయములందును రామ కథ వ్రాయబడియున్నది. హిందూదేశమునందే గాక మంగోలియా, టిబెట్, జావా, కంబోడియా మున్నగు దేశములందును రామ కథను గురించిన గ్రంథములున్నవి.

పై కథలన్నిటిని "ప్రపంచ సాహిత్యములో రామ కథ" యను ద్వితీయ సంపుటముగా వ్రాయుట జరిగినది.

తృతీయ సంపుటము : ఆదికవి యగు వాల్మీకి రామాయణములో సహజ సంఘటనలకు కొన్ని యసహజసంఘటనలు కలిపి ప్రజాదరణ పొందు విధముగ రచించెను. కాని తరువాత కవులనేకు లా యసహజ సంఘటనలకు మఱికొన్ని విపరీత యసహజ సంఘటనలను మేళవించి రామ కథనే యవాస్తవికత సంఘటనలతో నింపిరి. కాని యదార్థ రామాయణ గాథను వెలికితీయుటకు యత్నించలేదు. కనుక యసహజ సంఘటనలన్నిటిని 'రామాయణ సౌరభాలు' అను సంపుటమునందు విమర్శించిన విధముగ విసర్జించి. "చారిత్రక దృక్పథంలో రామాయణము"ను తృతీయ సంపుటముగ రచించుట జరిగినది.



తప్పొప్పుల పట్టిక 

| పేజి | లైను | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 28 | చివరి | ంకాపురి | లంకాపురి |
| 68 | 21 | బంగారం లేడి | బంగారు లేడి |
| 93 | 12 | నాటసముద్రుడను | దాటసముద్రుడను |
| 105 | 18 | నన్ను కాదనియు | నను కాదనియు |
| 118 | 9 | అభిషేకించుటకొనుట | అభిషేకించుకొనుట |
| 132 | 9 | సంఖ్యామాన అను | అను సంఖ్యామాన |
| 135 | 25 | చేయించుండెను | చేయించుచుండెను |
| 140 | 1 | రాజునకు | రామునకు |
| | 11 | సింహాసమునుంచి | సింహాసనమున నుంచి |
| 142 | 2 | అతనిని | అతని |
| 154 | 8 | బలికుమార్తెయగు | బలికుమార్తె కుమార్తె యగు |
| 171 | 23 | రామునితో | రావణునితో |